# రవీంద్రుని నాటకాలు

## (ద్వితీయ సంపుటము)

(రారాజు, పోస్టాఫీసు, ముక్తధార, రక్తకరవీరం)

అనువాదం :
అబ్బూరి రామకృష్ణరావు





సాహిత్య అకాదెమీ
న్యూ ఢిల్లీ

RAVINDRUNI NATAKALU— (Plays of Rabindranath Tagore) Vol—II *Raja, Dakghar, Mukthadhara & Raktakarabi.* Translated from Bengali into Telugu by Abburi Ramakrisha Rao, Sahitya Akademi, New Delhi, 1969. Price Rs. 8/-


ప్రథమ ముద్రణ: 1969

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :
వేంకట్రామ & కంపెనీ
విజయవాడ



*Available at:*
SAHITYA AKADEMI
New Delhi - 1

*Regional office:*
Calcutta - 29

*Regional office:*
Madras - 34

ముద్రణ:
హిందీ ప్రచార ప్రెస్
మద్రాసు - 17

వెల: రూ. 8/–

# రవీంద్ర నాటకాల సంక్షిప్త సమీక్ష

ప్రమథనాథ బిశి

రవీంద్రుడి నాటకాల సంఖ్య తక్కువేమీ కాదు. సంఖ్యా శ్రేణీ వైవిధ్యాల్నిబట్టి చూస్తే ఆయన కావ్యాల తర్వాతి స్థానం నాటకాలకే యివ్వాలి. ధారావాహికంగా సాగిన ఆయన నాటక రచనా చరిత్రను గమనిస్తే చిన్ననాటినుంచీ జీవితంలో యించుమించు చివరి రోజువరకూ నాటక రచనమీదా, ప్రయోగమ్మీదా ఆయన ఉత్సాహం మొక్కవోకుండా వున్నట్లు కనిపిస్తుంది. ఆ వుత్సాహం రచనకంటె ముందుగా నిర్వహణ మీదా నటన మీదా అని విదితమవుతుంది. రవీంద్రుడు నాటక రచన మొదలుపెట్టకముందే తన అగ్రజులలో వొకరైన జ్యోతిరింద్రనాథ ఠాకూరు నాటకాలు రాయటం ఆరంభించారు. ఆ నాటకాల ప్రయోగాలు అప్పుడప్పుడు తమ యింట్లోనే జరుగుతూవుండేవి. యింట్లోనే కాకుండా బయట రంగస్థలాల మీద కూడా ఆ నాటకాలను ప్రయోగించటంవల్ల ఆయనకు ఖ్యాతి లభించేది. అంతకుముందు కూడా రవీంద్రుని పినతండ్రి కొడుకులయిన గణేంద్రనాథ, గుణేంద్రనాథ ప్రభృతులు నటకుడైన రామనారాయణ చేత నాటకాలు రాయించి యింట్లో చాలా ఆడంబరంగా ప్రదర్శించేవారు. యీ విధంగా నాటకరచన నాటకప్రయోగాల ప్రభావం మధ్య రవీంద్రుడు పెరిగినట్లు కనిపిస్తుంది. సాహిత్య విషయాలంటే సదా ఆసక్తిగల యిలాంటి యువకుడు నాటకాలవైపుకి మొదట ప్రేక్షకుడుగానూ, తర్వాత నటుడుగానూ, చివరకు రచయితగానూ, ఆకర్షితుడై వుంటాడని సులభంగా వూహించుకోవొచ్చు. జరిగిందికూడా అదే. కేవలం ప్రేక్షకుడుగా వుండే ఆసక్తి చల్లబడిపోతున్న సమయంలో జ్యోతిరింద్ర నాథుడు రాసిన నాటకాల్లో వొకటి రెండు పాటల్నీ, సంభాషణల్నీ అదనంగా కూర్చటం మొదలుపెట్టాడు. నాటకంలోనే వొక పాత్ర ధరించి ప్రేక్షకుల సమక్షంలో ప్రవేశించాడు. యీ వివరాలు ఆయన 'జీవనస్మృతి' అనే గ్రంథంలో లభిస్తాయి. అయితే యీలోగా - అంటే యీ ప్రభావానికి

ఫలితంగా ఆయన తొలిసారిగా యెప్పుడు నాటకం రాయటానికి పూనుకున్నదీ తెలుసుకోవాలనే కుతూహలం కలగటం సహజం, 'జీవనస్మృతి' గ్రంథాన్ని బట్టి, శాంతి నికేతనంలో ఆరుబయట కణకణలాడే యెండలో కూర్చుని బాలకవి తొలిసారిగా 'పృథ్వీరాజ పరాజయం' అనే రౌద్రరస ప్రధానమయిన నాటకాన్ని రాసినట్లు తెలుస్తుంది. ఆ నాటకం తర్వాత లభ్యంకాలేదు. రవీంద్ర జీవితాన్ని రచించిన ప్రభాతకుమార ముఖోపాధ్యాయ, తర్వాతికాలంలో రవీంద్రుడు రాసిన 'రుద్రచండ్' నాటకం 'పృథ్వీరాజ పరాజయా'నికి రూపాంతరమే తప్ప వేరొకటి కాదని వూహించారు. లుప్తమైపోయిన యీ రచన వొదిలేస్తే 'వాల్మీకి ప్రతిభ' అనే గేయ నాటికనే ఆయన ప్రథమ నాటకంగా యెన్నిక చెయ్యాలి. పైన సూచించిన ఆయింటి వాతావరణంతో వాల్మీకి ప్రతిభకు సంబంధం వుంది. 'విద్వజ్జన సమాగమం' అనే పేరుతో మధ్య మధ్య వారి పూజా మంటపంలో గోష్ఠులూ సమావేశాలూ జరుగుతూండేవి. ఆ సందర్భాల్లో వినోద కాలక్షేపం విధిగా కల్పించాలిసి వుండటంవల్ల చిరకాలం చిత్తాకర్షకంగా వుండే గేయ నాటికలు రాయాలిసొచ్చింది. యీ నాటికల సృష్టికి ప్రధాన శిల్పి రవీంద్రుడే అయినప్పటికీ, వాటిలో జ్యోతిరింద్రనాథ, అక్షయ చౌధురీల రచనకూడా కలిసింది. ఆ నాటి నాటకాల్లో చాలాంసుటుకు కొంతకాలం గడిచేసరికి శుష్కించి రసహీనాలై అంతరించిపోయాయి. యిరవై యేళ్ల యువకుడు రాసిన నాటకాలు మాత్రం యిప్పటికీ వసివాడకుండానే వున్నాయి. వీటిని యెప్పుడు ప్రయోగించినా ప్రేక్షకులకు లోపం వుండదు.

మధుసూదన దత్తు తను మొదట బెంగాలీ కావ్యం రచించినప్పుడొక మిత్రుడికి లేఖ రాస్తూ "పెద్దపులి రక్తాన్ని చవి చూసింది. యిహ వెనక్కిపోవటమంటూ వుండదు" అన్నాడు. తన మొదటి నాటకాన్ని కూర్చినప్పటి రవీంద్రుడి మనః ప్రవృత్తికూడా యించుమించు అలాంటిదే. ఆపైన కొద్ది సంవత్సరాలలోనే 'రుద్రచండ్' 'కాలమృగయా' 'ప్రకృతిర్ పరిశోధ్' 'నళినీ' 'మాయార్ ఖేలా' నాటకాలు రాసేశాడు. 'రుద్రచండ్' నాటకంలో నాయకుడు రుద్రచండుడనే దస్యుడు. నాగరక సభ్యత అన్నా, రాజ పదవులన్నా అతడిలో సహించరాని అశాంతి కనిపిస్తుంది. ఆ నాటకంలో మరో రెండు ప్రధాన పాత్రలున్నాయి. రుద్ర

చండుడి కూతురైన 'అమియా' అనే కన్నెపిల్లా, చాంద్ కవీ. నాటక మంతా మనకు జ్ఞాపక ముండకపోయినా నష్టంలేదు. కాని, ఆ బాలికనూ, కవినీ మాత్రం మరిచిపోవటానికి వీల్లేదు. యీ రెండు పాత్రలూ తర్వాత చాలా నాటకాల్లో రూపాంతరాలు పొందుతూవొచ్చాయి.

'కాలమృగయా' తర్వాతికాలంలో 'వాల్మీకి ప్రతిభ' తో మిళితమై పోయింది.

'మాయార్ ఖేలా' గేయనాటిక. 'వాల్మీకి ప్రతిభ' లో సన్నివేశ కల్పనలోనూ, పాత్ర చిత్రణలోనూ వొక విధమైన బిగీ, జిగీ, వున్నాయి. 'మాయార్ ఖేలా' లో ఆ ప్రయత్నమే మృగ్యం. స్వరవిన్యాసంతో హృదయావేగాన్ని కట్టివేయటమే దీని ప్రధానోద్దేశం.

రచనలో కొంతవరకు అపరిణతమే అయినా 'ప్రకృతిర్ పరిశోధ్' అనే నాటకంలో రవీంద్రుడు తొలిసారిగా తన జీవన తత్వాన్ని వ్యక్తం చెయ్యటానికి ప్రయత్నించాడు. యీ నాటకంలో కనిపించే బాలిక 'రుద్ర చండ్' లో వున్న 'అమియా' కు రూపాంతరమే.

యింతవరకొచ్చేసరికి రవీంద్రుడి జీవితంలో నాటకరచనకు సంబంధించిన అభ్యాసదశ ముగిసింది. నాటకీయ గమనం, సన్నివేశ కల్పనా, పాత్రపోషణా, నాటక వస్తూన్మీలనానికి సంగీతాన్ని సాధనంగా వుపయోగించటమూ, అంతేకాదు, వనదేవతా మాయామోహినుల గమనాగమనాల్లో నృత్యరీతీ - అన్నీ వున్నాయి యీ నాటకాల్లో. తర్వాత వివిధ సమయాల్లో రాసిన నాటకాల్లో యీ సమస్త గుణాల వికాసమూ, పరిణతీ కనిపిస్తాయి గనక యీ దశను అభ్యాసదశ అన్నాను.

౨

'మాయార్ ఖేలా' రచించిన అనంతరం అతిస్వల్ప కాలంలోనే ప్రకటించిన 'రాజారాణి' 'విసర్జన' 'చిత్రాంగద' లలో రవీంద్రుడి నాటకలేఖని హఠాత్తుగా సంపూర్ణ యౌవనశక్తిని పొందింది. 'చిత్రాంగద' సమీక్ష మాత్రం వేరొకచోట వివరించటానికలా వుంచి, తక్కిన రెండింటిని గురించీ చెప్పాలిసింది యిక్కడ చెప్పిముగిస్తాను. 'రాజారాణి' 'విసర్జన' షేక్సుపియరు పద్ధతికి చెందిన అయిదంకాల ట్రాజడీలు. 'విసర్జన'- అంతకు ముందే రూపొందిన 'రాజర్షి' నవలలో కొంతభాగానికి నాటక రూపం.

చాలామంది 'విసర్జన' నాటకాన్ని రవీంద్రుడి అత్యుత్తమ విషాదాంత నాటకంగా భావిస్తారు. నా అభిప్రాయం వేరు. చిన్నచిన్న టెక్నికల్ లోపాలున్నప్పటికీ మానవ సహజమైన ఆర్ద్రభావ పరిపూర్ణతను బట్టి 'రాజారాణి' నాటకమే వుత్తమమయినదని నా అభిప్రాయం. తర్వాత చాలాకాలానికి యీ టెక్నికల్ లోపాల్ని సరిదిద్దుకునే వుద్దేశంతో రవీంద్రుడు 'తపతి' అనేనాటకాన్ని రచించాడు. మనకొక కొత్త నాటకం లభ్యమయిన మాటనిజమే. కాని, 'రాజారాణి' లాంటి అత్యుత్తమ నాటకాన్ని పొందగలిగామా అన్నది సందేహమే.

యీ సమయంలో రవీంద్రుడు మూడు ప్రహసనాల్ని రచించాడు. వాటిలో 'ప్రజాపతిర్ నిర్బంధ్', 'చిరకుమార సభా' అనే పేరుతో తర్వాతి కాలంలో ప్రజాదరణ పొందింది. సాధారణంగా యిదే ఆయన అత్యుత్తమ ప్రహసనమని అంటారు. నాకు మాత్రం వ్యక్తిగతంగా 'వైకుంఠేర్ ఖాతా' అంటే యిష్టం. దీని రసపరిధి సంకీర్ణమైనప్పటికీ గభీరమైనది. దీనిలో పాత్రల సంఖ్య తక్కువే అయినా అన్నీ జీవంతో తొణికిసలాడేటట్లుగా స్పష్టంగా చిత్రించిన పాత్రలు. యిందులో హాస్యం అశ్రువుల్ని వొలికిస్తూ పోయిపోయి చివరి దృశ్యంలో అపురూపమైన ప్రహసనాన్ని సృష్టిస్తుంది. దాంతో కన్నీరూ, నవ్వూ వొక దానితో వొకటి కలిసిపోతాయి. బహుజనాదరాన్ని పొందటానికి నోచుకోనిన యీ ప్రహసనం రవీంద్రుడి ప్రతిభకు నిర్దుష్టమైన నిదర్శనం.

యీ కాలంలోనే రవీంద్రుడు మరో శ్రేణికి చెందిన నాటకాలు రచించాడు. వాటిని పద్యనాటకాలనవొచ్చు. యీ రచనల్లో కవి లేఖిని నాటకకర్త లేఖినితో మిళితమై పోయింది. అయితే వాటి వైశిష్ట్యం యేమిటంటే కవి తన బాధ్యతను సంపూర్ణంగా నిర్వహించినా నాటక కర్తగావున్న బాధ్యతను తేలికపరచుకోవటం జరిగింది. వీటిని చాలామంది పద్యనాటకాలంటారు. వారి అభిప్రాయం ప్రకారం వీటికి సరియైన స్థానం పద్యకావ్యశ్రేణిలో. కాని, యిది సముచితంగా కన్పించదు. వీటిలో కావ్యగుణాలెంత అధికంగావున్నా వీటి భావభంగి నాటకీయమే. యీ రచనలన్నిటిలో నాటకీయ పరిణామం యేమీ లోపించలేదు. 'గాంధారి ఆవేదన' 'కర్ణకుంతీ సంవాదం' 'నరకవాసం' 'బిదాయ్ అభిశాప్' మొదలైన రచనల్ని, అలిఖితాలైన అయిదంకాల ట్రాజడీలలో చివరి

అంకంగా భావించి చూడటానికి ప్రయత్నిస్తే వాటి యథార్థస్వరూపమూ, రసపుష్టీ స్పష్టంగా బోధపడతాయి.

'సతి' 'మాలిని' నాటకాల్లో నాటక స్వరూపం ఆశించినదానికంటే యెక్కువ వ్యక్తమయినా వీటిలో వున్నది ప్రధానంగా కావ్యగుణమే.

'లక్ష్మీర్ పరీక్ష' అనే నాటకం వొక సార్థకమైన పరీక్ష. 'క్షణికా' కావ్యంలో వ్యావహారిక భాషద్వారా కవిసాధించ దలచినదేదో సమర్థంగా సాధించగలిగారీ నాటకంలో.

3

యీ సమయంలో రవీంద్రుడి అధ్యాత్మ జీవితంలో వొక గొప్ప పరివర్తన ప్రారంభమయింది. ఆ ఛాయ సహజంగా ఆయన నానావిధ రచనలమీదా నాటకాలమీదా కూడా పడ్డది. మానవ జీవితంలో రుతుక్రమ ప్రభావమూ, దానికి ప్రతిక్రియగా కలిగిన పరిణామమూ, యీసారి ఆయన నాటకాల కుపకరణాలయిపోయాయి. 'శారదోత్సవ్' 'రాజా' 'అచలాయతన్' 'ఫాల్గుని' మొదలైన నాటకాలు జన్మించాయి. వొకప్పుడు తమ యింట్లో వుత్సవాదుల ప్రోద్బలంవల్ల యెలా నాటకాలు రాయాల్సొచ్చిందో, యిప్పుడూ అలాటి ప్రోద్బలమే శాంతినికేతనంనుంచి ఆవిర్భవించింది. అందువల్లనే ఆ సమయంలో రాసిన నాటకాలు—'శారదోత్సవ్' 'అచలాయతన్' 'ఫాల్గుని' మొదలైనవి స్త్రీ పాత్ర వర్జితాలు. ఆరోజులలో శాంతినికేతనంలో స్త్రీలను రంగస్థలమ్మీదికి రానిచ్చేవారు కారు. పైగా దేశంలో వాతావరణం కూడా స్త్రీ పురుషులు కలిసి నటించటానికి అనుకూలంగా లేదు. యివి కాక యీ సమయంలో 'ప్రాయశ్చిత్త' 'డాక్ ఘర్' నాటకాలు కూడా రచించాడు.

'ప్రాయశ్చిత్త' నాటకం అంతకుముందు రాసిన 'బౌఠాకూరాణీర్ హాట్' అనే నవలకు నాటక రూపం, దీంట్లో అతి ప్రధానమైనది ధనంజయ బైరాగి పాత్ర. అది అహింసావాణితో సాక్షాత్కరించింది. గాంధిజీ ఆవిర్భావానికి పూర్వమే అవతరించిన ధనంజయ బైరాగి వేకువకు ముందుగానే లేచిన వేకువ పిట్ట.

'డాక్ ఘర్' రవీంద్రుడి రచనలన్నింటిలో సర్వాంగసుందరమైన గద్య నాటకం. చాలావరకు విచిత్ర కల్పనా కథల రీతిలో సాగిందీ రచన. దీన్ని మరోచోట సమగ్రంగా సమీక్షిస్తాను.

'రాజా' నాటకాన్ని సింబాలిక్ నాటకమని చెప్పాలి. 'రాజా' 'అచలాయతన్' నాటకాల్లో, భారతీయ సాధనమైన రెండు సంప్రదాయాల్ని స్వీకరించటం జరిగింది. దాస్య, సఖ్య. మధుర రస సాధనల్లో- మధుర రస సాధన యెంత కఠినమైనదీ, 'సురంగమ' 'ఠాకూర్దా' 'సుదర్శన' పాత్రల్లో - ముఖ్యంగా 'సుదర్శన' మానసిక సంఘర్షణలో కనిపిస్తుంది. 'అచలాయతన్' లో జ్ఞాన, కర్మ, భక్తి మార్గాల స్వరూపం ప్రదర్శితమైంది. యీ మూడు మార్గాల సమన్వయమే జీవితపు యథార్థ సిద్ధిగా నిరూపితమైంది. విశ్వ ప్రకృతిలో సాగుతూవున్న లీల, మానవ ప్రకృతిలో కూడా సాగుతూవున్నదని ఫాల్గుని నాటకంలో ద్యోతకమవుతుంది. వసంతమూ, యౌవనమూ - యివి సత్యాలు, శీతువూ, వార్థక్యమూ - యివి కేవలం భ్రమలు. 'శారదోత్సవ్' లో చెప్పదలిచిందేమిటంటే : యీ జగత్తు అనంత సౌందర్యాన్నీ అమృతాన్నీ కుమ్మరించి మానవుణ్ణి ఋణగ్రస్తుణ్ణిగా చేసుకుంటుంది. మానవుడు దుఃఖం ద్వారా ఆ అప్పు తీర్చుకోగలుగుతాడు. దుఃఖ ధనంతో సౌందర్యఋణాన్ని తీర్చుకోగలిగినపుడే ఆనందలాభం సాధ్యమవుతుంది.

వీటితర్వాత రవీంద్రుడి నాటకాలలో చెప్పుకోదగినవి 'ముక్తధార' 'రక్తకరబి'. 'శారదోత్సవ' నాటకం దగ్గిర్నుంచి 'ఫాల్గుని' నాటకం వరకూ, మానవుడికీ భగవంతుడికీ, మానవుడికీ ప్రకృతికీ గల సంబంధం, కథావస్తువు. 'ముక్తధార' 'రక్తకరబి' లో కనిపించే మానవుడు, సామాజిక మానవుడు. యిక్కడ వ్యక్తికీ సామాజిక వ్యవస్థకీ మధ్య సంఘర్షణ. అభిజిత్ రంజన్ - వీరు వ్యక్తికి ప్రతినిధులు. వారికి క్రమంగా నిరోధింపబడ్డ ప్రవాహంతోనూ, యంత్ర దానవుడితోనూ సంఘర్షణ యేర్పడింది. యిక్కడ కవి చెప్పదలిచిందేమిటంటే యంత్రంతోనే యంత్రాన్ని పరాభూతంచేస్తే యంత్రానికే విజయాన్ని చాటించినట్లవుతుంది. యంత్రాన్ని ప్రాణంతో ఆఘాతపరిస్తే దానివల్ల ముందుగా ప్రాణానికి నష్టం సంభవించినా చివరికి యంత్రశక్తి శిథిలమైపోతుంది - అని. అభిజిత్ మరణించాడు. కాని ముక్తధార ఆనకట్ట కూడా భగ్నమయింది. రంజన్ మరణించాడు. అయితే యంత్రపురి గోడ కూడా కూలిపోయింది. రెండు నాటకాల్లోనూ జటిలమైన వొక ఆధునిక సమస్య పరిష్కృతమైంది.

౪

'నటీర్ పూజ' నాటకం ౧౯౨౬ సంవత్సరంలో ప్రకటితమైంది. అది వొక బౌద్ధ జాతకం నించి గ్రహించిన కథ - నాటక శిల్పం అత్యున్నత స్థాయిలో వున్నది, కాని అంతకంటె వేరొక వైశిష్ట్యం కూడా కనిపిస్తుందీ నాటకంలో. ఆ తర్వాత రాసిన నృత్య నాటికల్లో కనిపించే నిర్దుష్ట భావాలు బీజరూపంగా యిందులో వున్నాయని నా విశ్వాసం. ఆయన జావాలో పర్యటిస్తున్నపుడు అక్కడ చూసిన నృత్య నాటక కళలో యీ భావాలకు అనుకూల క్షేత్రమూ, తగిన దృష్టాంతాలూ లభించటంవల్ల అవి స్థిర పడ్డాయి. రవీంద్రుడికి నృత్య నాటికల్ని గురించిన భావన లెన్నో వున్నాయి మనస్సులో. కాని లేనివేవంటే నృత్య నాటక కళను నిరూపించే దృష్టాం తాలు. జావా ద్వీపం వీటిని అందించింది. రవీంద్రుడి తుది జీవితంలో సఫలత్వాన్ని పొందిన నాటక రచనాశక్తి అంతా నృత్యనాటిక రచనలోనే వినియోగమయింది. 'చిత్రాంగద' 'చండాలిక' 'శ్యామా' 'తాషేర్ దేశ్' - యీ నృత్య నాటికలు రవీంద్రుడి సర్వతోముఖ ప్రతిభకు సమగ్ర మైన దృష్టాంతాలు. నాటక ప్రతిభ అన్నంతమాత్రాన యీ నూతన శిల్ప కళలోవున్న సర్వాంగీణ రూపం వ్యక్తంకాలేదు. యెందుకంటే యిందులో కావ్యమూ, సంగీతమూ, నాట్యమూ, నృత్యమూ చతురంగ ప్రవాహంగా మిళితమైనాయి. రవీంద్రుడి శిల్పకళా, బహుముఖమయిన ప్రతిభా, వీటి పరిపూర్ణ ప్రకాశమే యీ నృత్య నాటికల్లో మిళితమైనాయి అంటే అతిశయోక్తి కాబోదు.

౫

పైనైనంత సంక్షిప్తంగా రవీంద్ర నాటక ప్రవాహాన్ని సమీక్షించట మైంది. యీసారి ఫల శ్రుతికి సంబంధించిన ప్రాసంగిక విషయాల్ని కూడా సంక్షిప్తంగా చెప్పి ముగిస్తాను

రవీంద్రుడి నాటకాలప్పుడప్పుడు వ్యాపార రంగస్థలాల మీద ప్రదర్శిస్తూ వొచ్చారు. 'చిరకుమార సభ' 'శేషరక్ష' లాంటి కొన్ని నాటకాలు తాత్కాలికంగా మాత్రమే ప్రేక్షకుల ఆదరానికి పాత్రమయి నాయి. అయినా వ్యాపార రంగస్థలాల నాటక ప్రయోగ పద్ధతికీ రవీంద్ర నాటకాలకూ యెన్నడూ పొత్తుకలియలేదనే చెప్పాలి. యెందుకని? బహుశా ప్రేక్షకులు అలవాటుపడలేదేమో? అదీగాక వ్యాపార రంగస్థలాల మీద

ప్రసిద్ధికెక్కిన నాటకాలన్నీ వృత్తిగా నటించే నటీనటుల్ని ఆశ్రయించి వుండటంవల్ల ప్రసిద్ధికెక్కినవే. వాటిల్లోది వొకవిధమైన సామూహిక శిల్పం. రవీంద్రుడి నాటకాలు యేకాంతంలో ఆవిర్భవించాయి కాదా, అంటే వారి కుటుంబ వాతావరణంలో. యివి ఆయన తన వొక్కడి ప్రయత్నంవల్ల సృష్టించి ప్రయోగించినవి. అంచాత వీటిలో వున్న సహజ సంపద ప్రధానంగా కావ్య సౌందర్యం.

నాటకంలో వున్న సాహిత్య మూల్యాన్ని అప్రధానంగా భావించే విమర్శకు లెందరో వున్నారు. వాళ్ల అభిప్రాయంలో కేవలం ప్రేక్షకుల్ని రంజింపచేయటమే నాటకాల యేకైకప్రయోజనం. యీ అభిప్రాయాన్ని ఆమోదించటానికి వీల్లేదు. నాటకం ముఖ్యంగా సాహిత్యం. దాన్ని ఆ దృష్టితో సమీక్షించటమే వుచితం.

ఆ దృష్టితో గనక చూస్తే రవీంద్రుడి నాటకాలు అమూల్య రత్నాలు. రవీంద్రుడికి పూర్వం కూడా గేయ నాటకాలు లేకపోలేదు. అయినప్పటికీ ఆయన ప్రథమదశలో రాసిన ' వాల్మీకి ప్రతిభ ' ' మాయార్ ఖేలా ' యిప్పటికీ ప్రేక్షకుల ఆదరాన్ని పొందుతూనే వున్నాయి. వినోదాన్ని కల్పించటంలో కూడా వాటి విలవ యేమాత్రమూ తగ్గలేదు.

' రాజా ఓ రాణీ ' ' విసర్జన్ ' వంగ సాహిత్యంలో అగ్రశ్రేణికి చెందిన ట్రాజెడీలు. వంగసాహిత్యంలో వున్న ప్రహసనాల సంఖ్యకూడా అంత తక్కువకాదు. కాని, ' చిరకుమార సభ ' లాంటి నిష్కలంకమైన, సర్వజనోపభోగ్యమయిన ప్రహసనం మరొకటిలేదు. దీని ఆకర్షణ యెంత విస్తృతమైనదో అంత సహజమయినది.

రవీంద్రుడి కావ్యనాటకాలు : చిత్రాంగద, గాంధారిర్ ఆవేదన్, కర్ణకుంతీ సంవాద్, నరకవాస్ మొదలయినవి - రవీంద్ర సాహిత్యమిచ్చిన అమూల్యసంపద. యీ క్షేత్రంలో ఆయనకాయనే సాటి.

' శారదోత్సవ్ ' ' ఫాల్గుని ' మొదలైన రుతు నాటక క్రమంలో ' డాక్ ఘర్ ' ' రక్తకరబి ' మొదలయిన సింబాలిక్ పద్ధతిలో ఆయన వొక నూతన సంప్రదాయ ప్రవర్తకుడైనాడు. కేవలం వంగ సాహిత్యంలోనే కాదు బహుశా భారతీయ సాహిత్యమంతటిలోనూకూడా.

తుది వయస్సులో ఆయన రాసిన నృత్య నాటికలు ఆయన మౌలిక సృష్టి. వీటిల్లో కూడా ఆయన వొక నవ్యమార్గాన్ని ప్రదర్శించాడు.

కావ్యాల్ని, కథానికల్ని వొదిలేస్తే రవీంద్రుడి ప్రతిభ నాటకాల్లో వెలిసిన కావ్యత్వంలో సంపూర్ణంగా వ్యక్తమవుతుంది. ఆ ప్రతిభ యొక్క బహుముఖత్వం, నాటకాల శ్రేణీ వైవిధ్యంలోనూ నవ్యసంప్రదాయ ప్రవర్తకత్వంలోనూ స్పష్టమవుతుంది.

## రాజా - ౧౯౧౦

'రాజా' నాటక కథ బౌద్ధ జాతక కథల్లో కుశజాతకమనే కథనుంచి స్వీకరించినది. మూలకథ యిది: వారాణసి రాజయిన కుశుడు సింహాసనాన్ని అధిష్ఠించి కాన్యకుబ్జ రాజపుత్రిక అయిన సుదర్శనను వివాహం చేసుకున్నాడు. భర్త అతి కురూపిగా వుండటం సుదర్శన చూసింది. అప్పుడామె మనోవేదనతో తిరిగి పుట్టింటికి పోయింది. ఆపైన కుశుడు కాన్యకుబ్జానికి వెళ్లి నానావిధ నృత్య రీతులతో భార్య మనస్సు రంజింప చేసే ప్రయత్నంలో నిమగ్నుడైనాడు. యీ సమయంలో తన మామగారు సూచించిన వుపాయంతో యతీశ్వర్ పేరున రత్నాన్ని ధరించి దివ్య రూపాన్ని పొందగలుగుతాడు. అప్పుడు మళ్లీ భార్యా భర్తల సమాగమం జరుగుతుంది.

శిల్ప సౌందర్య విహీనమూ, ఆధ్యాత్మిక భావరహితమూ అయిన యీ చిన్నకథను తీసుకుని రవీంద్రుడు సర్వాంగ సుందరమైన నాటకాన్ని రూపొందించాడు. యీ నాటకంలో కవి నిరూపించదలిచిందేమిటంటే - విశ్వానికి అధిపతి అయిన రాజు యింద్రియ గ్రాహ్యుడు కాడు. అలా అని కేవలం యింద్రియాతీతుడూ కాడు. లోకంలో వున్న సమస్త సౌదర్యం లోనూ ఆయన విభూతి నిక్షిప్తమైవుంది. మనస్సులో యేకరూపుడైన అతడు బయట బహురూపుడు. యీ రూపానుభూతిని పొందగలిగిన వ్రాళ్లే రాజు స్వరూపాన్ని గ్రహించగలుగుతారు. కేవలం చర్మ చక్షువులతో చూడాలని ప్రయత్నిస్తే అంతులేని అనర్థాలకూ భ్రమలకూ లోను కావాలి సొస్తుంది. రాణి అయిన సుదర్శన కళ్లతో చూడరానిదాన్ని కళ్లతో చూడబోయి యే యిక్కట్లను తెచ్చుకున్నదో అదే యీ నాటకంలో విషయం.

యీ రసహీనమైన తత్వపరిచయంవల్ల, గేయ బహుళమూ, ఆనంద జనక సన్నివేశభరితమూ, నాటకీయ సంఘాత పూర్ణమూ అయిన రవీంద్ర కృత నాటక పరిచయం లభ్యం కాదు. ఆ పరిచయాన్ని పొందే భారాన్ని

పాఠకులమీదే వొదలేసి రవీంద్రుడి పరిణత లేఖినినుంచి వెలువడిన నాటకాల రచనాపద్ధతికి సంబంధించిన రెండు మూడు మాటలు చెబుతాను.

'శారదోత్సవ్' దగ్గర్నుంచి ఆయన చివరి జీవితంలో రాసిన నాటకాలన్నిటిలోనూ వొక పాటరన్ (pattern) చూడగలుగుతాం. వొక వీధీ, బహుజన సమాగమంతో కూడిన వొక వుత్సవమూ యీ పాటరనుకు ప్రముఖ చిహ్నాలు. వొక్కొక్కప్పుడా వీధి పల్లెటూరిది కావొచ్చు. కొన్ని చోట్ల కాల్పనికమైన నగర వీధి అయినా కావొచ్చు. వొకప్పుడా వుత్సవం గ్రామీణమైనది కావొచ్చు. కొన్నిచోట్ల రాజ ప్రాసాదాలలో వసంతోత్సవ సంబంధి కావొచ్చు. శారదోత్సవ్, రాజా, ఫాల్గుని, ముక్తధారలలో యీ పాటరన్ సుస్పష్టంగావుంది. అచలాయతన్, డాక్ ఘర్, రక్తకరబి లలో యేకదేశంగానూ అస్పష్టంగానూ వుంది. వుత్సవం లేకపోతే పోవొచ్చు. కాని సాధారణంగా వీధుల్లోనూ, వుత్సవాదుల్లోనూ కనిపించే స్త్రీ పురుషులే యీ నాటకాల్లోనూ కనిపిస్తూంటారు: పాటలు పాడే బిచ్చగాళ్లూ, దాసరులూ, పెరుగమ్మేవాళ్లూ, బాల బాలికా దళాలూ, అంధగాయకులూ, గ్రామ పెద్దలూ, సన్యాసులూ. యీ వీధులూ వుత్సవాలూ పైన చెప్పిన స్త్రీ పురుషులూ - యివన్నీ విశిష్టమైన వంగదేశ నిజస్వరూపాన్ని వ్యక్తం చేస్తాయి. ఆ రూపాన్ని తన నాటకానికి పాటరన్ రూపంగా గ్రహించి రవీంద్రుడు తన ఆర్టును వంగదేశపు వాస్తవికతపై అంకితం చేశాడు.

'రాజా' నాటకం The King of the Dark Chamber అనే పేరుతో యెంతో ఆదరాన్ని పొందింది.

## డాక్ ఘర్ - ౧౯౧౨

ముక్తికోసం మానవాత్మ యెంతో అపరిమితంగా వ్యాకుల పడుతుంది. ఆ ముక్తి వ్యాకులమైన మానవాత్మకు సంకేతమే యీ డాక్ ఘర్ నాటకంలో నాయకుడైన రోగిష్ఠి పిల్లవాడు అమల్. ముక్తిని గురించి మానవుల్లో చాలా చిత్రమయిన అభిప్రాయాలున్నాయి. విషయాసక్తులు దీన్ని అనర్థకమైన కోరికగా భావిస్తారు. అందుకనే గ్రామపెద్దా, మాధవదత్తూ, రాజవైద్యుడూ మొదలైనవాళ్లు అమల్ని బైటికి రాకుండా యింట్లోనే అట్టె పెట్టాలనుకుంటారు. అతడి మనోభావాన్ని ప్రబలమైన వ్యాధిగా భావించి, అతడికి చికిత్స చేయించి ఆరోగ్యవంతుణ్ణి చేయాలను

కుంటారు. యింకో వైపున తాతయ్యకూ, రాజవైద్యుడికీ యిదే మానవ స్వభావమని తెలుసు. అందుకే వాళ్లు అంత చనువుచూపుతారు. వుత్సాహాన్ని కలిగిస్తారు. అతడికి రాజు తప్పకుండా వుత్తరం రాస్తాడనీ లేకపోతే తమ కళ్లయెదుట అంత ఆడంబరంగా పోస్టాఫీసు తెరచివుంచటంలో వుద్దేశమేమైవుంటుందనీ చెబుతారు. ప్రపంచంలో సౌందర్యం యావత్తూ రాజుగారి పోస్టాఫీసులోనే వుందని నా అభిప్రాయం. అక్కణ్ణుంచి యెప్పుడూ టపావొస్తూనే వుంటుంది మనస్సు దగ్గిరికి. మనలో చాలా మందిమి అమల్‌లాగానే అందులో భాషను చదవలేం. అయినా వుత్తరాలు రాజు రాసినవేనని అమల్ విశ్వాసం. మనకా విశ్వాసంలేదు. అమల్ విశ్వాసంకలవాడు. మనం విశ్వాసం లేనివాళ్లం. అందుకే తాతయ్య మాధవదత్తుతో అంటాడు "విశ్వాసంలేనివాడా! నోరు మూసుకో' మని. యీలాంటి అల్ప వస్తువును రకరకాల పాత్రలతో రమ్యమయిన నాటకాన్ని రూపొందించటానికి వీలౌతుందని విశ్వసించటం కష్టం. 'డాక్‌ఘర్' నిర్దుష్టమైన నాటకమని మరోచోట చెప్పాను. యిది చాలా అల్పవ్యాప్తి గల నాటకం. రచనయొక్క అవధి యెంత పరిమితమైతే అంత వుజ్వలమవుతుంది రవీంద్రుడి ప్రతిభ. యీ కారణంచేతనే చిన్నచిన్న పాటల్లోనే ఆ ప్రతిభ వుజ్వలతమంగా ప్రకాశించింది.

### ముక్తధార - ౧౯౨౨
### రక్తకరబి - ౧౯౨౩

'ముక్తధార' నాటకానికీ అంతకు పూర్వపు 'ప్రాయశ్చిత్త' నాటకానికీ కొన్నికొన్ని పోలికలున్నాయి. రెండు నాటకాల్లోనూ ధనంజయ బైరాగి వున్నాడు. యీ బైరాగి రవీంద్రుడు సృష్టించిన పాత్ర లన్నిటిలోనూ వుత్తమమైనపాత్ర. ౧౯౦౯ సంవత్సరంలో మొట్టమొదట ప్రాయశ్చిత్తం ప్రయోగించినప్పుడు యీ ధనంజయ బైరాగి అహింసా ప్రతిఘటన దైవవాణి లాంటిదిగా తోచింది. చాలామందికి దైవవాణిలాగానే అవాస్తవికమైనదనీ, ఆచరణయోగ్యం కాదనీ అనిపించిది. కాని, ౧౯౨౨ సంవత్సరంలో ముక్తధార వెలువడినపుడు ధనంజయ బైరాగి వాక్కులో వాస్తవికత భాసించింది. యెందుకంటే యీలోగా గాంధిజీ ఆవిర్భవించాడు. ప్రాయశ్చిత్తముక్తధారలకు మధ్య యిది తప్ప వేరే పోలిక యేమీ లేదు. రెండు నాటకాలూ రెండు విభిన్న సమయాల్లో రాసినవి. 'బలాకా'

కావ్య రచన నాటినుంచీ కావ్యాల్లోనూ నాటకాల్లోనూ, తక్కిన అనేక రచనల్లోనూ, రవీంద్ర సాహిత్యంలో వొక నూతన దృష్టి, నూతన చైతన్యమూ కన్పించటం ప్రారంభించింది. వ్యక్తికీ వ్యక్తికీ మధ్యా, వ్యక్తికీ ప్రకృతికీ మధ్యా సాగే లీలను చూపించినంత మాత్రాన ఆయన తృప్తిపడ లేదు. వ్యక్తికీ సమాజానికీ మధ్యవున్న సంబంధాన్నీ సంఘర్షణనీ చూపించ టానికి పూనుకున్నాడు. మొదటినుంచీ జగత్తునంతటినీ క్రీడారంగంగా భావిస్తూ వొచ్చిన మానవుడు రవీంద్రసాహిత్యంలో యీ సారి సంగ్రా మానికీ ప్రతిఘటనకూ అలవాటుపడ్డ మానవుడుగా రూపొందసాగాడు. ముక్తధార, రక్తకరబి యీ భావాలను ప్రతిబింబించిన ఉత్తమ నాటకాలు.

వ్యక్తికీ సమాజానికీ మధ్య యంత్రం అనే వొక నూతన శక్తి వొచ్చి పడ్డది. దాని ఫలితంగా వ్యక్తికీ సమాజానికీ గల సంబంధం జటిలమై పోయింది. సమాజం - అంటే సంఘ బద్ధుడైన మానవుడు యంత్రదేవతను సమర్థిస్తాడు. వ్యక్తి యంత్రానికి విరోధి. అంచాత వ్యక్తికీ సమాజానికీ సంఘర్షణ అనివార్యమై నిలిచిపోయింది. అభిజిత్తుతో ఉత్తర కూటపు ప్రజలకు పోరాటం యేర్పడ్డది. యెందుకంటే మధ్యలో ముక్తధార ఆనకట్ట అనే యంత్రం వొచ్చిపడ్డది. రక్తకరబిలో రంజన్‌కూ రాజుకూ మధ్య విరోధం యేర్పడ్డది. యెందుకంటే వాళ్లిద్దరిమధ్యా యక్షపురి యాంత్రిక వ్యవస్థ సిద్ధమైంది. యీ పరిస్థితుల్లో కర్తవ్య మేమిటి ? రవీంద్రుడేమంటాడంటే విరోధాన్ని కాని నిరోధాన్ని కాని కాదని తప్పుకుంటే సమాధానం కుదరదు. యంత్రమ్మీద దెబ్బతీయాలిసిందే. కాని మరో యంత్రంతో కాదు. ప్రాణంతో నిరోధించాలి. దానివల్ల ప్రాణంపోతే పోతుంది. అభిజిత్తు, రంజనూ మరణించటం తప్పలేదు. కాని యింతకన్నా మరో ఉపాయం లేదు. వొక యంత్రాన్ని అంతకన్నా పెద్ద యంత్రంతో పరాజితం చేస్తే యంత్రానికే విజయం చాటించినట్లవుతుంది. ప్రాణాన్ని వొడ్డి ఆపని సాధిస్తే ప్రాణానికే విజయం చేకూరినట్లవుతుంది.

ముక్తధార రక్తకరబిలలో యిదే మూలవిషయం. కాని యీ రెండింటిలో వున్న సారస్యం అంత సులభంగా బోధపడేది కాదు. రవీంద్రుడి చరమ వయస్సులో తన జీవన తత్వాన్ని మేళవించిన నాటకాలు పరిశీలిస్తే వాటిలో ముక్తధార ఉత్తమమైనదనీ, ముక్తధారతో పోలిస్తే రక్తకరబిలో నాటకీయగతి మందంగా నడిచిందనీ నా అభిప్రాయం. రక్తకరబి కథా

వస్తువు శాఖోపశాఖలుగా అల్లుకునిపోయి లక్ష్యాన్ని దూరంచేసుకుని మందంగా నడిచింది. గురితప్పని విలుకాడి బాణంలాగా ముక్తధారలో కథాగమనం యేకాగ్రంగానూ రుజువుగానూ సాగింది.

ఆంగ్లంలో Myth making శక్తి అంటారు. కాల్పనికమైన వొక నూతన జగత్తును నిర్మించగలిగే యీ శక్తి రవీంద్రుడిలో కనిపిస్తుంది. రక్తకరబి నాటకంలో దుర్లభమైన యీ శక్తి సుప్రకాశితమైంది. యక్షపురి అనే పేరుతో వొక ఉపజగత్తు నిర్మించి దానికి లౌకికమైన నామకరణమూ రూపకల్పనా ప్రసాదించి విశ్వాస యోగ్యమైన జగత్తుగా దాన్ని తీర్చి దిద్దాడు. యీ రచనలో శిల్పికీ మేధావికీ సార్థకమైన సమన్వయం సమకూరింది. దీనితో భారతీయ సాహిత్య సమ్ముఖాన ఆశాజనకమైన భవితవ్యాన్ని చూపే ప్రశస్త ద్వారాన్ని తెరిచాడు.

# 1

# అంధకార గృహం

[ మహారాణి సుదర్శన, ఆమె దాసి సురంగమ ]

సుదర్శన : దీపం ! దీపమేదీ ? యీ యింట్లో వొక్కనాడూ దీపం వెలగదు.

సురంగమ : మహారాణీ ! మీ కోటలో యింటింటా దీపాలు వెలుగుతూనే వున్నై. వాటి ప్రమేయం లేకుండా పోవటానికి వొక్క యింట్లో నైనా అంధకారం వుంచుకోరూ ?

సుదర్శన : యెక్కడైతే మాత్రం అంధకార మెందుకుండాలి ?

సురంగమ : అలాగైతే వెలుతుర్ని గుర్తించలేం ; చీకట్ని గుర్తించలేం.

సుదర్శన : నువ్వీ అంధకార గృహంలో దాసివి ; నీ మాటలుకూడా అంధకారంలాగే వున్నై. వొక్కమాటా అర్థంకాదు. చెప్పు చూద్దాం. అసలీ యిల్లున్న దెక్కడ ? యీ యింట్లో కెటునుంచి రావటమో యెటునుంచి పోవటమో, ప్రతిరోజూ చిక్కుగానే వుంది.

సురంగమ : యీ యిల్లు కట్టింది నేల చీల్చి పృథివీహృదయాంతరాళంలో. మీ కోసం మహారాజు దీన్ని ప్రత్యేకంగా కట్టించారు.

సుదర్శన : ఆయన కిళ్ళేం తక్కువని యీ అంధకార గృహం ప్రత్యేకంగా కట్టించారు ?

సురంగమ : వెలుతురున్న యింటికి నానాజనమూ వొస్తుంటారు, పోతూంటారు. యీ చీకటింట్లో కేవలం నిన్నొక్కతెనే కలుసుకోగలుగుతారు.

సుదర్శన : అలాకాదు. నాకు వెలుతురు కావాలి. దీనికోసం నా హృదయం తహతహ లాడుతున్నది. నా కంఠహారాన్ని నీకు బహుమానంగా యిస్తాను, వొక్కరోజు యీ యింట్లోకి దీపం తేగలిగావంటే.

సురంగమ : నా తరమా ? ఆయన అంధకారం నిలిపినచోట నేనా దీఫం వెలిగించటం ?

సుదర్శన : మహారాజంటే యెంత భక్తి నీకు ? అవును గాని విన్నాను, నీ తండ్రి కేదో శిక్ష విధించారుట మహారాజు.

సురంగమ : నిజమే. నాన్న జూదమాడేవాడు. రాజ్యంలో వున్న యువకు లందరూ మా యింట్లో చేరి తాగేవారు. జూదమాడేవారు.

సుదర్శన : నువ్వేం చేసేదానివి ?

సురంగమ : అమ్మా మీరంతా విన్నట్టేవుంది. నేనవినీతి మార్గంలో పడ్డాను. బుద్ధిపూర్వకంగానే మా నాన్న నన్నాదారిలో దింపాడు. నాకప్పుడు తల్లి లేదు.

సుదర్శన : మహారాజు నీ తండ్రిని నిర్వాసితుణ్ణి చేశాడు గదా, నీ కాయన మీద కోపంరాలా ?

సురంగమ : అంతాయింతా కాదు-యెవరైనా మహారాజుని చంపి పారేస్తే బాగుండు ననిపించింది.

సుదర్శన : నీ తండ్రి దగ్గర్నుంచి విడిపించి నిన్నెక్కడుంచారు ?

సురంగమ : యేమో యెక్కడుంచారో యెవరికి తెలుసు ? కాని యెంత కష్టమైపోయింది. సూదులు గుచ్చినట్లు, నిప్పులో కాల్చినట్లైంది.

సుదర్శన : యేం. యెందుకోసం నీ కింత కష్టం ?

సురంగమ : అవినీతి మార్గంలో వుండటంవల్ల, ఆ మార్గం మూసెయ్యగానే, నా కింకో ఆశ్రయం లేకపోయింది. పంజరంలో బంధించిన అడవి జంతువులా గర్జిస్తూ అందర్నీ కరిచి చీల్చేయాలనుకునే దాన్ని.

సుదర్శన : మహారాజును గురించి అప్పు డేమనుకునేదానివి ?

సురంగమ : ఊః యేం నిర్దయ ! యేం కాఠిన్యం ! యే మాత్రమూ పట్టు విడవని కాఠిన్యం !

సుదర్శన : ఆలాటి రాజుమీద నీ కింత భక్తి యెలా యేర్పడింది ?

సురంగమ : అమ్మా యేం చెప్పను ? అంతటి దృఢసంకల్పమూ, అంత కాఠిన్యమూ వుండటంవల్లనే ఆయనమీద నా కింత అపేక్షా, యింత విశ్వాసమూ. లేకపోతే నాలాటి అవినీతిపరురాలి కాశ్రయ మెలా దొరుకుతుంది ?

సుదర్శన : యీ విధంగా నీ మనస్సెప్పుడు మారిపోయింది ?

సురంగమ : యేమో యెప్పుడో, నా దురహంకారమంతా చితికి మట్టిలో కలిసిపోయింది-అప్పుడు చూశాను, ఆయన రూపం యెంత భయం

కరమో అంత సుందరం. బతికిపోయాను. మళ్ళీ జన్మమెత్తినట్లై పోయాను.

సుదర్శన : సరేకాని సురంగమా యిటుచూడు. నా మహారాజు చూడటాని కెలా వుంటారు ? నే నొక్కనాడూ ఆయన్ని కళ్ళతో చూళ్ళేదు— ఆయన నా చెంత చేరటం చీకట్లోనే, వెళ్ళిపోవటమూ చీకట్లోనే. యెంతమంది నడిగానో! వొక్కరూ స్పష్టంగా జవాబు చెప్పరు. అందరూ యేదో కొంత దాచే వుంచుతారు.

సురంగమ : మహారాణి ! నే న్నిజం చెబుతున్నా, యెవరూ సరిగ్గా చెప్పలేరు. యేమి సౌందర్యం! అలాక్కాదు—లోకమంతా యేది సౌందర్య మంటారో అలాటి సౌందర్యం మాత్రం కాదు.

సుదర్శన ; యేమన్నావ్. ఆయన చక్కనివాడు కాడూ ?

సురంగమ : అది కాదు మహారాణీ ! చక్కనివాడంటే ఆయన్ను చౌకచేసి నట్లౌతుంది.

సుదర్శన : నీ మాటలన్నీ వొకటేరకం - యేవీ అర్థం కావు.

సురంగమ : అమ్మా యేం చేయను! అన్ని మాటలూ తెలుసుకోవటం సాధ్యంకాదు. నా చిన్నతనంలో మా నాన్న యింటి కెందరో పురుషులు రావటం చూశాను. వాళ్ళందర్నీ అందగాళ్ళనే అనే దాన్ని. రాత్రులూ పవళ్ళూ నా సుఖాల్నీ దుఃఖాల్నీ యే విధంగా నాట్యంతో నింపేవారో యిప్పటికీ మరచిపోలేను. మహారాజలాంటి వారా ? సుందరుడా ? యెన్నటికీ కాదు.

సుదర్శన : సుందరుడు కాడూ ?

సురంగమ : ఆఁ అదే చెబుతున్నాను. యెన్నటికీకాదు. సుందరుడు కాదంటే యేమన్నమాట. ఆయన ఆకార్ఠం యెంత అద్భుతం, యెంత ఆశ్చర్య జనకం ! మా నాన్న దగ్గిర్నుంచి లాక్కుని పోయి తన దగ్గిరికి నన్ను చేరదీసినప్పు డనుకునే దాన్ని - ఆయన ఆకారం భయంకరమని. నా మనస్సంతా నిరుత్సాహంగా వుండేది - క్రీగంటితోకూడా ఆయన వైపు చూడటానికి బుద్ధిపుట్టేది కాదు. ఆ తర్వాత యిప్పుడేమయిం దంటే, పొద్దున్నే లేవగానే ఆయనకు ప్రణామం చేస్తూ ఆయన పాదాలు మోపిన నేలవైపు చూస్తూ - ఆ చూడటమే చాలు - నాకు కళ్లున్నందు కనుకుంటాను.

సుదర్శన ; నీ కథంతా నా కర్థం కావటం లేదు కాని వింటుంటే మాత్రం యెంతో బాగుంటున్నది. నువ్వేమన్నా చెప్పు నేను ఆయన్ని చూచి తీరాలి. నా కెప్పుడు వివాహమైందో గుర్తులేదు. అప్పుడు నా కంతగా జ్ఞానంలేదు. మా అమ్మ చెప్పగా విన్నా, దైవజ్ఞులా మెతో చెప్పారుట - తన కూతురికి భర్త కాబోయే వ్యక్తి యెలాటి వాడంటే, అలాంటి పురుషు డీ లోకంలో యెవరూ వుండరని. యెన్నిసార్లడిగానో మా అమ్మని నా భర్త చూడటాని కెలావుంటాడో అని. ఆమెకు సూటిగా జవాబు చెప్పటాని కిష్ట ముండేది కాదు - " నేను మాత్రమేం చూశానమ్మా . నా పరదా చాటునుంచి బాగా చూడటాని కే వీలయ్యేదికాదు " అనేది. ఉత్తమపురుషు లందరిలోనూ వుత్తముడైన ఆయన్ని చూడాలనే యీ అభిలాష నన్ను వదలటం లేదు.

సురంగమ : అదుగో మహారాణి ! యేదో వోగాలి వీస్తున్నది.

సుదర్శన ; యేమిటి ? యేం గాలి ?

సురంగమ : అదుగో ఆ పరిమళం తెలియటంలా ?

సుదర్శన ; ఊహుం నాకే పరిమళమూ సోకటం లేదు,

సురంగమ : వీధి వాకిలి తెరుచుకుంది. ఆయన వేంచేస్తున్నారు. లోపలికొస్తున్నారు.

సుదర్శన: నీ కెలా తెలిసింది ?

సురంగమ : యేమో మహారాణీ ! నే ననుకుంటాను. నా గుండెలో ఆయన అడుగుల సవ్వడి కదుల్తుంది. యీ అంధకార గృహంలో ఆయన సేవకురాల్ని గదా ! అందువల్ల నాకి జ్ఞానమెలాగో కలుగుతుంది. కళ్ళతో చూడాల్సిన అవసరంలేకుండా నే నాకి అనుభవంకలుగుతుంది.

సుదర్శన : నాకు నీలాటి అనుభవమేవుంటే బతికిపోదు నే.

సురంగమ : వుంటుంది. మీకూ వుంటుంది మహారాణీ ! చూడాలి చూడాలని మీ మనస్సంతా చంచలమైపోయింది. అందుకనే కేవలం కళ్ళతో చూడాలనే కోరికతో మీ మనస్సంతా నిండిపోయింది. ఆ కోరిక వొదులుకున్నారంటే మీకంతా సులభసాధ్యమవుతుంది.

సుదర్శన : దాసివిగావుండీ నీకింత సులభం కావటమేమిటి, రాణిగావున్న నాకు కాకపోవట మేమిటి ?

సురంగమ : నేను దాసిని కాబట్టే నాకీశక్తి సహజంగా లభించింది. ఈ అంధకార గృహభారాన్ని నాకప్పగించి, "సురంగమా! యీ యిల్లు ప్రతిరోజూ చక్కగా అమర్చివుంచు. యిది నీపని" అని యేనాడు మహారాజా దేశించారో అప్పట్నుంచీ ఆయన ఆజ్ఞ శిరసావహించాను. "మహారాజా మీ తక్కిన యిండ్లలో దీపాలు వెలిగించే పని నా కిప్పించండి" అని మనసులోనైనా అనుకోలేదు. మనః పూర్వకంగా చేస్తున్న యీ పనే నాలో యీ శక్తిని మేల్కొల్పింది. నాకేమీ కష్టమనిపించలేదు. అదుగో ఆయన వేంచేస్తున్నారు. యింటిదాకా వొచ్చి వెలపల నిలబడివున్నారు. ప్రభూ!

(బైటనుంచి పాట వినబడుతుంది)

తెరు తెరు తెరు తలుపులు తెరు
వాకిట నను నిలుపబోకు

ఎదీయిటు నీదు చూపు
నావైపున సారింపుము
పనులన్నియు తీరిపోయె
సందెచుక్క కాననాయె
వెలుగుపడవ కదలి కదలి
అస్తాంబుధి గ్రుంకిపోయె

నడచి నడచి యిలు చేరిన
నను వాకిట నిలుపబోకు.

కలశము నిండార మధుర
జలముల గొని వచ్చితివా?
శుభ్రదుకూలము దాలిచి
కురులు ముడిచి పూలుతురిమి
కోరకములు మాలలుగా
కూరిచి కొనితెచ్చితివా?

గోవులు గోష్ఠముల జేరె
పులుగులు తమ గూండ్లు దూరె
ధారుణిపై సాగిపోవు
దారులెల్ల కలిసి యంధ
కారమ్మున మాయమయ్యె.

నీ వాకిలి చేరిన నను
వెలుపలనే నిలుపబోకు.

సురంగమ : మీ యింటివాకిలి మీకొక్కకుండా యెవరు మూయగలరు ప్రభూ ? అయినా ఆ తలుపులు గడియవేసి లేవు. చేరవేసినవే. కాస్త కదిలిస్తే వాటంతటవే తెరుచుకుంటై. ఆ మాత్రం కూడా చేయరూ ? నేనే లేచొచ్చి తెరిస్తేనే గాని లోపలికి రారూ ?

నన్ను కప్పియున్న మేలి
ముసుగును తొలగించు టనగ
ఎంతటిపని స్వామి ! నీ కెంతటిపని ?
నీ వనుకోవలె గానీ
నిశ్వాసమ్మొకటి చాలు
నేలరాలిపోవు ముసుగు.
నీ పిలిచిన పిలుపు వినక
కన్నుమూసి నేలవ్రాలి
యున్న నన్ను మేల్కొలుపక
వాకటనే నిలిచియుందువా ? స్వామి ! యిదేటివింత ?
రథచక్రధ్వనులు రేగ
జగతినెల్ల మేల్కొలుపుము
రాజఠీవి దర్పముతో
నీయింట ప్రవేశింపుము
నిదురమత్తు చెదిరిపోవ
నీవే నాప్రభువటన్న
నిశ్చయమున వేగవచ్చి
నీ చరణము లంటి, చేసి
కొనియెద నాత్మార్పణంబు.

మహారాణీ ! పోయి వాకిలి తెరవండి. లేకపోతే ఆయనలోపలికిరారు.

సుదర్శన : యీ యింటి అంధకారంలో యేదీ సరిగ్గా నాక్కనిపించదు. వాకి లెక్కడుందో నాకేంతెలుసు. ఇక్కడి సంగతంతా నీకు తెలుసు గద - నాబదులున్నువ్వేపోయి తెరిచిరా.

(సురంగమ ద్వారం తెరిచి వెళిపోతుంది.)

వెలుతుర్లో యెందుకు చూడనీయరు ప్రభూ మిమ్మల్ని ?

రాజు : వెలుగులో బట్టబయట వెయ్యి వస్తువులతోబాటు నన్నూ కలిపి చూద్దామనుకుంటున్నావా ? యీ గభీరాంధకారంలో నీకు నే నొక్కణ్ణిగానే వుంటున్నాను గదా !

సుదర్శన : లోకమంతా మిమ్మల్ని చూడగలుగుతున్నది గాని, రాణినైనై కూడా నేనే చూడటానికి నోచుకోలేదు.

రాజు : యెవరన్నారు నన్ను చూడగలుగుతున్నామని. బుద్ధిహీనులు తప్ప ఆమాట యెవరూ అనరు.

సుదర్శన : యేమో నాకెందుకు ? నేను మాత్రం చూచి తీరాలి.

రాజు : నా దర్శనం నీకు దుస్సహమవుతుంది. బాధ కలిగిస్తుంది.

సుదర్శన : యేమంటున్నారు, దుస్సహమా ? మీ మూర్తి యెంత సుందరమో, యెంత అద్భుతమో యీ చీకట్లోనే తెలుసుకో గలుగుతున్నానే, వెలుతుర్లో తెలుసుకోలేనా ? బైట మీ వీణ మోగుతుంటే ఆ గానమంతా నా కోసమే ననిపిస్తుంది. పరిమళ భరితమైన మీ వుత్తరీయ స్పర్శ నా శరీరాన్ని సోకగానే నా సర్వాంగాలూ మందసమీరంలో కలిసిపోయి అమందానందంలో తేలుతున్నట్లనిపిస్తుంది. మిమ్మల్ని చూస్తేనే సహించలేనంటారా ? యేమ్మాట !

రాజు : యేదో విధంగా నా మూర్తి నీ మనస్సులో గోచరించదూ ?

సుదర్శన : తప్పకుండా గోచరిస్తుంది. లేకుంటే నే నెలా బతగ్గలను ?

రాజు : యేవిధంగా ?

సుదర్శన : ఒక విధంగా కాదు. తొలకరి వానలు కురిసే దినాల్లో నీళ్ళతో నిండిన మొయిళ్ళతో-నింగి నేలపై వాలినచోట, వన తరుశ్రేణి సాంద్రమై పోయినప్పుడు నా మహారాజు మూర్తి యిలాగే వుంటుందని వుండివుండి అనుకుంటాను. యీ విధంగానే నేలపైకి దిగిరావటం, యిదేవిధంగా అంతటా ఆవరించటం, చూపులు చల్లనై, హృదయము పొంగిపోవటం, నయనాంచలాలపై నీలినీడల పూతలుపూయటం, మందహాసం గంభీరమైన ముఖం వెనక మాటుమణిగి వుండటం.

మళ్ళీ శరత్కాలంలో ఆకాశమ్మీది మేలిముసుగు దూరదూరంగా వీడిపోయినప్పుడో - మీరు స్నానంచేసి మీ శేఫాలికావన మార్గంలో నడిచిపోతూండగా మీ కంఠసీమలోవున్న మల్లెపూవుల

మాలా, మీ తలపైన తేలిపోయే తెల్లని వస్త్రంతో చుట్టిన పాగా, మీ వక్షస్థలమ్మీద శ్వేతచందనప్పూతా, దిగంతాలపైన సారించే మీ చూపులూ - యివన్నీ చూస్తే మీరు నాతో సహచరించే పథిక బంధువులనిపిస్తుంది. మీతో కలిసి నేనూ రాగలిగితే దిగ్దిగంతాలలో వున్న బంగారు వాకిళ్ళన్నీ వాటంతటవే తెరుచుకుంటై. అకలంకమైన అంతఃపురంలో ప్రవేశిస్తా. అది సాధ్యంకాకపోతే యీ గవాక్షం చెంత కూర్చుని సుదూరమైన ఆ సన్నివేశాన్ని స్మరిస్తూ నిట్టూర్పు విడుస్తూ వుంటాను. దినదినమూ, ప్రతిరాత్రీ కానరాని ఆ అడవి దారులకోసం, వాసన చూడని ఆ పూవుల పరిమళంకోసం లోలోపల యేడ్చి యేడ్చి, కుమిలి కుమిలి మరణిస్తాను.

వసంతకాలంలో వనభూములన్నీ రాగరంజితాలైనప్పు డెలా కనిపిస్తారంటే - చెవులకు కుండలాలూ, చేతిలో అంగదమూ, వొంటిపైన కుసుంభారుణమైన వుత్తరీయమూ, హస్తభూషగా అశోక మంజరీ, అనుస్వరంలోనూ మీ వీణలో బంగారు తీగలు లేపే వుత్కంఠా యివన్నీ కనిపించినట్లనిపిస్తుంది.

రాజు : యిన్ని విచిత్ర రూపాలు చూస్తున్నావుకదా. ప్రత్యేకంగా బైట కనిపించే వొక్క మూర్తిని చూడటాని కెందుకీ కోరిక ?

సుదర్శన : నా మనస్సులో గోచరించిన రూపమే బైటకూడా కనిపిస్తుందని నా నిశ్చయం.

రాజు : ఆ రూపాని కనుగుణంగా నీమనస్సుంటే, నీమనస్సు కనుగుణంగా ఆరూపమూ వుంటుంది. ముందుగా నీమనస్సు నా విధంగా మలుచుకో.

సుదర్శన : నిజం చెబుతున్నాను. యీ అంధకారంలో మీరున్నారని తెలిసి కూడా మిమ్మల్ని చూడలేక పోతున్నానని వొక్కొక్కసారి యేదో వింతభయం నా హృదయాన్నంతట్నీ వొణికించేస్తుంది.

రాజు : ఆ భయం వొస్తే తప్పేమిటి ? ప్రేమానుభవంలో యీ భయమే లేకపోతే అది నీరసమై పోతుంది.

సుదర్శన : సరే ! నే నో సంగతి అడుగుతాను. యీ చీకట్లో నన్ను మీరు చూడగలుగుతున్నారా ?

రాజు : అందుకు సందేహ మేమిటి ?

సుదర్శన : యేవిధంగా చూస్తున్నారు ? యేం చూస్తున్నారు ?

రాజు : యీ అనంతాకాశంలోవున్న అంధకారాన్నంతటినీ నా ఆనందం ఆకర్షిస్తుంది. యీ అంధకారం నా ఆకర్షణవల్ల తిరిగి తిరిగి యెన్నో నక్షత్ర గోళాల వెలుగును కబళించి తెచ్చి వొక్కచోట మూర్తి మంతంచేసి నిలిపింది. ఆ రూపంలో యెన్ని యుగాల ధ్యానం, యెన్ని ఆకాశాల ఆవేగం, యెన్ని రుతువుల వుపహారం చేర్చిందో గదా అనుకుంటాను.

సుదర్శన : యింతటి రూపమహాత్వముందా నాకు? మీ మాటలంటే విని నా హృదయ ముప్పొంగి పోతున్నది. కాని, అంతగా నమ్మకం కుదరటంలేదు. యిదంతా నాలో నేను చూడలేక పోతున్నాను.

రాజు : నీ దర్పణంలో కనిపించదు. చాలా చిన్నదై పోతుంది. నా మనః ఫలకంలో చూడగలిగావంటే యెంత పెద్దదిగానో కనిపిస్తుంది. నా హృదయంలో కేవలం నువొక్కదానివే. యింకెవరూ లేరు.

సుదర్శన : అలాగే చెబుతూండండి. మీరు మాట్లాడుతుంటే గానం చేసినట్లని పిస్తుంది. అనాదిగా జన్మజన్మాంతరాల్లో విన్నగానం - దాన్నిమీరూ విన్నారు. నాకూ వినిపించారు. కాదు నే విన్నదానికన్న చాలా గొప్పదీ, చెవుల పండువైనదీ, మీ గానంలో చూశాను - ఆ ఆలోక సుందరిని. నాలో కాదు-మీలో నే-మీరు నన్నే విధంగా చూస్తున్నారో- ఆ దృశ్యాన్ని వొక్కసారి నాక్కూడా చూపించరూ? మీ చెంత అంధకారమంటూ యేమీ లేదూ? అందువల్ల మీరంటే అదో విధ మైన భయం వేస్తుంది. కఠినమైన నల్లని లోహంలాంటి యీ అంధ కారం నిద్రమోస్తరుగా, మూర్ఛ మాదిరిగా, మృత్యువులాగా వుంటుంది. మీ కలాంటిదేమీ వుండదు. అందువల్ల యీ స్థలంలో మీతో కలిసిమెలిసి యెలా వుండటం? ఊఁహుఁ. మనకిక్కడ సమా గమం కుదరదు. యిక్కడ కాదు. యిక్కడకాదు. అనుదినమూ నే చూస్తూన్న తరువులూ, లతలూ, పశువులూ పక్షులూ, కొండలూ కోనలూ కనిపించే చోటనే మిమ్మల్ని చూస్తాను.

రాజు : సరే యిటుచూడు. నీ అంతట నువ్వే గుర్తించాలి నన్ను; యెవరూ నీకు గుర్తుచెప్పరు. వో వేళ చెబితే మాత్రం నమ్మటమెలాగ?

సుదర్శన : నే గుర్తించి తీరుతాను. గుర్తించి తీర్తాను. లక్షమందిలోవున్నా గుర్తిస్తాను. పొరబాటుండదు.

రాజు : యీ రోజున వసంతోత్సవం జరుగుతుంది. నీ ప్రాసాద శిఖరమ్మీద నిలబడి నిదానించిచూడు. నా వుద్యానవనంలో వేయిమంది మధ్య నన్ను చూడటానికి ప్రయత్నించు.

సుదర్శన : ఆ అందరి మధ్యా దర్శనమిస్తారా ?

రాజు : ఒక్కసారికాదు. అనేకసార్లు అన్ని వైపులనుంచీ కనిపించేట్లుగా సంచరిస్తాను. సురంగమా !

[సురంగమ ప్రవేశం]

సురంగమ : ప్రభూ !

రాజు : యీ రోజున వసంతపూర్ణిమోత్సవం.

సుదర్శన : నే చేయవలసిన పనేమిటి ప్రభూ !

రాజు : యిది పండుగచేసుకునే రోజు ; పనిచేసే రోజుకాదు. సంతోషంతో నా పుష్పవనంలో నాతో వుండాలి,

సురంగమ : చిత్తం ప్రభూ !

రాజు : మహారాణి నన్నీరోజున కళ్ళార చూడాలనుకుంటున్నది.

సురంగమ : యే ప్రదేశంలో చూస్తారు.

రాజు : వేణునాదం పంచమస్వరంలో వినిపించేచోట, కుసుమ కేసరాల్నుంచి పుప్పొడిగాలిలో తేలేచోట, వెన్నెల్లో, నీడల్లో కేళాకూళులు సాగే చోట - నా దక్షిణ కుంజవనంలో.

సురంగమ : ఆ దాగుడుమూతల్లో యేం కనిపిస్తుంది ? ఆ వీచేగాలిలో అంతా చంచలంగా వుంటుంది. భ్రమ కలుగుతుంది.

రాజు : రాణి చాలా కుతూహలంగా వున్నది.

సురంగమ : కుతూహలం కలిగించే వస్తువులు వేనవేల్ున్నై. మీరు వాట న్నిటితో కలిసిపోయి కుతూహలాన్ని తీర్చగలరా ? మీ రలాంటిరాజు లనుకోన్నేను. మహారాణీ ! మీ కుతూహలం తీరింతర్వాత భగ్న హృదయంతో కన్నీళ్ళతో మళ్ళీ మీరు తిరిగిరావలసిందే.

చేరువగా దూరముగా
యెగిరి పోవుచున్న వవే
మెరువు చూపుగములు
వనీ విహంగముళు.

మ్రోగెనేని హృదయవీథి
ప్రేమ వేణుగానరవము
గగన విహారములు మాని
తమకు తామె తిరిగి వచ్చి
తలలువంచి నిలిచిపోవు
మెరువు చూపుగములు
వనీ విహంగములు.
హృదయ కవాటమ్ము తెరిచి
వచ్చిపోవు వారలెవరొ
కనిపించుట లేదా మరి ?
కుసుమ పరీమళములతో
గానముతో హాసముతో
చిర వసంతమే వెదకుచు
నిన్ను జేరవచ్చె ; గాని
పరవశమున దూరముగా
ఎగిరిపోవుచున్నవి, నీ
మెరువు చూపుగములు
వనీ విహంగములు.



# 2

## పురవీథి

మొదటి బాటసారి : యేమండోయ్!

ప్రహరి : యెందుకండి ?

రెండో బాటసారి : యెటుపోవాలి. మాదీదేశం కాదు. మాకొక్క స్త దారి చూపించండి.

ప్రహరి : ఎక్కడికి పోయేదారి ?

రెండో బాటసారి : ఇవ్వాళ్ల యెక్కణ్ణో వుత్సవముందిట. అక్కడి కేవైపుగా పోవాలో చెప్పండి.

ప్రహరి : యిక్కడా, అన్నిదార్లూ వొకటే - యెటుపోయినాసరే ఆ ప్రదేశం చేరుతారు. సరాసరి వెళ్ళిపొండి. (నిష్క్రమిస్తాడు)

మొదటి బాటసారి : వినవోయ్ విను - వాడిమాట విను. అన్నిదార్లూ వొకటేనంటాడు. అదే నిజమైతే యిన్నిదార్లెందుకయ్యా. వొక్కటి చాలదూ ?

రెండో బాటసారి : అన్నా! కోపం తెచ్చుకుంటావెందుకు ? వొక్కొక్క దేశంలో వొక్కొక్క పద్ధతి. మన దేశంలో అసలు రోడ్డన్నమాటే లేదని చెప్పొచ్చు. అన్నీ వంకరటింకర సందులు, చుట్టు దిరిగే చిక్కు దార్లూ. అందరికీ తెలిసే రహదారి వుండటమే మంచిదికాదంటాడు మన రాజు. అలాటి రహదారే వుంటే ప్రజలందరూ దేశంవిడిచి వెళ్ళిపోతారు. యీ దేశంలో అంతా తారుమారు. వెళ్లిపోయే వాణ్ణెవరూ ఆపరు. వచ్చేవాణ్ణీ లెక్కచేయరు. అయినా యెంత మంది మనుషులున్నారో చూడు. మన రాజ్యంలో యిలాటి రస్తాలే వుంటే రాజ్యం రాజ్యమంతా నిర్మానుష్యమై పోతుంది.

మొదటి బాటసారి : యేమోయ్ జనార్దనా. నీకో పెద్ద జబ్బుంది.

జనార్దన : యేవిటది ?

మొదటి బాటసారి : స్వదేశాన్ని నువ్వు నిందిస్తావు. అడ్డూ ఆటంకం లేకుండా రోడ్లిలాగేవుంటే బాగుంటుందంటావు కదూ ? నువు చెప్పవోయ్ కౌండిల్యా, ఇలాంటి రోడ్లు మంచి వన్నాడా లేదా ?

కౌండిల్య : అన్నా భవదత్తా ! నీకు తెలియందేముంది ? యీ జనార్దనుడిది వో విధమైన వంకరబుద్ధి. వీడిరోజులు బాగుండక యీ మాటలు రాజుగారి చెవినే పడాలిగాని, చస్తే వీడి శవాన్ని శ్మశానంలో పారేయటానికి వెతికినా మనుషులు దొరకరు.

భవదత్త : రస్తాలు బాహాటంగావున్న యీదేశం వొచ్చినప్పట్నుంచీ కన్ను మూసినా కాలక్షేపంచేసినా సుఖంలేదు. వొళ్ళంతా వుడికి పోతున్నది. యెవరొస్తున్నారో యెవరు పోతున్నారో - రామ రామ - దిక్కూదివాణం లేదు.

కౌండిల్య ; అదీగాక యీ జనార్దనుడి సలహామీదనే నేనీ దేశానికొచ్చాను, మా వాళ్లలో యిలాటి దెన్నడూ జరగలేదు. మానాన్న నెరుగుదువుగా నువ్వు. ఆయనయెంత మహానుభావుడు ! తనచుట్టూ 49 మూరల మేరకు గండి తవ్వించి తను బతికినంత కాలమూ ఆ హద్దు దాటిపోకుండా గడిపాడు. వొక్కనాడూ కూడా ఆ హద్దు కవతల కాలుపెట్టలేదు. ఆయన చచ్చిపోయిన తర్వాత దహన సంస్కారం కూడా ఆ హద్దు దాటరాదనే అన్నారు. అదో విషమ సమస్య అయి పోయింది. చివరకు శాస్త్రచర్చ చేసి తేల్చిందేవిఁటంటే ! నలభై తొమ్మిది అనే సంఖ్యలో రెండు అంకెలున్నై. వాటిని మించిపోవటానికి వీల్లేదు కాబట్టి నాలుగూ తొమ్మిదీ కలిపి నలభై తొమ్మిదిగా వున్నదాన్ని అటునుంచి యిటు తిప్పి తొమ్మిది నాలుగూ అంటే తొంభైనాలుగు చేయండి. అప్పుడు శవాన్ని యింటి వెలపలికి తీసుకెళ్ళి తగలెయ్యటానికి వీలౌతుంది. కాకపోతే యింట్లోనే దహనం చెయ్యాల్సి వొస్తుంది అన్నారు. అబ్బ యేమి తర్జన భర్జనలు ! యేమయ్యా మనదేశంలాంటి దేశముందా ?

భవదత్త : చచ్చిన తర్వాత కూడా శాస్త్ర చర్చ జరిగిందంటే యిదేం తక్కువ విషయమా ?

కౌండిల్య : ఆలాంటి దేశమ్మట్టిలో పుట్టిన శరీరమే జనార్దనుడిదీని - కాని

చూడు యిలాంటి ఆటంకం లేని రస్తాలే మంచివంటాడతను.

(నిష్క్రమిస్తాడు)

(కుర్రవాళ్ళను వెంటబెట్టుకుని తాతయ్య ప్రవేశం)

తాత : పిల్లల్లారా! పైరగాలితో యివ్వాళ మనకు పోటీ. యేమాత్రమూ లొంగిపోరాదు. వీథులన్నిట్లోనూ మన పాటల్తో వో వెలుగు వెలిగించాలి.

దక్షిణ ద్వారమ్ము తెరచియున్నది నేడు
రావోయి రావోయి రావో వసంతా?
హృదయ ముయ్యాలగా నూపెదను గానీ
రావోయి రావోయి రావోయి సఖుడా?
నవనవ శ్యామ సుందర రథమ్మెక్కి
పొగడపూవుల దారులందున నడచి
కళవళింపగ చేయు మురళి పూరించి
బూరుగు పుష్పాళ్ళు పైనిండ నలది
రావోయి రావోయి రావో వసంతా?
వనమల్లికా నికుంజమ్ముల న్నడచి
నవకిసాలయ రమ్య పుంజమ్ము గడచి
రావోయి రావోయి రావో వసంతా!
మత్తిల్లి వీచు గాడ్పుల సీమలోన
అంటియంటని ఉత్తరీయాంచలమ్ము
ఆకాశ వీథులం దల్లలనాడ
రావోయి రావోయి రావో వసంతా!

(నాగరికదళం ప్రవేశిస్తుంది)

మొదటివాడు : అన్నా! నువ్వేమన్నా అను. యివ్వాళనుంచైనా మన రాజు మనక్కనిపిస్తే బాగుంటుంది. ఆయన రాజ్యంలో యిన్నాళ్ళ నుంచీ వుంటున్నాం. వొక్కనాడూ ఆయన్ని మనం చూళ్ళేదు - యేం దురవస్థ!

రెండోవాడు : అందులో వున్న లోగుట్టు మీ కెవరికీ తెలియదు. యెవరి తోనూ చెప్పనంటే చెబుతాను.

మొదటివాడు : వొక్క పేటలోనే వుంటున్నాం మన మిద్దరమూనూ.

యెన్నడైనా వొకరిమాట యింకోరితో చెప్పానా? మీ అన్నయ్య బావి తవ్వుతూంటే గుప్తధనం దొరికిందన్న సంగతి మాత్రం చెప్పా లనే చెప్పాను. ఆ సంగతంతా నీకూ తెలుసు.

రెండోవాడు: తెలియకేం? అందుకనే అంటున్నాను. యెవరికీ చెప్పకుండా దాచి పెడతానంటే చెబుతాను. లేకపోతే ముప్పు రావొచ్చు.

మూడోవాడు: నువ్వు బలేవాడివోయ్ విరూపాక్షా; వోచెంప ముప్పొస్తే రావొచ్చునంటూ, దాన్ని కొంపమీదికి తేవటాని కెందుకీ వుబలాటం? యెవరయ్యా నీ రహస్యాన్ని మూటగట్టుకుని రాత్రింబవళ్ళూ కాపలా కాచేవారు?

విరూపాక్ష: ఆమా ఔలాగో వొచ్చిందిగదా. అందుకని, చెప్పకపోవటమే మంచిదంటే చెప్పనేచెప్పను. నేను మాత్రం బొల్లికథ లల్లేవాణ్ణి కాదు. రాజెవరికీ కనిపించడన్నమాట మీరే యెత్తారు. దానికి నే చెప్పాను - కావాలనే కనిపించటం లేదన్నాను.

మొదటివాడు: అదేదో చెప్పేశేద్దూ విరూపాక్షబాబూ.

విరూపాక్ష: మీరంతా నాకు దగ్గిర స్నేహితులు కాబట్టి - మీతో చెబితే దోషంలేదు. (రహస్యంగా) మన రాజున్నాడే ఆయన చాలా అంద వికారంగా వుంటాడు. అందుకనే యెవరికీ కనబడనని వొట్టేసు కున్నాడు,

మొదటివాటు: అంతే అయ్యుండాలి. అన్నిదేశాల్లోనూ రాజును చూస్తే ప్రజలు వెదురుగడమీది ఆకుల్లాగా గజగజా వొణికిపోతారు గదా, మనరాజు కనేపించ డెందుకని? యేంచేసినా చెయ్యకపోయినా సరే, గుడ్లురిమి వీళ్ళ తలలన్నీ నరికిపారేయండని చెప్పినా రాజంటూ వొకడున్నాడని తెలుస్తుంది. విరూపాక్షుడి మాట నాకు నచ్చింది.

మూడోవాడు: నాకేం నచ్చలా. రూపాయిలో పావలా వొంతైనా నాకు నమ్మకంలేదు.

రెండోవాడు: యేమన్నావురా బిక్షూ, నా మాట అబద్ధమనా?

విశ్వావసు: నేనలా అనలేదు. యీమాట నమ్మలేక పోతున్నానన్నాను. నువ్వు కోపం తెచ్చుకో మరేమన్నా తెచ్చుకో.

విరూపాక్ష: నువ్వెందుకు నమ్ముతావులే. నీ తండ్రి తాతల్నే లెక్కచెయ్యావు నువ్వు. అంత బుద్ధిమంతుడివి. యీ రాజ్యంలో రాజంటూ వొకడు

కనిపించకుండా నైనా వుండకపోతే నువు నిలవటానికి చోటుంటుందా ? నిన్ను నాస్తికుడన్నా అనొచ్చు.

విశ్వవసు : బలే ఆస్తికుడివిలే నువ్వు. యింకేదేశంలోనన్నా వుంటే, మన రాజు చూడటానికి అందవికారంగా వుంటాడన్నందుకు నీ నాలిక కోసి కుక్కలకు పారేసేవారు.

విరూపాక్ష : ఇదుగో, నోరు పారేసుకోకు జాగ్రత్త !

విశ్వవసు : జాగ్రతగా వుండవలసిన వాళ్లొకరికి చెప్పాల్సిన పనిలేదు.

మొదటివాడు : యిశ్ యిశ్ యిదేమంత బాగాలేదోయ్. మనందరి కొంప మీదికి తెచ్చేట్లున్నారు. నాకిందులో యే సంబంధమూ లేదు. వెళ్ళిపోతాను.

(నిష్క్రమిస్తాడు)

(కొంతమందితో చెట్టపట్టాలు పట్టుకుని తాత ప్రవేశిస్తాడు)

మొదటివాడు : తాతా యివ్వాళ నిన్నీవిధంగా అలంకరించిం దెవరు ? నీ మెళ్ళోవున్న పూలదండ గుచ్చింది యే నేర్పరి చేతులు ?

తాత : ఓ బుద్ధిహీనుల్లారా ! మాటలన్నీ అంత సుస్పష్టంగా వుండాలా యేం ? కాస్తైనా గోప్యం వుండదూ ?

రెండోవాడు : అవసరంలేదు తాతా ! నీ విషయమంతా బట్టబయలేగా. మాకవికేసరి నీమీద రాసినపాట నువు వినలేదనుకుంటాను. అది యింటింటా మోగుతున్నది.

తాత : వొక్కిల్లే చాలు. యిల్లిల్లూ తిరిగి వినటానికి తీరికెక్కడిదీ ?

మూడోవాడు : అదంతా మరీ బడాయి. మీ ఆవిడ నిన్ను చీరకొంగున కట్టేసింది కాబోలు పాపం ! వూళ్లో యెక్కడికెళితే అక్కణ్ణే కదా. నువ్వు పట్టుమని యింట్లో వున్నదెపుడు ?

తాత : మా ఆవిడ చీరకొంగు చాలా పొడుగురా బాబూ, వూళ్లో యెక్కడికెళ్ళినా ఆ చీరకొంగు తప్పించుకోటం సాధ్యంకాదు. ఆపాటేమిటి పాడు విందాం.

రెండోవాడు :

రూపప్రభ కన్నుల మిరుమిట్లుగొల్పు తావులలో
నీవలె మైమరచేవా రెవరయ్యా తాతయ్యా
శోభిల్లే రసికసభాసీమలలో
నీకన్నను రసికాగ్రణు లెవరయ్యా తాతయ్యా !

తాత : చాల్చాలూరుకోండిరా. యీ వసంతకాలంలో పాడాల్సిన పాటేన్రా అది ?

మొదటివాడు : యెందుకు పాడుతున్నామో తెలియదూ ?

కలయికలూ కవుగిలింత లెక్కడనో
అక్కడ నీ వ్యాపారం
కలత లలుక లెచ్చటనో
నిలువవు నీ పదము లచట
మాయమర్మ మెరుగరాని తావులలో
నీకన్న నమాయకు లెవరయ్యా తాతయ్యా !

తాత : మీరందరూ మీ కవిగారి దగ్గిర వుపదేశమే పొందినట్లయితే మీకు తెలిసుండేది. యీ ఫాల్గుణమాసపు దినాల్లో తాతయ్యలాంటి పాత సరుకంతా వర్జించాలని, నామీద కవిత్వం కట్టి దానికోసం రాగ స్వరా లపవ్యయం చేయకండి. మీ సరస్వతి వీణాతంత్రులన్నీ తుప్పు పట్టి పోగలవు.

రెండోవాడు : తాతా నువు దారి పొడుగునా సభ చేస్తుంటే వుత్సవాని కెళ్ళేదెప్పుడు ? పద పోదాం దక్షిణోద్యానానికి.

తాత : దారి పొడుగునా రుచిచూస్తూ పోవటం నా పద్ధతి. చివరికెలాగా వుంది విందుభోజనం. ఆదావంతేచ మధ్యేచ.

రెండోవాడు : యివ్వాళ, తాతా, అన్నిటికన్న యెక్కువగా వొక్కమాట మనస్సులో మెదుల్తున్నది.

తాత : యేమిటి చెప్పూ.

రెండోవాడు : యీసారి దేశదేశాల్నుంచి యెందరో వొచ్చారు. వాళ్ళందరూ అనేదేమిటంటే అంతా చూశాం బాగానే వుంది గాని మహారాజు కనిపించరేమిటి ? అని. యెవరూ దీనికి జవాబు చెప్పలేక పోతున్నారు. అదొక్కటీ మన దేశానికి గొప్ప వెలితిగా కనిపిస్తున్నది.

తాత : వెలితా ? మన దేశంలో యేవొక్కచోటూ రాజు లేడంటే యేమన్న మాటా ? రాజ్యం రాజ్యమంతా రాజుతో నిండిపోయిందన్నమాట. దాన్నా వెలితంటావు ? యీ విషయం మనందర్నీ వొక్కొక్క రాజుగా చేసేసింది. తక్కిన దేశాల రాజులందరూ చిందరవందరగా వొచ్చి అంతా పాడుపాడు చేశారు. తమ గజతురగ పదాతి సైన్యాల

వేగిరపాటుతో దక్షిణానిలంలో దాక్షిణ్యమే లేకుండా చేశారు. వసంత ఋతువుకే వూపిరి సలపకుండా చేశారు. ఇహ మన రాజో! తనంటూ తానేచోటా వుండడు. అందరికీ చోటిస్తాడు. కవికేసరి పాట విన్నారా.

మారాజు రాజ్యాన అందరము రాజులమె
కాకున్న నతనితో కలసి యెటులుండేము
మా యిచ్చవచ్చిన రీతి సంచరించేము
అయిన అతని యిచ్ఛనే అనుసరించేము
మాకు దాసులౌ నరపతుల దాస్యమ్ముతోగాని
భయముతోగాని యేబంధనమ్ములులేవు
కాకున్న నతనితో కలసి యెటులుండేము
మమ్మందరను గౌరవించు మారాజు
అయిన ఆగౌరవమ్మెల్ల అతనినే చేరు
ఏ అసత్యముతోడ నెవ్వరుగాని
ఊరకే మము కించపరచగాబోరు
కాకున్న నతనితో కలసి యెటులుండేము
మాదారిబడి పోదు మందరము మేము
అయిన అతని దారినే కలసిపోయేము
వైఫల్య మనియెడి నుడిగుండమందు
పడి యెన్నడును మేము నశియింపబోము
కాకున్న నతనితో కలసి యెటులుండేము
మారాజు రాజ్యాన అందరము రాజులమె.

మూడోవాడు: కాని తాతా! నువ్వేమన్నా అను. రాజు కనిపించటంలేదని ఆయన్ని గురించి తేలిగ్గా అందరూ మాట్లాడుతుంటే మాత్రం విని సహించలేక పోతున్నాం.

మొదటివాడు: నన్నెవడన్నా తిడితే వాడికి శిక్షపడుతుంది. కాని రాజును పట్టుకుని అడ్డమైనమాటలూ అంటుంటే వాళ్ళనోరు మూసేవాడే లేడు.

తాత: అంటే యేమన్నమాటా? యే రాజైతే ప్రజల్లో వున్నాడో అతని శరీరాని కా దెబ్బ తగుల్తుంది ప్రజల కతీతంగా వున్న మహారాజు

శరీరానికి మాత్ర మదేదీ తగలదు. దీపంలో వున్న సూర్య తేజస్సు వుఫ్ అని వూదితే ఆరిపోతుంది. వెయ్యిమంది కలిసి సూర్యుణ్ణి వూదినా ఆయన చెక్కు చెదరకుండానే వుంటాడు.

(విశ్వవసువూ విరూపాక్షుడూ ప్రవేశిస్తారు)

విశ్వ ; తాతా, యిటు చూడు! యీ మనిషేమంటున్నాడో. మనరాజు అందవికారంగా వుంటాడనీ, అందుచేతనే కనిపించటం లేదనీ దండోరా చేస్తున్నాడు.

తాత : యింతమాత్రానికి కోపమెందుకోయ్ బిశూ? అతని రాజు వికృతంగా వుండ కెలా వుంటాడనుకున్నావ్? లేకపోతే అతని రాజ్యంలో విరూపాక్షుడి ముఖంలాంటి ముఖం కలవాళ్ళెందుకుంటారు? అతని తలిదండ్రులు స్వయంగా అతనికి కార్తికేయుడని పేరు పెట్ట లేదనుకో - అద్దంలో తన ముఖం చూచుకోగానే రాజు ముఖం కూడా అలాగే వుంటుందని ధ్యానం చేస్తాడు.

విరూపాక్షు : తాతా - అతని పేరు చెప్పనుగాని అలాటి మనిషి చెప్పిన మాట నమ్మకుండా వుండటానికి వీల్లేదు.

తాత : నీకన్న కూడా యెవడున్నాడోయ్ విశ్వాసపాత్రుడు?

విరూపాక్ష : అలాక్కాదు. నేను ప్రమాణంచేసి చెప్పగల్ను.

మొదటివాడు : వీడికి సిగ్గూ బిడియంలేదు. చెప్పగూడని మాట చెప్పడమే కాకుండా ఆది నిలబెట్టుకోటానికి ప్రమాణం కూడా చేస్తానంటాడు.

రెండోవాడు : వాణ్ణి కింద పడుకోబెట్టి, నేలమీద వాడి ప్రమాణం యెంతుందో చూసేద్దూ.

తాత : అన్నా! యెందుకంత కోపం తెచ్చుకుంటావు? పాపం వాడు తన రాజుగారి ఆకారం వికృతంగా వుంటుందని సాటించి వుత్సవంగా తిరుగుతున్నాడు. పో బాబూ విరూపాక్షా! నీమాట నమ్మేవాళ్ళు చాలామందుంటారు. వాళ్ళందర్నీ వెంటబెట్టుకుని కులాసాగా తిరుగు.

(నిష్క్రమిస్తాడు)

(విదేశీయుల దళం మళ్ళీ ప్రవేశిస్తుంది)

కౌండిల్య : రాజంటే మనకెంతవర కలవాటైపోయిందంటే, యెక్కడా రాజు కనబడకపోతే మనం నేలమీద నుంచున్నా కాళ్ళకింద నేల లేనట్టే అనిపిస్తున్నది.

భవదత్త : చూడు కౌండిల్యా! అసలు రాజంటూ వీళ్ళకు లేనేలేడు. అందరూ కలిసి వో వదంతి మాత్రం పుట్టించుంచారు.

కౌండిల్య : నాకూ అలాగే అనిపిస్తున్నది. నే నెరిగినంత వరకూ ప్రతి దేశపు రాజూ తన దేశంలో అందరికన్నా యెక్కువగా కళ్ళకక్కనిపిస్తాడు. తన రూపాన్ని అందరికీ ప్రదర్శించకుండా వుండలేడు.

జనార్దన : నిజమేకాని, యీ రాజ్యమంతా చూస్తే నియమబద్ధంగా వుందిగదా, రాజే లేకపోతే యిలా వుండదే.

భవదత్త : యిన్నాళ్ళనుంచీ రాజున్న దేశంలో వుండికూడా నీ బుద్ధిలా వెలిగిపోతున్నది. అంతా నియమ బద్ధంగావుంటే రాజుండాల్సిన అవసర మేముంది?

జనార్దన : యిలా చూడు! యింతమందికలిసి యివ్వాళ ఆనందంగా గడుపు తున్నారుగదా, రాజే లేకపోతే వీళ్ళందరూ యిలా వొకచోట చేరటమే జరగదే.

భవదత్త : జనార్దనా, నువ్వు అసలుసంగతి కప్పిపుచ్చుతున్నావ్. వీళ్ళ రాజ్యంలో వో నియమమంటూ వున్నదని నాకూ కనిపిస్తున్నది. వుత్సవం జరుగుతున్న మాటా స్పష్టంగానే వుంది. అందులో యే అల్లరీ జరగటంలేదు. కాని రాజెక్కడ? ఆయన్ను చూశావా యెక్కడైనా చెప్పు.

జనార్దన : నే ననే దేమిటంటే, మీ అందరికీ వోవిధమైన రాజ్యం తెలుసు. అక్క డందరికీ రాజు కళ్ల క్కనిపిస్తాడు. కాని రాజ్యంలో మాత్ర మతని కే ప్రసక్తీ వుండదు. భూత భేతాళాలు తాండవిస్తూ వుంటా యక్కడ- అంతా అరాజకమే. కాని యిక్కడో-

కౌండిల్య : యెటుదిగిగీ మళ్ళీ అదేమాట. నువ్వు భవదత్తడిగిన ప్రశ్నకు జవాబుచెప్పు. అవునా, కాదా? రాజును చూశావా, లేదా?

భవదత్త : అంతటితో వూరుకో కౌండిల్యా. అతనితో వాదించి లాభంలేదు. అతని న్యాయశాస్త్రం కూడా యీ దేశప్పద్ధతిగానే తయారైంది. కళ్ళతో నిమిత్తం లేకుండానే చూడట మారంభించాడు. యింకా నమ్మక మేమి టతనిమీద? కొన్నాళ్ళపా ఓతని కన్నంలేని ఆహార మిస్తూవుంటే మళ్ళీ మనలాంటి సామాన్యులుండే లోకంలోకి రాగలుగుతాడు. (నిష్క్రిమిస్తాడు)

(దాసరుల పాట)

ప్రాణపురుషుడు నాదు ప్రాణపదమున నిల్చియుండు
అందుకే యెల్లెడల నతడు కన్పించు
కనుపాపలో చూపుమేరలో కదలాడు నతడు
ఆవంక నీవంక నందుకే కన్పించు.
అతని నోటిమా టాలకింపగ నెంచి
వాడవాడలలోన తిరుగాడితినిగాని
వెదకినా ఆమాట వినిపించనేలేదు
వెనుదిరిగి మరల నా యిలు చేరితినొ లేదొ
ఆ మాట నా పాటలోననే మ్రోగినది.
యాచించి యింటింట నతని నన్వేషించు
జనులార! మీకు కానగరాడు కానగారాడు
నా హృదయపదమందు నా కన్నుదోయిలో
చూడ్కి నిల్పితిరేని అతడు కన్పించు

(పదాతిక దళం)

మొదటి పదాతికుడు: తప్పుకోండి, తప్పుకోండి - పక్కకు జరగండి.

మొదటి పథికుడు; వచ్చాడయ్యా మొనగాడు. దూర దూరంగా అంగలేసి నడుస్తున్నాడు. యేం నాయనా యెందుకు తప్పుకోవాలి? మే మందరమూ దారిని తిరిగే కుక్కలమా?

రెండో పదాతికుడు: మా మహారాజొస్తున్నారు.

రెండో పథికుడు: రాజా? యేనాటి రాజు?

మొదటి పదాతికుడు: మా యీ దేశపురాజు.

మొదటి పథికుడు: వీడికి పిచ్చికాకపోతే, యెప్పుడయ్యా మా దేశపురాజు రోడ్డంట అందర్నీ తరిమివేసుకుంటూ బయద్దేరాడు?

రెండో పదాతికుడు: మహారాజీరోజున గోప్యంగా వుండటంలేదు. స్వయంగా వుత్సవంలో పాల్గొంటారు.

రెండో పథికుడు: నిజమేనా అన్నా!

రెండో పదాతికుడు: అదుగో చూడు జండా యెగురు తున్నది.

రెండో పథికుడు: నిజమేనోయ్. అదిగో అది జండాయే.

రెండో పదాతికుడు: జండామీద కింశుకపుష్పం అంకితమైంది చూడు.

రెండో పథికుడు : నిజంగా కింశుక పుష్పమేన్రా - ఆ యెరుపురం గెంత జిగేల్మంటున్నదో.

మొదటి పదాతికుడు : అయితే మాత్రం! నాకేం నమ్మకం లేదు.

రెండో పథికుడు : లేదన్నా - నా కెప్పుడూ అపనమ్మకం లేదు - అదుగో ఆ కుంభు వున్నాడే వాడే యీ అల్లరంతా చేసేది. నే నొక్కమాటా అన్లేదు.

మొదటి పదాతికుడు : వాడా! వొఠి శూన్యకుంభం. దానికి చప్పుడెక్కువ.

రెండో పదాతికుడు : యెవడయ్యా అతను? మీ కేమవుతాడు?

రెండో పథికుడు : యేమీకాడు. మాపూరి పెత్తందారు పినమామ దగ్గిర బంధువు. వాడిల్లు మా పేటలో కాదు.

రెండో పదాతికుడు : యీ పాపిష్టి పినమామల కోవకు చెందినవాడల్లేనే వుంది. బుద్ధికూడా అలాగే యేడిసింది.

కుంభ : యెన్నో కష్టాలు రావటంవల్ల నా బుద్ధి యీవిధంగా అయిపోయింది. యీ మధ్యనే యెక్కణ్ణుంచో వో రాజొచ్చాడు. ఆయన నామధేయానికి ముందు మూడొందల నలభై యైదు శ్రీకారాల్తగిలించుకొని డప్పులు వాయించుకుంటూ పట్నమంతా తిరిగాడు. ఆయన వెనక నేనెంత వినయంగా మసుల్తూ వుండిపోయా ననుకున్నారు! ఆయన కెన్ని కట్నాల్చదివించానో, యెంతచాకిరీ చేశానో, పిత్రార్జితమంతా అమ్ముకు పోవాల్సినంత పనైంది. చివరకి ఆయన రాచరిక మెంతవరకు పోయిందనుకున్నారు! యెవరైనా కాస్త భూమి కావాలనిగాని, వో గ్రామ మిప్పించమనిగాని ఆయన దగ్గిరికిపోతే పంచాంగం విప్పి మంచిరోజొక్కటీ కనిపించదన్నారు. మా దగ్గిర్నుంచి డబ్బులాగేటప్పుడు మటుకు మఖ, ఆశ్లేష, తిథిత్రయమూ యివన్నీ ఆయన్ని బాధించేవికావు.

రెండో పదాతికుడు : యేమోయి కుంభూ! మా రాజుకూడా అలాంటి నకిలీ రాజంటావా యేమిటి?

మొదటి పదాతికుడు : ఒరే పినమామా - యీసారి మీ పిన్నత్త దగ్గిర్నుంచి సెలవుతీసుకు మరీ రా.

కుంభ : అయ్యా - కోపించకండి. చెవులూ ముక్కూ సులువుకుని యెంత దూరం వెనక్కు పొమ్మంటే అంతదూరం పోవటానికి సిద్ధంగా

వున్నాను.

రెండో పదాతికుడు : సరే యిక్కడే వరసలో నిలబడు. మహారాజొస్తున్నారట, మేంవెళ్ళి దారి సరిగ్గా వుంచుతాం.

(పదాతికులు నిష్క్రమిస్తారు)

రెండో పథికుడు : ఒరే కుంభూ! అలా నోరు పారేసుకుంటే నీకు చావు తప్పదు.

కుంభ : కాదురా మాధవా! అది నా నోరుపారేసుకోటం కాదు - నా నొసటి రాత! వేషం వేసుకుని యెవడో రాజంటూ వొస్తే వాడెదట వొక్కమాటా అనకపోతిని. యెంతో మంచిగా వుండి అంతా నాశనం చేసుకుంటిని. యీసారి నిజమైన రాజే వొచ్చేసరికి అనరాని మాటలన్నీ నా నోటంట రావట మేమిటి - నా ఖర్మం కాకపోతే.

మాధవుడు : నా పద్ధతిది : రాజుమాట నిజంకానీ, అబద్ధంకానీ, ఆయన్ని మన మనుసరిస్తూనే వుండాలి. రాజంటే మనకేం తెలుసు, ఆయన వున్నాడా లేడా అని విచారించి తేల్చుకోటానికి? చీకట్లో గురిచూసి కొడితే, కొట్టగా కొట్టగా యేదో వో రాయి తగలొచ్చు. నే నెప్పుడూ వో చెంపనుంచి నరుక్కుపోతాను. నిజమైతే మంచిదే! వో వేళ నిజం కాకపోయినా మన కొచ్చిన నష్ట మేమిటి?

కుంభ : ఆ కొట్టేవి రాళ్ళయితే ఆట్టే యిబ్బంది లేదు. అవి గనక ఖరీదైన వస్తువు లయితే, వాటిని దుబారా చేస్తే దివాలా తీస్తాం.

మాధవుడు : అరుగో! మహారాజొస్తున్నారు. ఆహా! ఆయన్ని పోలినవాడాయనేనోయ్. యేం విగ్రహం! వెన్నతోచేసిన బొమ్మలా గున్నారు- కుంభూ! యేమంటా విప్పుడు?

కుంభ : బాగానే కనిపిస్తున్నారు. నాకేం తెలుసు - అయితే కావొచ్చు.

మాధవుడు : సరిగ్గా రాజుగా పోతపోసినట్లున్నాడు. యెండపడితే కరిగి పోతాడేమోనని భయం గలుగుతున్నది.

(రాజవేషధారి ప్రవేశం)

మాధవుడు : జయం జయం మహారాజా! తమ దర్శనంకోసం పొద్దుట్నుంచీ నిలబడి వున్నాను. అనుగ్రహించండి.

కుంభ : యేదో భ్రమ కలుగుతున్నది. పోయి తాతను పిలుచుకొస్తాను.

(నిష్క్రమిస్తాడు)

(పథికదళం ప్రవేశం)

మొదటి పథికుడు : అరుగో మహారాజుగారు - చూచొద్దాం రండి.

రెండో పథికుడు : జ్ఞాపకం వుంచుకోండి ప్రభూ. కుశలీవస్తులో వుండే వుదయదత్తు మనమణ్ణి. నాపేరు విరాజదత్తు. మహారాజుగారు బయల్దేరారన్న వార్త వినగానే పరిగెత్తుకొచ్చాను. వారూవారూ అనుకునే మాటలేవీ చెవిని బడనీయలేదు. అందరికన్నా ముందు మీకు ప్రణమిల్లుతున్నాను.

మూడో పథికుడు : యేమిటీ! నే నిక్కడ తెల్లవారు జామునుంచీ నుంచున్నాను - అప్పటికో కాకైనా కూయలేదు - యింతసేపూ నువ్వెక్కడున్నావ్? మహాప్రభూ! నేను విక్రమస్థలిలో వుండే భద్రసేనుణ్ణి. యీ భక్తుణ్ణి కాస్త జ్ఞాపకముంచుకోండి.

రాజవేషి : నీ భక్తివల్ల మాకు చాలా ప్రీతి కలిగింది.

విరాజదత్త : మహారాజా! మా దారిద్ర్యాన్ని కంతులేదు - యిన్నాళ్ళూ తమరి దర్శనం కాలేదు - యెవరికి చెప్పుకోం మా మొర?

రాజవేషి : ఇహ మీకు దారిద్ర్యం లేకుండా చేస్తాను.

(నిష్క్రమిస్తాడు)

మొదటి పథికుడు : ఇలా వెనకబడివుంటే లాభంలేదు. ఈ గుంపులో కలిసి పోయినామంటే రాజు కంటబడట మెలాగ?

రెంతో పథికుడు : అరెరే. అటుచూడు. ఆ నరోత్తముడు వేసిన యెత్తు చూడు. యింతమంది మిక్కడున్నాంగదా. అందర్నీ వెనక్కుతోసి యెక్కణ్ణుంచో వో తాటాకు విసనకర్ర పట్టుకొచ్చి రాజుగార్ని విసరటం మొదలు పెట్టాడు.

మాధవుడు : వాడి పొగరేం తక్కువకాదు.

రెండో పథికుడు : వాణ్ణి బలవంతంగా అక్కణ్ణుంచి లాగేయాలి. వాడు రాజుపక్కన నుంచోటానిక్కూడా తగడు.

మాధవుడు : మహారాజా మాత్రం కనుక్కోలేడుట్రా? వీడి భక్తి మరీ శ్రుతిమించి పోయింది.

మొదటి పథికుడు : రాజుల కేంతెలుస్తుందాసంగతి - వోవేళ తెలిసినా విసనకర్రతో వీస్తుంటే ఆ సంగతే మరచిపోతారు.

(అందరూ నిష్క్రమిస్తారు)

(తాతతో కలిసి కుంభు ప్రవేశం)

కుంభు : యీ రోడ్డంటే ఆయన వెళ్ళారు.

తాత : వెళ్ళినంతమాత్రాన రాజౌతాడంటావా ?

కుంభు : కాదు తాతా! స్పష్టంగా కళ్ళకక్కనిపించాడు. వొకరు కాదు యిద్దరు కాదు రోడ్డు రెండు వైపులా వున్న జనమంతా ఆయన్ను చూసేశారు.

తాత : అందుకే నాకు సందేహం. మన రాజెన్నడైనా రోడ్డుమీదున్న ప్రజలందర్నీ మురిపిస్తూ తిరిగారా ? యిలాంటి వుపద్రవ మిదివర కెన్నడూ రాలేదు.

కుంభు : పోనీ యివ్వాళ సరదాకొద్దీ అలా చేశారనుకోరాదూ ?

తాత : అనుకోవచ్చు - కాని మా మహారాజు సరదా చంచలంకాదు. గడియ గడియకూ మారిపోదు.

కుంభు : యేం చెప్పను తాతా! వెన్నతోచేసిన బొమ్మలా వున్నారు. నా శరీరమంతా అడ్డుగావుంచి యెండ తగలకుండా చేద్దామనిపించింది.

తాత : యీ బుద్ధి నీకెప్పు డబ్బిందిరా బాబూ ? మన మహారాజేమిటి, వెన్నబొమ్మేమిటి ? నువ్వాయన కెండతగలకుండా కాపాడ్డమేమిటి ?

కుంభు : తాతా నువ్వేమన్నా చెప్పు, కళ్ళ కెంతందంగా కనిపించారనుకున్నావ్. యివ్వాళ చూడు - యింతమం దిక్కడ కూడారుగదా, వీళ్ళందరిలో అలాటి మనిషి వొక్కడూ లేడు.

తాత : వొకవేళ మా మహారాజు దర్శనమే యిస్తే మీ కంటమాత్రం పడడు-పదిమందిలో ఆయన్ను ప్రత్యేకంగా చూపించటానికి వీల్లేదు. ఆయన అందరిలో కలిసిపోయుంటాడు.

కుంభు : ఆయన జండా కూడా చూశామయ్యా.

తాత : యేముంది జండా మీద ?

కుంభు : కింశుకపుష్ప చిహ్నం. కళ్ళు మిరుమిట్లు కొలిపేటట్టుంది.

తాత : మా మహారాజు జండామీద పద్మ మధ్యంలో వజ్ర చిహ్న ముంటుంది.

కుంభు : లోకమంతా అంటున్నారు. మహారాజు వెడలొచ్చారని.

తాత : నిజమే. అందులో సందేహంలేదు. కాని ఆయనతో వెంట పదాతికులు గాని, వాద్య బృందంగాని, దీపాలుగాని యేమీ వుండవు.

కుంభు : అలా అయితే యెవరూ ఆయన్ని పోల్చుకోలేరనుకుంటాను.

తాత : పోల్చుకునేవారుంటే కొద్దిమంది వుండొచ్చు.

కుంభు : అలాటి వాళ్ళకి కోరిన వరమల్లా లభిస్తుందనుకుంటా.

తాత : వాళ్ళేమీ కోరరు. రాజును గుర్తించటమంటే బిచ్చగాళ్ళ పనికాదు. చిన్న బిచ్చగాడు, పెద్ద బిచ్చగాణ్ణి చూసి రాజనుకుంటాడు వొంటి నిండా నగలు పెట్టుకుని రోడ్డు కిరుపక్కలా నిలుచున్న ప్రజల కళ్ళ యెదుట బిచ్చనుడుగుతూ తిరిగిన మనిషిని లోభులైన మీరందరూ ఆయన్ని మహారాజంటూ ఆయనకేసి చూస్తూ కూచున్నారు. అదుగో మా పిచ్చి చెలికాడు. రా అన్నా రా! యీ పనికిరాని మాటల్తో కాలం వ్యర్థంచేసుకోకుండా, కోలాహలంగా కాలక్షేపం చేద్దాం.

(పిచ్చివాడి ప్రవేశం - పాట)

ఏమయినా మరి యెవరేమన్నా
కాంచనహరిణము కావలెనన్నా
చపలచరణ జన మనోహరణ చణ
కాంచన హరిణము కావలెనన్నా

కాంచనహరిణము ఖద్యోతమువలె
చూపులకందక దాపుననిలువక
పట్టబోవగా పలాయనమ్మయి
కన్నుచెదర వడిగా నడయాడును.

కైవసమయినా కాకపోయినా
దాని దారినే తరలిపోవుదును
నాయంతటనే నానాస్థలముల
నెటకెటకో పరువెత్తిపోవుదును.

సంతను దొరికే సరుకులనే కొని
యింటదాచుకొనరే మీరందరు
దొరకనిసరుకుల పరిమళములే
యేల మెదలు నా యెద లోలోపల

ఉన్నదంతయును ఊడ్చి యొరులకిచ్చి
లేనివానితో నానందింతును
పోయెనంచు వాపోవుచుంటినని
అందరు మిరన కొందురో యేమో

నగుమోమున నానందముచిందగ
నిర్విచారముగ నేజీవింతును.

# 3
# కుంజవనద్వారం

(తాతా, వుత్సవ బాలకులూ ప్రవేశం)

తాత : పిల్లల్లారా! సింహద్వారందాకా వచ్చేశాం. యీ సారి తలుపు మా గట్టిగా తట్టాలి.

కమల ముకుళదళములు ప్రీలెనవే
గాలిం దేలెనవే
మానస సరసిని రసప్లుతములై
త్రుటిలో తరగలు తూలెనవే
నింగి మునింగెను పరిమళమ్మున
అనిలము మూర్ఛిలె నానందమ్మున
ఝుంఝుమ్మని తుమ్మెద రొదచేసెను
నిఖిల భువనముల మనములు సోలెనవె
మనములు సోలెనవే

(అవన్తి, కోసల, కాంచీ మొదలైన రాజగణం ప్రవేశం)

అవన్తి : యిక్కడి వాళ్ళు మహారాజుని మనకూ్కడా చూపించేటట్టు లేరు.

కాంచి : వీళ్ళ పరిపాలన పద్ధతే అదోరకంగా వుంది. రాజు వనంలో వుత్సవం చేయటమేమిటి? అక్కడికి పోవటానికి అలగాజనాని కేవిధమైన ఆటంకం లేకపోవటమేమిటి?

కోసల : మనకోసం ప్రత్యేకంగా వో స్థలం రాయ్పేటుచేసి వుంచాల్సింది.

కాంచి : వాళ్ళకా మర్యాద తెలియకపోతే మనమే బలవంతంగా యేర్పాటు చేసుకుందాం.

కోసల : యిదంతా చూస్తే, యిక్కడ రాజంటూ యెవరూ లేరు. యేదో వంచన నడిచిపోతున్నదనే సందేహం కలుగుతున్నది.

అవన్తి : అయితే అయ్యుండొచ్చు. కాని వీళ్ళ మహారాణి సుదర్శన సంగతి మాత్రం వంచనకాదు.

కోసల : ఆమెను చూద్దామనే కోరికతోనే నే నిక్కడి కొచ్చాను - కనిపించ టాని కిష్టంలేని వాళ్ళని చూడాలనే వుబలాటం నాకు లేదు - కాని

చూడదగిన మనిషిని చూడకుండాపోతే మనమిక్కడి కెందు కొచ్చినట్టు ?

కాంచి : ఆ పని నెరవేరటానికో పన్నాగం పన్నాలి.

అవన్తి : అదంతా మంచిదే. కాని ఆ పన్నాగంలో మనమే పడిపోకుండా చూడాలి.

కాంచి : అదేమిటి ? జండా యెత్తిపట్టుకుని యెవరో యిటొస్తున్నారు. యేదేశపు రాజితడు ?

(పదాతికుల ప్రవేశం)

మీరా జేదేశపువాడు ?

మొదటి పదాతికుడు : యీ దేశపురాజు. యివ్వాళ వుత్సవం జరపటానికి బయల్దేరారు.

(నిష్క్రమిస్తాడు)

కోసల : యిదేం విడ్డూరం ! యీ దేశపు రాజు బయల్దేరాడా ?

అవన్తి : అది నిజమే అయితే. యీాయనొక్కణ్ణీ చూసి మళ్ళీ మనదేశం పోవాల్సిందే ? చూడవలసిన రాజమహిమనికూడా చూడకుండానే !

కాంచి : వాడిమాట కేం ? యిక్కడ రాజులేడని చెప్పి, యెవడికి సరదా పుడితే వాడు తనే రాజునని చెప్పుకుంటాడు. చూడు వాడి వేషం కొంచెం అతిగా కన్పించటంలా ?

అవన్తి : కాని చూడటానికి చాలా అందంగా వున్నాడు. కళ్ళు కాంచర్యం గొలిపేటట్టుగా వున్న దాయన ఆకారం.

కాంచి : కళ్ళు చెదిరితే చెదరొచ్చుగాని, కొంచెం జాగర్తగా చూస్తే తెలిసి పోతుంది. యిదిగో నీ యెదట్నే వాడి మోసమంతా బయట పెట్టేస్తా చూద్దువుగాని.

(రాజవేషి ప్రవేశం)

రాజవేషి : రాజులారా ! స్వాగతం ! యిక్కడ మీ సత్కారంలో యే లోపం జరగలేదుగద.

రాజులందరు : (కపట వినయంతో నమస్కరిస్తూ) యేమీలేదు.

కాంచి : యేలోటున్నా, అది మీ దర్శనంతో తీరిపోయింది.

రాజవేషి : సామాన్యుల కెన్నడూ నేను దర్శన మివ్వను - మీరు నా అను యాయులు గదా. అందువల్ల మీ యెదుటి కొచ్చాను.

కాంచి: అసాధారణమైన మీ అనుగ్రహాభారాన్ని మేమ్మోయ్యలేక పోతున్నాం.
రాజవేషి: నే నిక్కడెంతో సేపుండను.
కాంచి: ఆ సంగతి మాకు తెలిసిపోయింది. యెక్కువకాలం స్థిరంగావుండే యోగం మాకూ కనిపించటంలేదు.
రాజవేషి: యీలోపున మీ కేమైన అభ్యర్థనలుంటే—
కాంచి: లేకేం ప్రభూ! యీ మీ అనుచరులందరి యెదటా చెప్పటానికి బిడియపడుతున్నాం.
రాజవేషి: (అనుచరులతో) కాస్సేపు మీ రవతలికెళ్ళండి. యిహ మీ కోరికలన్నీ సంకోచంలేకుండా చెప్పుకోవొచ్చు.
కాంచి: మా కే సంకోచమూ లేదు. మీక్కూడా సంకోచం లేకుండా వుండాలి.
రాజవేషి: లేదు. ఆలాంటి సంశయ ముంచుకోనక్కర్లేదు.
కాంచి: అయితే రా. నేలమీద తల ఆనించి మా అందరికీ వొక్కొక్కరికీ ప్రణామం చెయ్యి.
రాజవేషి: యేమిటీ! మా పరిచారకులు రాజశిబిరంలోనుంచి వారుణీ మద్యాన్ని తెచ్చి పుష్కలంగా మీకు వితరణచేసినట్లుందే!
కాంచి: దొంగరాజా! ఆ మద్యంలో యెక్కువ భాగం మీకే లభించింది. అందుకనే మట్టిలో పొర్లాడవలసిన అవస్థపట్టింది.
రాజవేషి: యీలాటి పరిహాసం రాజోచితం కాదు.
కాంచి: పరిహాసం చేయదగిన అధికారం యెవరికుందో, వారంతా దగ్గిర్నే వున్నారు. సేనాపతీ!
రాజవేషి: యిహ ప్రయోజనంలేదు. మీ అందరికీ నేను ప్రణామం చెయ్యవలసిందే అన్నసంగతి స్పష్టంగా తెలుసుకోగలిగాను. నా శిరస్సు తనంతట తానే వొంగిపోయింది. అంతకన్న తీవ్రమైన పద్ధతిగా మట్టిలో దింపవలసన అవసరం లేదు. నన్నెప్పుడైతే మీరు పోల్చుకున్నారో, నేనూ అప్పుడే మిమ్మల్ని పోల్చుకున్నాను. యిదుగో నా యీ ప్రణామం స్వీకరించండి. దయవుంచి నన్ను పరిగెత్తుకునే పోనిస్తే, ఆట్టే ఆలస్యం చెయ్యను.
కాంచి: పరిగెత్తట మెందుకు? మేమందరమూ నిన్నే రాజుని చేసేస్తాం.

యీ తమాషా చివరగాకా నడుపుదాం. నీ కేమైనా పరివార ముందా ?

రాజవేషి : వుంది. రోడ్డుమీద చూచిన వాళ్ళంతరూ నా వెంటబడి వొస్తు న్నారు. మొట్టమొదట నా వెంట ఆట్టేజనం లేనప్పుడు అందరికీ కొంత సందేహంగా వుండేది. జనం యెక్కువైనకొద్దీ సందేహం దూరమై పోయింది. గుంపులో జనమంతా తమ గుంపు పెద్దది గావటంచూసి ముగ్ధులై పోతున్నారు. యిహ నాకే యిబ్బందీ లేదు.

కాంచి : బలేబాగుంది, యిహనుంచీ నీకు మేం సహాయం చేస్తాం. కాని మాకోపని సాధించి పెట్టాలి నువ్వు.

రాజవేషి : మీ ఆజ్ఞా, యీ కిరీటమూ - యీ రెండూ నా తలమీద పెట్టుకుంటాను.

కాంచి : యింకేమీ లేదు. మహారాణి సుదర్శనను చూడాలనుకుంటున్నాం. ఆ పని నువు చేసిపెట్టాలి.

రాజవేషి : నా ప్రయత్నలోపం వుండబోదు.

కాంచి : నీ ప్రయత్నమీద మాకేం నమ్మకంలేదు. మేం చెప్పినట్లు నువ్వు నడుచుకోవాలి. సరే యిహ నువు పోయి కుంజవనంలో ప్రవేశించి రాజాడంబరంతో వుత్సవం నడుపు.

(రాజులూ, రాజవేషీ నిష్క్రమిస్తారు)

(తాతా, కుంభు ప్రవేశిస్తారు)

కుంభు : తాతా ! నీమాట ల్నాకంతగా అర్థం కావు. నీవంటే మాత్రం నమ్మకం. ఆ రాజుతో నాకేం పనిలేదు. నీ వెంటనే వుండిపోతాను. నాకేం మోసంరాదు కద ?

తాత : పూర్తిగా నా వెంటనే నడిస్తే నీ కేమోసమూ వుండదు. నాకన్నా యెక్కువైన దేమన్నా నీ కవసరమైతే మాత్రం తప్పక మోస పోతావు.

కుంభ : తాతా ! వుత్సవమారంభమైంది. యిహ లోపలికి పద.

తాత : కాదురా బాబూ ; ముందుగా యీద్వారబంధం దగ్గిర చేయాల్సిన పని చేస్తున్నాను. యిక్కడ యీ ఆగంతుకు లందరితో కలిసిమెలిసి తిరగాలి. అదుగో మా నిర్భాగ్యులంతా వొస్తున్నారు.

నిర్భాగ్యులముఠా : తాతా ! యివ్వాళ నిన్ను వెతికివెతికి మా కాలస్యమై పోయింది.

తాత : యివ్వాళ నా పనంతా యీ ద్వారమ్ముందే. తక్కినచోట్ల వెతికితే యెలా కనిపిస్తాను ?

మొదటివాడు : నువ్వు మా వుత్సవానికి సూత్రధారుడివి.

తాత : అందుకోసమే నేనీ ద్వారం దగ్గిరున్నది.

రెండోవాడు : యివ్వాళ నువ్వు, కుంభు, సుధనూ, ముషలూ, తోషలూ— వీళ్ళనే వెంటబెట్టుకుని తిరుగుతావా ? దేశ విదేశాల్నుంచి యెందరో రాజులొచ్చారు. వాళ్ళతో పరిచయం చేసుకోవూ ?

తాత : వీళ్ళందరూ కల్లాకపటం లేనివాళ్ళు. ఉత్తినే వీళ్ళ పక్కన్నిలబడుంటే చాలు, తమకేదో నేను పెద్ద సేవ చేశాననుకుంటారు. యిహ ఆ పెద్ద మనుషు లున్నారే, తల వూడదీసి వాళ్ళముందుంచినా యెందుకూ పనికిరాని పదార్థమిచ్చి మోసం చేశాడంటారు.

మొదటివాడు : పోదాం పద, తాతా !

తాత : లేదు నాయనా ! నా కివ్వాళ్ళల్లా యిక్కడుండిపోవటమే. యీ అందరి రాకపోకలూ చూసి నాతల తిరిగిపోతున్నది. ఆలస్యమెందుకు, పాట మొదలు పెడదాం.

(బృందగానం)

లేదురా మనకేమి లేదురా పదరా
ఇంట బైటా మనము పాడుకొందమురా
ఎన్నాళ్లు గడచినా యేమాయె పదరా
హాయి హాయిగ మనము పాడుకొందమురా
లేదురా మనకేమి లేదురా పదరా
పైడి యిసుకల పైన భవనాలు నిర్మించు
వారి యెదురుగ నిల్చి పాడుకొందమురా
లేదురా మనకేమి లేదురా పదరా
జేబుదొంగలు మనల చేరగా రాగానె
ఉత్తజేబులు చూపి పాడుకొందమురా
లేదురా మనకేమి లేదురా పదరా
మునలితొత్తైన ఆ మృత్యువే వచ్చెనా
దానిపై చిటికేసి పాడుకొందమురా

లేదురా మనకేమి లేదురా పదరా
అదె వసంతుడు వచ్చె ఋతురాజు నేడు
ఉజ్వలమ్మైన వేషము మేనదాల్చి
పైన వేషమె కాని లోన భిక్షుకుడె
లేదురా మనకేమి లేదురా పదరా.

(కొందరు స్త్రీలు ప్రవేశిస్తారు)

ప్రథమ : తాతా !

తాత : యేమమ్మా !

ప్రథమ : యివ్వాళ వసంత పూర్ణిమా చంద్రుడికి పూలదండ వేద్దామని మొక్కుకుని యింనుంచి బయల్దేరాం.

తాత : అయితే మీ మొక్కు చెల్లించుకోటం కష్టమేనే !

ద్వితీయ : యెందుకనీ ?

తాత : మా ఆవిడ కేవలం యీ వొక్కదండే నా మెళ్లో వేసింది.

తృతీయ : చూశారా, చూశారా, తాతగారి వినయం చూశారా ?

ద్వితీయ : అయ్యయ్యో ! ఆకాశంలోనుంచి చంద్రు డెంత కిందికి పడి పోయాడు ?

తాత : మీరు వేసిన వల్లో పడకుండా బతకట మెలాగ ?

ప్రథమ : అలా చెప్పు. అది మా వల ప్రభావమన్నమాట.

తాత : చంద్రుడికూడా వో ప్రభావముంది. వుపయోగించే వలేదన్నా వుంటే దాంట్లో తనకు తానే పడిపోతాడు.

తృతీయ : యేమిటి మీ ఆవిడ లెఖ్ఖ ? యివ్వాళ పండగరోజు ; లేకపోతే రెండు దండ లెక్కువ కట్టేది కాబోలు.

తాత : యెన్నిచ్చినా సరిపోవు కాబట్టి యివ్వాళ వొకటే యిచ్చింది. వొఖ్ఖదాని కాస్తే యిబ్బందిలేదు.

ద్వితీయ : తాతా ! నువు యీవాకిలి వొదిలి రావా యేమిటి ?

తాత : అందరూ సాగిపోయిన తర్వాత చివరికి నేను.

[స్త్రీలు నిష్క్రమిస్తారు]

(నాట్యదళం ప్రవేశం)

తాత : రండి. రండి.

మొదటివాడు : మా అందరికీ నువ్వు నటరాజువి. నీకోసం వెతుకుతూ తిరుగుతున్నాం.

తాత: నేనివ్వాళ యీ వాకిలి దగ్గిరే తిష్ఠవేశాను. అందరూ యిటు పోవల సినవాళ్ళే. మిమ్మల్ని చూడగానే నా పాదాలు కదిలిపోతున్నై. వొక్కసారి నాట్యంచేసి పోదురూ.

(నృత్యంజేస్తూ పాట)

నాయెదలోపల నిత్యము నృత్యము
చేయున దెవ్వరురా
తోడై మృదువుగ మృదంగమును మ్రో
గించే దెవ్వరురా

తాతా థైథై తాతా థైథై
నగవుల రవ్వలు అశ్రుమరకతము
లాందోళింపగ వదన బింబమున
తాళతాళమున మందమందముగ
తోడు తోడుగా జననమరణములు
నృత్యము చేయునురా
తాతా థైథై తాతా థైథై
ఏమానందము యేమానందము
ముక్తియొకట భవబంధమ్మొక యెడ
దివారాత్రములు నాట్యము సేయగ
దిగ్దిగంతములు తరంగితములై
పండువు సేయునురా

తాత: యిహ వెళిపొండి - ఆడుతూ పాడుతూ వెళిపొండి.

[నిష్క్రమిస్తారు]

(నాగరకదళం ప్రవేశం)

మొదటివాడు: తాతా! మనకు రాజు లేనేలేడు. యీమాట రెండొందల సార్లు చెబుతాను.

తాత: అంత కఠిన నియమ మెందుకు - అయిదొందలసార్లు చెప్పరాదూ?

రెండోవాడు: మోసంచేసి యెన్నాళ్ళు మనుషుల్ని తప్పుతోవలో పెడతారు?

తాత: నేను కూడా ఆ తోవలోనే వున్నానోయ్.

మూడోవాడు: మాకు రాజు లేడంటూ అన్నివైపులా ప్రచారం చేస్తాం.

తాత : యెవరితో కజ్జా తెచ్చుకోమంటావ్ చెప్పూ - మీ రాజుగారేమో యెవరి చెవిలోనూ నోరుపెట్టి 'నే నున్నానూ' అని చెప్పలేదు. మీరే 'వున్నా' రని చెబుతున్నారు. ఆయన కున్నదంతా మీ కోసమే.

మొదటివాడు : రాజు లేడని రోడ్డంట కేకలేసుకుంటూ పోతాం. రాజంటే తనకు చాతనైంది చేసుకోమను.

తాత : ఆయనేమీ చేయడు.

రెండోవాడు : నా కుర్రాడు, పాతికేళ్ళవాడు. వారం రోజులు జ్వరం వొచ్చి చచ్చిపోయినాడు. దేశంలో ధర్మాన్ని పాలించే రాజేవుంటే యిలాంటి అకాల మృత్యువు వొస్తుందా ?

తాత : అరె నీ కింకా యిద్దరు పిల్లలున్నారు - నాకు పుట్టిన అయిదుగురూ పోయారు. వొక్కడూ మిగల్లేదు.

మూడోవాడు : అయితే ?

తాత : అయితే యేముంది ? పిల్లలు చనిపోయారని చెప్పి కయ్యం తెచ్చుకుని రాజును కూడా పోగొట్టుకుంటామా ? అంత తెలివి తక్కువా ?

మొదటివాడు : యింట్లో తింటానికి అన్నం లేనివాళ్ళకు రాజెందుకు ?

తాత : బాగా చెప్పావోయి నాయనా ! అందుకోసం ఆ అన్నంరాజును వెతికి పట్టుకో. యింట్లో కూర్చుని హాహాకారాలు చేస్తే ఆయన దర్శనమియ్యడు.

రెండోవాడు : మన రాజుగారి న్యాయ మెలావుందో చూడు. మన భద్రసేనుడున్నాడే వాడికి రాజంటే యేమో యేమీ తెలియదు - అంత అజ్ఞానంలో వున్నాడు. కాని వాడి యింటి అవస్థ యేమని చెప్పను ? గబ్బిలాలకూ్కడా వాడింట్లో కాపరం చేయటం కష్టం.

తాత : నా అవస్థ చూద్దూ. రాజుగారి వాకిలిదగ్గర రోజల్లా పడిగాపులు కాస్తున్నా వొక్క పైసా అయినా యెవరూ యియ్యలా.

మూడోవాడు : అయితే ?

తాత : అయితే యేముంది ? అందువల్లే నాకీ అహంభావమంతా. కావలసిన వాళ్ళ కెవరైనా ప్రతిఫలమంటూ యిస్తారా ? అందుకని రాజు లేడంటూ ఆనందంగా తిరుగు. యీ వుత్సవంలో నానా స్వరాలు వుంటై - అవన్నీ వొక్క రాగంలో కలిసిపోతై.

కాదు వసంతమ్మనగా కేవల కుసుమిత సుమముల లీల
కనబడలేదా రాలే ఆకుల రాలే పూవుల ఖేల
పొంగే అలలో క్రుంగుతరంగపు
సంగీతము వినరాదా
కడలిని గలిసిన యలల సవ్వడులె వినిపించెడు నేవేళ
ఈ వసంత సమయమ్మున గనుమదె రాలిన పూవుల ఖేల
మాణిక్యములే యనగా నేల
నా ప్రభుపాద యుగమ్ముల మ్రోల
నానాభూముల మృచ్ఛకలమ్ములు మిళితములైనవి చాల
సాగింతురు నా గురుచరణాంబుజములకడ
జ్ఞానులు కొందరు తమతమ మనుగడ
ఎక్కువగా అజ్ఞానులపై అభిమానిమ్మక్కడ
అందుకోసమే శిష్యుడనైతిని గురువును విడువగజాల



# 4

# ప్రాసాద శిఖరం

(సుదర్శన, ఆమె సఖ రోహిణి ప్రవేశం)

సుద : వోసే రోహిణీ ! నువు మా మహారాజు నెన్నడూ చూళ్లేదూ ?

రోహిణి : యెంతోమంది ఆయన్ను చూశారనీ చాలా కొద్దిమంది మాత్రమే ఆయన్ను గుర్తించారనీ మాత్రం విన్నాను. అందుకోసం, కళ్ళు మిరిమిట్లు కొలిపే మనిషెవరైనా కనిపిస్తే అతనే రాజనుకుంటాను - కాని రెణ్ణాళ్ళైంతర్వాత నా పొరబాటు తెలిసిపోతుంది.

సుద : నువు పొరబడితే పొరబడొచ్చుగాని, నే పడటానికి వీల్లేదు. నేను మహారాణిని, ఆయన నా మహారాజేకదా !

రోహిణి : ఆయనకు మీమీదెంత అభిమానం, మీరు పోల్చుకోటాని కాలస్యం కానిస్తారా ?

సుద : ఆ మూర్తిని చూడగానే నా మనస్సు పంజరంలో పక్షిలా చంచలమై పోతుంది. ఆయన సంగతి బాగా విచారించి మరీ వచ్చావా ?

రోహిణి : అందుకు సందేహమేమి ? యెవర్ని గూర్చి విచారించానో, ఆయనే మహారాజు.

సుద : యెక్కడి రాజో ?

రోహిణి : మన మహారాజే.

సుద : అదుగో, తలమీద విప్పిన పూలగొడుగున్నదే, ఆయన సంగతేనా చెబుతున్నావ్ ?

రోహిణి : అవును. ఆయన జండామీద కింశుకపుష్ప చిహ్నంకూడా వుంది.

సుద : నే చూడగానే పోల్చేసుకున్నా. నువ్వే సందేహించావ్.

రోహిణి : మాకు ధైర్యం తక్కువ. పొరబడ్డామంటే, యెక్క డపరాధ మవుతుందోనని భయం.

సుద : సురంగమ వుంటే యే సందేహమూ వుండేది కాదు.

రోహిణి : సురంగమ మా అందరికన్నా తెలివైంది కాబోలు.

సుద : యేమన్నా అను - ఆమె సరిగ్గా పోల్చుకో గల్దు.

రోహిణి : ఆ మాట నేన్నమ్మను. అదంతా ఆవిడ నటన. చూచి గుర్తించా నని చెబితే చెప్పొచ్చు, అది నిజమో అబద్ధమో తేల్చటాని కెవరి శక్యం? ఆవిడకుమల్లే మాకూ సిగ్గు బిడియం లేకపోతే, ఆ మాట మా నోట్లోనూ దాగేదికాదు.

సుద : లేదు లేదు. అలాటి ప్రగల్భా లేవీ ఆడ దామె.

రోహిణి : ఆ అర్థం వొచ్చేట్టు నటిస్తుంది. అది ప్రగల్భాలాడటం కన్నా పెద్ద గడుసుతనం. అమ్మో ఆవిడ కెన్ని టక్కులు! అందుకే మేమెవరమూ ఆవిడ వేపైనా చూడం.

సుద : యేమైనా గానీ, ఆమే వుంటే వొక్కమారడిగి చూసేదాన్ని.

రోహిణి : ఆవిడ యెన్నడూ యెక్కడికీ కదల్దు. యివ్వాళ మాత్రం వొళ్ళంతా అలంకరించుకుని వుత్సవానికి బయల్దేరింది. ఆవిడ వేషం చూసి నవ్వాపుకోలేకపోయాం.

సుద : ప్రభు వాజ్ఞాపించటం వల్లనే అలా అలంకరించుకుంది.

రోహిణి : సరే మంచిది. మహారాణీ! మా మాటల్తో పనేముంది? కావా లంటే ఆవిణ్ణే పిలుచుకొస్తాను. ఆవిడ మాటల్తోనే సందేహనివృత్తి చేసుకుందురుగాని, యే మదృష్టం ఆవిడది. రాణిగారికే రాజుగారితో పరిచయం చేస్తుంది!

సుద : కాదు కాదు. యెవరితోనూ పరిచయం చేయక్కరలా, అయినా ఆమాటందరూ అంటూంటే వినాలనుంది.

రోహిణి : అందరూ అంటూనే వున్నారే. అడుగో చూడండి. ఆయన జయ ధ్వని యిక్కడికూడా వినిపిస్తున్నది.

సుద : అలా అయితే వొపని చేసిపెట్టు. యీ పూలు పద్మపత్రంలో వుంచి ఆయన కిచ్చేసిరా.

రోహిణి : యెవరు పంపించారని వొవేళడిగితే -

సుద : దానికేమీ సమాధానం చెప్పనక్కరలా - ఆయన అర్థం చేసుకుంటారు. తన్ను నే పోల్చుకోలేననే ఆయన వుద్దేశం - యిప్పుడు పట్టుబడి పోయారు - యీ సంగతి ఆయనకు తెలియచెప్పందే వొదల్ను,

(పూలు తీసుకుని రోహిణి నిష్క్రమిస్తుంది). యివ్వాళ నా మనస్సు దేమో కళవళపడుతున్నది. యిదివర కెన్నడూ యిలా లేదు. యీ పౌర్ణమి వెన్నెల మధ్యభాండంపైన నురుగుమల్లే నాల్గువేపులా పొర్లిపోతున్నది, వో రుతురాజా! వసంతా! యీ గభీరయామినిలో భీరువులై ఆకులమాటున సిగ్గుతో వొదిగిన విరికన్నెల పరిమళాన్ని చూరగొన్నట్లు నా మనస్సునుకూడా అనురాగ శూన్యం చేశావు - నేలమీద కాళ్లు నిలవకుండా తేలిపోతున్నై, వొరే ప్రతీహారి!

ప్రతీహారి : (ప్రవేశించి) యేమిటి మహారాణీ!

సుద : అదుగో ఆ మావితోటలోగుండా వుత్సవ బాలకులు పాడుకుంటూ పోతున్నారు. పిలు, పిలు, వాళ్ళను పిలిచి తీసుకురా—కాస్సేపు వాళ్ళపాట వింటాను. (ప్రతీహారి నిష్క్రమిస్తాడు) వో నిశాపతీ! నీ కటాక్ష వీక్షణాలెందుకో నా యీ చిత్తచాంచల్యమ్మీద వాలుతున్నై. నవ్వుతో మెదిపిన నీ సంతోషం ఆకాశమంతా నిండిపోయింది. తల దాచుకునే చోటే నాక్కనిపించదు—నీవంక చూసి నాకు నేనే సిగ్గిల్లుతున్నాను. సిగ్గూ, బిడియమూ, సుఖమూ, దుఃఖమూ అన్నీ కలిపి నా హృదయంలో నృత్యం చేస్తున్నై. శరీరంలో రక్త కణాలన్నీ నాట్యం చేస్తున్నై. నలువైపులా జగత్తు నాట్యం చేస్తున్నది. అంతా మసకమసగ్గావుంది.

(బాలకులు ప్రవేశిస్తారు)

రండి రండి, మీరందరూ రూపందాల్చిన తరుణ రుతురాజులు, వసంతులు, మొదలుపెట్టండి మీపాట. నా శరీరమంతా పాడుతూనే వుందిగాని నా కంఠంనుంచి స్వరం పైకి రావటంలేదు. నాకోసం కాస్సేపు పాడిపొండి.

(బాలకుల పాట)

ఈ మధుర యామినీవేళ
విరహమే మధురమైనదిరా
విరహ వేదనలో గభీర
రాగమొక్కటి మ్రోగినదిరా
నేటి పున్నమరేయి నిండి
కాతరమ్మయి కానరాని

తృష్ణయేదో నిండినదిరా
ఏ చంచల మరీచికలను
కందోయి యెదుట నిల్పినదిరా
ఏ సుదూర సుగంధరాశి
వాయుపథమున దారితప్పి
నా యెదను మాయమైనదిరా
స్వరరాగ తాళములతోడ
నేవాణి చివురు జొంపముల
గుసగుసలు వేవునో అదియె
నాకాలి యందియల రవళి
గూడి తోడుగ మ్రోగినదిరా

సుద : చాల్చాలు. యిహ ఆపండి. మీపాట వింటూంటే నాకళ్ళు నీళ్లతో నిండిపోతున్నై. మనం పొందగోరిన అభీష్ట వస్తువు మనకు ప్రాప్తించే అవకాశంలేదు—అలాటి అవకాశ మవసరమూ కాదు. అని నా కనిపిస్తున్నది. దాన్నిలా అన్వేషించటంలోనే ఆ సమస్త ప్రాప్తీ సుధామయమైవుంది. యే మధురమూర్తి అయిన తపస్వి మీకీపాట నేర్పాడో చెవుల పండువు చేసిన ఆ గాయకుణ్ణి కళ్ళారా చూద్దామనిపిస్తున్నది. హృదయాంతరాళంలో చేరరాని దారుల చేరువ పొదరిళ్ళ నీడల్లో మాయమై పోతాను. వో తాపసకుమారులారా! మీకేమీయగలను? నా మెడలో వున్నది కేవలం రత్నాలతో కట్టిన మాల. కఠినమైన యీదండ మీకుబాధ కలిగిస్తుంది. మీమెళ్ళో వేసుకున్న పూలదండల వంటివి నాదగ్గిరేమీ లేవు.

[ప్రణామంచేసి బాలకులు నిష్క్రమిస్తారు]

(రోహిణి ప్రవేశిస్తుంది)

సుద : నే చేసిన పనేమీ బాగాలేదు. జరిగిందంతా నీ నోటంట వినటం సిగ్గుగా వుంది. వొక విషయమ్మాత్రం హఠాత్తుగా నా కర్థమైపోయింది. అన్నిటికన్నా యెక్కువగా యియ్యటంగాని, అన్నిటికన్నా యెక్కువగా పుచ్చుకోటంగాని, చేత్తోచేసే పనిగాదు. అయినా యేంజరిగిందో చెప్పు.

రోహిణి : నేనేమో పూలు రాజు కిచ్చేశాను. ఆయన కర్థమైనట్లేమీ నా కనిపించలా.

సుద : యేమన్నావ్ ! ఆయనకేమీ అర్థం కాలేదనా ?

రోహిణి : లేదు. ఆయన నోటిమాట లేకుండా చూసి బొమ్మలాగ కూర్చుండి పోయినాడు. తనకేమీ అర్థంకాలేదన్నమాట తెలిసిపోతుందని మాశే ఆళ్ళేదు.

సుద : ఛి ఛి ఛి !! నా ప్రగల్భాలన్నిటికీ తగ్గ శిక్షే యిది. నేనిచ్చిన పూలు వెంట తీసుకురాలేదేమ్మరి ?

రోహిణి : యెలా తీసుకొచ్చేది ? పక్కనే కూర్చున్నాడు కాంచీరాజు. ఆయన బలే నేర్పరి—చిటికెలో గ్రహించేశాడంతా—ముసి ముసి నవ్వులు నవ్వుతూ అన్నాడు "మహారాజా ! రాజమహిషి సుదర్శనా దేవి వసంతపూజ సందర్భంలో మీకు పూలతో స్వాగతం చెబుతున్నది." ఆమాట వినటంతోనే తెలివొచ్చి లేచి "మా రాజసమ్మానం పరిపూర్ణ మయినట్లు భావిస్తున్నా" నన్నాడు. రాజు. నేను సిగ్గుపడి తిరి గొస్తుంటే కాంచీరాజు మహారాజు మెళ్ళోనుంచి యీ ముత్యాల దండ తీసి, నాతో "సఖీ, నువు కొనితెచ్చిన సౌభాగ్యానికి ప్రతి ఫలంగా మహారాజుగారి కంఠహారం ఆత్మసమర్పణం చేసుకుంటున్నది" అని ఆదండ యిచ్చాడు.

సుద : కాంచీరాజు చెప్పవలసొచ్చిందా ? వసంత పూర్ణిమ వుత్సవమూ, నా అవమానమూ రెండూ యీరోజే ప్రారంభం. అయితే కానీ; నువు వెళ్ళిపో. కాస్సేపు నే నేకాంతంగా వుండాలి. (రోహిణి నిష్క్రమిస్తుంది) యీనాడు నాదర్పమంతా యిలా చూర్ణమైపోయినా, ఆ మోహనమూర్తి మీదినుంచి నా మనస్సు తిప్పుకోలేక పోతున్నాను. యింకా నాకభిమాన మెక్కడిది ! పరాభవం. అంతటా పరాభవమే—విముఖంగా వుండగలిగే శక్తికూడా లేదు. యీముత్యాల దండ రోహిణి దగ్గిర్నుంచి తీసుకుందామని కోరిగ్గా వుంది. కాని రోహిణేమనుకుంటుందో ? రోహిణీ !

రోహిణి : (ప్రవేశించి) యేమ్మహారాణీ !

సుద : యివ్వాళ నువు నెరవేర్చిన పనికి నీకేం బహుమాన మవసరం ?

రోహిణి : మీవద్దనుంచి కాకపోయినా, ఆయన వద్దనుంచి యిప్పించిన బహుమానముంది కద.

సుద: కాదు కాదు. అది యివ్వటం కాదు. యిప్పించటం కాదు. బలవంతాన తీసుకోటం.

రోహిణి: అనాదర సూచకమైన రాజ కంఠహారాన్ని కూడా అనాదరం చేద్దామనే దర్పం నాకు లేదు.

సుద: అవమానాన్ని తెచ్చిన యీ దండ నీ మెళ్ళో వుండటం నాకేం నచ్చలేదు. దానికి బదులుగా నాచేతి కంకణాలిస్తాను. ఆ దండ నాకిచ్చేయ్. యివి తీసుకుని వెళ్ళిపో. (రోహిణి నిష్క్రమిస్తుంది.) యిది నా హారమైపోయింది. యీ దండ తెంపి పారెయ్యాలిసింది. కాని మనస్సొప్పటంలా. యిది కంటకమాలకు మల్లే నా వేళ్ళకు గుచ్చుకొంటున్నది. అయినా దీన్ని విడవలేకపోతున్నాను. యీనాటి ఉత్సవదేవత చేతులారా యిచ్చిన దండ యిది. అగౌరవ చిహ్నమైన యీ దండ!

*

# 5

# కుంజ ద్వారం

(తాతా, కొందరు మనుష్యులూ ప్రవేశిస్తారు)

తాత : యేమిటోయ్ విశేషం ?

మొదటివాడు : చాలా వుంది. యిదుగో చూడు ! అంతటా యెరుపురంగు చల్లేశారు——వొకటే యెరుపు. మిగిలిందెవరూ లేదు.

తాత : యేమంటున్నావ్ ? రాజులందరిమీదా రంగు చల్లారా యేం ?

రెండోవాడు : వూరుకోవయ్యా. వాళ్ళ చాయకు పోవట మెలాగ ? వాళ్ళందరూ లోపల ఆవరణంలో వుండిపోయారు.

తాత : అరెరే. బలే చిక్కులో పడ్డారే. కొంచెమైనా చల్లలా రంగు ? బలవంతంగా చొరవచేసుకుని లోపలి కెళ్ళాలిసింది.

మూడోవాడు : తాతా. వాళ్ల రంగుందే అదోరకం. వాళ్ల కళ్ళెర్రన. వాళ్ల సైనికుల తలపాగా లెర్రన. యిహ పైకెత్తిపెట్టిన వాళ్ళ కత్తుల వైఖ రెలావుందంటే, కాస్త దగ్గిరికెళ్లి వాటిని ముట్టుకున్నామంటే మనలోపలున్న యెరుపురంగంతా పైకి చిమ్మేసేటట్లుంది.

తాత : వాటిని ముట్టుకోకపోవటమే మంచిది. వాళ్ళందరూ నిర్వాసులు. వాళ్ళకు మనం దూరదూరంగానే నడవాలి. యిళ్ళకేనా వెళ్ళిపోతున్నారు ?

రెండోవాడు : అవును తాతా ! రాత్రి రెండున్నర గంటల్దాటి పోయింది. యింకా వెళ్ళలేదేం నువ్వు లోపలికి ?

తాత : యింకా పిలుపు రాలేదు.

మూడోవాడు : మీ శంభూ, సుధనూ యెక్కడి కెళ్ళారు ?

తాత : నిద్రపోవటాని కెళ్ళారు.

మొదటివాడు : వాళ్ళేం మీకుమల్లే అదేపనిగా మేలుకోగల్రా ?

(నిష్క్రమిస్తారు)

(దాసరులు ప్రవిశిస్తారు)

(దాసరుల పాట)

తెల్లనివి నల్లనివి యెల్ల
నీ రాగ మహిమమ్ముచేత
రంజితములై పోయెనోయి
అరుణారుణములైన నీదు
చరణములవలె నాయెనోయి
శయనములు స్వప్నములు వేష
భూష లరుణము లాయెనోయి
కెందమ్మివోలె నా యెడద
కళవళమ్మయి పోయెనోయి

తాత: బలే బాగా వుంది. ఆట పాటల్తో బాగా వినోదం చేసుకున్నారా?

దాసరి: అంతా యింతానా? అంతా వొకటే యెరుపురంగు. వొక్క చందమామ మాత్రం రోక్రా యిచ్చాడు. అతను తెల్లగానే వుండి పోయాడు.

తాత: అతను పైకి పెద్దమనిషిలాగే కనిపిస్తాడు. ఆ తెల్ల ముసుగు తీసేసి చూశావంటే ఆయన తత్వం బైట పడుతుంది. వుండుండి ఆయన్లో నుంచి యెన్నెన్ని రంగులు బైట పడ్డాయో అన్నీ యిక్కణ్ణుంచుని చూస్తునేవున్నా. అయినా తను మాత్రం తెల్లగానే వుండిపోతాడు.

నాయాట నీతోడనే నేడు సఖుడా
వ్యాకులమ్మైన నా హృదయ మేవేళ
నోటువోవుట యన్నమాటయే లేదు
బుక్కాము పయి చల్లి తప్పికొన నెంతువా?
నా సరస మనసారగా మనోనాథ
నిలిచి నా హృత్కమల రక్తరేణువు కొంత
నీపైని చిల్కగా నీయవా సఖుడా!

(నిష్క్రమిస్తారు)

(స్త్రీలు కొందరు ప్రవేశిస్తారు)

మొదటి స్త్రీ: యేమమ్మోయ్. యిందాకెక్కడ చూశామో, అక్కడే వుండిపోయాడమ్మా చందమామ.

రెండో స్త్రీ : మన వసంత పూర్ణచంద్రుడు యింత రాత్రి గడిచినా, కొంచ మైనా పడమటివైపుకు మొగ్గలా.

మొదటి స్త్రీ : యీ చంద్రుడు కదలకుండా యెవరికోసమమ్మా దారులు చూస్తున్నాడు ?

తాత : తన కెవరు దారి చూపిస్తారో వాళ్ళకోసమే.

మూడో స్త్రీ : యిల్లొదిలిపెట్టి దారంట మనుషుల్ని వెదుకుతున్నాడను కుంటాను.

ఉన్నదంతయును మూటగట్టుకొని
సర్వనాశమే ఆకాంక్షించుచు
వేచియుంటి నిట
ఇంటనుండి ఘంటాపథమున బడి
యెవరు వత్తురా యని చూచుచు నే
వేచియుంటి నిట

రెండో స్త్రీ : దారివెంట సాగిపోయే శక్తిలేదు నాకు. దారితప్పిపోవటమె మంచిది. అయినా మనకు చిక్కనివాళ్ల చేతుల్లో మనం చిక్కితే యేం లాభం.

తాత : అతని చేతిలో చిక్కటమంటే ముక్తిపొందటమన్నమాటే.

తా కనుపింపక కాంచు నిన్నతడు
కానరాక ప్రేమించుచుండు నిను
గోపన మాతని ప్రేమరహస్యము
చూరగొనియె నా హృదయపదమ్మును

(స్త్రీలు నిష్క్రమిస్తారు నటులు ప్రవేశిస్తారు)

తాత : అన్నలారా ! రాత్రి సగానికి పైగా గడిచిపోయింది గాని పండుగ వుత్సాహమ్మాత్రం తగ్గనంటున్నది. మీరిళ్ళకు వెళ్ళేముందు వొక్క మారు నాట్యంచేసి పోరూ ?

నీతోడ నృత్యమ్ము సేయగా
పారవశ్యమ్మావరించినది నన్ను
నీ తాళగతినంటి నా పదమ్ములు నడచు
ఎవ్వరేమనుకొన్న నా చెవిని బడదు
నీపాట వినగానె నా హృదయమందు

ఉన్మాద మెదియొ మేల్కొనును
నాభజన సాధనలు వేషాభిమానములు
తెగినేల జారిపడిపోవు
నాట్య వేగముతోడ హృదయ మాందోళింప
తలపోతలే చెరిగిపోవు

(సురంగమ ప్రవేశం)

సురం: యేంచేస్తున్నా వింతసేపూ తాతా ?

తాత: వాకిట్లోనే వున్నాను.

సురం: ఆ పని పూర్తయింది కద - వొక్క మనిషీ లేడు. అంతా వెళ్ళిపోయారు.

తాత: అలా అయితే వెళతా నీసారి లోపలికి.

సురం: వేణునాద మెక్కణ్ణుంచి వొస్తున్నది యీసారి వింటే తెలిసిపోతుంది

తాత: అందరూ తాటాకుబూర లూదినంతసేపూ వొకటేగోల

సురం: వుత్సవంలో తాటాకుబూర లూదటం, రాజేర్పరిచిన ఆచారమే.

తాత: ఆయన వేణునాద మెన్నడూ తక్కిన నాదాల్ని వేటినీ అణచివేయదే. అలా కాకపోతే అందరూ తమ తమ సంగీతాన్ని కట్టిపెట్టాల్సిందే.

సురం: తాతా! యీ వుత్సవంలో లోపలేదో యివ్వాళ మనకో ఆపద మహారాజు తేబోతున్నారని కేవలం నాలో నాకనిపిస్తున్నది.

సుత: ఆపదనా తేబోతున్నారు ?

సురం: అవును తాతా! యివ్వాళ మనల్ని దూరంగా పంపించేస్తారు. యిన్నాళ్లు మన మాయన దగ్గిరే వుండటం ఆయన సహించరు.

తాత: అలా అయితే యీసారి ఆ కంటకవనం ఆవలివొడ్డునుంచి పారిజాతాన్ని పెకలించి తెప్పిస్తారు. ఆ అజ్ఞాతసీమనుంచి నా కెలాగో వార్త వొచ్చింది.

సురం: నీకు రాని వార్తంటూ వుందా ? రాజుగారివద్ద నువు మెట్టని తోవంటూ వుందా ? అకస్మాత్తుగా రాజుగారి ఆజ్ఞ వొచ్చేటప్పటికి నాకే దారి వెతుక్కుంటూ తిరగాల్సొస్తున్నది.

ఏ కుంజవనములో ఏ నిభృత వీధిలో
ఏ గహన సీమలో పూలు పుష్పించునో

ఏ నిభృత భూమిలో ఏ గహన సీమలో
సౌరభమ్ములు మోసి సంచారములు సేయు
వ్యాకులమ్మగు దక్షిణానిలము వీచునో
బైట పాటలుపాడు దాసరులతో బాటు
క్లాంతమైన వసంత యామిని గతించినది
ఉత్సవపు రాజెడ నున్నాడొ ? యేమేమి
కొనిపోవుచున్నాడొ తన గృహాంగణమునకు

(కాంచీరాజూ రాజవేషి ప్రవేశం)

కాంచి : నే చెప్పినట్లు సరిగ్గా నడచుకోవాలి. యేమాత్రమూ పొరపాటు రాగూడదు.

రాజవేషి : రాదు.

కాంచి : మహారాణి మేడ కరభోద్యానంలో వుంది.

రాజవేషి : అవును మహారాజా ! నే నిదివరకే చూశాను.

కాంచి : ఆ వుద్యానానికి నిప్పంటిస్తాను. ఆ మంటల గందరగోళంలో నువ్వు కార్యసిద్ధి చేసుకురావాలి.

రాజవేషి : అందుకు భిన్నంగా జరగదు.

కాంచి : అవునుగాని, వేషధారీ, యిటుచూడు. మనం వుత్తుత్తినే భయపడు తున్నాంగాని అసలీదేశానికి రాజు లేడోయ్.

రాజవేషి ; ఆ అరాజకాన్ని పోగొట్టాలనే నా ప్రయత్నం. నిజంగానీ, మిథ్య గానీ సామాన్య మానవులకి రాజంటూ వొ డుండితీరాలి. లేకపోతే అనిష్టం తప్పదు.

కాంచి : యెంత సత్పురుషుడివి ! లోకహితం కోసం నువు చేసిన యీ ఆశ్చర్యకరమైన త్యాగం మా అందరికీ ఆదర్శప్రాయం. యీ పరోప కారాన్ని నేనే చేద్దామనుకుంటున్నాను. (తలవని తలంపుగా తాతను చూసి) యెవరయ్యా నువ్వు ? యెక్కడ దాక్కున్నావ్ ?

తాత : దాక్కోలేదు. నేను చాలా అల్పుణ్ణి. అందుకే మీకంట బళ్ళేదు.

రాజవేషి ; యీ దేశపురాజు తన చుట్టమని చెబుతూ తిరుగుతుంటా డితను. బుద్ధిహీనులందరూ నిజమేననుకుంటారు.

తాత ; బుద్ధిమంతుల కే సందేహమూ కలుగదు. అందుకని బుద్ధిహీనుల్తోనే నా వ్యవహారమంతా.

కాంచి : మే మనుకుంటున్న మాటలన్నీ విన్నావా ?
తాత : తమరు నిప్పంటించటాన్ని గురించి సలహా యిస్తున్నారు.
కాంచి : అయితే నువ్వు మా ఖైదీవి. పద శిబిరంలోకి.
తాత : యీవిధంగా యివ్వాళ ఆహ్వానం వొచ్చిందనుకుంటాను.
కాంచి : గుడుగుడుమంటూ యేమిటి గొణుగుతున్నావ్ ?
తాత : యీదేశమ్మీది మమకారం తెంచేసుకుని యేమాత్రమూ కదిలి పోలేక పోతున్నాను. అందుకోసం కాబోలు అంతఃపురంలోకి లాక్కుని పట్టుకుపోవటానికి రాజభటు లొచ్చారు—అంటున్నాను.
కాంచి : వీణ్ణిచూస్తే పిచ్చివాడిలా వున్నాడు.
రాజవేషి : వాడి కథంతా తలకిందులు ; వొకటీ అర్థంకాదు.
కాంచి : వీళ్ళమాట లెంత తక్కువగా అర్థమైతే, అంత భక్తి కుదురుతుంది వీళ్ళమీద బుద్ధిహీనులకి. యీ పప్పుడకదు మనదగ్గిర. స్పష్టంగా మాట్లాడటమే మా పద్ధతి.
తాత : అయ్యా మహారాజుగారూ ! నోరు మూసుకున్నాను.

*

# 6
## కరభోద్యానం

రోహిణి : యేమిటీ జరుగుతున్నదంతా! నాకే మర్థం కాకుండావుందే! (తోటమాలితో) మీరంతా హడావుడిగా యెక్కడికీ వెళుతున్నారు?

మొదటిమాలి : మేం తోటవిడిచి వెళ్ళిపోతున్నాం.

రోహిణి : యెక్కడికి?

రెండోమాలి : మాకు తెలియదు. మా రాజు దగ్గిర్నుంచి పిలుపొచ్చింది.

రోహిణి : రాజుగారు తోటలోనే వున్నారుగదా! యేరాజుగారు.

మొదటిమాలి : చెప్పలేం.

రెండోమాలి : యిన్నాళ్ళనుంచీ మేం పనిచేస్తున్న రాజే.

రోహిణి : మీరందరూ వెళ్లిపోతారా?

మొదటిమాలి : ఆ అందరమూ. యిప్పుడే వెళ్ళిపోవాలి, లేకపోతే యేదో ముప్పు కలుగుతుంది.

(నిష్క్రమిస్తారు)

రోహిణి : వీళ్ళు చెప్పేదేం అర్థం కావటంలేదు. భయమేస్తున్నది. నదివొడ్డు విరిగి పడిపోతుంటే దానిమీది జంతువులన్నీ పరిగెత్తుకు పోయినట్లు వీళ్ళందరూ తోటలోనించి పారిపోతున్నారు.

(కోసలరాజు ప్రవేశం)

కోసల : కాంచీరాజూ, మీరాజూ కలిసి యెక్కడికి పోయారో తెలుసా?

రోహిణి : వాళ్లీ తోటలోనే వున్నారు. యెక్కడున్నారో మాత్రం నాకేమీ తెలియదు.

కోసల : వాళ్ళేం చేయదలచుకున్నారో తెలియటంలా. కాంచీరాజు న్నమ్మట మంత మంచిపనికాదు.

(నిష్క్రమిస్తాడు)

రోహిణి : యీ రాజులందరూ యేదో ఆలోచన చేస్తున్నారు. త్వరలోనే యేదో అనిష్టం రాబోతున్నది. వీళ్లందరూ కలిసి నన్ను చుట్టు ముట్టటం లేదుగద !

అవంతిరాజు : (ప్రవేశించి) రోహిణీ ! రాజులందరూ యెక్కడికి పోయిందీ తెలుసునా ?

రోహిణి : యెవరెక్కడున్నారో చెప్పటం కష్టం. యింతకుముందే కోసల రాజిక్కడున్నారు.

అవంతి : కోసలరాజు సంగతికాదు. కాంచీరాజూ, మీరాజూ యెక్కడ ?

రోహిణి : చాలా సేపైంది వాళ్లనుచూసి.

అవంతి : కాంచీరాజు తప్పించుకు తప్పించుకు తిరుగుతున్నాడు. యేదో మోస మున్నమాట నిశ్చయం. వీళ్లతో కలిసి వుండటమంత మంచి పనిగాదు. రోహిణీ ! యీ తోటలోనుంచి పైకివెళ్ళే దారెక్కడో తెలుసునా ?

రోహిణి : నాకు తెలియదు.

అవంతి : దారి చూపించటాని కింకెవరూ లేరూ ?

రోహిణి : తోటమాలీ లందరూ తోట వొదిలి పారిపోయారు.

అవంతి : యెందుకని ?

రోహిణి : వాళ్ల సంగతి సరిగ్గా బోధపడటంలా. శీఘ్రంగా తోట వొదిలేసి రమ్మని రాజుగారి పిలుపొచ్చిందని మాత్ర మన్నారు.

అవంతి : రాజా ? యే రాజు ?

రోహిణి : స్పష్టంగా చెప్పలేకపోయారు.

అవంతి : యిదంతా యేం బాగుండలా. యేమన్నా కానీ, యిక్కణ్ణుంచి పైకిపోయేదారి వెదుక్కుని పోవటం మంచిది. వొక్క ముహూర్తం కూడా యిహ యిక్కడుండరాదు.

(తొందరగా నిష్క్రమిస్తాడు)

రోహిణి : యెన్నాళ్ళనుంచో వున్నా నీ తోటలో, కాని యివ్వాళ యిక్కడ చిక్కుకుపోయాను. యిక్కణ్ణుంచి బైటపడితేనే గాని నాకు తరణోపాయం లేదనిపిస్తున్నది. రాజే కనిపిస్తే బతికిపోదును. మొన్న మహారాణి పంపిన పూవులాయన కిచ్చినప్పుడు మైమరచినట్లున్నాడు గాని, ఆ తర్వాత నాకెన్నో బహుమానాలు పంపాడు. అకారణంగా

చూపే యీ బహుమానంవల్ల నా భయ మ్మరీ యెక్కు వౌతున్నది. యింతరాత్రివేళ పక్షులన్నీ యెగిరిపోతున్నా యెక్కడికి? మహారాణి పెంపుడులేడి యెక్కడి కా వైపుగా పరుగెత్తుతున్నది? చపలా! చపలా! వినిపించుకోవటమేలేదు నా పిలుపు. యిలా యిదివర కెన్నడూ జరగలేదు. నాల్గు దిగంతాలూ పిచ్చివాడి కళ్ళలాగా అకస్మాత్తుగా యెర్రబడిపోయినై. అదేమో అన్నివైపులా సూర్యాస్త మయంలా వున్నది. యేమిటీ సృష్టికర్త వున్మత్తత? భయంగావుంది. యెక్కడ చూడగల్ను నా మహారాజుని?

*

# 7
# రాణి ప్రాసాద ద్వారం

రాజవేషి : కాంచీరాజా ! యేమిటీ వ్యవహారం ?

కాంచి : నేను కేవలం యీ ప్రాసాదానికే నిప్పంటిద్దా మనుకున్నాగాని యింత వేగంగా అన్ని వైపులా యీ అగ్ని వ్యాపిస్తుందని మాత్ర మనుకోలేదు, యీ తోటలోనుంచి బైటికిపోయే దా రేదో తొంద రగా చెప్పు.

రాజవేషి : దా రెటో నాకేమీ తెలియదు. నన్నిక్కడికి తీసుకుని వొచ్చిన వాళ్ళలో వొక్కడూ కనిపించడు.

కాంచి : నువ్వీదేశపు వాడివి. దారి నీకు తప్పక తెలిశుండాలి.

రాజవేషి : యీ అంతఃపురం తోటలో నే నెన్నడూ ప్రవేశించలేదు.

కాంచి : అదంతా నాకు తెలియదు. నువు దారి చూపించి తీరాలి. లేక పోతే నిన్ను రెండు ముక్కలుగా చీల్చేస్తాను.

రాజవేషి : దానివల్ల నా ప్రాణం పోతుందిగాని, బైటికిపోయే వుపాయ మ్మాత్రం మీకు దొరకదు.

కాంచి : అలా అయితే యీ దేశపు రాజునని ఎందుకు విర్రవీగుతున్నావ్ ?

రాజవేషి : రాజునికాదు, నేను రాజునికాదు. (నేలమీదపడి చేతుల్జోడించి) మహారాజా యెక్కడున్నావ్ ? నన్ను రక్షించు. నేను పాపిష్ఠిని. నన్ను రక్షించు, నేను విద్రోహిని, నన్ను దండించు, రక్షించు.

కాంచి : యిలా యేమీ లేనిచోట అరిస్తే యేం లాభం ? అందాకా దారి తెలుసుకునే ప్రయత్నం చేద్దుగాని పద !

రాజవేషి : యేమైతే అదౌతుంది. నేనిక్కడే పడుంటాను.

కాంచి : అలా కానివ్వను- నేనీ అగ్నిలో కాలిపోవటమే జరిగితే, నే నొక్కణ్ణే చావను, నిన్నుకూడా తోడు చేసుకుంటాను.

నేపథ్యంలో : రక్షించు, రక్షించు. రాజా రక్షించు. అన్నివైపులా మంటలు!
కాంచి : లే మూర్ఖుడా ! ఆలస్యం చెయ్యకు.
సుదర్శన : (ప్రవేశించి) మహారాజా! రక్షించు! మంటలు చుట్టుముట్టుతున్నై
రాజవేషి : రాజెక్కడ ? నేను మాత్రం రాజుని కాదు.
సుద : నీవు రాజువికాదూ ?
రాజవేషి : నేను కపట వేషధారిని! పాషండుణ్ణి! (కిరీటాన్ని కిందపారేసి) నా కపటమంతా మట్టిలో కలవనీ. (కాంచీరాజుతో నిష్క్రమిస్తాడు)
సుద : రాజు కాడీతడు ? రాజులేడూ ? అలా అయితే వో అగ్నిదేవా ! నన్ను దగ్ధం చెయ్. నీకే ఆత్మ సమర్పణం చేసుకుంటాను. వో పావన మూర్తీ నా అవమానాన్ని, నా కళంకాన్ని కాల్చి బూడిచేసి పారేయ్
రోహిణి : (ప్రవేశించి) మహారాణీ, అలా వెళుతున్నా వెక్కడికి ? నీ అంతః పురాని కన్నివైపులా నిప్పంటుకున్నది. అందులో ప్రవేశించకు.
సుద : నే నందులోనే ప్రవేశిస్తా. నే మరణించేందుకే యీ మంటలు.

*

# 8
# అంధకార గృహం

రాజు : భయంలేదు, నీకేంభయంలేదు. అగ్ని యీ యింటి చాయకు రాదు.

సుద : భయంలేదు నాకు—కాని యీలజ్జ - యీ పరిభవం - నిప్పుకుమల్లే నా వెంట వెంటనే వొస్తున్నది. నా ముఖాన్ని, నా హృదయ మంతటినీ కళంకితం చేసేసింది.

రాజు : యీ తాపం శమించటానికి కొంతకాలం పడుతుంది.

సుద : యెన్నటికీ శమించదు. యిది శమించదు.

రాజు : మహారాణీ! నిరాశచెందకు.

సుద : మహారాజా ; మీ కోసమని అబద్ధమాడలేను. నా మెళ్లో యింకొకరి పూలదండ ధరించాను.

రాజు : ఆ దండకూడా నాదే, కాకపోతే నీ కెక్కణ్ణుంచి వొస్తుంది ? ఆ దండ నా యింటినుంచి దొంగిలించి తెచ్చించే.

సుద : కాని యిది అతనిచేతుల్తో యిచ్చించి. అయినా దీన్ని వొదిలించుకో లేకపోతున్నాను. మంటలు నన్నన్నివైపులా ఆవరించినప్పుడు, దండను వాటిలో పారేద్దా మనుకున్నాను గాని, ఆ పని చేయలేక పోయాను. నా పాపిష్ఠిమనసు " యీ దండ మెళ్లో వేసుకుని కాలి చచ్చిపో " మ్మన్నది. బట్టబయలున మిమ్ముల్ని చూద్దా మనుకుని పతిలాగా యీ అగ్నిగుండంలో దూకాను. నేనూ చావలేదు, మంటలూ నన్ను పట్టుకుపోలేదు. యేమ్మంట లివి !

రాజు : నీకోరిక తీరింది గదా! యివ్వాళ నన్ను చూడగలిగావు గదా !

సుద : యీ సర్వనాశనంలోనా, నేను మిమ్మల్ని చూడాలనుకున్నది ? యేం చూశానో కాని యిప్పటికీ నా గుండె కొట్టుకుంటూనే వున్నది.

రాజు : యెలా కనిపించా న్నేను ?

సుద : భయంకరం! ఆ రూపం భయంకరం! దాన్ని జ్ఞాపకం చేసుకోటం కూడా భయంగా వుంది. అబ్బా నలుపు, నలుపు. నువ్వు నల్లని వాడివి. వో ముహూర్తం పాటే నే చూసింది. మీ ముఖమ్మీద ఆ మంటల వెలుగు పడ్డది. ఆకాశంలో ధూమకేతువు లేచినట్లనిపించింది. ఆ ఆకాశానికి మల్లెనే మీ ఆకారం కూడా నలుపు. వెంటనే కళ్ళు మూసేసుకున్నాను. యిహ చూడలేకపోయినా, ఝంఝూమారుతంలో మేఘాల్లాటి నలుపు - అపార పారావారంలాటి నలుపు - ఆ తుపానులో సాంధ్యరాగం!

రాజు : నే నీ్నకిదివరకే చెప్పాను - ముందుగా అలవాటు పడనివాళ్లు హఠాత్తుగా నన్నుగనక చూస్తే నా రూపం దుర్నిరీక్ష్యమవుతుంది. నన్నో పెద్ద వుపద్రవంగా భావించి, నాచెంత వూపిరి సలపక పారిపోతారు. యీ విధంగా జరగటం యెన్నోసార్లు చూశాను. అందుకే, అలాంటి కష్టం నీకు తప్పించి, క్రమక్రమంగా నారూపాన్ని పరిచయం చేద్దామనుకున్నాను.

సుద : కాని పాపం పండి అదంతా భగ్నమైంది. యిప్పుడిహ ఆ పరిచయ భాగ్యాన్ని వూహించుకోనే లేకపోతున్నాను.

రాజు : రాణీ! పరిచయ మయితీరుతుంది. యేది నలుపని నీ హృదయ మీనాడు కంపిల్లుతున్నదో, ఆ నల్లదనమే నీ హృదయాన్ని స్నిగ్ధం చేసే గడియ వొస్తుంది. కాకపోతే నీపై నా ప్రేమకు ప్రయోజనమేముంది?

ప్రేమచే విస్మయము పుట్టింతు గాని
రూప వైభవముచే మురిపింప బోను
　　పాటతో వాకిళ్ళు తెరిపించుటేగాని
　　చేతితో ద్వారమ్మునే తెరువగాబోను
అనురాగమాల నీమెడను వేయుటెగాని
బరువైన భూషణమ్ములు పూలదండలును
నామేన ధరియించి తిరుగాడగాబోను
　　ఏగాలివానలో ఏ అలలులేచి మది
　　నాట్యమ్ము సేయునో యెవ్వారెరుంగుదురు
కనరాని యాకర్షణమ్ముతో శశివోలె
హృదయాబ్ధిపై తరంగమ్ముతే లేపుదును.

సుద : కాదు కాదు. కేవలం మీ ప్రేమవల్ల యేమవుతుంది? నా ప్రేమ తన ముఖం తిప్పుకున్నది. బాహ్యారూప సౌందర్యం నా తల కెక్కింది. ఆ మైకం వొదలదు. అది నా రెండు కళ్ళనూ మిరిమిట్లు గొలిపింది. నా మధుర స్వప్నాలన్నిటినీ తళతళలాడేట్టు చేసింది. యిదుగో నా కథంతా చెప్పేశాను. నాకు తగిన శిక్ష విధించండి.

రాజు : శిక్ష ప్రారంభమయింది.

సుద : మీరు నన్ను పరిత్యజించకపోతే నేనే మిమ్మల్ని పరిత్యజిస్తాను.

రాజు : యెంతవరకు సాధ్యమవుతుందో ప్రయత్నించు.

సుద : యే ప్రయత్నమూ అక్కర్లేదు. మిమ్మును చూస్తే నా కసహ్యంగా వుంది. లోలోపల మీమీద కోపంకూడా వొస్తున్నది. నన్నెందుకని— నన్నీ విధంగా చూడట మెందుకో తెలియటంలా. కాని, యెందుకని మీరిలా వున్నారు? లోకంలో మీరు సుందరులని యెందుకు పేరొచ్చింది? మీరు నలుపు - కారునలుపు! యెన్నడూ నాకు మీరు బాగుండరు. నే నెవర్ని ప్రేమిస్తానో అతన్ని చూశాను. అతడు నవనీతంలా కోమలుడు. శిరీషకుసుమంలా సుకుమారుడు. ప్రజాపతి వంటి సుందరాకారుడు.

రాజు : అందుకే యెండమావిలా అది మిథ్య - బుద్బుదంలా శూన్యం.

సుద : అయితే కానీయండి. నేను మీ చెంతన క్షణమైనా నిలవలేను. నేనిక్కణ్ణుంచి వెళిపోయితీరాలి. మీతో సంగమ మ్మాత్రం నా కేమాత్రమూ సంభవంగాదు. ఆ సమాగమం మిథ్యాసమాగమ మవుతుంది. నా మనస్సింకో వైపున లగ్నమైంది.

రాజు : కొంచెమైనా ప్రయత్నించవూ?

సుద : నిన్నట్నుంచీ ప్రయత్నిస్తూనే వున్నాను. కాని ప్రయత్నించినకొద్దీ నా మనస్సు ప్రతిఘటిస్తున్నది. నే నశుచిని, పతితను-మీ సమీపంలో వున్నంతసేపూ, మీ అనుకంప నాకు బాధ కలిగిస్తుంది. అందుకని దూరంగా వెళ్ళిపోవాలనుకుంటున్నాను - మీ సంగతి నా మనస్సు కంటకుండా వుండేంత దూరం.

రాజు : సరే, నువ్వెంత దూరం వెళ్లగలిగితే అంతదూరం వెళ్ళిపో.

సుద : కావాలని మీరు నా కాటంకాన్ని కల్పించరు. అందుకనే నా మనస్సు పోవటమా వుండటమా అన్న సంశయంలో పడ్డది. నా జుట్టుపట్టుకుని

బలవంతంగా లాగి నన్నెందు కుంచివేయరూ యిక్కడ ? నన్ను కొట్ట రెందుకని ? నన్ను కొట్టండి, దండించండి ! మీ నోట యే మాటా రాకపోవటం నాకు మరీ దుర్భరంగా వుంది.

రాజు : నే నేమీ అనటంలేదని నీ కెవరు చెప్పారు ?

సుద : యీ విధంగా కాదు. ముక్తకంఠంతో చెప్పండి, వజ్రగర్జనతో ఆదేశించండి, నా చెవుల కింకోమాట యేదీ వినిపించకుండా చెప్పండి. నన్నింత సులభంగా వొదిలేయకండి - పోనీయకండి.

రాజు : వొదిలేస్తాను గాని, పోనీయను.

సుద : పోనీయరా ? నే పోయితీర్తాను.

రాజు : సరే పో.

సుద : చూడండి. అలా అయితే నా తప్పేం లేదు. మీరు నన్ను బలత్కారంగా వుంచగలిగినా మీ రలా చెయ్యటం లేదు. నన్నేం బంధించలేదు. నే వెళ్ళిపోతున్నాను. మీ పారాకాచేవాళ్లనినన్నాపొద్దని ఆజ్ఞాపించండి.

రాజు : యెవరూ నిన్నాపరు. గాలిలో చెదిరిపోయే మేఘాల్లాగా యే ఆటంకంలేకుండా వెళ్ళిపో.

సుద : క్రమంగా నా ఆవేగ మెక్కువవుతున్నది. నా లంగరు తెగిపోయింది. మునిగిపోతే పోతానేమో కాని తిరిగిమాత్రం రాను.

(వేగంగా నిష్క్రమిస్తుంది)

(సురంగమ ప్రవేశం - పాట)

ఒక్క వ్రేటుతో నున్మూలింపుము
నా భయమెల్ల భయానక మూర్తీ
కఠినుడవై నా హృదయము నీ పద
యుగమున నానతముగ నొనరింపుము
నిత్యకృత్యముల ముంచి యుంచి నా
ఇంటి చుట్టురా గోడ కట్టితివి
విధియించితి వీ వేషభూషలను
రార మ్మాకస్మిక సాక్షాత్కృతి
దిగ్దిగంతముల నావరించి నా
జీవనమొక్క నిమేషములోపల
ముక్త మార్గమున పోవని మ్మెగిరి.

అంతట నీ దరహాసమూర్తియును
అభయ ముదారమ్మగు నీ రూపము
సనాతనమ్మయి శాంతిమయమ్మయి
సాక్షాత్కారం ఐయ్యేడు గావుత.

సుద : (మళ్ళీ ప్రవేశించి) రాజా! మహారాజా!

సురం : ఆయన వెళిపోయారు.

సుద : యేమిటీ వెళిపోయినారా? సరే, అలా అయితే నన్ను నిస్సందేహంగా వొదిలేశారన్నమాటే. నేను మాత్రం మళ్ళీ తిరిగొచ్చాను. కాని మహారాజుకు నా మీద అపేక్షలేదు. మంచిపనే జరిగింది. నా కింకే బాధ్యతాలేదు. నే స్వతంత్రురాలిని. సురంగమా, నన్నిక్కడే వుంచేయమని మహారాజు నీతో యేమైనా అన్నారా?

సురం : ఉహుఁ - నాతో యేమీ అన్లేదు.

సుద : అవును. యెందుకంటారు? అనవలసిన విషయం కాదిది. అలా అయితే నాకింకే నిర్బంధమూలేదు. చూడు సురంగమా! రాజు గారినో విషయమడుగుదామనుకున్నాను. కాని అది నోట్లోనే వుండి పోయింది. పట్టుబడ్డ వాళ్ళందరికీ మహారాజు మరణశిక్ష విధించారా?

సురం : మరణదండనా? మనరాజెప్పుడూ నాశహేతువైన శిక్ష విధించరు.

సుద : అయితే వాళ్ళ నేంచేశారు?

సురం : వాళ్ళందర్నీ వొదిలేశారు. కాంచీరాజు పరాభవాన్ని వొప్పుకుని స్వదేశం వెళ్ళిపోయారు.

సుద : బతికిపోయాం.

సురం : మహారాణీ! నాదో విన్నపముంది.

సుద : విన్నవించుకోవలసిన వాళ్ళెవరో తెలుసుకున్నావా? మహారాజునుంచి యింతవరకూ పుచ్చుకున్న ఆభరణాలన్నీ నీకే యిచ్చిపోతాను. యీ అలంకారాల్తో నాకేం శోభలేదు.

సుర : అమ్మా నన్ను దాసిగా వుంచిన యేలిక నన్ను నిరాభరణంగానే వుంచారు. ఆ లేకపోవటమే నా అలంకారం. మహారాజు నాకేమీ యివ్వలేదని గర్వంతో అందరికీ చెప్పుకో గల్గుతున్నాను.

సుద : అయితే యేమిటి నీ విన్నపం?

సురం : మీతోబాటు నేకూడా వొస్తాను.

సుద : యేమంటున్నావూ ? నీ ప్రభువును కాదని దూరదేశానికి వెళ్ళి పోతావా ? యిదేం విన్నపం ?

సురం : దూరదేశ మెలా అవుతుంది రాణీ. మీరు విపత్తులో పడు తున్నప్పుడాయన దగ్గరే వుంటారు.

సుద : యేదో పిచ్చదానిలా మాట్లాడుతున్నావు. నావెంట రోహిణిని తీసుకుపోదామనుకున్నాను. కాని రానన్నది. నాతో రావాలని యిదేం సాహసం నీకు ?

సురం : నాకు సాహసంలేదు ; శక్తిలేదు. కాని మీతో వొస్తే అనంతటదే సాహసమూ కలుగుతుంది, శక్తీ కలుగుతుంది.

సుద : నిన్ను తీసుకెళ్ళటం నావల్లకాదు. నువు నాతోవుంటే నా అవమానం నా కెప్పుడూ జ్ఞాపక మొస్తుంది. అది నే సహించలేను.

సురం : అమ్మా మీ మంచిచెడ్డలన్నీ నా వొంటినిండా నింపుకున్నాను. నన్ను పరాయిదాన్నిగా చూడొద్దు. నేవొచ్చి తీర్తాను.

నీప్రేమ మహిమాతిశయముచేతనె నేను
సకల కలంక భాగస్వామి నైనాను
అన్ని యపరాధాలు అపరాధినౌ నావె
నీదారిలో నున్న కంటకమ్ముల నేరి
నేలపై నీవు విశ్రాంతి గైకొనుచోట
నాలోన నీరాగ మనురాగమై వెలయు
పరచియుంచెదను నాయుత్తరీయాంచలము.
శుభ్రాసనము వెంట పదిలమ్మొసర్చుకొని
నియతిమై యందందు తిరుగుదానను గాను
పాదమ్ము లెంపేని పంకిలము లయ్యోనా
అపంక మెదపైన హత్తుకొన గోరుదును.

*

# 9

# సుదర్శన తండ్రి కాన్యకుబ్జరాజూ, మంత్రీ

కాన్యకుబ్జ: ఆమె రాకపూర్వమే సమాచారమంతా నాకు తెలిసింది.

మంత్రి: రాజకన్య మనపట్నానికి వెలపల నదీతీరాన నిలిచింది. ఆమెకు స్వాగతం చెప్పి తీసుకురావటానికి మనుష్యుల్ని పంపించనా?

కాన్య: భర్తను పరిత్యజించి వొచ్చిన నిర్భాగ్యురాలికి స్వాగతం చెప్పి ఆమె అవమానాన్ని లోకమంతటికీ చాటుతావా? చీకటి పడనీ! దారిలో యెవరూ లేని సమయం చూసి తీసుకురా.

మంత్రి: ఆమె నివసించటానికి మన ప్రాసాదంలో యేర్పాట్లు చేయనా?

కాన్య: అదేమీ అక్కర్లేదు. బుద్ధిపూర్వకంగా ఆమె తను రాణిగా, యేకేశ్వరిగా వున్న స్థానాన్ని వొదిలి బయల్దేరింది. మన రాజగృహంలో ఆమెను దాసిగా నియోగించాలి.

మంత్రి: చాలా కష్టాలపాలవుతుంది.

కాన్య: యీ సందర్భంలో ఆమెను కష్టాల్నుంచి తప్పిస్తే తండ్రినని అనుకోటానికి నాకర్హత లేకుండా పోతుంది.

మంత్రి: తమ ఆజ్ఞానుసారం నడుచుకుంటాను.

కాన్య: యీమె నా కూతురన్నమాట యెవరికీ తెలియరాదు. దానివల్ల గొప్ప అనర్థం కలుగుతుంది.

మంత్రి: అనర్థమని సందేహమెలా కలిగింది తమకు?

కాన్య: స్త్రీగనక తన ప్రతిష్ఠ మట్టిలో కలిపి, భ్రష్టురాలైతే, సంసారానికి భయంకరమైన అనర్థం వొస్తుంది. యీ పిల్లంటే నేనెంతగా భయపడుతున్నానో నీకు తెలియదు. ఆమె తనతోబాటే యింటికి శనిగ్రహాన్ని కూడా తీసుకొచ్చింది.

*

# 10

## అంతఃపురం

సుద : పో, పో. సురంగమా నువు పో. నాలో యేదో కోపాగ్ని మండి పోతున్నది. యెవర్ని చూసినా వోర్వలేకపోతున్నాను. నువ్వలా శాంతంగా వుంటావ్ - అది చూస్తే నాకోప మ్మరీ యెక్కువవు తున్నది.

సురం : యెవరిమీద కోపం మహారాణీ ?

సుద : నాకేం తెలియదు - కాని నాకంతా ధ్వంసంచేసి పారేద్దామని పిస్తున్నది. అంత మహనీయమైన రాణివాసాన్ని విసర్జించి నే నిక్కడ చేరటం, యీ మూల దాక్కొని యిల్లూడవటం కోసమా ? ధరణీ చక్రం వొణికిపోదేం ? నా అధఃపతనం పారిజాతపువ్వులు కోయటంలాంటిదా ? నక్షత్రాలు రాలినట్లుగా, అగ్నిమయమై దిగ్దిగంతాలు విదీర్ణమైపోవా ?

సురం : దావానలజ్వాలలు పైకి లేచేముందు కుమిలికుమిలి పొగరేగుతుంది. సమయ మింకా మించిపోలేదు.

సుద : మహారాణి గౌరవాన్ని మట్టిలో కలిపి మరీ వొచ్చేశాను. యిక్కడ నా సాంగత్యం కోరేవా రెవరూలేరు. కేవలం వొక్కర్తైను. యీ మహాత్యాగాన్ని గ్రహించి నన్నుద్ధరించటానికొక్కరూ క్షాత్రైనా కదల్పరు.

సురం : నువ్వేకాకినివి కాదు.

సుద : సురంగమా, నీతో నిజం చెబుతున్నాను. నా పొందుకోరి నన్ను కొనిపోవటానికి రాజప్రాసాదానికి నిప్పంటించారు. అయినా నాకేం కోపం రాకుండావుంది. పైగా నాహృదయ మానందంతో లోలోపల పొంగిపోతున్నది. యెంత మహాపరాధం ! యెంత సాహసం ! ఆ

సాహసమే నాలో సాహసాన్ని పురికొల్పింది. ఆ ఆనందంతోనే సర్వమూ పరిత్యజించి రాగలిగాను. కాని యిదంతా నా కల్పన కాదుగదా! యెక్కడా అతని సూచనే కనిపించదే?

సురం: నువ్వేవ రనుకుంటున్నావో అతను కాదు - యీ నిప్పంటించింది యీ సాహసం చేసింది కాంచీరాజు.

సుద: పిరికితనం! పిరికితనం! యెంత మోహనమూర్తి! అయితే లోపల పురుషకారం లేదు. యీ అసమర్థుడికోసమా నన్ను నే వంచించు కున్నది? సిగ్గుచేటు! సిగ్గుచేటు! కాని సురంగమా! యిప్పటికైనా నన్ను వెనక్కు తీసుకుపోవటం మీ మహారాజు ధర్మంకాదా? (సురంగమ మాట్లాడదు) తిరిగి వెళ్ళిపోవటానికి నే బాధపడుతున్నా ననుకుంటున్నావు కాబోలు. యెన్నటికీ కాదు! రాజేవొచ్చి ఆహ్వానించినా నే పోను. కాని, ఆయన వారించనైనా వొక్కసారి వారించడే! వెళ్ళిపోవటానికి మాత్రం యే ఆటంకమూ లేకుండా దారి తెరిచే వుంచారు. తనపై వొక మహారాణి నడుస్తున్నదన్న వేదనకూడా లేదీ దారికి. అదీ మీ మహారాజు లాంటిదే. కఠినమైనది, కర్కశమైనది. దీనాతి దీనుడైన బిచ్చగాడెలాగో నేనూ అలాగే యీ మార్గంలో. మాట్లాడవేం? యేమిటీ మీ రాజు వ్యవహారం?

సురం: అందరికీ తెలుసు. మనరాజు నిష్ఠురుడు, కఠినుడు. ఆయన్నెవరూ కదిలించలేరు.

సుద: అయితే అహోరాత్రాలూ నువ్వాయన్ను స్మరిస్తుంటా వెందుకు?

సురం: చలించని పర్వతంలా యెల్లప్పుడూ ఆయన్ను కఠినంగానే వుండనీ, నా కన్నీళ్ళవల్లా, నా పరిదేవనం వల్లా ఆయన చలించకుండానే వుండనీ, నాదుఃఖం నాదిగానే వుండి ఆయన కాఠిన్యానికే జయం కలగనీ!

సుద: సురంగమా! చూడు! అదుగో ఆ చివర - తూర్పువైపున నేలమీద ధూళి లేస్తున్నది.

సురం: అవున్నిజమే.

సుద: అది రథమ్మీద జండాలా కనిపిస్తున్నది.

సురం: అవును ధ్వజమే అది.

సుద: అయితే వొస్తున్నారన్నమాట.

సురం : యెవరా వొచ్చేవారు.

సుద : యింకెవరు ? మీ రాజే. యెలా వుండగలరు, నన్ను విడిచి ? యిన్నాళ్ళుండటమే ఆశ్చర్యం.

సురం : కాదమ్మా. ఆ వొచ్చేది మన రాజుకాదు.

సుద : కాదులే. నీకంతా తెలుసు. నీ రాజున్నారే మహా కఠినులు; యెంత మాత్రమూ చలించరు కాదూ ? యెలా చలించరో చూస్తానుగా ! నే నప్పుడే అనుకున్నా, వెంటబడి మరీ వొస్తారని. సురంగమా నువ్వనుకుంటున్నా వేమోకాని నే నొక్కనాడూ ఆయన్ను పిలవలా ; వోడిపోయిన నీ రాజు నా దగ్గరి కెలా వొస్తారో చూద్దువుగాని. వొక్కమా రలా వెళ్లి చూసిరా. (సురంగమ నిష్క్రమిస్తుంది) రా జొచ్చి నన్ను పిలిస్తే పో దలచానా ? యెన్నటికీ లేదు. నేను పోను. పోనేపోను.

(సురంగమ ప్రవేశం)

సురం : అమ్మా ! యీాయన మన రాజు కాదు.

సుద : కాదూ ? నిజమే ? యిప్పటికైనా నన్ను తీసుకుపోవటానికి రాలేదూ ?

సురం : మన రా జీవిధంగా నేలమీద ధూళి రేపుతూ రాడు. ఆయన యెప్పు డొచ్చేదీ పసిగట్టటానికైనా వీల్లేదు.

సుద : అయితే ఆ వొచ్చేది——

సురం : కాంచీరాజుతో వొస్తున్నా డతను.

సుద : ఆయన పే రేదో నీకు తెలుసునా ?

సురం : ఆయన పేరు సువర్ణుడు.

సుద : అయితే ఆయనే వొస్తున్నా రన్నమాట. "వుచ్ఛిష్టంలా బైటపడ్డాను. నన్నెవరు పరిగ్రహిస్తారు ?" అని అనుకున్నా. కాని నా వీరాధివీరు డదుగో నన్నుద్ధరించటానికే వొస్తున్నాడు. సువర్ణ రాజు నెరుగుదువా నువ్వు ?

సురం : మా తండ్రి యింటిదగ్గిర ఆయనజూదమాడుతూ వుండేవాడు——

సుద : ఆయన్ను గురించి నువ్వు చెప్పేమాటలు వినదలచుకోలేదు. నా కాయన మహావీరుడు. నా పరిత్రాణకర్త. నేనే స్వయంగా ఆయన పరిచయం చేసుకుంటాను. కాని సురంగమా ! నీ రాజేం రాజు ! నేనింత దైన్యంలో వున్నా న న్నుద్ధరించటానికి రాలేదు. నన్నిక

తప్పుపట్టటానికి వీల్లేదు. యిక్కడ రాత్రింబవళ్ళూ జన్మంతా చాకిరీ చేస్తూ పడుండలేను. నీలాగా అతివినయంగా వుండటం నాచేతగాదు. అవునుగాని నిజంచెప్పు. మహారాజుమీద నీకంత అభిమానమా ?

(సురంగమ)

నీ చరణదాసినై నేనెట్లు పలుకుదు
నిన్ను ప్రేమించితి నన్నమాట
నాలోన నేదే గుణమ్ముండెనా యది
భవదనంత స్నేహఫలముగాదె
మూల్యమే లేక యమ్ముడు వోవదగుదాన
చేరి శ్రీపదసేవ సేయుదాన.

# 11

## శిబిరం

కాంచి : (కాన్యకుబ్జరాజు దూత నుద్దేశించి) మీ రాజుతో వెళ్ళి చెప్పు. ఆయన ఆతిథ్యాన్ని స్వీకరించటానిక్కాదు, మేం రావటం. మా రాజ్యానికి తిరిగి వెళ్ళిపోవటానికి సిద్ధంగా వున్నాం. యీ లోపుగా యిక్కడి దాసీ గృహంలోనుంచి రాణి సుదర్శనను విడిపించి తీసుకు పోవాలని మా కోరిక.

దూత : ఆ రాణి తన తండ్రి యింట్లోవున్న సంగతి తమరు జ్ఞాపక ముంచుకోవాలి.

కాంచి : కన్యగా వున్నంతకాలమే ఆమెకు పితృ గృహంలో ఆశ్రయం వుంటుంది.

దూత : భర్తృగృహంతో కూడ సంబంధమున్నది.

కాంచి : ఆమె ఆ సంబంధాన్ని తెంచుకుని వొచ్చేసింది.

దూత : బతికున్నంత వరకూ ఆ సంబంధం తెగిపోవటానికి వీల్లేదు. అది మధ్యమధ్య విడిపోవొచ్చు. కాని సాంతమూ పోదు.

కాంచి : ఆ విషయంలో యే సంబంధమూ వుండనక్కర్లేదు. యెందుకంటే ఆమెను తీసుకుపోవటానికి ఆమె భర్తే స్వయంగా వొచ్చారు. రాజా !

సువర్ణ : యేమ్మహారాజా !

కాంచి : మీ రాణిని తండ్రియింట దాసిగావుంచి మీరు మెదలకుండా వుంటారా ?

సువర్ణ : నేనలాటి కాపురుషుణ్ణి కాను.

దూత : యిదంతా పరిహాసంలావుంది. మీరు నిజంగా మహారాజే అయితే రాజభవనంలో ఆతిథ్యం పుచ్చుకోటాని కిలా సందేహిస్తా రెందుకని ?

కాంచి : రాజా !

సువర్ణ: యే మ్మహారాజా!
కాంచి: రాణి నిమ్మని ప్రార్థించి తీసుకుపోవటానికా వొచ్చారు?
సువర్ణ: యెన్నడూ కాదు.
దూత: అయితే తమరు కోరే దేమిటి?
కాంచి: రాణిని మీరాజు స్వయంగా మా అధీనం చెయ్యకపోయినట్లయితే మా క్షత్రియ ధర్మాన్ననుసరించి బలాత్కారంగా తీసుకుపోతాం. యిది మా ఆఖరుమాట.
దూత: రాజా! మా రాజుకూడా క్షత్రియ ధర్మాన్నే పాటిస్తారు. మీ ప్రగల్భాలు విన్నంత మాత్రాన రాణిని స్వయంగా మీవశం చేయలేరు.
కాంచి: యీ సమాధాన మొస్తుందని తెలిసే వొచ్చాం. సరే మీరాజు కంతా నివేదించు.

(దూత నిష్క్రమణ)

సువర్ణ: కాంచీ మహారాజా! మన సాహసం మితిమీరిపోతున్నది.
కాంచి: అలా కాకపోతే యీ వ్యవహారంలో దిగినందుకు ఫలమేమిటి?
సువర్ణ: కాన్యకుబ్జరాజును చూచి భయపడకపోతే పోయినాం - కాని -
కాంచి: అలా సందేహించట మారంభిస్తే యీ ప్రపంచంలో యే ఆపదా రాకుండా వుండే స్థలం వెదికినా దొరకదు.

(సైనికుడు ప్రవేశిస్తాడు)

సైనికుడు: మహారాజా! అవంతి, కోసల, కళింగరాజులు తమతమ సైన్యాలతో వొస్తున్నారని వార్త వొచ్చింది.

(నిష్క్రమిస్తాడు)

కాంచి: అనుకున్నంతా జరిగింది. సుదర్శన పలాయన వార్త అంతటా వ్యాపించింది. అందరూ కలిసి వొకరితో వొకరు కుమ్ములాడటంవల్ల అంతా వృథాప్రయాసైపోయింది.
సువర్ణ: లాభంలేదు మహారాజా! యిదంతా శుభసూచకం కాదు. చాటుగా వుండి మన రాజే యీ వార్త నలువైపులా వ్యాపింపచేశాడన్న మాట నిశ్చయం.
కాంచి: యెందుకు? దానివల్ల ఆయన కేం లాభం?
సువర్ణ: దురాశాపరులందరూ వొకర్నొకర్ని చించి చెండాడి చచ్చిపోతారు. ఆ లోపల నిక్షేపాన్ని ఆయనే తీసుకుపోతాడు.

కాంచి: మీ రా జెందుకు కనిపించడో యిప్పుడు బాగా అర్థమయింది. మన భయంవల్ల ఆయ నన్నిచోట్లా కనిపిస్తాడు. అదీ ఆయన కౌశలం.

సువర్ణ : కాని మహారాజా! నన్ను విడిచిపెట్టండి.

కాంచి: నీవల్ల మాకు సాధించతగిన ప్రయోజనం చాలా వుంది. నిన్ను విడిచి పెట్టటానికి వీల్లేదు.

(సైనికుడి ప్రవేశం)

సైనికుడు : విరాట, పాంచాల, విదర్భరాజులు కూడా వొచ్చారు. నది కవతలివొడ్డున శిబి రాన్నేర్పరిచారు.

(నిష్క్రమణ)

కాంచి: మొట్టమొదట మే మందరం వొకరితో వొకరు కలిసి పనిచెయ్యాలి. కాన్యకుబ్జరాజుతో యుద్ధం ముందైపోతే తరవా తేదో వుపాయం చూడొచ్చు.

సువర్ణ : యీ వుపాయంలో నన్ను దింపకుండా వుంటే నాకు నిశ్చింతగా వుంటుంది. నేను పనికిమాలిన వాణ్ణి - నా ద్వారా—

కాంచి: వోరి కపటరాజా! వుపాయాలన్నీ పనికిమాలినవే. సోపానాలు గానీ, ఘంటాపథాలుగానీ-అవెప్పుడూ మన కాళ్ళ కిందనే వుంటాయి. ఆ వుపాయమే గనక గొప్పదైతే దాన్ని ఆచరణలో పెట్టటాని కెంతో ఆలోచన చెయ్యాలి. నీలాంటి వాణ్ణి వుపయోగించుకుని పనిచేయించు కోవటంలో కొంత సుళువుంది. యే విధమైన కపట నాటకమూ అక్కర్లేదు- నా మంత్రినేగనక సలహా అడిగితే దొంగతన మనటానికి బదులు లోకహితమంటాడు. లేకపోతే పని చెడిపోతుంది. పో! రాజు లందర్నీ వోసారి చదరంగపు బల్లమీద పావులకుమల్లే కదిలించి రావాలి - అందరూ రాజులైతే చదరంగమాడట మెలాగ?

# 12

## అంతఃపురం

సుద : యుద్ధమింకా జరుగుతున్నదా ?

సురం : ఆ, జరుగుతూనేవుంది.

సుద : యుద్ధానికి పోయేముందు నా తండ్రి నాతో అన్నారు : “వొక్క మనిషిని పరిత్యజించావు కాని యేడుగుర్ని నీవెంట లాక్కొచ్చావు. నిన్నేడుముక్కలుగా నరికి తలో ముక్కా యిచ్చేద్దామనిపిస్తున్నది” అని. నిజమే. అలా చేస్తేనే బాగుండును. సురంగమా!

సురం : ఏమమ్మా ?

సుద : నీ రాజుకి నన్ను రక్షించగలిగిన సామర్థ్యమే వుంటే యిప్పుడింత నిశ్చింతగా వుండగలుగుతారా ?

సురం : అమ్మా నాతో యెందుకు చెప్పటం ? రాజు తరఫున సమాధానం చెప్పటానికి నావల్ల నౌతుందా ? ఆయన సమాధానమే యిస్తే అందులో యేమీ పొల్లుండదు, అందరికీ అర్థమవుతుంది. వోవేళ యియ్యకనేపోతే, అందరూ నోరు మూసుకుండవలసిందే. నా గ్రహణ శక్తి చాలా తక్కువని నాకు తెలుసు. అందుకోసం ఆ ఆలోచనే చెయ్యన్నేను.

సుద : యెవరెవరు చేస్తున్నారీ యుద్ధం ?

సురం : యేడుగురు రాజులు కలిసి చేస్తున్నారు.

సుద : యింకెవరూ లేరూ ?

సురం : సువర్ణుడు యుద్ధానికి ముందే రహస్యంగా పారిపోవటానికి ప్రయత్నిస్తే, కాంచీరాజతన్ని శిబిరంలో ఖైదీగా వుంచాడు.

సుద : నే మరణిస్తేనే బాగుండేది. వో మహారాజా ! ఆపదలో వున్న నా తండ్రిని రక్షించటానికి మీరొస్తే మీ కీర్తి హెచ్చుతుందిగాని తగ్గదు. నా అపరాధానికి నా తండ్రి నెందుకు శిక్షించటం ?

సురం : యీా సంసారంలో మన మొకళ్ళమే కాదు. చిన్నా, పెద్దా యెందరో వున్నారు. వాళ్ళకోసమే ఆందోళన. మన మొకళ్ళమే అయితే యీా ఆందోళ నెందుకోసం ?

సుద : చూడు సురంగమా! నేనిక్కడ కాలు పెట్టినప్పట్నుంచీ యెన్నో సార్లు హఠాత్తుగా గమనించాను. నా గవాక్షం కింద వీణ వాయిస్తున్నట్లు.

సురం : అయితే కావొచ్చు. యెవరో వాయించే వుంటారు.

సుద : అక్కడ చెట్లగుబురు దట్టంగా వుంది. అంతా చీకటి. యేమిటో చూడటానికి యెన్నోసార్లు ప్రయత్నించాను. కాని, యేమీ కనిపించ లేదు.

సురం : యెవరో దారిపోయే మనిషి తీరిగ్గా కూర్చుని వాయించాడేమో !

సుద : అయితే కావొచ్చు. కాని, నా అంధకార గృహంలో నా వెనకటి గవాక్షం నాకు జ్ఞాపకం వొస్తున్నది. సంధ్యాసమయంలో అలంకరించుకుని అక్కడ నిలబడేదాన్ని. దీపశూన్యమైన నా వాస గృహంలోకి బహిరంధకారాన్ని దూసుకుని జలపాతంలోని సలిలధారలా పాటపై పాటా, స్వరంపై స్వరమూా నా ముందర జారిజారి వొదిగి వొదిగి పడేవి. ఆ పాటలే నిబిడాంధకారంలోనుంచి వొచ్చేవో, నన్నే అంధకారంలోకి పిలిచేవో !

సురం : అమ్మా ? యే మ్మహనీయమైన అంధకారమది ? నే నా అంధకారంలో దాసిని !

సుద : మరి నాకోస మక్కణ్ణుంచి వొచ్చావెం దుకని ?

సురం : మన మహారాజు చేయి పట్టుకుని మళ్ళీ ఆదరంతో వెనక్కు తీసుకుపోతాడు. ఆ ఆదరంకోసమే వొచ్చాను.

సుద : నాకేం నమ్మకం లేదు. ఆయన రారు. నన్నాయన పూర్తిగా పరిత్యాగం చేశారు. యిహ రావలసిన పనేముంది ? నే చేసిన అపరాధం - యేమంత తక్కువది కాదు.

సురం : పరిత్యజించటమే జరిగితే, ఆయనతో మనకేమీ ప్రయోజనం లేదు. ఆయన మనకు లేనట్లే. ఆ అంధకారమంతా శూన్యగృహమే- అందులోయే వీణా మోగదు. యెవరి పిలుపూ వినిపించదు - అంతా వంచన !

(ద్వారపాలకుడి ప్రవేశం)

సుద : యెవరు నువ్వు ?

ద్వార : నేనీ ప్రాసాదానికి ద్వారపాలకుణ్ణి.

సుద : సంగతేమిటి ? త్వరగా చెప్పు.

ద్వార : మన కాన్యకుబ్జమహారాజును ఖైదీ చేశారు.

సుద : అయ్యో ! అమ్మా వసుంధరా !!

(మూర్ఛిల్లుతుంది)

*

# 13

(ఖైదీగా కాన్యకుబ్జరాజూ, యితర రాజులూ, సువర్ణుడూ)

కాంచి : పృథివీపతులారా ; రణక్షేత్రంలో పని పూర్తయింది.

కళింగ : కొంత పూర్తయింది. రణరంగంలో ప్రదర్శించిన శౌర్య పరాక్రమాలకు పారితోషికాన్ని పొందేముందుగా, ఆ శౌర్యాన్నీ, పరాక్రమాన్నీ పరిచయం చేయవలసిన అవసరం వుంది.

కాంచి : మహారాజా ! మనమిక్కడ సమావేశమైంది జయమాల్యాన్ని గ్రహించటానిక్కాదు. వరమాల్యాన్ని గ్రహించటానికే.

విదర్భ : ఆ మాల జయలక్ష్మి చేతులనుంచే గ్రహించాలి గదా !

కాంచి : అలా కాదు. ఆ మాల కూర్చినది కుసుమసాయకుడి అంతఃపురంలో. యీ నెత్తురు చేతుల్తో దాన్ని స్పృశిస్తే పూలన్నీ నేల రాలిపోతాయి,

కళింగ : అయితే మన్మథుడు మన యేడుగురి అర్హతలనూ యెలా నిర్ణయించగలడు ?

కాంచి : అలా అయితే ఆ నిర్ణయం రణదేవత చండి కూడా చెయ్యలేదు.

కోసల : అయితే మీ వుద్దేశ మేమిటి ? స్పష్టంగా చెప్పండి.

కాంచి : నా అభిప్రాయ మేమిటంటే, స్వయంవర సభలో రాజకన్య స్వయంగా యెవరి మెళ్ళో మాల వేస్తుందో అతనికే దక్కుతుందీ వసంతోత్సవ సౌభాగ్యం.

విదర్భ : యీ యేర్పాటుత్తమంగా వుంది. నాకు సమ్మతమే.

అందరూ : మాకూ అంగీకారమే.

కాన్యకుబ్జ : మహారాజులారా ! నన్ను వధించండి, లేకపోతే మీలో యెవరన్నా నాతో ద్వంద్వయుద్ధం చెయ్యండి. యిలా నన్ను జీవన్మృతుణ్ణిగా మాత్రముంచకండి.

కాంచి : మీ పుత్రిక పతిగృహాన్ని త్యజించి వొచ్చింది. ఆమెవల్ల మీకేమీ బాధ లేకుండా చేస్తున్నాం. యీ రోజున మేం చేసే యేర్పాటువల్ల ఆమె సమ్మానితురాలౌతుంది.

కోసల : రేపే శుభలగ్నంలో స్వయంవరం స్థిరపరచండి.

కాంచి : అదే మంచిది.

విదర్భ : ఆ యేర్పాట్లు ప్రారంభిద్దాం మనం.

కాంచి : కళింగ రాజా ! ఖైదీ మీ ఆశ్రయంలోనే వున్నాడు.

(కాంచీ రాజు తప్ప తక్కిన రాజులు నిష్క్రమణ)

కాంచి : యేమోయ్ కపటరాజా !

సువర్ణ : చిత్తం. మీ ఆజ్ఞేమిటి ?

కాంచి : మహారథులందరూ తొలిగిపోయారు. యిహ శిఖండిని ముందుంచుకుని నే నడవాలి.

సువర్ణ : తమ భావం స్పష్టంగా తెలియటం లేదు.

కాంచి : స్వయంవర సభలో నాకు ఛత్రధారివై నువు నిలబడాలి.

సువర్ణ : నేను కింకరుణ్ణిగా వుంటే తమకు దానివల్ల లాభమేమిటి ?

కాంచి : వో సువర్ణా ! నీకాట్టే బుద్ధిలేదు సరేకదా స్వాభిమానం కూడా వున్నట్టు లేదు. రాణి సుదర్శన నీ వంక యెంత అనురాగంతో చూసిందో, ఆ సంగతి నీ బుర్రలో యిప్పటికీ ప్రవేశించినట్లు లేదు. యేం జరిగినా, ఆ రాజసభలో చూస్తూ చూస్తూ ఛత్రధారివైన నీ మెళ్ళో వెయ్యజాలదు పూలదండ. అయినా నీ మీదనించి మాత్రం మనసు తిప్పుకో లేదు. అందుకని యెటొచ్చీ ఆ దండ నా రాజఛత్రచ్ఛాయలో పడి తీరుతుంది.

సువర్ణ : మహారాజా ! నన్ను గూర్చి యేవో నిరాధారమైన కల్పనలు చేస్తున్నారు—భయం కలిగించే కల్పనలు. అనుగ్రహించండి, యీ ఆపత్సముద్రంలో నన్ను దించకండి. నన్ను విడిచిపెట్టండి.

కాంచి : పనంతా పూర్తయిన తర్వాత నీకు ముక్తి. ఆపైన వొక్క ముహూర్తం కూడా ఆలస్యం చెయ్యను. వాంఛాసిద్ధి అయిన తర్వాత దానికి తోడ్పడ్డ సాధనా న్నెవరూ చిరస్మరణీయంగా వుంచుకోరు.

*

# 14

(వాతాయనం)

సుద : సురంగమా! అలా అయితే స్వయంవర సభకు నే వెళ్ళటం తప్పని సరేనా!

సురం : కాంచీ రాజే యీ విధంగా ఆదేశించాడు.

సుద : యిది రాజోచితమైన ఆదేశమేనా? తన నోటితోనే అన్నాడా యీ మాట?

సురం : లేదు. అతని దూత సువర్ణుడీ సంగతి తెలియచేశాడు.

సుద : ఛి, ఛీ!

సురం : ఆ సందర్భంలోనే కొన్ని వాడిపోయిన పూలు చూపించి, "వసంతోత్సవంనాటి స్మృతి చిహ్నాలివి. పైకెంత మలినంగా కనిపించినా, లోపల నవనవంగా వికసించే వున్నాయి. అని మీ రాణితో చెప్పు" అన్నాడు.

సుద : చాల్చాలు! నన్నిలా దగ్ధం చేసి పారేయకు.

సురం : అటు చూడు. సభలో రాజులందరూ ఆసీనులై వున్నారు. మెళ్ళో పూలదండ వేసుకుని ఆభరణాలేవీ లేకుండా కేవల మొక్క కిరీటంతో వున్నవాడే కాంచీ మహారాజు. ఆయన వెనకనే గొడుగు పట్టుకుని నిలిచినవాడే సువర్ణుడు.

సుద : అతడా సువర్ణుడు! నిజంగానే!

సురం : అవునమ్మా నిజం చెబుతున్నాను.

సుద : యీ మనిషినా నేనావేళ చూసింది? కాదు, కాదు. ఆలోకంతో అంధకారమూ, సమీరంతో సౌరభమూ మేళవించి నే నానాడు చూచిన దితను కాదు. కాదు.

సురం : చూచిన వాళ్ళందరూ అతన్ని సుందరు డంటున్నారు.

సుద : ఆ సౌందర్యంతోనే మనసు భ్రమిస్తుంది. నా యీ పాపిష్ఠి కళ్ళు దేనితో క్షాలనం చేస్తే యీ బాధ పోతుంది?

సురం : వాటిని నల్లదనంలో ముంచి జ్వాలన చెయ్యాలి. అన్ని రూపాలనూ ముంచేసే మన మహారాజు రూపంలో జ్వాలన చెయ్యాలి. ఆ నీలిమ కొంచెం కళ్ళకంటితే చాలు అంతా పోతుంది.

ప్రతీహారి : (ప్రవేశించి) స్వయంవర సభలో రాజులందరూ మీ రాక కెదురు చూస్తున్నారు. (నిష్క్రమణ)

సుద : నా మేలిముసుగు తీసుకురా (సురంగమ నిష్క్రమణ) వో రాజరాజా! మీరు నన్ను పరిత్యజించారు? అలా చేయటం సముచితమే. కాని, నా అంతఃప్రవృత్తి మీకు తెలియదు. (పైట చాటునుంచి కత్తి పైకి తీసి) నా శరీరం కళంకితమైపోయింది. అందరి యెదుటా నేనీరోజున మట్టిలో కలిసిపోతాను. కాని, నా హృదయాంతస్సీమలో యే కళంకమూ లేదు. నా హృదయాన్ని చీల్చి మీ కీ విషయాన్ని తెలియజేయలేనా? మీ సమాగమ భాగ్యం కల్పించిన ఆ అంధకారగృహం నేడు శూన్యమైపోయింది. ఆ యింటి వాకిలి తెరిచేవారెవరూ లేరు ప్రభూ! ఆ తలుపులు తీయించటానికిహ మీరు రానేరారా? ఆ ద్వారప్రాంతంలో మీ వీణ వాయించరా? అలా అయితే మరణాన్నే వరిస్తాను. అది మీలాగా నల్లనిది, అందమైనది, మీలాగే మనోహరమైనది. అదే మీరు. మీరే అది.

నీ అగాధాంధకారములోన
అంతమొందింపు మీ యంధకారమ్మెల్ల
అంధకారస్వామి!

రా దుర్గమాకృతీ! గంభీరమూర్తీ!
నా జీవనమ్మందు, నా హృదయపథమందు
రారమ్ము దిగి రమ్ము
అంధకారస్వామి!

ఈ మనోదేహమ్ము లేకమై పోనిమ్ము
లేనివై పోనిమ్ము
అంధకారస్వామి!

నా పురా సంస్మృతులు కోర్కెలు వికారములు
నీ చరణముల చెంత నిలిచిపోవగనిమ్ము :
నిర్వాసితను నేను దుర్వాసనా సూత్రబద్ధనో
యంధకారస్వామి!

వేయి బంధములతో నీ యందు బంధింపు
మోయి! యీలాటి బంధనములే కామింతు
నంధకారస్వామి!

*



# 15

(స్వయంవర సభ)

విదర్భ : కాంచీరాజా! మీ శరీరం నిరాభరణంగా వున్నదే!

కాంచి : యీ వరణంలో నాకేమీ ఆశలేదు. ఆభరణాలవల్ల పరాభవం ద్విగుణీకృత మవుతుంది.

కళింగ : వున్న ఆభరణాలన్నీ ఛత్రధారి వొంటిమీదనే వున్నాయి.

విరాట : దీనివల్ల కాంచీరాజు, బాహ్యాడంబరంలో వున్న వెలితిని ప్రకటిస్తున్నాడు. తాను శూరుణ్ణనే స్వాభిమానంతో యితరాలంకారాలన్నిట్నీ పరిహరించాడు.

కోసల : అతని చాకచక్యం నాకు తెలుసు. ఆభరణాలు ధరించిన వారందరిలోనూ తానొక్కడూ నిరాభరణంగా వుండి తన గౌరవాన్ని పెంచుకో దలుచుకున్నాడు.

పాంచాల : అదంత మంచి పనా? అందరికీ తెలిసిందే—కాంతాకటాక్షం పతంగంలా ఆభరణదీప్తిలోనే పడిపోతుంది.

కళింగ : యింకా యేమిటీ ఆలస్యం?

కాంచి : కళింగరాజా! అధైర్యపడకండి. విలంబంవల్లనే ఫలితం మధురమైపోతుంది.

కళింగ : ఫలం లభిస్తుందనే నిశ్చయమే వుంటే యెంత విలంబమైనా చిక్కులేదు. ఆ ఆశ అనిశ్చితం కాబట్టే దర్శనం కోస మీకుతూహలమంతా.

కాంచి : మీరు నవయౌవనంలో వున్నారు. యీ వయస్సులో యెంత వొదులుకున్నా ఆ ఆశాసుందరి వేశ్యలాగా మళ్ళీ మళ్ళీ వొస్తూనే వుంటుంది. మాకా రోజులు దాటి పోయాయి.

కళింగ : కాని, శుభముహూర్తం దాటిపోతున్నది.

కాంచి : భయం లేదు. శుభగ్రహాలు కూడా దుర్లభదర్శనం కోసం వేచి వుంటాయి. వోవేళ తెలియక మంచి ముహూర్తం పెట్టకపోయినా ప్రియదర్శనమే సమకూరితే అశుభగ్రహాల దృష్టి కూడా ప్రసన్నమయిపోతుంది.

విదర్భ : మీరెప్పుడు బయల్దేరారు ?

విరాట : మంచి ముహూర్తం చూసే బయల్దేరాం. దైవజ్ఞులు యాత్ర సఫల మవుతుందనే చెప్పారు.

పాంచాల : మే మందరం మంచి ముహూర్తంలోనే బయల్దేరాం. కాని, ఆ విధాత పరమలోభి. అందరికీ వొకే ఫలితాన్ని రానీయడు.

కోసల : ఆ ఫలాన్ని త్యాగం చెయ్యటమే అవసరమైతే అది శుభగ్రహాల ప్రభావమే.

కాంచి : యేమిటి! కోసలరాజుగారంత ఔదాసీన్యం వహిస్తున్నారు! ఫలాన్ని త్యాగం చెయ్యటాని కీసరంజామా అంతా యెందుకు ?

కోసల : యెందుకేమిటి ? కాంక్ష లేకపోతే త్యాగంతోనూ అవసరం లేదు. అవునుగాని మనం కూర్చున్న యీ పీఠాలు కదులుతున్న ట్లున్న దే. యిది భూకంపమా యేమిటి ?

కాంచి : అయితే కావొచ్చు.

విదర్భ : కాకపోతే యింకో రాజసైన్య మేదయినా వొచ్చిపడుతున్న దేమో ?

కళింగ : కావొచ్చుగాని, అలా అయితే దూతద్వారా ముందుగా వార్త వొచ్చేది.

విదర్భ : మన విషయంలో యిది దుశ్శకునంలాగే కనిపిస్తున్నది.

కాంచి : భయపడే కళ్ళకన్నీ దుశ్శకునాలే కనిపిస్తాయి.

విదర్భ : నే నదృష్టదేవతకు భయపడతాను. అక్కడ మన శౌర్యమేమీ పని చేయదు.

పాంచాల : విదర్భరాజా! నేటి శుభసమయంలో లేనిపోని సందేహాల్లేవ దీయకండి.

కాంచి : అదృష్టమనేది దృష్టమైతేనేగాని దాంతో సంబంధం పెట్టుకోను.

విదర్భ : అప్పటికి సమయమ్మించిపోతుంది. యింతకూ నా భయమేమిటంటే యేదైనా వొకటి—

కాంచి : ఆ 'వొకటి' ని పాటించకండి. అది మనం కల్పించిందే అయినా మనల్నే నాశనం చేస్తుంది.

కళింగ : బైట యేదో వాద్యం వాయిస్తున్నట్లున్నారు !

పాంచాల : అవునలాగే వుంది.

కాంచి : అయితే యింకేం. నిశ్చయంగా రాణి సుదర్శనే. యింతసేపటికి విధాత నా అదృష్ట ఫలాన్ని తీసుకొస్తున్నాడు. అది రాణి అడుగుల చప్పుడే. (జనాంతికంగా) సువర్ణా! యీ విధంగా ముడుచుకు పోయి నా వెనక దాక్కోవొద్దు. నీ చేతుల్లో నా రాజచ్ఛత్రం వొణుకు తున్నది జాగర్త!

(సైనికవేషంతో తాత ప్రవేశం)

కళింగ : అదేమిటి? యెవరది?

పాంచాల : పిలవకుండా ప్రవేశించాడు. యెవడీతడు?

విరాట : దర్పానికేం తక్కువ లేదు. కళింగ రాజా! వాణ్ణి కొంచె మాపెయ్యండి.

కళింగ : మీరందరూ వయస్సులో నా కన్న పెద్దలు. నేను మీకన్న ముందుండటం శుభం కాదు.

విదర్భ : విందాం యేం చెబుతాడో.

తాత : వొచ్చేశారు మహారాజు!

విదర్భ : (చకితుడై) మహారాజా?

పాంచాల : యే రాజు?

కళింగ : యెక్కడి రాజు?

తాత : మా రాజు.

విరాట : యేమిటీ, మీ రాజా?

కళింగ : యెవరూ?

కోసల : యెవరాతడు?

తాత : నేననేదెవరో మీ అందరికీ తెలుసు. ఆయనే వొచ్చేశారు.

విదర్భ : వొచ్చారా?

కోసల : వారభిప్రాయ మేమిటి?

తాత : మీ అందర్నీ వా రాహ్వానిస్తున్నారు.

కాంచి : ఆహ్వానమా? యే వుద్దేశంతో ఆహ్వానిస్తున్నారు?

తాత : వారి అహ్వానాన్ని యెవరేవుద్దేశంతో గ్రహించ గోరినా యిబ్బంది లేదు. అందరికీ తగిన స్వాగతమే లభిస్తుంది.

విరాట : యెవరు నువ్వు?

తాత : వారి సేనాధిపతుల్లో నేనొకణ్ణి.

కాంచి: సేనాపతివా? వుత్తమాట. భయపెట్టటానికా వొచ్చావు? నీ దొంగవేషాన్ని మేం కనిపెట్ట లేదనుకుంటున్నావు. మేమందరమూ నిన్ను బాగా యెరుగుదుం. సేనాపతి నంటావూ?

తాత: తమరు నన్ను బాగా పోల్చారు. నాకన్న అసమర్థు డెవడున్నాడు? అయినా నాకీ సేనాపతి వేషంవేసి నన్నాయనే పంపించారు. నా కన్న మహావీరులైన వాళ్ళందర్నీ యిళ్ళల్లోనే వుంచేశారు.

కాంచి: సరే. సముచితమైన మర్యాదలతో వారి ఆహ్వానాన్ని అంగీకరిస్తాం—కాని ప్రస్తుతం వొక ముఖ్యమైన వ్యవహారంలో వుండటం చేత - యీపని ముగిసిందాకా ఆయన వేచివుండాలి.

తాత: ఆహ్వానం పంపినతర్వాత ఆయన వేచి వుడంటమనే మాటేలేదు.

కోసల: నే నాహ్వానాన్నంగీకరించి యిప్పుడే పోతాను.

విదర్భ: ఆలస్యం చేయటమంత బాగా లేదు కాంచిరాజా. నేనూ వెళ్ళుతున్నాను.

కళింగ: మీరందరూ ప్రవీణులు. నేను మిమ్మనే అనుసరిస్తాను.

పాంచాల: కాంచీరాజా! కాస్త వెనక్కి తిరిగి చూడు. నీ రాజఛత్రం కింద పడిపోయింది. నీ ఛత్రధారి యెప్పుడు పారిపోయాడో కూడా తెలియదు.

కాంచి: సరే నేనూ బయల్దేరుతున్నాను. సమావేశానిక్కాదు. రణ రంగానికి!

తాత: రణక్షేత్రంలోనే మీకు మా ప్రభువుతో పరిచయ మవుతుంది. అదీ చాల ప్రశస్తమైన ప్రదేశమే.

విరాట: మనమందరమూ యేదో లేనిపోని భయంతో పారిపోతున్నాం. చివరికి కాంచి రాజొక్కడికే జయం లభిస్తుంది.

పాంచాల: అలాగే వుంది. ఫలం చేజిక్కేసమయంలో దాన్ని పారేసి పోవటమంత బాగాలేదు.

కళింగ: కాంచీ రాజుతో కలియటమే శ్రేయస్కరం. యింత సాహసం చేస్తున్నాడంటే వివేచన లేకుండా చేస్తాడా?

*

# 16

(సుదర్శన, సురంగమ)

సుద : యుద్ధమ్ముగిసింది. మహారాజు రావటమెప్పుడు ?

సురం : యెలా చెప్పను—దారివంక చూస్తూ కూచున్నాను.

సుద : నా హృదయ మానందంతో వొణికి పోతున్నది. అది వో విధమైన వేదనగా వుంది. సిగ్గుపడి కుమిలిపోతున్నాను - ఆయన్ను తలెత్తి యెలా చూడగలను ?

సురం : పూర్తిగా పరాజయ మంగీకరించి వినమ్ర భావంతో ఆయన్ను సమీపిస్తే యే సిగ్గూ వుండదు.

సుద : వొప్పుకుంటున్నాను - జీవితమంతటికీ కావలసినంత పరాజయం పొందనే పొందాను. కాని, యిన్నాళ్ళూ ఆయన దగ్గర గర్వంతో అందరికన్నా యెక్కువ ఆదరం పొందే అధికారాన్ని సంపాయించాను గదా, అదంతా వొక్క పెట్టున విడిచిపెట్ట లేకపోతున్నాను. నేను రూపవతిననీ, గుణవంతురాలననీ, నాపై నా స్వామి కంతులేని అనుగ్రహమనీ అందరూ అనేవారు. అందువల్లనే అందరూ చూస్తుండగా ఆయనచెంత తలవొంచి నిలవటానికి సిగ్గు చేటుగా వుంది.

సురం : స్వాభిమానాన్ని చంపుకోకపోతే, సిగ్గూ వొదలదు.

సుద : ఆయన దగ్గిర మళ్లీ వెనకటి ఆదరాన్ని పొందుదామనే కోరిక నన్ను విడవకుండా వుంది.

సురం : అమ్మా చివరకంతా పీడిపోతుంది. అంతా ఆయనకు సమర్పిద్దామనే కోరికొకటే మిగుల్తుంది.

సుద : అదే, ఆ అంధకార గృహంలో కోరిక—యేమీ కనిపించదు, వినిపించదు - యేకోరికా లేదు - ఆ గంభీరాంధకారమధ్యంలో లీనం కావటం. సురంగమా ! నన్నాశీర్వదించవూ ?

సురం : యేమంటున్నావమ్మా. యేమనాశీర్వదించను ?

సుద : అందరి యెదటా తలవొంచి నే నాశీర్వాదాన్ని కోరుకుంటాను. మహారాజు నన్ను చూచినంత ప్రసన్నంగా యింకెవర్నీ చూళ్ళేద నే అందరూ అనేవారు. అదంతా విని నాహృదయం కఠినమై నా ప్రభువుకే ఆఘాతం కలిగించింది. తల వొంచటానికే సిగ్గుగా వుంది. యీ సిగ్గు తుంచెయ్యాలి. ప్రపంచమంతటికీ లోకువ కావాల్సిన సమయ మొచ్చింది. కాని రాజేరీ ? నన్ను తీసుకుపోవటాని కిప్పటి కైనా రారేమి ? యింకెవరి కోసమన్నా వేచివున్నారా ?

సురం : నే చెప్పనే చెప్పాను. మన రాజు మహా నిష్ఠురుడని.

సుద : సురంగమా ! వెళ్లు. ఆయన కబురేదైనా తీసుకురా.

సురం : ఆయన కబురెక్కడ దొరుకుతుందో నాకేం పాలుపోవటం లేదు. తాతను పిలుచుకు రమ్మన్నాను. ఆయనే వొస్తే మహారాజువార్త తెలుస్తుంది.

(తాత ప్రవేశం)

సుద : మీరు మహారాజు కాప్తులని విన్నాను. నమస్కరిస్తున్నాను. నన్నాశీర్వదించండి.

తాత : రాణీ యేం పనిది ? నే నెవ్వరి నమస్కారాన్నీ స్వీకరించను. అందరికీ నాతో సంబంధం నవ్వులాటకే.

సుద : ఆ నవ్వే నాకనుగ్రహించండి. నాకో మంచివార్త చెప్పండి. మహారాజు నన్నెప్పుడు తీసుకు పోవటాని కొస్తారో సెలవీయండి.

తాత : చాలా గడ్డు ప్రశ్నే వేశారు. నా స్నేహితుడి తీరుతెన్నులు నాకేమీ అర్థంకాలేదు. యేం చెప్పేది ? యుద్ధమేమో ముగిసింది. కాని ఆయనెక్కడికి వెళ్లిందీ యెవరికీ తెలియదు.

సుద : వెళ్లిపోయారా ?

తాత : వులుకూ లేదు పలుకూ లేదు.

సుద : మీ స్నేహితుడు బలేవాడు !

తాత : అందుకే లోకమతన్ని నిందిస్తుంది. వున్నాడో లేడో అని సందేహిస్తుంది కూడాను. కాని ఆయనేమీ లెక్క చేయడు.

సుద : యెంత కఠినుడు ? యెంత కఠినుడు ? పాషాణ హృదయుడు ! వజ్ర సంకల్పుడు ! నా హృదయమంతా అర్పించినా నా గుండె ఛిందర

వందలైందిగాని ఆయన మాత్రం చలించ లేదు. తాతా యిలాంటి స్నేహితుడితో నువ్వెలా కాలక్షేపం చేస్తున్నావు ?

తాత : సుఖంలో దుఃఖంలో ఆయన లీల తెలుసుకున్నాను. ఆయనేం చేసినా సరే నా కళ్ళవెంట నీళ్ళు రావు.

సుద : ఆయన లీల నాకూ్కడా తెలియచేసే భాగ్యం లేదా ?

తాత : తప్పకుండా వుంటుంది. లేకపోతే మిమ్మలనింత బాధ పెట్టట మెందుకు ? ఆయన సులభసాధ్యుడు కాదు.

సుద : ఆయన నిష్ఠురత్వ మెంతవరకుంటుందో నేనూ చూస్తాను. యీ కిటికీ దగ్గర నోరెత్తకుండా వుండిపోతాను. కాలైనా కదపను - యెలా రారో చూస్తాను !

తాత : మహారాణి ! మీ వయస్సు చాలా చిన్నది. పట్టుదలతో యెంత కాలమైనా వుండగలరు. మరి నాకో ? ఒక ముహూర్తంపోతే పెద్ద నష్టమే. దొరకనీ దొరక్కపోనీ ఆయన్ను అన్వేషించక తప్పదు.

(నిష్క్రమణ)

సుద : అవసరం లేదు. నాకవసరం లేదు. సురంగమా ! మహారాజుతో నాకు పని లేదు. ఆయన యుద్ధం చేసిం దెవరి కోసమని ? నా కోసమ్మాత్రం కాదూ ? కేవలం తన శౌర్యాన్ని ప్రకటించుకో టానికా ?

సురం : ప్రకటించాలనే కోరిక వారికుంటే సందేహానికి తావే లేకుండా ఆ పని చేసేవారు.

సుద : పో పో ! ఆయన ప్రసంగమంటే నే సహించలేక పోతున్నాను. నేనింత పరాజితనైనా ఆయనకు తృప్తి లేదు.

# 17

(నాగరికదళం)

మొదటివాడు : యింతమంది రాజులొక్కచోట చేరి యుద్ధం చెయ్యటమేదో తమాషాగా వుంటుందనుకున్నాను గాని - చూడగా చూడగా యేమయిపోయిందో కూడా తెలియటంలా.

రెండోవాడు : చూశావుగా, వాళ్ళల్లో వాళ్ళకే యేదోతగాదా వొచ్చింది. యెవరూ యెవర్నీ నమ్మటంలా.

మూడోవాడు : వాళ్ళు చేయదలచుకొన్నదేదీ సరిగ్గా సాగినట్టు లేదు. కొందరు ముందుకూ, కొందరు వెనక్కూ, కొందరటూ, కొందరిటూ పోతున్నా రిదేం యుద్ధంరా ?

మొదటివాడు : వాళ్ల దృష్టి యుద్ధమ్మీద లేదు. వొకర్ని చూసి వొకరను మానిస్తున్నారు.

రెండోవాడు ; యుద్ధంలో చచ్చేది నేనూ, ఫలమనుభవించేదింకోడూ, అనుకుంటున్నాడు ప్రతి రాజూ.

మూడోవాడు : కాంచీరాజు మాత్రం యుద్ధం చేస్తున్నాడు—ఆ మాట వొప్పుకుని తీరాలి.

మొదటివాడు : అతనోడిపోయినా ఆ సంగతి గమనించటం లేదు.

రెండోవాడు : చివరి కతని గుండెలో వో బాణం వొచ్చి గుచ్చుకుంది.

మూడోవాడు : అదివరకే అడుగడుక్కీ అతని బలం తగ్గుతూనే వున్నా అతనది గుర్తించినట్లే కనిపించ లేదు.

మొదటివాడు : తక్కిన రాజులందరూ అతన్ని విడిచి యెక్కడికి పారి పోయారో కూడా తెలియదు.

రెండోవాడు : కాని, కాంచీరాజు మరణించలేదని వింటాను.

మూడోవాడు : లేదు. చికిత్స చేసిం తర్వాత ఆయన మళ్ళీ తేరుకున్నాడు. ఆ బాణపాతంవల్ల అతని వక్షఃస్థలంలో పడ్డ మచ్చ బతికున్నంత కాలమూ మాసిపోదు.

మొదటివాడు: పరిగెత్తిపోయిన రాజులెవరూ సురక్షితంగా పోలేదు. అందరూ పట్టుబడ్డారు. కాని న్యాయ విచారణెలా జరిగింది?

రెండోవాడు: తక్కిన రాజు లందరికీ శిక్ష విధించారు. కాంచీ రాజును మాత్రం న్యాయాధికారి తన సింహాసనానికి దక్షిణ పార్శ్వంలో వుంచుకుని స్వయంగా తనే అతని తలమీద కిరీటముంచాడు.

మూడోవాడు: యిదేమిటో నాకెంత మాత్రమూ అర్థం కావటంలా.

రెండోవాడు: విచారణ యెవరో మతి పోయిన వాళ్లు చేసినట్లుంది.

మొదటివాడు: మరింకేమిటి? అపరాధం చేసిన వారెవరన్నా వుంటే, అతను కాంచీ రాజే. తక్కిన వాళ్లందరిలో కొందరు దురాశతో ముందుకు పోతే, కొందరు భయంతో వెనకే వుండిపోయారు.

మూడోవాడు: బలే బాగుంది. పులిని వొదిలేసి, తోకను కత్తిరించినట్లుగా వుంది.

రెండోవాడు: నేనే న్యాయాధికారినైతే కాంచీరాజు క్షేమంగా వుండే వాడా? వాడైపు లేకుండా చేసేవాణ్ణి.

మూడోవాడు: మనకేం తెలుసు. ఆ న్యాయాధికారులంతా గొప్ప గొప్ప వాళ్లు - వాళ్ళ బుద్ధి అదో విధంగా వుంటుంది.

మొదటివాడు: వాళ్లకు బుద్ధంటూ వొకటుందా అని? వాళ్ళకేం తోస్తే అదే. వాళ్లకు చెప్పే వాళ్లెవరు?

రెండోవాడు: అన్నా నువ్వేమన్నా అను. శాసనాధికారం నా చేతుల్లోనే వుంటే వీళ్లందరికన్నా చక్కగా నడిపించేవాణ్ణి.

మూడోవాడు: యింకా చెప్పాలా?

# 18

(మార్గ మధ్యం)

(తాతా కాంచీరాజూ ప్రవేశం)

తాత : కాంచీ రాజా ! మీరు కూడా యీ దారిలో వున్నారేం ?

కాంచి : మీ రాజు నన్ను వీధిని బెట్టాడు.

తాత : అది ఆయన స్వభావమే.

కాంచి : ఆతర్వాత మళ్లీ కనిపించ లేదు.

తాత : అదీ ఆయన వినోదమే.

కాంచి : కాని యెన్నాళ్లిలా నన్ను తప్పించుకుని తిరుగుతాడు ? ఆయన ఆధిపత్యాన్ని నే నెంతమాత్రమూ గౌరవించకుండా వున్న సమయంలో యెక్కణ్ణుంచో హఠాత్తుగా వొచ్చి, ఒక్క ముహూర్తంలో నా ధ్వజకేతనాలు విరిచి పారేసి, ధ్వంసం చేసేశాడు. యిప్పుడు నా వోటమి నంగీకరించి, ఆయన యెదట సాష్టాంగపడదామనుకుంటే, యెంత తిరిగినా ఆయన కనిపించడు.

తాత : ఆయనెంత గొప్ప ప్రభువైన కానీ, తనకు వశమైనవారికి తాను కూడా వశం కావాలిసిందే. కాని, రాజా, యీ అర్ధరాత్రి వేళ బయల్దేరా రేమి ?

కాంచి : నా దురభిమానం నన్ను విడవకుండా వుంది. కాంచీ రాజ్యాధిపతి తన కిరీటాన్ని చాత పట్టుకుని మహారాజు మందిరాన్ని వెతుక్కుంటూ తిరుగుతున్న సంగతి ప్రజలు పగటివేళ చూస్తే నవ్వుతారు.

తాత : వాళ్ల తీరే అది. కంటినీరు తెప్పించే యెంత దుఃఖజనకమైన దృశ్యమైనా సరే, ఆ కోతి వెధవలు నవ్వుతారు.

కాంచి : తాతా ! యేమిటీ వ్యవహారం ? వుత్సవంలో వున్న పిల్లలందర్నీ చేరదీసుకొచ్చా విక్కడికి. అక్కడ నిన్నంటుకు తిరిగిన స్నేహితు లందరూ యేరీ ?

తాత : మా శంభూ, సుధనుల సంగతేనా ? వాళ్ళందరూ యుద్ధంలో మరణించారు.

కాంచి: మరణించారా ?

తాత: అవును. వాళ్లు నాతో యేమన్నారంటే "తాతా! పెద్ద పెద్ద పండితులైన వాళ్ల మాటలు మా కర్థం కావు. నువ్వు పాడేటప్పుడు నీతో గొంతుకలిపి పాడటంకూడా మా చాతకాలేదు. మాకు చాతదయిందల్లా వొక్కటే. ప్రాణా లర్పించటం. మమ్మల్ని యుద్ధంలోకి తీసుకుపో, మా జీవితం సార్థకం చేసుకుంటాం" అన్నారు. వాళ్లు చెప్పేదొకటీ, చేసేదొకటీ కాదు. యుద్ధంలో అందరికన్నా ముందు నిలబడ్డారు. అందరికన్నా ముందే ప్రాణాలర్పించారు.

కాంచి: సరాసరిగా బుద్ధిశాలురందరికన్నా ముందే దాటిపోయారు! యిప్పుడీ పిల్లలందర్నీ చేర్చి నువ్వు చేసే దేమిటీ బాలక్రీడ?

తాత: యీసారి వసంతోత్సవం నానా క్షేత్రాల్లో, నానా విధాలుగా జరిగిపోయింది. అదంతా పాటల్లో, అభినయంలో పెట్టి వీళ్లందర్నీ తిప్పుకుంటూ పోతాను. ఆ రోజున రాజోద్యానమంతా చక్కని యెర్ర రంగుతో మెరిసిపోయింది. రణరంగంలోనూ అలాగే వుంది. అదంతా సమాప్తమైంది. యివ్వాళ యీ నడివీధిలో మాకో పెద్ద పండుగ నడుస్తుంది. యిళ్ళలోవున్న మనుషులందర్నీ పైకి రప్పించటాని కివాళ దక్షిణ సమీరంలా కోలాహలం చేస్తున్నాం.

(పాట)

ఈ వసంత వేళయందు
కుంఠిత మవగుంఠితమగు
నీ జీవిత పథములోన
వంచన మొనరింపబోకు.
హృదయాబ్జము విరియనిమ్ము
నే ననుచును పరులనుచును
భేదబుద్ధి మరచిపొమ్ము
గానామృత భరిత గగన
సీమతోడ వియ్యమంది
బహిర్జగతి దశ దిశలను
విస్మరించి, వెల్లువగా
మధురభావ మొలికింపుము.

చివురు చివురునందు నేడు
వనమున వేదనలు మ్రోగె
దూరసీమ నెవరి గోరి
వసుంధరాదేవి నేడు
సజ్జితయై నిలుచునొకో
నాదు ప్రాణమందిరమున
దక్షిణా నిలమ్మెవరిని
తలుపు తట్టి పిలుచు నొకో
పరిమళములు కళవళించు
ఈ నిశి యెవ్వరి పదముల
మ్రోల నేల వ్రాలునొకో
సుందర వల్లభ మూర్తీ
యెవరికి నీ యాహ్వానము.

*

# 19

(మార్గ మధ్యం)

(సుదర్శన, సురంగమ)

సుద : సురంగమా ! బతికి బైటపడ్డాను - నా పరాభవంవల్ల తెరిపినిపడ్డాను. యెంత గర్వంగా వుండేదాన్ని ! ఆ గర్వాన్ని కొంచమైనా తగ్గించుకోవటం నా కిష్టమయ్యేది కాదు. మహారాజు నా యింటి కెందుకు రావాలి ? నేనేగద ఆయన దగ్గిరికి పోవాలిసినదాన్ని—యీ మాట నా మనసుచేత వొప్పించగలిగేదాన్ని కాదు. రాత్రంతా, ఆ గవాక్షంచెంత పొర్లాడుతూ వొకళే యేడ్చాను. నా హృదయంలో ఆవేదనలాగే పైరగాలి హూ హూ మని వీస్తూనే వుంది. కృష్ణ చతుర్దశి అంధకారంలో పక్షుల కూజితాలు నన్ను పిలిచినట్లే అనిపించినై—అంధకారమే శోకిస్తున్నట్లు !

సురం : నిన్న రాత్రి యెన్నటికీ తెల్లవారదేమో ననిపించింది !

సుద : నువ్వు, చెబితే నమ్మవుగాని, అర్ధరాత్రివేళ యెక్కడో వీణ వాయిస్తున్నట్లనిపించింది. అంత నిష్ఠురతా, అంత కాఠిన్యమూ వున్న ఆ చేతుల్తో అంత సున్నితంగా యెలా వాయించాడో ఆయన ? నా పరాభవ గాథ లోకంలో అందరూ విన్నారు. కాని, నీరవరాత్రి వేళ ఆ వీణా స్వరాన్ని నా హృదయ మొక్కటే వినగలిగింది - యింకెవరూ వినలేదు. సురంగమా! నీకు వినిపించిందా ఆ వీణా వాదనం ?

సురం : ఆ వీణాస్వరం వినటానికేగదా నీ వెంట వెంటబడి నే వొచ్చింది. దురభిమానాన్ని నిర్మూలించే ఆ స్వరం చెవులారా వినటానికి ప్రతీక్షిస్తూనే వున్నాను.

సుద : ఆయన మాటే నెగ్గింది. వీధిలో నన్నొంటరిగా విడిచి వెళ్లిపోయారు. మళ్లీ కలిసినప్పు డిలా చెబుతాను. "నేనే వొచ్చాను. మీ రాక కెదురు చూడకుండానే వొచ్చాను. కన్నీరు కార్చుకుంటూ వొచ్చాను. కఠిన శిలామయమైన మార్గాన, నడిచి నడిచి వొచ్చాను" యీ గరువతనాన్ని మాత్రం వొదులుకోను.

సురం: కాని, ఆ గర్వం కూడా యెంతోకాలం నిలవదు. అమ్మా, మీ కన్నా ముందుగా ఆయనే వొచ్చారు. లేకపోతే మిమ్మి నీదారి పెట్టట మెవరితరం ?

సుద: నిజమే. నాకూ అలాగే లీలగా అనిపించిందిగాని పూర్తిగా నమ్మకం లేకపోయింది. గర్వంతో మూసుక్కూర్చున్నంతసేపూ నన్ను రాజు పరిత్యజించారనే అనిపించింది. ఆ గర్వం వొదులుకొని వెలపలికి రాగానే, ఆయన కూడా వెలపలికి వొచ్చినట్లూ యీ మార్గంలోనే ఆయనతో స్వాగతం ప్రారంభమైనట్లూ అనిపిస్తున్నది. యిప్పుడు నా మనస్సులో యే ఆలోచనా లేదు. ఆయనకోసం నే పడ్డ వేదనా, దాని ఫలంగా ఆయన సాంగత్య ప్రాప్తి — యింత కర్కశమైన మార్గం కూడా నా కాళ్లకింద అడుగడుక్కీ మధురంగా ధ్వనిస్తున్నది — యిదే నా వీణ, నా దుఃఖవీణ - యీ వీణాగానం తోనే ఆయన కూడా యీ కరకు రాళ్లపై, యీ ధూళిలో పడి నడుస్తున్నారు — యిదే నా కరగ్రహణం కూడా చేశారు - ఆ అంధకార గృహంలో నా చేతిలో చెయి వేసినట్లు - హఠాత్తుగా ఆనందంతో నా వొళ్లు పులకించినట్లు - యెవరన్నారు — రాజిక్కడ లేరని - సురంగమా! తెలుసుకున్నావా, ఆయన మనతోనే ప్రచ్ఛన్నంగా వొస్తున్నారని ?

(సురంగమ పాట)

ఈ యిరుల పొరలలో రెండు చేతులు సాచి
    నన్ను చేపట్టితివి నాథా
మెల్ల మెల్లని నడల నేవేళ నాదరికి
    వేంచేసితివి మనోనాథా
జీవనస్వామి నీ యెరుక యేమరచి నిను
    కోల్పోయితి ననుకొంటి నాథా
నీవు మాత్రము నన్ను కోల్పోవ నేరవని
    యీ రేయి గనుగొంటి నాథా
ఏ నిశీథిని నేను వెలుగు నార్పితినో
ఆ నిశీథిని నీవు ధ్రువతారవై నిల్చి
    జ్వలియింతువో మనోనాథా

నీ తోడ చరియింప నేనాడు మానితినొ
ఆనాటి నుండియును నాదారి వెంటనే
డాగియుందువు నీవు నాథా

సుద : యెవరా వొచ్చేది ! సురంగమా ! నిదానించి చూడు ! యింత రాత్రి వేళ చీకటిలో పడి యింకో పథికు డెవరో యీదారినే వొస్తున్నాడు.

సురం : అమ్మా ! ఆయన కాంచీరాజు.

సుద : కాంచీరాజా !

సురం : భయపడకమ్మా.

సుద : భయమా ? భయమెందుకు ? భయపడే సమయం దాటిపోయింది.

కాంచి : (ప్రవేశించి) అమ్మా మీతోబాటు నేనూ యీ మార్గంలోనే నడుస్తున్నాను. నన్ను చూచి మీరేం భయపడవొద్దు.

సుద : కాంచీరాజా ! మనమిద్దరమూ ఆయన చేరువగా వొకరి సరసన వొకరం జట్టుగా నడుస్తూండడం బాగానే వుంది. రాజగృహాన్ని పరిత్యజించి వొచ్చే సమయంలో మీ పరిచయం గలిగింది నాకు. మళ్లీ తిరిగి నా రాణివాసానికి వెళ్లే సమయంలో కూడా శుభసూచకమైన మీ సాంగత్యం లభిస్తుందని ముందెన్నడూ భావించలేకపోయాను.

కాంచి : అమ్మా ! మీరు చాలా దీనంగా తల వొంచుకుని నడిచి పోతున్నారు. యిది మీ వైభవానికి తగదు. మీ రనుమతిస్తే రథం సిద్ధం చేసి తెస్తాను.

సుద : వొద్దు, వొద్దు. అలా అనకండి. యే మార్గంలోపడి ఆయనకు దూరంగా పోయానో ఆ దారి వెంటనే యీ ధూళిలోపడి నడిచి ఆయనచెంత చేరుకుంటాను. అదే నా భాగ్యం. రథారూఢనైతే నన్ను నే వంచించుకోవటమే అవుతుంది.

సురం : రాజా ! మీరూ యీ ధూళిలోనే నడుస్తున్నారు ! యేనుగులూ, గుర్రాలూ, రథాలూ యేవీ కనిపించవే !

సుద : నే రాణిగా వున్నప్పుడు వెండిబంగారాల మీదనే కాలు మోపే దాన్ని. యీనాడు ధూళిలో నడుస్తూ ఆ భాగ్యదోషాన్ని పోగొట్టు కుంటాను. యీ మట్టినేలపై నడిచే మహాప్రభువుతో నాకీరోజున అడుగడుగునా సాంగత్యం లభించింది. యిది నా సౌభాగ్యంగా భావిస్తాను.

సురం : మహారాణీ! అదుగో ఆ పూర్వదిగంతాన్ని చూడు! ఉష స్సమయం సమీపించింది.

(పాట)

రేయి గడచె ప్రొద్దుపొడిచె
నాదు ప్రయాణమ్ము ముగిసె
అదుగదుగో వినిపించెడు
తీయనైన వెలుగుపాట
ధన్యుడవో యాత్రికుడా!
జాగరమున నలసె రజని
ధన్యమయ్యె నీనాటికి
ధూళి ధూసరిత హృదయము
అటవీ పర్యంకమందు
సమీరణము మేల్కొనియెను
ప్రతికుంజ ద్వారమ్మున
తేనెలకై మూగె తేంట్లు
నీ ప్రయాణమంతమయ్యె
తుడిచికొమ్ము కంటినీరు
తొలగెను లజ్జా భయములు
అహంకార మంతరించె.

(తాత ప్రవేశం)

తాత : అమ్మా! ఉషస్సమయమైంది.

సుద : మీ ఆశీర్వాదంవల్ల నా గమ్యాన్ని చేరుకున్నాను.

తాత : కాని మనరాజుగారి మర్యాద చూశారా? ఏ రథం లేదు. మేళ తాళాల్లేవు. యే ఆడంబరమూ లేదు.

సుద : ఆడంబరంలేదూ? అదుగో ఆకాశాన్ని చూడండి! ఎంత రాగ రంజితంగా వుందో. కుసుమ సౌరభంతో మంద సమీర మెంతగా నిండిపోయిందో

తాత : మా రాజెంత నిష్ఠురుడైనా కావొచ్చు. మేమ్మాత్రమంత కాఠిన్య వహించలేం. మాకు బాధగానే వుంది. అమ్మా! మీరీ దీనవేషంతో రాజభవనానికి నడిచిపోతున్నారు. చూచి సహించగలమా? కొంచె మాగండి, నే వెంటనే పోయి మీ చీనాంబరాలు తెస్తాను.

సుద : వొద్దు. వొద్దు. ఆ రాణివేషం నా జీవితాంతంవరకూ లేకుండా చేశారాయన. అందరి యెదుటా నన్ను దాసివేషంతో నిలిపారు. నా జన్మ తరించింది. నే నిపుడాయన దాసిని. ఆయన క్కావలసిన వారెందరున్నారో వాదందరికన్నా తక్కువదాన్ని.

తాత : శత్రుపక్షంవారు మిమ్మ్మ చూసి పరిహాసిస్తారు. అది నే సహించ లేకుండా వున్నాను

సుద : ఆ పరిహాసం శాశ్వతంగా అక్షయంగా వుండాలి. వారందరూ నా మీద దుమ్ము చల్లనీ. యీనాటి నా కళ్యాణయాత్రలో ఆధూళీ పరాగమే నా అంగరాగమవుతుంది.

తాత : యిప్పుడు మన వసంతోత్సవంలో చివరిఘట్టం సాగనియ్యండి. పుష్పపరాగాన్నలా వుంచి పైరగాలిలో వొచ్చే ధూళీపరాగమే రానియ్యండి. అందరమూ కలిసి యీ ధూళితోనే ప్రభువు సన్నిధా నాన్ని చేరుకుందాం. ఆయన శరీరంకూడా ధూళిధూసరితమై వుంటుంది. గుప్పిళ్ళతో ఆయనమీద చల్లిన ధూళి అలాగే వుండి పోతుంది. దులపనైనా దులుపుకోరు.

కాంచి: తాతా! యీ ధూళీ వినోద సమయంలోనన్ను మరిచిపోవొద్దు. యెవరూ గుర్తించటానికి వీల్లేకుండా నా రాజవేషాన్ని ధూళిధూసరితం చెయ్యాలి.

తాత : దానికెంతోకాలం పట్టదు. యింతకిందికి దిగిరావటంతో మీ మిథ్యా గౌరవమంతా మాయమైపోనే పోయింది. చూస్తూ చూస్తూ వుండ గానే మీ వాలకమింకా మారిపోతుంది. మా మహారాణిని చూడండి. ఆమె తనపై మహాకోపం తెచ్చుకుని, తన అలంకారాలన్నిట్నీ విస ర్జించి భువనమోహనమైన తన సహజ సౌందర్యాన్ని తృణీకరిద్దామను కుంది. కాని ఆ సౌందర్యం పరాభవ ఫలితంగా మరీ యెక్కువగా భాసించింది. దాన్నేమాత్రమూ కప్పిపుచ్చటానికే వీల్లేదు. మా రాజుకు సౌందర్యంతో సంబంధం లేదంటారు. అందుకే చిత్రవిచిత్రా లైన నానా రూపాల్లోవున్న సౌందర్యాన్ని ఆయన అభిమానిస్తారు. అదే ఆయన అలంకారం. ఆ సౌందర్యం దురభిమానమనే తన ముసుగు తొలిగించుకుంది. మా రాజ ప్రాసాదంలో నానా సుస్వరాలతో నిండిన వీణావాదనం వినాలని నా ప్రాణం తహతహలాడుతున్నది!

సురం : అదుగో! సూర్యోదయం!

## 20

(అంధకార గృహం)

సుద : మీ ఆదరాన్ని పొందే అధికారాన్ని పోగొట్టుకున్నాను. మళ్లీ ఆ అధికారాన్ని నాకియ్యకండి. నేను మీ చరణదాసిని. సేవించే అధికారమే నాకియ్యండి.

రాజు : యిప్పుడు నా ఆకారం చూసి సహించగలవా ?

సుద : మహాప్రభూ సహించగలను. నా ప్రమోదవనంలో, నా రాణివాసంలో మీ దర్శనం చెయ్యాలనే అభిలాషవల్ల మీ రూపం నాకు వికృతంగా కనిపించింది. ఆ ప్రదేశాల్లో మీ దాసానుదాసుడు కూడా మీకన్నా సుందరంగా కనిపిస్తాడు. ఆ విధంగా మిమ్మును చూడాలనే కుతూహలం పూర్తిగా పోయింది. ప్రభూ ! మీ ఆకారం సుందరం కాదు—అనుపమం !

రాజు : నా వుపమానం నీలోనే వుంది.

సుద : అలావుంటే అదీ అనుపమమే. నాలో మీ ప్రేమ నిష్ఠమై వుంది. ఆ ప్రేమా మీ ప్రభావమే. ఆ ప్రదేశంలో మీ రూపాన్నే మీరు చూడగలుగుతున్నారు. నాదేమీ కాదు. అంతా మీదే.

రాజు : నేడీ అంధకార గృహద్వారం పూర్తిగా తెరిచేస్తున్నాను—యిక్కడి లీల సమాప్తమైంది. యీసారి నాతో రా ! రా, బాహ్య ప్రపంచంలోకి—వెలుగులోకి.

సుద : వొచ్చేముందు, నా అంధకార ప్రభువుకు, నా నిష్ఠుర, భయానక ప్రభువుకోమారు ప్రణమిల్లుతాను.

*

# 1

మాధవదత్తు : గట్టి చిక్కులోనే పడ్డాను. వాడు లేనంతకాలం యే ఆదుర్దా వుండేదికాదు. యెక్కణ్ణుంచొచ్చాడో వాడిప్పుడు నా యిల్లంతా ఆక్రమించుక్కూచున్నాడు. యిహ వాడు వెళిపోతే యిల్లు యిల్లులాగే వుండేట్టు లేదు. వైద్యుడుగారూ మీ అభిప్రాయ మేమిటి ? వాడికీ—

వైద్యుడు : వాడి రాతలో ఆయుర్దాయమే గనక వుంటే చాలాకాలం జీవించొచ్చు. ఆయుర్వేదంలో రాశిం దాన్నిబట్టి—

మాధవదత్తు : యేమన్నారు ?

వైద్యుడు : శాస్త్రంలో చెప్పిందేమిటంటే "పైత్తికాన్ సన్నిపాత జాన్ కఫవాతసముద్భవాన్"—

మాధవదత్తు : బాబ్బాబు కొంచెం వుండండి. మీరా శ్లోకాలేవీ యేకరవు పెట్టకండి. వాటితో వున్న భయం మరీ యెక్కువౌతుంది. ప్రస్తుతం చేయాల్సిందేమిటో అది కాస్త చెప్పేయండి.

వైద్యుడు : (పొడుంపట్టు పట్టి) సావధానంగా మనస్సులో వుంచుకోవాలి.

మాధవదత్తు : ఆ మాట బాగానే వుంది. కాని యే విషయాన్ని గురించి సావధానంగా వుండాలో అది కాస్త నిర్ధారణగా చెప్పేయండి.

వైద్యుడు : యిదివరలో చెప్పనే చెప్పాను. అసలతన్ని యిల్లు విడిచి పోనియ్యనేకూడదు.

మాధవదత్తు : పసివాడాయెను. వాణ్ణి రాత్రింబవలూ యింట్లో బంధించి వుంచటం చాలా కష్టమైన పని.

వైద్యుడు : అయితే యేం జేస్తానంటారు ? ఈ శరత్కాలపు గాలీ, యెండా - యీ రెండూ అతనికి మాత్రం విషంతో సమానం. దానిక్కారణం శాస్త్రంచెప్పనే చెప్పింది. "అపస్మారే జ్వరే కాశే కౌమలాయాం హలీమకే—

మాధవదత్తు : సరే సరే మీ శాస్త్రం అలా వుణ్ణీయండి. అలాగైతే వాణ్ణి కట్టేసి వుంచాలన్న మాట. వేరే వుపాయ మేమీ లేదంటారు ?

వైద్యుడు : యేమీలేదు. ఎందువల్లనంటారా ? " పవనే తపనే చైవ "

మాధవదత్తు : మీ చైవతో నాకేం వొరుగుతుంది చెప్పండి. అదలా వుంచి చేయాల్సిందేమిటో సెలవిద్దురూ. మీ చికిత్సా విధానం చాలా కఠోరంగావుంది. రోగానికి సంబంధించిన బాధంతా వాడు పాపం నోరెత్తకుండా వోర్చుకుంటూనే వున్నాడు. కాని మీ ఔషధాన్ని సేవించేటప్పుడు మాత్రం వాడు పడే బాధ చూస్తే గుండె పగిలి పోతుంది.

వైద్యుడు : ఆ బాధ యెంత ప్రబలంగా వుంటే దాని ఫలితం అంతయెక్కువన్నమాట. అందుకోసమే చ్యవన మహర్షి యేమన్నాడంటే " భేషజం హితవాక్యంచ తిక్తం అశుఫలప్రదం ? " దత్తుగారూ యివాళకి వెళ్లొస్తాను.

(నిష్క్రమణ)

(తాతయ్య ప్రవేశం)

మాధవదత్తు : తాతయ్యొచ్చేశాడు. ఇహ మన పనైనట్టే.

తాతయ్య : యేమయ్యా, నేనంటే యెందుకోసం నీ కంత భయం ?

మాధవదత్తు : పిల్లల బుద్ధులు మార్చటంలో నీ అంత వాడు లేడని.

తాతయ్య : నువ్వు కుర్రవాడివి కాదు. మరి నీ యింట్లో పిల్లల్లేరు. నీ మటుకు నీకు బుద్ధులు మారిపోయేవయస్సే దాటిపోయింది. యేమిటి నీ విచారం ?

మాధవదత్తు : ఇంటికో పిల్లవాణ్ణి తీసుకొచ్చుకున్నాను.

తాతయ్య : యెలాంటి వాడేమిటి ?

మాధవదత్తు : మా ఆవిడకు వో పిల్లవాణ్ణి దత్తత తెచ్చుకుందామని పిచ్చిపట్టుకుంది.

తాతయ్య : ఆమాట చాలా రోజుల్నుంచీ వింటున్నా. అయితే నీకు లేదుగా తెచ్చుకోవాలనీ.

మాధవదత్తు : తెలియదుటోయ్ యెంత కష్టపడి యీ డబ్బు కూడబెట్టానో - యెక్కణ్ణుంచో కుఱ్ఱవాడెవడో వచ్చి అతి శ్రమతో ఆర్జించిన యీ ధనమంతా కించిత్తైనా శ్రమలేకుండా తగలేస్తాడనే మాట తల్చుకుంటే మనస్సు చికాకు పడేది. అయితేనేం, యిప్పుడా కుఱ్ఱవాడేవిధంగా కలిసిపోయినాడంటే——

తాతయ్య : అదే అదే వీడికోసం యెన్నిరూపాయలు ఖర్చైనా అదంతా ఆ రూపాయల మహాభాగ్యమనుకుంటున్నావు.

మాధవదత్తు : వెనకటి రోజుల్లో డబ్బు కూడబెడుతూవుండేవాణ్ణి. అదో దుర్వ్యసనంలా వుండేది. ఆ పని చేయకపోతే వుండగలిగేవాణ్ణి కాదు. ఇప్పుడుందే యీ ఆర్జించే డబ్బంతా యెప్పుడో అప్పుడు వాడికి చెందుతుందిగదా అని ధనార్జన మంటేనే మహాసంతోషంగా వుంటున్నది.

తాతయ్య : చాలా బాగుందోయ్. పిల్లవాణ్ణి యెక్కడ సంపాయించావో కాస్త చెప్పు చూతాం.

మాధవదత్తు : నా భార్యకి ఆ వూళ్లో వరసనుబట్టి అన్న అవుతాడు. అతని బిడ్డ. పసితనం నుంచీ పాపం వాడికి తల్లిలేదు. ఈ మధ్య తండ్రి కూడా చనిపోయాడు.

తాతయ్య : అలాగైతే నాకతన్తో అవసరముందన్నమాటే.

మాధవదత్తు : ఇంతవున్నాడో లేదో వాడి శరీరంలో వొక్కపెట్టున వాతమూ పిత్తమూ శ్లేష్మమూ ప్రకోపించి పోయినై. ఇహ ఆట్టే ఆశలేదంటాడు వైద్యుడు. కాని, వొక్క అవకాశమ్మాత్రం వుంది - ఎలాగోవోలాగ యీ శరత్కాలపు గాలీ యెండా సోకకుండా యింట్లో కట్టిపెట్టి వుంచటం. నీకేమో పిల్లల్ని యిళ్లల్లోనుంచి బైటికి రప్పించటం యీ ముసలితనంలో అదో ఆశై పోయింది. అందుకూ నువ్వంటే భయం.

తాతయ్య : నువ్వు చెప్పిందేమీ అబద్ధంకాదు. శరత్కాలపు గాలీ యెండా మోస్తరుగా నేనూ భయంకలిగించే స్థితిలో పడ్డాను. కాని యింట్లో కట్టిపెట్టి వుంచే మోస్తరు ఆటలు కూడా నాకొన్ని తెలుసునయ్యా. కాస్త పనీపాటా చక్కబెట్టుకొని మళ్లీవొస్తా. తర్వాత పిల్లవాణ్ణి మచ్చిక చేసేసుకుంటాను.

(నిష్క్రమణ)

(అమలగుప్త ప్రవేశం)

అమలగుప్త : మామయ్యాగారూ.

మాధవదత్తు : ఏం అమలూ.

అమలగుప్త : నేనూ ఆ ముంగిట్లోకి వెళ్ళకూడదూ ?

మాధవదత్తు: పోరాదు నాయనా.

అమలగుప్త: అదుగో అక్కడ అత్తయ్యా తిరగలిలో పప్పు విసురుతున్నదీ - ఆపప్పు బద్దల నూకరొండు చేతుల్తోనూ తీసేసుకుని తోక ముడుచు క్కూర్చుని ఉడత కుస్ కుస్ మంటూ తింటున్నదీ - అక్కడికి నే వెళ్లకూడదూ ?

మాధవదత్తు: పోకూడదు నాయనా.

అమలగుప్త: నేనే గనక ఉడత నైతే యెంత బాగుండేది. అవునుగాని మామయ్యగారూ నన్నెందుకని పైకి వెళ్లనీయరూ ?

మాధవదత్తు: ఇల్లు దాటి వెళ్తే జబ్బుచేస్తుందంటాడు నాయనా వైద్యుడు ?

అమలగుప్త: వైద్యుడికా సంగతెలా తెలిసింది ?

మాధవదత్తు: బాగుంది నువ్వనేమాట. వైద్యుడికి తెలియదూ. ఆయన యెన్ని పుస్తకాలు చదివి పారేశాడు.

అమలగుప్త: పుస్తకాలు చదవగానే అన్నీ తెలుసుకోటానికి వీలౌతుందా ?

మాధవదత్తు: బాగుంది. ఆమాత్రం తెలియదూ నీకూ ?

అమలగుప్త: (నిట్టూర్చి) నేనే పుస్తకాలూ చదవలా. అందుకని నాకు తెలియదు.

మాధవదత్తు: చూడు - పెద్దపెద్ద పండితులున్నారే వాళ్లంతా నీ మోస్తరే. వాళ్లు యిల్లు విడిచి వెళ్లనేవెళ్లరు.

అమలగుప్త: వెళ్లరూ ?

మాధవదత్తు: ఎప్పుడు వెళుతారు చెప్పు. అదేపనిగా కూర్చుని వాళ్లు పుస్తకాలు చదువుతూంటారు. ఇంకోవైపుకి వాళ్ల దృష్టి పోనేపోదు. అమలబాబూ నువుకూడా పెద్దైం తర్వాత పండితుడివై పోదువుగాని, అదే పనిగా కూర్చుని యింతింత పెద్ద పుస్తకాలు చదువుదువుగాని. అందరూ చూసి ఆశ్చర్యపడిపోతారు.

అమలగుప్త: వొద్దువొద్దు. మామయ్యగారండీ మీ రెండుకాళ్లూ పట్టుకుంటాను. నేను పండితుణ్ణి మాత్రంకాను. మామయ్యా పండితుణ్ణి కావటం నాకొద్దు.

మాధవదత్తు: అమలూ యేమిటామాట. నేనేగనక పండితుణ్ణైవుంటే బతికిపోయుందును.

ఆమలగుప్త : లోకంలో యేమేముందో అదంతా చూస్తాను. కేవలం చూస్తూనే తిరుగుతాను.

మాధవదత్తు : ఒక్కమాట విను. ఏం చూస్తావ్ ? చూట్టానికి అంతమరీ యేముంది ?

అమలగుప్త : మన కిటికీదగ్గిర కూర్చుంటే కనిపిస్తుందే ఆ కొండ - దూరంగా - ఆ కొండదాటి పోవాలని నాకు మహా కోరిగ్గావుంది.

మాధవదత్తు : ఏమిటా మాట పిచ్చివాడిలాగ ? పనిలేదు పాటులేదు. ఉత్తపుణ్యానికి ఆ కొండ దాటి వెళిపోతావూ ? నువ్వనే మాట యేమీ బాగాలేదు. ఆ కొండ వున్నదే - ఓ పెద్ద అడ్డుగోడలాగ యెత్తుగా లేచివుండటాన్ని బట్టి యిది దాటి పోవటానికి వీల్లేదూ అని మనం గ్రహించాలి. కాకపోతే అంత పెద్దపెద్ద రాళ్ళను పోగుచేసి అంతా వో పెద్ద కుప్పగా చేయాల్సిన అవసర మేముంది ?

అమలగుప్త : మామయ్యగారూ, దాటిపోవద్దంటున్నదనా మీరంటున్నారు. ఆ సంగతి నాకు బాగా అర్థమైంది. భూదేవికి మాట్లాడ్డం చాత కాదు. అందుకని నీలాకాశంవేపు చేయెత్తి పిలుస్తుంది. చాలా చాలా దూరంలో యెవరెవరైతే యిళ్లల్లోకూర్చుని వుంటారో వాళ్లు మధ్యాహ్నంవేళ వొంటరిగా కిటికీదగ్గిర కూర్చుంటే వాళ్లకూ ఆ పిలుపు వినిపిస్తుంది. ఆ పిలుపు పండితులకు వినిపించదు.

మాధవదత్తు : వాళ్లు నీమాదిరి వెర్రివాళ్లుకాదు. వాళ్లకు వినాలనే వుండదు.

అమలగుప్త : నామోస్తరు వెర్రివాణ్ణి నిన్ననే వొకణ్ణి చూశాను.

మాధవదత్తు : నిజంగానా. ఎలాంటివాడో చెప్పు విందాం.

అమలగుప్త : అతని బుజాన నో వెదురు కర్ర. దాని చివరనో మూట కట్టివుంది. అతని యెడం చేతిలో వో ముంత. ఓ జత పాత కిర్రు చెప్పులు వేసుకుని, అదుగో ఆ పొలమ్మీదుగా ఆ కొండవేపు వెళుతు న్నాడు. అతన్ని పిలిచి 'ఎక్కడికోయ్ పోతున్నావ్' అని అడి గాను. 'ఏమో యెక్కడికో నాకేం తెలుసు' అన్నాడు. 'మరైతే ఎందుకని పోతున్నావ్' అన్నాను. పనేదైనా దొరుకుతుందేమో చూదామని పోతున్నానన్నాడు. సరేకాని మామయ్యగారూ పని కోసం అంతగా చూసుకోవాలా ?

మాధవదత్తు : తప్పనిసరిగా. ఎంతమంది పనికోసం దేవులాడుకుంటూ తిరగటంలా.

అమలగుప్త : అయితేసరే నేనూ వాళ్లలాగే పనికోసం వెతుక్కుంటూ తిరుగుతాను.

మాధవదత్తు : వెతికినా దొరక్కపోతేనో ?

అమలగుప్త : వెతికినా దొరక్కపోతే మళ్లీ వెతుక్కుంటాను. ఆ తర్వాతే మయిందంటే ఆ కిర్రు చెప్పులు వేసుకున్న మనిషి వెళ్లిపోయాడు. తలుపు దగ్గిర నిలబడి అతన్ని చూస్తూ వుండిపోయాను. అల్లదుగో ఆ మేడి చెట్టు కిందుగా కాలవ పారుతున్నదీ అక్కడ బుజమ్మీద నుంచి వెదురు కర్ర దించి కాలవ నీళ్లలో తీరిగ్గా కాళ్లు కడిగేసుకుని ఆ తర్వాత ఆ మూటవిప్పి పేలపిండి బయటికి తీసి అది నీళ్లతో మెదిపి తినటం మొదలుపెట్టాడు. తినటం అయిపోగానే మూట కట్టేసి బుజాన వేసుకున్నాడు. కాళ్లమీది బట్టపైకి లాక్కుని ఆ కాలవలోకి దిగి కాళ్లతో నీళ్లు కోసుకుంటూ కోసుకుంటూ దాటి యెలా వెళ్లిపోయాడో! అత్తయ్యతో చెప్పి వుంచాను. ఎప్పుడో వోనాడు ఆ కాలవ వొడ్డుకి వెళ్లి పేలపిండి తింటానూ అని.

మాధవదత్తు : అత్తయ్యేమంది ?

అమలగుప్త : అత్తయ్యేమందంటే "నీ వొళ్లు నయంకానీ ఆ తర్వాత కాలవ వొడ్డుకి నిన్ను తీసికెళ్లి నీ చేత పేలపిండి తినిపించి తీసుకొస్తాను" అన్నది. నా వొళ్లెప్పుడు నయమౌతుంది ?

మాధవదత్తు : ఎంతోకాలం పట్టదునాయనా.

అమలగుప్త : ఎంతోకాలం పట్టదూ ? నయం కాగానే నేనే వెళ్లిపోతాను.

మాధవదత్తు : ఎక్కడికి నాయనా వెళ్తావ్ ?

అమలగుప్త : వంకర టింకరగా పారుతుండే ఆ యేట్లో దిగుతూ దిగుతూ వొడ్డు చేరుకుంటూ చేరుకుంటూ వెళ్లిపోతాను మిట్ట మధ్యాహ్నం యింటి తలుపులన్నీ వేసుకుని అందరూ నిద్దరపోతూ వుంటారే అప్పుడు నే నెక్కడికో చాలా దూరానికి పనికోసం వెతుక్కుంటూ తిరుగుతూ తిరుగుతూ వెళ్లిపోతాను.

మాధవదత్తు : సరేగానీ ముందు వొళ్లు నయంచేసుకో, తర్వాత——

**అమలగుప్త** : ఆ తర్వాత నన్ను పండితుణ్ణి కమ్మని మటుకు **అనబోకండి** మామయ్యగారూ.

**మాధవదత్తు** : సరే, నువ్వు యేమవుదామనుకుంటున్నావ్ ?

**అమలగుప్త** : ఇప్పటికిప్పుడు నాకేమీ మనసుకి తట్టటంలా. **ఆలోచించి** చెబుతాను.

**మాధవదత్తు** : అవునుగానీ అలాగ యెవరో దారిని పోయే పొరుగూరి వాళ్లని పిలిచి పిలిచి మాట్లాడటం మాత్రం మానేయాలి నాయనా.

**అమలగుప్త** : పొరుగూరి వాళ్లంటే నాకెంతో యిష్టం.

**మాధవదత్తు** : నిన్ను పట్టుకు తీసుకెళ్తే ?

**అమలగుప్త** : అలాగైతే యికనేం. అనుకోటమేగాని నన్నెవ్వరూ పట్టుకు తీసుకెళ్లరు. అందరూ నన్ను కూర్చునేవుండమంటారు.

**మాధవదత్తు** : నాకాస్త పనుంది. పోయొస్తాను. నువ్వు మాత్రం గుమ్మం దాటి పోకుసుమా.

**అమలగుప్త** : పోను. కాని, మామయ్యగారండీ, రోడ్డు పక్క వున్న యీ గదిలో కూర్చుని వుంటాను.

*

# 2

పెరుగు మనిషి : పెరుగో పెరుగు - తాజా పెరుగు.

అమలగుప్త : పెరుగూ, ఓ పెరుగూ.

పెరుగు మనిషి : పిలుస్తా వెందుకు? కొంటావా పెరుగు?

అమలగుప్త : ఎలాకొ్కనేది? నా దగ్గర డబ్బుల్లేవే.

పెరుగు మనిషి : ఏం కుర్రాడి వయ్యా! నాకు పొద్దైపోటానికా?

అమలగుప్త : నీతో రాగలిగితే నీతో కలిసి వొచ్చేసే వుందును.

పెరుగు మనిషి : నాతోనా?

అమలగుప్త : ఆఁ. నువ్వెంతో దూరంనుంచి కేక వేస్తూ వేస్తూ నడిచి పోతూంటే అది విని నాకెలాగుంటుందో—

పెరుగు మనిషి : (పెరుగు కావిడి దించి) నాయనా, నువ్విక్కడ కూర్చునేం జేస్తుంటావ్?

అమలగుప్త : వైద్యుడు నన్ను బైటికి పోగూడదన్నాడు. అందుకోసం పొద్దస్తమానం యిక్కడే కూర్చునివుంటాను.

పెరుగు మనిషి : అలాగా, ఏమైందమ్మా నీకు?

అమలగుప్త : నాకు తెలియదు. నేనేమీ చదువుకోలేదు. అందుకోసం నాకేమైందో నాకు తెలియదు. పెరుగుమనిషీ, నువ్వెక్కడి నుంచొస్తున్నావ్?

పెరుగు మనిషి : మా వూరినుంచొస్తున్నాను.

అమలగుప్త : మీ వూరా? చా ... లా దూరం కదూ మీ వూరు?

పెరుగు మనిషి : మా వూరున్నదే అదుగో ఆ పాంచ్‌మోడా కొండ పక్కన శ్యామలీ నది వొడ్డున వుంది.

అమలగుప్త : పాంచ్‌మోడా కొండ, శ్యామలీ నదీ - మీ వూరు చూసినట్టే వుంది. ఎప్పుడు చూశానో గుర్తు రావటం లా.

పెరుగు మనిషి : ఆ కొండ పక్కకి వొకనాడెప్పుడైనా వెళ్లావా యేమిటి?

అమలగుప్త : లా. ఎన్నడూ వెళ్లలా. కానీ యెందుకో చూశాననే అనిపిస్తుంది. ఎంతో కాలంనుంచీ వుంటున్న మరీ పెద్ద చెట్లదగ్గిర కదూ మీ వూరు! దాని పక్కనే పోయే యెర్రని రోడ్డుంది కదూ ?

పెరుగు మనిషి : సరిగ్గా వున్నదున్నట్టుగానే చెప్పావు నాయనా.

అమలగుప్త : ఆ కొండ చరియల్లో ఆవులన్నీ మేస్తూ తిరుగుతూ వుంటాయి కదూ ?

పెరుగు మనిషి : ఏం ఆశ్చర్యం! ఉన్నదున్నట్టుగా చెబుతున్నావు. మా వూళ్లో ఆవులు మేయకేం, అదే పనిగా మేస్తూ వుంటాయి.

అమలగుప్త : ఆడవాళ్లందరూ నదిలో నీళ్లు నింపుకుని బిందెలు నెత్తిన పెట్టుకుని పోతూవుంటారు కదూ ? వాళ్ల చీరలు కూడా యెర్రగా వుంటాయి.

పెరుగు మనిషి : భేష్ భేష్ సరిగ్గా అన్నావు. మా గొల్ల పేటలో ఆడ వాళ్లందరూ యేటిదగ్గరనుంచే నీళ్లు తెచ్చుకుంటారు. కాని వాళ్లందరూ యెర్ర చీరలే కట్టుకోరు. దానికేంగాని నాయనా, నువ్వు తప్పకుండా యెప్పుడో వోనాడు అక్కడికి షికారు వెళ్ళి వుంటావు.

అమలగుప్త : నిజంగా పెరుగుమనిషీ నే నెన్నడూ ఆ వైపు వెళ్లలేదు. ఎప్పుడైతే మా వైద్యుడు నన్ను బైటికి పోవచ్చునని చెబుతాడో అప్పుడొచ్చి నన్ను మీ వూరుకి తీసుకువెళ్తావ్ ?

పెరుగు మనిషి : తీసుకెళ్లకేం, తప్పకుండా తీసుకువెళ్తాను.

అమలగుప్త : నీకు మల్లే అదే విధంగా పెరుగు అమ్మటం నాకు నేర్పవూ ? అలాంటి కావిడి బుజమ్మీద వేసుకుని అలాంటిదే చాలాదూరం పోయే రోడ్డు మీదుగా——

పెరుగు మనిషి : చంపేశావ్. పెరుగు అమ్మటాని కెందుకు పోతావు నాయనా ? ఇంతింత పుస్తకాలు చదివి పండితుడివై పోదుగాని.

అమలగుప్త : ఉఁ హు. ఉఁ హు. ఎప్పటికీ నేను పండితుణ్ణి కాను. రంగు రంగుగా మీ రోడ్డు పక్కన ఆ పెద్ద ముసలి మర్రిచెట్టు దగ్గిరవున్న గొల్ల పేటనుంచి పెరుగు తీసుకొచ్చి దూర దూరంగా వున్న పల్లె పల్లెకూ పోయి పెరుగు అమ్ముకుంటూ అమ్ముకుంటూ తిరుగుతాను.

పెరుగో పెరుగు, తాజా పెరుగు అని అదోరకంగా కేకవేస్తావే, ఆ స్వరం నాకు నేర్పు.

పెరుగు మనిషి : ఎంత మాటన్నావు బాబూ. ఆ స్వరం నేర్చుకోవటం కూడానా ?

అమలగుప్త : అదికాదు. ఆ స్వరం వింటూంటే నాకు భలే బాగుంటుంది. ఆకాశం చిట్ట చివరినుంచి పిలిచే పక్షి పిలుపు వినిపిస్తే మనస్సు యెలా కళవళిస్తుందో అలాగ ఆ రోడ్డు మలుపునుంచీ వరసగా వున్న ఆ చెట్లలోనుంచి నీ కేక వినబడగానే నా కనిపిస్తుంది—ఏమనిపిస్తుందో నేనేం చెప్పగలను ?

పెరుగు మనిషి : ఈ పిడతలో కాస్త పెరుగు తాగు నాయనా.

అమలగుప్త : మరి నా దగ్గర డబ్బులు లేవుగా ?

పెరుగు మనిషి : ఎబ్బెబ్బె, ఎబ్బెబ్బె - డబ్బుమాటే యెత్తొద్దు. నా పెరుగు కాస్త నువ్వు తాగితే నా కెంతో సంతోషంగా వుంటుంది.

అమలగుప్త : నీకు చాలా ఆలస్యం అయిపోయింది కదూ ?

పెరుగు మనిషి : ఏమీ కాలేదు నాయనా. నాకే నష్టమూలేదు. పెరుగు అమ్మటంలో యెంత సుఖముందో నీ దగ్గర నేర్చేసుకున్నాను.

అమలగుప్త : (రాగ వరుసతో) "పెరుగో పెరుగు, తాజా పెరుగు". అదుగో, ఆ పాంచ్‌మోడా కొండల దగ్గిర శ్యామలీ నది పక్కన గొల్ల యిళ్ల పెరుగు. వేకువజామునే చెట్లకింద నిలిచిన ఆవుల పాలు పితికి సాయంకాలం ఆడవాళ్లు తోడువేసిన ఆ పెరుగు. పెరుగో, పెరుగు, తాజా పెరుగు.

ఇదుగో, యీ రోడ్డుమీద తలారి పచారుచేస్తూ తిరుగుతున్నాడు. తలారీ, తలారీ ! ఒక్కమాట వినిపోవూ ?

(తలారి ప్రవేశం)

తలారి : అదేమిటిలా వొకటే పిలుస్తున్నావు. నేనంటే భయంలేదు నీకు ?

అమలగుప్త : నువ్వంటే యెందుకు భయపడాలి ?

తలారి : నిన్ను పట్టుకుని తీసుకుపోతాననుకో !

అమలగుప్త : ఎక్కడికి తీసుకుపోతావ్ ? చాలా దూరానికా ? ఆ కొండ అవతలికా ?

తలారి : ఏకాయెకీ నిన్ను రాజుగారి దగ్గిరికి తీసుకువెళ్తాననుకో.

అమలగుప్త : రాజుదగ్గిరికా? తీసుకువెళ్ళూ నన్ను. మరైతే, వైద్యుడు బైటికి పోరాదన్నాడు. నన్నెవ్వరూ పట్టుకుని బైటికి తీసుకు వెళ్ల లేరు. నేను పొద్దస్తమానం యిక్కడ కూర్చుని తీరాల్సిందే.

తలారి : పోరాదన్నాడూ వైద్యుడు? ఆ హాఁ, అనే వుంటాడు. నీ మొహం చూడు యెలా పాలిపోయిందో. నీ కళ్లచుట్టూ యెలా నలు పెక్కిందో. రెండు చేతులమీదా నరాలు పైకి కనిపిస్తున్నాయి.

అమలగుప్త : నువ్వు గంట కొడతావు కదూ?

తలారి : ఇప్పుడింకా వేళ కాలేదు.

అమలగుప్త : కొందరు వేళ యెప్పుడూ సాగిపోతూనే వుంటుందంటారు. కొందరు యింకా వేళకాలే దంటారు. మరి నువ్వు గంట కొట్టగానే వేళైపోతుందా?

తలారి : అదెలా అవుతుంది? వేళ కాగానే అప్పుడు గంట కొట్టేస్తారు.

అమలగుప్త : నీ గంట భలే భేషుగ్గా ఉంటుంది. వింటుంటే నాకెంతో బాగుంటుంది. మధ్యాహ్నం వేళ మాయింట్లో అందరూ భోంచేసి వెళ్ళిపోతారు. మామయ్య యెక్కడికో పనిమీద బైటికి వెళ్ళి పోతాడు. అత్తయ్య రామాయణం చదువుతూ చదువుతూ కునుకు తుంది. మా బుల్లి కుక్కపిల్ల మండువాలో వొక మూలగా నీడలో తోకదగ్గిర మూతి ఆనించుకుని నిద్దరపోతూ వుంటుంది. అప్పుడు నీ గంట మోగుతుంది గణగణమని. అవునుగానీ నీగంట యెందుకు మోగుతుంది?

తలారి : ఎందుకా? సమయమనేదీ యెప్పుడూ వొకచోట కూర్చుని వుండదు, యెప్పుడూ కదిలిపోతుందీ అని అందరికీ చెప్పటానికి.

అమలగుప్త : ఎక్కడికి వెళ్ళిపోతుంది? ఏ దేశానికి వెళ్ళిపోతుంది?

తలారి : ఆ సంగతెవ్వరికీ తెలియదు.

అమలగుప్త : ఆ దేశంనుంచి వొచ్చిన వాళ్ళెవరూ లేరనుకుంటాను. నాకు భలే కోరిగ్గా వుంది—యీ సమయంతోపాటు వెళ్ళిపోదామనీ యింతవరకెవ్వరూ యెరగని ఆ దూర దేశానికి.

తలారి : ఆ దేశానికి అందరం వెళ్ళాల్సిందే.

అమలగుప్త : నేనూ పోవాల్సిందే?

తలారి : తప్పకుండా.

అమలగుప్త : మరివైద్యుడు నన్ను పైకి పోరాదన్నాడుగా ?

తలారి : ఎప్పుడో వోనాడు బహుశా ఆ వైద్యుడే నిన్ను చేత్తో పట్టుకుని తీసుకు వెళ్తాడు.

అమలగుప్త : అలాక్కాదు. ఆయన్ని నువ్వెరగవు. కేవలం పట్టి యింట్లోనే వుంచేస్తాడు.

తలారి : ఆయన్ని మించిన వో మంచి వైద్యుడున్నాడే ఆయన వొచ్చి విడిపించుకు తీసుకువెళ్తాడు.

అమలగుప్త : ఆ మంచి వైద్యుడు నా దగ్గిర కెప్పుడు వొస్తాడు ? ఇంకా యిలా కూర్చోవటమేమీ నాకు బాగుండటంలా.

తలారి : అలాంటి మాటలు అనకూడదు నాయనా.

అమలగుప్త : అది కాదూ - నేను కూర్చునే వున్నాను. నన్ను యెక్కడ కూర్చోబెట్టి వుంచారో అక్కణ్ణుంచి నేను పైకిపోనే లేదు. కానీ, గణగణమని నీ గంట మోగుతుందే, ఆ గంట మోగగానే నా మనస్సు అదోలా వుంటుంది. అవునుగాని తలారీ——

తలారి : ఏం నాయనా ?

అమలగుప్త : అదుగో, ఆ రోడ్డు అవతల పక్కనా వో పెద్ద యింటి మీద జెండాయెత్తారూ——అక్కడా యెవరెవరో చాలామంది వొస్తూ పోతూ వుంటారూ——అక్కడా యేమైంది ?

తలారి : అక్కడ కొత్తగా పోస్టాఫీసు పెట్టారు.

అములగుప్త : పోస్టాఫీసా ? ఎవరి పోస్టాఫీసు ?

తలారి : మరి పోస్టాఫీసు ఎవరిదౌతుంది ? రాజుగారిదే. మొత్తానికి భలే పిల్లాడు.

అమలగుప్త : రాజుగారి దగ్గిరనుంచి వుత్తరాలన్నీ రాజుగారి పోస్టాఫీసు కొస్తాయా ?

తలారి : రాకేం ? చూడు. నీ పేర కూడా యెప్పుడో వోనాడు వుత్తరం వొస్తుంది.

అమలగుప్త : నా పేర కూడా వుత్తరం వొస్తుందా ? నేనింత చిన్నవాణ్ణి కదా !

తలారి : చిన్న పిల్లలికి రాజుగారు యింతింత చిన్న చిన్న వుత్తరాలు రాస్తారు.

అమలగుప్త : భలే బాగుంటుంది. నాకెప్పుడొస్తుంది వుత్తరం ? నాకాయన వుత్తరం రాస్తాడని నువ్వెలా తెలుసుకున్నావ్ ?

తలారి : అలా కాకపోతే ఆయన సరిగ్గా యీ తెరిచిన కిటికీ ముందరే అంతపెద్ద బంగారపురంగు బాపుటా యెత్తి పోస్టాఫీసు యెందుకు పెట్టి పోయినాడూ ? (కుర్రాడు భలే ముచ్చటగా వున్నాడు)

అమలగుప్త : సరే, రాజుగారి దగ్గిరనుంచి నాకు వుత్తరమొస్తే నాకెవరు తెచ్చి పెడతారు ?

తలారి : రాజుగారికి యెంతోమంది వున్నారు పోస్టు బంట్రోతులు చూడలా ? బంగారంలాంటి బిళ్ళలు పెట్టుకు తిరుగుతూ పోతూంటారు.

అమలగుప్త : సరేగాని వాళ్ళెక్కడ తిరుగుతూంటారు ?

తలారి : ఇంటింటా, ఊరూరా—ఈ ప్రశ్న వింటూంటే నవ్వొస్తున్నది.

అమలగుప్త : నేను పెద్ద వాణ్ణయిం తర్వాత పోస్టు బంట్రోతు నవుతాను.

తలారి : హ్హా హ్హా ... పోస్టు బంట్రోతు ! ఏం మహా గొప్ప ఉద్యోగం ? ఓ యెండ లేదు, వో వాన లేదు, లేనివాడంటూ లేదు, వున్న వాడంటూ లేదు - అందరికీ వుత్తరాలు పంచిపెడుతూ తిరగటం - బ్రహ్మాండమైన వుద్యోగం.

అమలగుప్త : నవ్వుతావేం ? అన్నింటికన్నా ఆ వుద్యోగమే నాకు నచ్చింది. మరి నువ్వు చేసే పని కూడా మంచిదే. భగ్గున మండి పోయే మధ్యాహ్నం వేళ ఠంగ్ ఠంగ్మంటూ నీ గంట మోగు తుంది. ఒక్కొక్క రోజున అకస్మాత్తుగా రాత్రి పక్క మీద లేచి కూర్చుని చూస్తూంటాను. అప్పుడు యింట్లో దీపం కూడా ఆరి పోయి వుంటుంది. అప్పుడు యేదో చీకట్లోంచి లోపలికి ఠంగ్ ఠంగ్ మంటూ గంట వినిపిస్తుంది.

తలారి : అదిగదుగో, పెత్తందారొస్తున్నాడు. నేనిహ తప్పించుకుంటాను. నీతో కబుర్లు చెప్పటం వాడు చూశాడంటే నేను చిక్కుల్లో పడక తప్పదు.

అమలగుప్త : ఏడీ అ పెత్తందారు ? ఎక్కడా ?

తలారి : అదిగదుగో - చాలా దూరంలో - నెత్తిమీద వో పెద్ద తాటాకు గొడుగు.

అమలగుప్త : అంటే రాజుగారు అతణ్ని పెత్తందారుగా వేశాడన్న మాట.

తలారి : లేదోయ్ బాబూ, తనకి తనే పెత్తందారయ్యాడు. తనంటే లెక్క చెయ్యని వాళ్ళని రాత్రింబవళ్లు హడలెత్తి పోయేటంత యేడిపించుకు తింటాడు. అందరితోనూ వైరం తెచ్చుకుని తన పని సాగించుకుంటాడు. ఇవాళ్టికి వెళ్ళిపోతాను. కాస్త పనీ పాటూ చూసుకోవాలి. మళ్ళీ రేప్పొద్దున్నే వొచ్చి పట్నంలో భోగట్టా అంతా వినిపించిపోనాను.

(నిష్క్రమణ)

అమలగుప్త : రాజుగారి దగ్గిరనుంచి రోజూ వొక వుత్తరం వచ్చిందంటే భలే బాగుంటుంది. ఈ కిటికీ దగ్గిర తిన్నగా కూర్చుని చదువు కుంటాను.

మరి నేను చదువుకో లేనే! ఎవరు చదివి పెడతారు? అత్తయ్యేమో రామాయణం చదువుతుంది. అత్తయ్యకి రాజుగారి ఉత్తరం చదవటం చాతనవుతుందా? ఎవ్వరికీ చదవటం చాతకాకపోతే దాన్ని జాగర్త పెట్టి వుంచి పెద్దైం తర్వాత చదువుతాను. కానీ, పోస్టు బంట్రోతులు నన్ను గుర్తుపట్టకపోతే?

పెత్తందారుగారూ! ఓ పెత్తందారుగారూ! ఒక్క మాట విని పోరూ!

పెత్తందారు : ఎవడ్రా అదీ! అదే పనిగా నన్ను రోడ్డు మధ్య పిలుస్తు న్నాడే! ఎవరింటి కోతిరా వాడు?

అమలగుప్త : నువ్వు పెత్తందారువి. నువ్వంటే అందరికీ భయమూ భక్తీ.

పెత్తందారు : (ఉబ్బిపోయి) అవునవును. లేకేం? భయమూ వుంది. భక్తీ వుంది.

అమలగుప్త : రాజుగారి పోస్టు బంట్రోతులు నీ మాట వింటారూ?

పెత్తందారు : వినకపోతే వాడు బతికినట్టే! ఇంతకూ నువ్వనేదేమిటి?

అమలగుప్త : పోస్టు బంట్రోతుకి నువ్వు చెప్పాలి - నా పేరు 'అమలు' అనీ, నేనీ కిటికీ దగ్గిర కూర్చుంటాననీ.

పెత్తందారు : ఎందుకో చెప్పు చూద్దాం?

అమలగుప్త : నా పేర వుత్తరమే కనక వొస్తే——

పెత్తందారు: నీ పేర వుత్తరమా? ఎవరయ్యా నీకుత్తరం రాసేది?

అమలగుప్త: ఒక వేళ రాజుగారుత్తరం రాస్తే అప్పుడు—

పెత్తందారు: హ్హా హ్హా హ్హా - ఈ కుర్రాడు సామాన్యుడు కాడు. హ్హా హ్హా హ్హా రాజుగారు నీ కుత్తరం రాస్తాడూ? రాయకేం జేస్తాడు? నువ్వతని దగ్గిర చుట్టాని వాయెను. ఇన్నాళ్లనుంచీ నిన్ను చూడలేదనీ రాజుగారు పాపం శుష్కించిపోతున్నాడు. నాకు కబురొచ్చింది కూడాను. ఇహ యేమీ ఆలస్యం వుండదు. ఉత్తరం వుందే, అది యివ్వాళ, తప్పితే రేపు వొచ్చి తీరుతుంది.

అమలగుప్త: పెత్తందారూ! నువ్వలాగంటున్నావేం? నామీదేమైనా కోపం వొచ్చిందా?

పెత్తందారు: బాగుందోయ్. నీ మీద నాకోపమా? అంత సాహసమే? రాజుగారికీ, నీకూ మధ్య వుత్తరాలు నడుస్తున్నాయి కదా. చూస్తున్నానుగా. ఈ మాధవదత్తున్నాడే, వీడు హద్దు మీరిపోతున్నాడు. నాలుగు డబ్బులు కూడబెట్టాడో లేదో ప్రస్తుతం ఆయనింట్లో రాజులూ, పాదుషాలూ వాళ్ళని మించి యింకో మాటే వినపడదు. కాస్తుండవోయ్. నీ పని పట్టేస్తాను.

ఒరే అబ్బాయి! తొందరగానే వస్తుంది రాజుగారి వుత్తరం మీ యింటికి. ఆ బందోబస్తంతా నేను చేస్తున్నాను.

అమలగుప్త: వొద్దు వొద్దు నువ్వేమీ చెయ్యక్కర్లా.

పెత్తందారు: ఎందుకు? నీ సంగతి రాజుగారికి తెలియజేస్తాను. అప్పుడాయన ఆలస్యం చేయటానికి వీలుండదు. నీ సంగతి కనుక్కొ రమ్మని వెంటనే మనిషిని పంపించేస్తాడు. ఏం చెడ్డ గర్వం యీ మాధవదత్తుకి—కాస్త రాజుగారి చెవిలో పడిందంటే అణుగుతుంది.

(నిష్క్రమణ)

అమలగుప్త: ఎవరు నువ్వు? కాళ్ల గజ్జెలు ఘల్లు ఘల్లు మంటూ నడుస్తున్నావ్? కాస్సేపు ఆగవూ?

బాలిక: ఆగటానికి నాకు వీల్లేదే! వేళ తప్పిపోతుంది.

అమలగుప్త: నీకేమో ఆగటాని కిష్టంలేదు. నాకేమో యిహ యిక్కడ కూర్చుని వుండటాని కిష్టంలేదు.

బాలిక : నిన్ను చూస్తే అదేమిటో నాకూ, తెల్లవారకట్ట కనిపిస్తుందే, ఆ వేగుచుక్క జ్ఞాపకం వొస్తుంది. అసలు నీ సంగతేమిటో చెప్పు.

అమలగుప్త : ఏమో నాకు తెలియదు. వైద్యుడు మాత్రం నన్ను బైటికి పోరాదన్నాడు.

బాలిక : ఓహో! అలాగైతే బైటికి పోకు సుమా. వైద్యుడు చెప్పినట్లే నడుచుకోవాలి. కొంటెతనం చేయరాదు. అలా అయితే, అందరూ చెడ్డవాడంటారు. వీధివైపు అదే పనిగా చూస్తూంటే మనసు చికాకు పడుతుంది. అందుకోసం యీ వాకిలి సగం మూసేసి వుంచుతాను.

అమలగుప్త : వొద్దు వొద్దు, మూసేయొద్దు. ఇక్కడ మిగతావన్నీ మూసేసే వున్నాయి. ఇదొక్కటి మాత్రం తెరిచివుంది. నువ్వెవరో చెబుదూ ! నే నెరగను కదా నిన్ను ?

బాలిక : నా పేరు సుధ.

అమలగుప్త : సుధా ?

సుధ : తెలియదూ ? పూలదండలు గుచ్చే మాలిని కూతుర్ని.

అమలగుప్త : నువ్వేం చేస్తావు ?

సుధ : సజ్జనిండా పూలుకోసి తీసుకొచ్చి దండలు గుచ్చుతాను. ఇదుగో యిప్పుడు పూలు కోసుకురావటానికే వెళ్తున్నాను.

అమలగుప్త : పూలు కోయటానికి వెళ్తున్నావా ? అందుకోసమే నీ రెండు కాళ్లూ హుషారుగా లేస్తున్నాయి. నడిచిన కొద్దీ ఘల్లు ఘల్లు మని అందెలు మోగుతున్నాయి. నీతోబాటు నేనుకూడా రాగలిగానంటే యెత్తుగావున్న కొమ్మమీద కనీ కనపడకుండా వుందే, అక్కడినుంచి నీకు పూలు కోసిచ్చేవాణ్ణి.

సుధ : అంతే మరీ, నాకంటే నీకే బాగా తెలుసును సుమా పూల సంగతి !

అమలగుప్త : తెలుసు. ఎంతో బాగా తెలుసు. నాకూ యేడుగురు అక్క చెల్లెళ్లూ - సంపెంగా సమాచారం తెలుసు. నే నేమనుకుంటున్నా నంటే - నన్నెవ్వరూ ఆపకుండా వుండాలిగాని వొత్తుగా వున్న అడవి లోపలికి నేను వెళ్లిపోగల్ను - పోయి సన్న సన్న చిటారు కొమ్మల కింకా పైన మనువా పక్షి వుయ్యాలూగుతుందీ, అక్కడ సంపెంగ నై పోయి పూయగల్ను. నువ్వు నాకు ' పారుల్ అక్క ' వౌతావా ?

సుధ : ఏం తెలివితేటలు ! 'పారుల్ అక్కనె' లా అవుతాను ? నేనేమో సుధని. పూలదండ లమ్మే శశి కూతుర్ని. నేను ప్రతి రోజూ యిన్నిన్ని దండలు గుచ్చాలి. నేను కూడా నీకు మల్లే యిక్కడ కూర్చుండి పోగలిగితే బాగుండును.

అమలగుప్త : అలా అయితే రోజల్లా యేం చేస్తూవుండేదానివి ?

సుధ : నా...బొమ్మ వుందీ...దానికి పెళ్లి చేస్తాను...దాన్ని తీసుకునీ... పోతా బాబూ - వేళ అయిపోతున్నదీ. ఆలస్యం చేస్తే పూలు దొరకనే దొరకవు.

అమలగుప్త : నాతో కలిసి కొంచెం కబుర్లు చెబుదూ నాకెంతో బాగుంటుంది.

సుధ : సరే అలాగే. నువ్వుమాత్రం కొంటెతనం చెయ్యకూ - బంగారు పాపలాగ యిక్కడే కదలకుండా కూర్చో. నేను పువ్వులు కోసుకుని తిరిగొచ్చే టప్పుడు నీతో కబుర్లాడి పోతాను.

అమలగుప్త : మరి నాకో పువ్విచ్చి పోతావా ?

సుధ : అలా పువ్విచ్చేయటం యెలాగ ? ఖరీదివ్వాలి మరి ?

అమలగుప్త : నేను పెద్దవాణ్ణి అయిపోగానే యిస్తాను. నేను వుద్యోగం కోసం వెతుక్కుంటూ అదుగో - ఆ కాలవ దాటి వెళ్లిపోతాను అప్పుడు నీకు సొమ్మిచ్చేస్తాను.

సుధ : సరే మంచిదే.

అమలగుప్త : అలాగైతే నువ్వు పూలుకోసుకుని వొస్తావా ?

సుధ : వొస్తా.

అమలగుప్త : వొస్తావూ ?

సుధ : ఆఁ, వొస్తా.

అమలగుప్త : నన్ను మరిచిపోవు కదూ. నా పేరు అమలు. నీకు జ్ఞాపకం వుంటుందా ?

సుధ : పోనమ్మా, మరిచిపోను - చూడు, జ్ఞాపకం వుంటుంది.

(నిష్క్రమణ)

(పిల్లల ప్రవేశం)

అమలగుప్త : మీరందరూ యెక్కడికోయ్ వెళ్తున్నారు ? ఇక్కడోసారి కాస్సేపుండి వెళ్లరూ ?

పిల్లలు : ఆడుకోటానికి వెళ్తున్నాం.

అమలగుప్త : ఏమి ఆటలాడుకుంటారు మీరు ?

పిల్లలు : పొలం దున్నటం - వ్యవసాయం చేయటం.

ఒకడు : (ఓ కర్రచూపించి) ఇదుగో మా నాగలి.

రెండోవాడు : మేమిద్దరమూ రెండెద్దుల మవుతాం.

అమలగుప్త : రోజల్లా ఆడుకుంటారా ?

పిల్లలు : ఓ, రోజు రోజల్లా.

అమలగుప్త : ఆ తర్వాత సంజె చీకట్లో యేటి వొడ్డునే నడిచి నడిచి యిల్లు చేరుకుంటారా ?

పిల్లలు : ఆఁ, సాయంకాలానికి తిరిగొస్తాం.

అమలగుప్త : తిరిగొచ్చేటప్పుడు మా యింటి ముందువైపుగా రండోయ్.

పిల్లలు : నువ్వు బైటికి వొచ్చేద్దూ - ఊఁ పద ఆడుకుందాం.

అమలగుప్త : నేను పైకి పోవాలంటే వల్లకాదన్నాడు వైద్యుడు.

పిల్లలు : వైద్యుడు చెప్పిందంతా వింటావా యేం నువ్వు ? - పదండి పోదాం, పొద్దైపోతున్నది.

అమలగుప్త : అదికాదు చూడండి. ఈ మాయింటి కిటికీ కెదురుగా నిలబడి కాస్సేపాడుకోండి. కాస్త చూస్తాను.

పిల్లలు : ఏం పెట్టి ఆడుకోమంటావిక్కడ ?

అమలగుప్త : ఇదిగో నా ఆటవస్తువులన్నీ పెట్టినచోటనే వుండిపోయినాయి. ఇవన్నీ తీసుకోండోయ్ మీరు. ఒక్కణ్ణీ యింట్లో కూర్చుని ఆడుకో బుద్ధికాదు. నేలమీద మట్టిలో యివన్నీ చెల్లాచెదరుగా పడేవుంటాయి - ఎందుకూ పనికిరావు.

పిల్లలు : బలే, బలే, బలే. ఎంచక్కా వున్నాయో. ఇదేమో వోడ - యిదీ జడల ముసలమ్మ - చూశారుటోయ్ యెంతందంగా వున్నాయో సిపాయి బొమ్మలు. ఇవన్నీ మాకిచ్చేశావు - నీకు కష్టంగా వుండదూ ?

అమలగుప్త : ఏబ్బే నాకేం కష్టంలేదు. అన్నీ మీకిచ్చేశాను.

పిల్లలు : మళ్ళీ నీ కివ్వనే యివ్వం.

అమలగుప్త : ఇవ్వాల్సిన పనే లేదు.

పిల్లలు : నిన్నెవరూ అల్లరి పెట్టరూ ?

అమలగుప్త : ఎవరూ యేమీ అనరు. అయితే, రోజూ ప్రొద్దున్నే మా వాకిలి ముందర కొంచెంసేపు యీ సామాన్లన్నిటితోనూ ఆడుకోవాలి. ఇవి పాతబడిపోగానే మళ్లీ కొత్త సామాన్లు తెప్పించిస్తాను.

పిల్లలు : సరేనోయ్. రోజూ యిక్కడ ఆడుకుని పోతాం. ఇదుగో చూడండి. అందరం సిపాయిలమైపోయి యుద్ధం ఆట ఆడుకుందాం. తుపాకీ లెక్కణ్నుంచొస్తాయి? అదుగో, ఓ పెద్ద రెల్లు కర్ర అక్కడ పడి వుంది చూడు - దాన్ని ముక్కలుగా విరిచేసి తుపాకీలు చేద్దాం - మరి నువ్వదేమిటి కునుకుతున్నావ్ ?

అమలగుప్త : ఆc, నాకు పెద్ద నిద్ర మూసుకొస్తున్నది. ఎందుకో తెలియదు గాని వుండుండి నిద్దరొస్తుంది. చాలా సేపట్నుంచీ కూర్చునివున్నాను. ఇహ కూర్చోలేకపోతున్నాను. వెన్ను నొప్పిపెడుతున్నది.

పిల్లలు : ఇంత పొద్దున్నే యేం నిద్ర బాబూ? అదో విను తలారి గంటలు కొడుతున్నాడు.

అమలగుప్త : ఔనౌను; అదుగో ఠంగ్ ఠంగ్‌మని గంటలు మోగుతున్నాయి. 'నిద్ర పో' అని నాకు బిగ్గరగా చెబుతున్నాయి.

పిల్లలు : అలా అయితే యిప్పుడు వెళ్ళిపోయి మళ్ళీ రేప్పొద్దున్నే వొస్తాం.

అమలగుప్త : వెళ్ళేముందు వొక్క మాట మిమ్మల్ని అడుగుతున్నాను. మీరందరూ బైటే తిరుగుతుంటారు గదా. రాజుగారి పోస్టాఫీసులో బంట్రోతుల్ని యెవ్వరినైనా యెరుగుదురా ?

పిల్లలు : ఎరక్కేం? బాగా యెరుగుదుం.

అమలగుప్త : ఎవరు వాళ్ళు ? పేరేమిటి ?

పిల్లలు : ఒకడిపేరు బాదల్. ఇంకోడు శరత్. ఇంకాయెంతమందోవున్నారు.

అమలగుప్త : సరేకానీ నాపేరయేదైనా వుత్తరం వొస్తే వాళ్ళు నన్నేమైనా పోల్చుకోగలుగుతారూ ?

పిల్లలు : పోల్చుకోలేకేం? ఉత్తరం మీద నీ పేరే గనక వుంటే నిన్ను సరిగ్గా పోల్చేసుకుంటారు.

అమలగుప్త : రేప్పొద్దున్న వొచ్చేటప్పుడు వాళ్ళలో వొకణ్ని పిల్చుకొచ్చి నాకు చూపించరూ ?

పిల్లలు : ఓ, అలాగే.

*

# 3

అమలగుప్త : మామయ్యా - ఇహ యివ్వాళ ఆ కిటికీ దగ్గిర కూర్చోడానికి పోరాదూ ? వైద్యుడు వొద్దన్నాడా ?

మాధవదత్తు : అవున్నాయనా. ప్రతి రోజూ అక్కడ కూర్చుండబట్టే నీ జబ్బు ముదిరిపోయింది.

అమలగుప్త : కాదు మామయ్యా. నా జబ్బు సంగతేమీ నాకు తెలియదు గాని, అక్కడ కూర్చుంటే మాత్రం నాకెంతో సుఖంగా వుంటుంది.

మాధవదత్తు : అక్కడ కూర్చుని కూర్చుని యీ పట్నంలో పెద్దా పిన్నా యెన్ని దేశాలవాళ్లున్నారో వాళ్ళందరితోనూ స్నేహం చేసేసుకున్నావు. మన వాకిలి ముందర ప్రతి రోజూ అదేమిటో వో పెద్ద తిరునాళ్ళయిపోతున్నది. ఇలా చేస్తుంటే యెప్పుడైనా వొళ్ళు కుదట పడుతుందా ? ఏదీ, యిలా చూడు. నీ ముఖం యెలా పాలిపోయిందో !

అమలగుప్త : నా కోసం వొస్తాడే ఆ ఫకీరు - కిటికీ దగ్గిర నన్ను చూడకపోతే తిరిగి వెళ్ళిపోతాడు.

మాధవదత్తు : ఉన్నవాళ్ళు కాక యీ ఫకీరు కూడా యెవడు ?

అమలగుప్త : రోజూ నా దగ్గిరకొచ్చి నానా దేశాల కథలూ చెప్పిపోతూంటాడు. వింటుంటే బలే బాగా వుంటుంది.

(ఫకీరు వేషంలో తాత ప్రవేశం)

అమలగుప్త : ఇడుగో ! ఇతనే ఫకీరు - ఇలా వొచ్చి నా పక్కమీద కూర్చో.

మాధవదత్తు : ఇదేమిటి - ఇతనూ -

తాతయ్య : (కంటితో సైగ చేసి) నేను ఫకీరుని.

మాధవదత్తు : నువ్వు యే మనిషివి కావో తేల్చుకో లేకుండా వున్నాను.

అమలగుప్త : ఈసారి యెక్కడికి వెళ్ళావు ఫకీరూ ?

తాతయ్య : నేను క్రౌంచద్వీపానికి వెళ్ళేను. అక్కణ్నుంచి యిదే వొస్తున్నాను.

అమలగుప్త : క్రౌంచద్వీపం నుంచే ?

తాతయ్య : దీని కాశ్చర్య పోవటమెందుకు ? నన్ను మీ బోటి వాళ్ళ కింద కట్టేశావ్ ! నాకు పోవటానికేమీ ఖర్చు లేదు. ఎక్కడికి బుద్ధిపుడితే అక్కడికి పోగల్ను.

అమలగుప్త : (చప్పట్లు చరుస్తూ) మా బలే తమాషా. నాకు వొళ్ళు నయంకాగానే నన్ను శిష్యుణ్నిగా చేసేసుకుంటానన్నావు జ్ఞాపకముందా ఫకీరూ ?

తాతయ్య : బాగా జ్ఞాపకముంది. లోకసంచారాని క్కావలసిన మంత్రా లన్నీ నేర్పేస్తాను. ఇహ సముద్రంలోగానీ, కొండల్లోగానీ అడవుల్లోగానీ యెక్కడా యే విధమైన అడ్డూ తగల్దు.

మాధవదత్తు : ఏమిటిదంతా, మీ యిద్దరి మధ్యా యీ పిచ్చి మాటలు ?

తాతయ్య : నాయనా, అమల్ ! సముద్రాలకీ, పర్వతాలకీ నేను భయ పడనుగానీ మీ మామయ్యా దగ్గిరికి వైద్యుడొచ్చి కలుసుకున్నా డంటే నా మంత్రాలు పనిచెయ్యవని వొప్పుకోవాల్సిందే.

అమలగుప్త : మామయ్యగారూ, వైద్యుడితో మీరేమీ అనకండి. నే నిప్పు డిక్కణ్ణే పడుకుని వుంటాను. ఏమీ చెయ్యను. కానీ, నా వొంట్లో నయమయిందనగానే ఆ రోజే ఫకీరు చెప్పిన మంత్రం వల్లిస్తూ వెళ్ళి పోతాను. నదులూ, కొండలూ, అడవులూ నన్నేమీ అడ్డుపెట్ట లేవు.

మాధవదత్తు : ఎబ్బెబ్బే! ఒకటే పనిగా పోతాను పోతాననకూడదు నాయనా. నా మనస్సంతా పాడైపోతుంది.

అమలగుప్త : ఆ క్రౌంచద్వీపం యెలాంటిదో నాకు చెప్పవూ ఫకీరూ ?

తాతయ్య : అది చాలా చిత్రవిచిత్రమైన ప్రదేశం. అది కేవలం పక్షుల రాజ్యం. అక్కడ మనుష్యులుండరు. అవి మాట్లాడలేవు - నడవలేవు, పాట పాడుతాయి. ఎగురుతాయి.

అమలగుప్త : ఏ మద్భుతం ! సముద్రం వొడ్డున కదూ ?

తాతయ్య : ఆఁ, మరేమిటి ? సముద్రం వొడ్డునే.

అమలగుప్త : కొండలన్నీ నీలిరంగువి కదూ.

తాతయ్య : వాటి గూళ్ళన్నీ ఆ నీలగిరుల్లోనే. సంధ్యా సమయంలో అస్తమిస్తున్న సూర్యుడి వెలుగు పడుతూవుంటే, ఆకు పచ్చని పక్షులు శ్రేణులు కట్టి తమతమ గూళ్ళకు తిరిగి వొస్తూవుంటాయి.

ఆకాశపురంగూ, పర్వతాలరంగూ, పక్షులరంగూ అన్నీ వొకటే వొక్క పోగైపోతాయి.

అమలగుప్త : కొండల మీద సెలయేళ్లున్నాయా ?

తాతయ్య : చాల్లేవోయ్. సెలయేళ్ళు లేకపోతే యెలాగౌతుంది? ఒక్క పెట్టున వజ్రాలు కరిగించి ధారగా పోతపోస్తున్నట్లే - ఆ సెల యేళ్ళు యేం నృత్యం చేస్తాయి! గులకరాళ్ళని గలగలమని మోగిస్తూ మోగిస్తూ కలకలలాడుతూ, చరచరమంటూ పోయి ఆ సెలయేళ్ళు సముద్రమధ్యంలో చెంగున దూకుతాయి. వాటిని వైద్యుడు కాదుకదా వాడి తాతైనాసరే వొక్క క్షణం యెక్కడా ఆపి వుంచలేడు. పక్షులన్నీ చేరి నన్నో పనికిమాలిన మనుష్యమాత్రుణ్ణిగా వెలివేశాయి గాని లేకపోతే ఆ సెలయేటి వొడ్డున వేలకు వేలుగా అవి కట్టుకున్న గూళ్ళ ప్రక్కనే నేనుకూడా వో గూడు కట్టుకుని సముద్ర తరంగాలను చూస్తూ రోజల్లా కాలక్షేపం చేస్తూ వుందును.

అమలగుప్త : నేను గనక పక్షిని కాగలిగితే...

తాతయ్య : అలాగైతే వో గట్టి చిక్కుంటుంది. 'పెద్దవాణ్ని అయిన తర్వాత పెరుగమ్ముతాన' ని, పెరుగు మనిషితో చెప్పివుం వని విన్నాను. పక్షుల రాజ్యంలో పెరుగు వ్యాపారం అంతగా లాభసాటి గాదు. దాంతో నీకు కొంత నష్టంకూడా రావచ్చునను కుంటాను.

మాధవదత్తు : ఇహ నాకేం బోధపడటంలా. మీరిద్దరూ కలిసి నన్ను వెర్రెక్కించేట్టు కనిపిస్తున్నారు. నే వెళుతున్నా.

అమలగుప్త : మామయ్యగారూ, నా పెరుగుమనిషి వొచ్చి వెళ్ళిపోయి నాడా ?

మాధవదత్తు : వెళ్ళిపోకేం, ఆ వేషధారి ఫకీరు మూట మోసుకుని క్రౌంచ ద్వీపంలో పక్షి గూళ్ళ దగ్గిర యెగురుతూ వుంటే వాడికి కడుపు నిండదు. నీ కోసం వాడు వో ముంత పెరుగు వుంచి పోయాడు. వాళ్ళ వూళ్ళో తన మేనకోడలి పెళ్ళిట. అందుకోసం 'తేలిమి పాడా' లో సన్నాయిమేళం కుదర్చటానికి వెళ్ళిపోవలసొచ్చినందుకు చాలా యిదైపోయినాడు.

అమలగుప్త : తన చిన్న మేనకోడల్నిచ్చి నాకు పెళ్ళి చేస్తానన్నాడు.
తాతయ్య : అట్లాగైతే పెద్ద చిక్కొచ్చేట్టే కనిపిస్తున్నది.
అమలగుప్త : నాతో చెప్పాడు - నాకు చక్కని చుక్కలాంటి పెళ్లాం అవుతుందిట. ముక్కున బులాకీ పెట్టుకుని, యెఱ్ఱచారల చీర కడుతుందిట - పొద్దున్నే లేచి తన సొంత చేతుల్తో నల్లావుపాలు పితికి కొత్త మట్టి ముంతతో గుమ్మపాలు నాచేత తాగిస్తుందిట. సందెచీకటి పడగానే దీపంపట్టుకొని గొడ్లసావిడంతా తిరిగొచ్చి నా పక్కను కూర్చుని యేడుగురు అక్కాచెల్లెళ్లూ - సంపెంగా కథ చెబుతుందిట.
తాతయ్య : బలే ముచ్చటైన పిల్లే. అన్నీ వొదులుకున్న ఫకీరుని నాకే కోరిక పుడుతున్నది. నే చెబుతున్నాగా నీకు - నీకేగనక అవసర మైతే వాళ్లింట్లో మేనగోడళ్ల కొరత మాత్రం వుండదు.
మాధవదత్తు : పో. పో. ఇహ భరించలేను.

(నిష్క్రమణ)

అమలగుప్త : ఫకీరూ, మామయ్య వెళ్లిపోయినాడు. ఈసారి నాతో మెల్లి మెల్లిగా చెప్పవూ? రాజుగారి వుత్తరం నాపేర పోస్టాఫీసులోకి వొచ్చిందా?
తాతయ్య : రాజుగారి వుత్తరం రవాణా అయి వొచ్చేస్తుందని విన్నాను. ఆ వుత్తరం యిప్పుడు దారిలోవుంది.
అమలగుప్త : దారిలోనా? ఏదారిలో? అదుగదుగో వాన వెలిసి ఆకాశ మంతా తేటగా అయిపోయినట్టు చాలా దూరంలో కనిపిస్తున్నదీ - అక్కడ వొత్తుగావున్న అడివి మధ్యగావొచ్చే దారిలోనా?
తాతయ్య : నీ కన్నీ తెలిసినట్టు కనబడుతుందే! సరిగ్గా ఆ దారిలోనే.
అమలగుప్త : నాకన్నీ తెలుసును ఫకీరూ.
తాతయ్య : అదే చూస్తున్నాను. ఎలా తెలుసుకున్నావా అని.
అమలగుప్త : అదేమో నాకు తెలియదు. నాకు కళ్లకట్టినట్లుగావుంది. ఎన్నాళ్ల కిందటనో - యెన్నోసార్లు చూశానేమో అనుకుంటాను. ఎన్నాళ్లయిందో మనస్సుకి తట్టటంలా - చెప్పనా? నాక్కనిపిస్తూనే వుంది. రాజుగారి పోస్టు బంట్రోతు కొండమీదినుంచి వొక్కడే దిగి వొస్తున్నాడు. ఎడంచేతిలో లాంతరూ బుజాన వుత్తరాల సంచీ -

ఎన్ని పగళ్లూ యెన్ని రాత్రిళ్లూ అలా దిగుకుంటూనే వొస్తున్నాడో - ఆ కొండకింది భాగం దగ్గిర ఆ యేరు పెద్దదై పోయేచోట వొంపు తిరిగిన ఆ యేటివెంబడే నడిచి వొస్తున్నాడు. ఏటి వొడ్డున జొన్న చేలు - ఆ చేలల్లో మొక్కల సందుల్లోనుంచి నడుచుకుంటూ వొస్తున్నాడు. ఆ తర్వాత చెరుకుతోట - ఆ చెరుకుతోట పక్కగా పెద్ద యెత్తైన పొలిమేర గట్టుంటుంది. ఆ గట్టుమీదుగా నడుచుకుంటూ వొస్తున్నాడు. రాత్రీ పగలూ వొంటరిగా నడుచుకుంటూ వొస్తున్నాడు. పొలంలో రెక్కల పురుగులు చప్పుడుచేస్తూ వుంటాయి. యేటివొడ్డున వొక్క మనిషైనా వుండడు. కేవలం వడ్రంగి పిట్ట తోకాడించుకుంటూ తిరుగుతుంది - అంతా నాక్కనిపిస్తుంది. అతను వొస్తూవుండటం చూస్తున్నకొద్దీ నా గుండె వుప్పొంగిపోతుంది.

తాతయ్య: నావి నీ కళ్లంత తాజాకళ్లు కాకపోయినా నీ చూపుతో కలిపి చూస్తూవుంటే నాకూ కనిపిస్తున్నది.

అమలగుప్త: ఆ పోస్టాఫీసు యజమాని అంటారే, ఆ రాజుగార్ని యెరుగుదువూ?

తాతయ్య: ఎరక్కేం? నేను రోజూ ఆయన దగ్గిర భిక్షం అడుక్కోటానికి పోతాను.

అమలగుప్త: అలాగైతే మరీ మంచిది. నాకు నయమైపోగానే నేను కూడా ఆయన దగ్గిర భిక్షం అడుక్కోటానికి పోతాను. పోలేనూ?

తాతయ్య: నీకు దేహి అని భిక్షమడగవలసిన అవసరమే లేదు నాయనా. నీ కిచ్చేదంతా ఆయన యిక్కడికే తెచ్చియిస్తాడు.

అమలగుప్త: అలాక్కాదు. ఆయన వాకిలి కెదురుగా దారిపక్కన నిలిచి రాజుగారికి జయం అంటూ భిక్షమడుగుతాను. కంజిరా వాయిస్తూ నృత్యం చేస్తాను. బలేబాగుంటుందికదూ!

తాతయ్య: ఓ. అద్భుతంగా వుంటుంది. నిన్ను వెంటబెట్టుకుని పోయినా నంటే నాక్కూడా కడుపునిండా భిక్ష దొరుకుతుంది. రాజుగారిని యేం కావాలని అడుగుతావ్!

అమలగుప్త: నన్ను మీ పోస్టు బంట్రోతుగా చేసెయ్యండి అని అంటాను. చేతిలో లాంతరు పట్టుకుని మీ వుత్తరాలన్నీ పంచేస్తూ తిరుగుతాను. నీకు తెలుసునో లేదో నా వొంట్లో నయమై లేచిం తర్వాత బిచ్చ

మడగటం యెలాగో నేర్పుతానన్నాడు వో అతను. అతనితో కలిసి యెక్కడెక్కడికో బిచ్చమడుక్కుంటూ తిరుగుతాను.

తాతయ్య : ఎవరబ్బా అతను ?

అమలగుప్త : ఛిదాం.

తాతయ్య : ఎవరా ఛిదాం ?

అమలగుప్త : అతను గుడ్డివాడూ, కుంటివాడూనూ. రోజూ నా కిటికీ దగ్గిరకు వొస్తూవుంటాడు. సరిగ్గా నాలాంటి వొకబ్బాయి అతన్ని చక్రాలబండీలో పెట్టి తోసుకుంటూ పోతూవుంటాడు. నేనతన్తో చెప్పాను. నాకు నయం కాగానే అతన్ని తిప్పుకుంటూ తిరుగుతానని.

తాతయ్య : అలా చేస్తే భేషుగ్గా ఉండేటట్టు కనిపిస్తుంది.

అమలగుప్త : అతనే నాతో చెప్పింది. యే విధంగా బిచ్చమడుక్కోవాలో నేర్పిస్తానని. అతనికి బిచ్చం వెయ్యమని మామయ్యతో చెబితే "అంతా నటన! వాడు గుడ్డీ కాదు కుంటీ కాదు" అంటాడు. వాడు గుడ్డి కావటం నిజం కాకపోవచ్చు. కాని, వాడికి కళ్ళు కనిపించవన్నమాటుందే - అది మాత్రం సత్యం.

తాతయ్య : సరిగ్గా చెప్పావోయ్ బాబూ! దాంట్లో వున్న సత్యం యేమిటంటే వాడు కళ్ళతో చూడలేడు. ఆ పైన వాణ్ని గుడ్డివాడంటే యేం? కాదంటే యేం ?

అయితే వాడికి బిచ్చమే దొరకదు కదా, నీ దగ్గిర కూర్చుని వుండిపోతే యేం చేద్దామని ?

అమలగుప్త : ఎక్కడేదుందో వాడికి నే వినిపిస్తూ వుంటా, పాపం చూడలేడుగా తనూ - నువ్వు నాకు చెప్పే దేశదేశాల కథలన్నీ అతనికి వినిపిస్తూంటాను. ఓ రోజున నాకు చెప్పావే, తేలిక దేశమంటూ - అక్క డేవస్తువుకూ అట్టే బరువుండదనీ వొక్క దూకు దూకితే కొండలు దాటి పోవచ్చుననీ ఆ తేలిక దేశాన్ని గురించి నే చెబితే విని యెంత పొంగిపోయినాడో.

అవునుగాని ఫకీరూ, ఆ దేశానికి యే దిక్కుగా పోవటానికి వీలవుతుంది ?

తాతయ్య : లోపలి దిక్కునుంచి వో దారి వుంది. దాన్నుందే, వెదికి కనుక్కోవటం కష్టం.

అమలగుప్త : పాపంవాడు గుడ్డివాడు. ఓ వేళ వున్నా చూడనే లేడు. కేవలం వాడు బిచ్చమెత్తుకుంటూనే తిరుగుతూండాలి. దానివల్ల అతనికి బాధగా వుంది. నేనేతనితో అన్నాను. "నువ్వు బిచ్చమెత్తు కోటానికి పోవటంవల్ల యేదో కొంత తిరగటానికి వీలుంది - ఎంతో మందికి ఆ వీలుకూడా లేదే -"

తాతయ్య : ఇంట్లో కూర్చుండమంటే యెందుకోసం నీ కీ బాధ ?

అమలగుప్త : ఊహూ౦, బాధలేదు. మొదట నన్నింట్లో కూర్చోబెట్టేసినప్పుడు రోజురోజల్లా యెలా గడుస్తుందిరా అనుకునే వాణ్ని. మన రాజు గారి పోస్టాఫీసు చూసినప్పట్నుంచీ యిప్పుడు రోజంతా బాగానే వుంటున్నది. ఈ యింటి మధ్య కూర్చుండటమంటే యెంతో బాగుంటున్నది. ఎప్పుడోవోనాడు వుత్తరం నాకందుతుందన్నమాట తలుచుకుంటుంటే నా కుత్సాహం వొచ్చి వుత్తినే వులక్కుండా, పలక్కుండా కూర్చోగలుగుతున్నా.

అయితే రాజుగారి వుత్తరంలో యేం రాసి వుంటుందో నాకు తెలియదు.

తాతయ్య : ఏం, తెలియకపోతే ? నీ పేరు పైనరాసి వుంటుందిగా, చాలు.

(మాధవదత్తు ప్రవేశం)

మాధవదత్తు : మీరిద్దరూకలిసి యేదో నెత్తిమీదికి తీసుకురాదల్చుకున్నట్లుంది.

తాతయ్య : ఏమయిందేమిటి ?

మాధవదత్తు : రాజుగారు మీపేర వుత్తరం రాయటంకోసమే పోస్టాఫీసు యిక్కడ పెట్టారని అందరితోనూ చెపుతున్నావా లేదా ? నే విన్నా నాసంగతి.

తాతయ్య : దానివల్ల యేమ్మునిగింది ?

మాధవదత్తు : మనపెత్తందారు పంచానన్ వున్నాడే, ఆయన రాజుగారికీ విషయం ఫిర్యాదు చేస్తూ ఆకాశరామన్న వుత్తరం రాశాడట.

తాతయ్య : అన్ని విషయాలూ రాజుగారి చెవిని బడతాయన్నమాట మాకు తెలియదాయేం ?

మాధవదత్తు : అయితే మరి కొంచెం జాగర్తగా యెందుకుండరూ ? రాజనీ పాదుషా అనీ యేదిపడితే అది నోటంట రావటం యెందుకు ? మీరిద్దరూ నన్నేదో ప్రమాదంలో పడేసేట్టేవున్నారు.

అమలగుప్త : ఫకీరూ! రాజుగారు కోప్పడతారా?

తాతయ్య : అలా అనగానే అయిపోయిందీ? కోప్పడతారూ! ఏ విధంగా కోప్పడతారో చూతాంగా. నాలాంటి ఫకీరుమీదా నీ వంటి కుర్రాడి మీదా కోపం తెచ్చుకుంటే ఆయన తన రాజరికం యెలా వెలిగిస్తాడో అదీ చూడాల్సిందే.

అమలగుప్త : చూడు ఫకీరూ - యివ్వాళ పొద్దుట్నుంచీ కళ్ల మీద వుండుండి చీకటి కమ్మినట్లై పోతున్నది. ఇదంతా స్వప్నమా అనిపిస్తున్నది. పూర్తిగా మాట్లాడ్డం మానేసి గుప్ చప్పుగా కూర్చుందామని పిస్తున్నది. మాట్లాడటానికి బుద్ధేవుట్టడంలా. ఏం, రాజుగారి వుత్తరం రాదూ? ఇప్పుడే యీ యిల్లూ యివన్నీ చీకట్లో కలిసి మాయమై పోతే వొకవేళ——

తాతయ్య : (అమలును విసురుతూ) వొస్తుంది. ఉత్తరం యివాళే వొస్తుంది.

(వైద్యుడు ప్రవేశం)

వైద్యుడు : ఎలావుందివ్వాళ?

అమలగుప్త : చాలా బాగున్నట్టే తోస్తున్నది. వేదన అంతా మాయమై నట్టే అనిపిస్తున్నది.

వైద్యుడు : (జనాంతికంగా మాధవదత్తుతో) ఆ నవ్వుందే అదేమంత మంచిదిగా కనిపించటంలా. ఇప్పుడన్నాడు చూడండీ బాగున్నట్టే తోస్తున్నదనీ - అదీ చెడులక్షణమే చక్రధరదత్తు అన్నట్లు.

మాధవదత్తు : మీకో నమస్కారం - అ చక్రధరదత్తు మాట అలావుంచి అసలు సంగతేమిటో చెప్పండి.

వైద్యుడు : పిల్లవాణ్ణి అదుపులో వుంచటం జరగలేదనే తోస్తున్నది.

మాధవదత్తు : అలాక్కాదు. వాడిమీదికి నాలుగు వైపులనుంచీ యేదీ రాకుండా అతి జాగ్రత్తగా మూసేశాను. వాణ్ణి బైటికి వెళ్లనీయ టమేలేదు. వాకిలి మొత్తంమీద మూసేవుంటున్నది.

వైద్యుడు : తలవని తలంపుగా యివ్వాళ యెంతగాలివొచ్చింది! నే చూసే వొస్తున్నా. మీ సింహద్వారంలోనుంచి లోపలికి హోరుమంటూ గాలి వీస్తున్నది. అదుందే, యెంత మాత్రమూ మంచిదికాదు. ఆ వాకిలి భద్రంగా తాళంవేసి బిగించేయండి. కాకపోతే రెండుమూడు రోజులు వొచ్చేపోయేవాళ్ల కాటంక మవుతుంది. అంతగా తప్పని

సరిగా యెవరైనా వొచ్చిపడితే దొడ్డి తలుపుండనేవుంది. అదుగో, ఆ కిటికీలోనుంచి సూర్యుడి సందెవెలుగు వొస్తున్నది. అదికూడా మూసెయ్యాలి - రోగి నెప్పుడూ అతి మెలకువగా వుంచుతాయి.

మాధవదత్తు: అమల్ కళ్లు మూసుకుని వున్నాయి - నిద్రపోతున్నాడను కుంటాను - వాడి మొహం చూస్తుంటే అనిపిస్తుంది - వాణ్ణి యింట్లో తెచ్చిపెట్టుకున్నాను. మక్కువంతా వాడిమీదనే. ఇప్పుడు వాణ్ణి యిహ నిలుపుకోలేననే అనుకుంటున్నాను.

వైద్యుడు: అదేమిటి? మీ యింటికి పెత్తం దారొస్తున్నాడు. ఏం వుపద్రవం! నే పోయొస్తాను బాబూ. మీరు వెళ్లి గట్టిగా తలుపులు వేసేసి వుంచండి. నే నింటికి వెళ్లగానే వో సన్న మాత్ర పంపిస్తాను. దాన్ని మింగించి చూడండి. వాణ్ణి నిలుపుకునే యోగమేవుంటే దాంతో నిలుపుకో గలుగుతారు.

(పెత్తందారు ప్రవేశం)

పెత్తందారు: కుర్రాడా! ఏం సంగతి?

తాతయ్య: (గబగబా లేచి నిలబడి) ఇదుగో. ఊరుకో. ఊరుకో.

అమలగుప్త: లేదు ఫకీరూ. నువ్వనుకున్నట్టు నేను నిద్ర పోవటంలా. అంతా వింటూనేవున్నా. అదేమిటో చాలా దూరంలో వున్నవాటిని కూడా వినగలుగుతున్నా. మా అమ్మానాన్నా వొచ్చి నా తలవైపున నిలబడి మాట్లాడుతున్నట్టుగా వుంది.

(మాధవదత్తు ప్రవేశం)

పెత్తందారు: ఏమోయ్ మాధవదత్తూ. నువ్వీ మధ్య చాలా గొప్ప గొప్ప వాళ్ళతో కలిసి తిరుగుతున్నావట.

మాధవదత్తు: ఏమంటున్నారు పెత్తందారుగారూ? నన్నేం వేళాకోళం చేయకండి. నేను చాలా సామాన్యమైనవాణ్ణి.

పెత్తందారు: మీ అబ్బాయున్నాడే, వీడు రాజుగారి దగ్గర్నుంచి వుత్తరం కోసం యెదురు చూస్తున్నాడు.

మాధవదత్తు: కుర్రవెధవ. వాడికి మతి లేదు. వాడి మాటకో లెక్కా?

పెత్తందారు: అలా అనకండి. ఇందులో ఆశ్చర్యమేముంది? రాజుగారికి మీ ఇంటికి మించి యింత యోగ్యమైన సంబంధం యెక్కడ దొరుకుతుంది? చూశావుగా. అందుకోసమే రాజుగారి పోస్టాఫీను

మీ కిటికీ కెదురుగా పెట్టారు. ఓ కుర్రాడా! నీ పేర రాజుగారి వుత్తరం వచ్చిందిలే.

అమలగుప్త : (కళవళపడి లేచి) నిజంగా ?

పెత్తాందారు : నిజం కాకపోతుందా ? నీకూ, రాజుగారికీ చుట్టరికమాయెను. (ఏమీ రాసిలేని తెల్లకాగితం ముక్క యిచ్చి) హహ్హాహాహా యిదే వారు పంపిన వుత్తరం.

అమలగుప్త : నాతో పరాచికమాడకండి. ఫకీరూ, ఫకీరూ, ఇది నిజంగా రాజుగారి వుత్తరమేనా చెప్పు.

తాతయ్య : అవున్నాయనా. ఫకీరుని నేన్నీకు చెబుతున్నాను. నిజంగా నిజంగా ఇది ఆయన వుత్తరమే.

అమలగుప్త : మరి దీంట్లో నాకేమీ కనిపించటం లేదు. నా కళ్ళకు యివ్వాళ అంతా తెల్లగానే వుంటున్నది. పెత్తందారుగారూ మీరు చెబుదురూ ఆ వుత్తరంలో యేం రాశుందో.

పెత్తందారు : రాజుగారేం రాస్తున్నారంటే " నేనివ్వాళా రేపటి లోపుగా మీ యింటికి వొస్తున్నాను నాకోసం మురముురాలూ, అటుకులూ నైవేద్యం తయారుచేసి వుంచు. ఇహ రాజభవనంలో వొక్క క్షణమైనా వుండాలని లేదు—" అని. హా హా హా హా.

మాధవదత్తు : (రెండు చేతులూ జోడించి) పెత్తదారుగారూ మీకో నమస్కారం. ఇవన్నీ పట్టించుకుని వేళాకోళం చేయకండి.

పెత్తదారు : వేళాకోళమే! ఎందుకోసమని వేళాకోళం? వేళాకోళం చేసేటంత సామర్థ్యం కూడానా అతనికి ?

మాధవదత్తు : ఏం తాతా నీక్కూడా మతి పోయిందా యేం ?

తాతయ్య : ఆహా. మతి పోబట్టే యీ తెల్లకాగితమ్మీద అక్షరాలు కనిపిస్తున్నాయి. తన రాజవైద్యుణ్ణి వెంటబెట్టుకుని అమల్ ని స్వయంగా చూడటానికి వొస్తున్నానని రాజుగారు రాస్తున్నారు.

అమలగుప్త : అదుగో ఫకీరూ, అదుగో. రాజుగారి వాద్యం వినిపించటంలా ?

పెత్తందారు : హా హా హా హా ఇంకా కొంచెం మతిపోతేనేగాని వినిపించదు.

అమలగుప్త : పెత్తదారుగారూ ! మీకు నామీద కోపం వొచ్చిందనీ, నేనంటే మీ కిష్టం లేదనీ, అనుకున్నాను. నిజంగా మీరు రాజుగారి వుత్తరం తెస్తారని అనుకోనే లేదు. ఏదీ మీ కాళ్ళొకసారి పట్టుకోనివ్వండి.

పెత్తందారు: భక్తి శ్రద్ధలు కలవాడే కుర్రాడు! కొంచెం మతి లేదన్న మాటేగాని హృదయం మంచిదే.

అమలగుప్త: ఇప్పటికి నాలుగు జాములైనట్టుంది. అదుగో గంట. ఠంగ్, ఠంగ్, ఠంగ్, ఠంగ్. ఠంగ్. ఠంగ్ - సందె నక్షత్రాలు వొచ్చాయా ఫకీరూ? ఎందుకో నాకేం కనిపించటంలా.

తాతయ్య: వాళ్లు కిటికీలన్నీ మూసేశారు. ఇదుగో నే తెరుస్తున్నాను.

(సింహద్వారాన్ని తోసిన చప్పుడు)

మాధవదత్తు: ఏమిటది? ఎవరది? ఏమిటీ వుపద్రవం?

బైటినుంచి: తలుపు తెరవండి.

మాధవదత్తు: ఎవరు మీరు?

బైటినుంచి: తెరవండి తలుపు.

మాధవదత్తు: పెత్తందారుగారూ - వీళ్లేం బందిపోటు దొంగలు కారుకదా!

పెత్తందారు: ఎవర్రా అది! పంచానన్ పెత్తందారంటే భయముందా లేదా?...చూడండి! ఒక్క దెబ్బలో చప్పుడు తగ్గిపోయింది. పంచానన్ గొంతు వినిపిస్తే చాలు. ఎంత పెద్ద బందిపోటు దొంగైనా సరే లొంగిపోవాల్సిందే.

మాధవదత్తు: (కిటికీలోనుంచి పైకి చూసి) బద్దలుకొట్టి పారేశారు అందుకనే చప్పుడు ఆగిపోయింది.

(రాజదూత ప్రవేశం)

రాజదూత: మహారాజు యీ రాత్రి వేంచేస్తున్నారు.

మాధవదత్తు: చచ్చాన్రా భగవంతుడా.

అమలగుప్త: రాత్రి యే వేళకు వొస్తారు?

రాజదూత: ఇవ్వాళ రెండు జాములవేళకు.

అమలగుప్త: నా స్నేహితుడు ప్రహారీ నగరద్వారంలో గంట కొడతాడు. ఠంగ్ ఠంగ్‌మనీ - అప్పుడా?

రాజదూత! ఆఁ, సరిగా అప్పుడే. తన చిన్ని స్నేహితుణ్ణి చూడటానికి అందరికన్నా గొప్పవాడైన వైద్యుణ్ణి పంపించారు.

(రాజవైద్యుడి ప్రవేశం)

రాజవైద్యుడు: ఇదేమిటీ, నలువైపులా అన్నీ మూసేశారు. తెరిచేయండి తెరిచేయండి - యెన్ని కిటికీలూ, తలుపులూ వున్నాయో అవన్నీ

తెరిచేయండి. (అమలు వొంటిమీద చేయివుంచి) ఎలా వుంది నాయనా ?

అమలగుప్త : చాలా బాగుందండీ. ఇహ నాకేవిధమైన జబ్బూ లేదు, బలే. అన్నీ తెరిచేశారు. నక్షత్రాలన్నీ కనిపిస్తున్నాయి. అంధకారానికి అవతల వున్న నక్షత్రాలన్నీ.

రాజవైద్యుడు : అర్ధరాత్రి రాజుగారొచ్చినప్పుడు పక్కమీదనుంచీ లేచి పోయి ఆయనతో కలిసి తిరగగలవూ ?

అమలగుప్త : ఓ తిరగ్గలను. తిరగ్గలిగానంటే బతికిపోయానన్నమాటే. అంతటా అంధకారంగా వున్న యీ ఆకాశంలో ధ్రువనక్షత్రాన్ని చూపించమని రాజుగార్ని అడుగుతాను. ఆ నక్షత్రాన్నిదివరకెన్నో సార్లు చూసినట్టే అనిపిస్తుంది గాని, తీరా వొచ్చేసరికి అదేదో తెలుసుకోలేక పోతున్నాను.

రాజవైద్యుడు : ఆయన అన్నీ తెలిసేట్టు చేస్తాడు. (మాధవదత్తుతో) రాజుగారి ఆగమనానికి యిల్లంతా పూలతో అలంకరించి సిద్ధంచేసివుంచాలి. (పెత్తందారుని చూపించి) ఆ మనిషి నిక్కడ వుండనీయరాదు.

అమలగుప్త : ఆయన నా స్నేహితుడండీ. మీరు వొచ్చేముందే నాకు రాజుగారి వుత్తరం తెచ్చి యిచ్చాడు.

రాజవైద్యుడు : సరే నాయనా. నీకు స్నేహితుడే గనక అయితే యీ యింట్లోనే వుండిపోతాడు.

మాధవదత్తు : (అమలు చెవిలో రహస్యంగా) రాజుగారికి నువ్వంటే యిష్టం. ఆయన స్వయంగా యివ్వాళ వొస్తున్నారు గదా, యేదైనా మనకు సాయపడతారేమో అడిగి చూద్దూ. మన స్థితి అంత బాగాలేదు. నీకు తెలియనిదేముంది ?

అమలగుప్త : అదంతా సరిగ్గా యేర్పాటు చేసుకునే వుంచాను మామయ్యా. ఆ విషయాన్ని గురించి నువ్వేమీ విచారించవొద్దు.

మాధవదత్తు : యేమిటా యేర్పాటు బాబూ ?

అమలగుప్త : నన్ను తన పోస్టుబంట్రోతుగా చేసుకోమని కోరుకుంటాను. ఊరూరా, యింటింటా ఆయన వుత్తరాలు పంచిపెడుతూ వుంటాను.

మాధవదత్తు : (నెత్తిమీద మొత్తుకుంటూ) ఆరి భగవంతుడా.

అమలగుప్త : మామయ్యా ! రాజుగారు వొస్తున్నారు గదా ఆయనకోసం నైవేద్యం యేదైనా తయారుచేసి వుంచుతావా ?

రాజదూత : ఆయన చెప్పేవుంచారు. మీ యింట్లో యిక్కడ మురమురాలూ, అటుకులూ సిద్ధంగా వుంటాయని.

అమలగుప్త : మురమురాలూ, అటుకులూనా ! పెత్తందారుగారూ, మీరిది వరకే చెప్పేశారు. రాజుగారి సమాచారమంతా మీకు తెలుసు. మాకొక్క సంగతీ తెలియకపాయె.

పెత్తందారు : మా యింటికి మనిషిని పంపిస్తే రాజుగారికోసం మంచి మంచివేవైనా -

రాజవైద్యుడు : ఏమీ అక్కర్లేదు. ఈసారి మీరంతా కదలకుండా వుండండి. వొచ్చింది, వొచ్చింది, నిద్ర వొచ్చింది అమలుకి. నేను పిల్లవాడి తల వైపున కూర్చుంటాను. అతనికి నిద్ర వొస్తున్నది. దీపం ఆర్పేయండి. ఆకాశంలో నక్షత్రాలనుంచి వెలుతురు రానీయండి. అతనికి నిద్ర వొచ్చింది.

మాధవదత్తు : (తాతయ్యతో) తాతా, యేమిటలా చెక్కిన విగ్రహంలా చేతులు కట్టుకుని నిశ్శబ్దంగా నిలిచిపోయినావ్ ? నాకేదో భయం వేస్తున్నది. ఈ కనబడేదంతా మంచి లక్షణమా ? ఇల్లంతా చీకటి చేసేశారెందుకు ? నక్షత్రాల వెలుతురుతో యేమవుతుంది ?

తాతయ్య : ఓయీ ! విశ్వాసహీనుడా ! మాట్లాడకూరుకో.

(సుధ ప్రవేశం)

సుధ : అమలూ !

రాజవైద్యుడు : అతను నిద్రపోతున్నాడు.

సుధ : అతనికోసం పూలు తెచ్చాను. ఇవి అతని చేతి కియ్యటానికి వీల్లేదూ ?

రాజవైద్యుడు : ఇలా యివ్వు ఆ పూలు.

సుధ : అతను యెప్పుడు మేలుకుంటాడు ?

రాజవైద్యుడు : ఇప్పుడే రాజుగారు వచ్చి పిలవగానే.

సుధ : అప్పుడతనితో వోమాటు చెవిలో రహస్యంగా చెబుతారూ ?

రాజవైద్యుడు : ఏమని చెప్పను ?

సుధ : "సుధ నిన్ను మరిచిపోలేదు" అని చెప్పండి.



# ముక్తధార

(ఉత్తరకూట పర్వత ప్రదేశం. అక్కడివాళ్ళు వుత్తర భైరవ మందిరానికి వెళ్ళేదారి. దూరంగా ఆకాశంలో యెంతో యెత్తుగావున్న లోహ యంత్ర శిఖరం కనిపిస్తుంది. దాని కెదురుగా భైరమందిర గోపు రాగ్రమ్మీద త్రిశూలం కనిపిస్తుంది. దాని పక్కన మామిడితోటలో రణజిత్ మహారాజు శిబిరం. యివాళ అమావాస్య. భైరవుడికి మందిరంలో హారతిచ్చేరోజు. అక్కడికి మహారాజు కాలినడకతో వొచ్చి శిబిరంలో విశ్రాంతి తీసుకుంటున్నాడు. అతని ఆస్థానంలో యంత్ర రాజైన విభూతి అనేక సంవత్సరాలు పరిశ్రమించి నిర్మించిన లోహ యంత్రంతో ముక్తధారా రాజుల పాతానికి ఆనకట్టకట్టాడు. యీ అసాధారణ ప్రజ్ఞను సమ్మానించే వుద్దేశ్యంతో వుత్తరకూట ప్రజలందరూ భైరవ మందిర ప్రాంగణంలో వుత్సవం చేసుకుంటున్నారు. భైరవ మంత్ర దీక్షితులైన పరివ్రాజకులు పగలంతా స్తోత్రగానం చేస్తూ తిరుగుతున్నారు. కొందరి చేతుల్లో కమ్మని పొగలు రేగే ధూమపాత్రికలు, కొందరి చేతుల్లో శంఖాలు, కొందరి చేతుల్లో గంటలు, పాటకు మధ్యమధ్య తాళంతో గంటలు మోగిస్తూవుంటారు.)

పాట

జయ భైరవ! జయ శంకర
జయ జయ జయ ప్రళయంకర!
శంకర! శంకర!
జయ సంశయ భేదన
జయ బంధన ఛేదన
జయ సంకట సంహర
శంకర శంకర!

పాడుకుంటూ, పాడుకుంటూ పరివ్రాజకులు నిష్క్రమిస్తారు.

(పూజా నైవేద్యంతో వొక విదేశ యాత్రికుడు ప్రవేశిస్తాడు. వుత్తరకూట పౌరుణ్ణిలా ప్రశ్నిస్తాడు.)

యాత్రికుడు: ఆకాశంలో ఆ యెత్తుగా కనిపించేదేమిటి? చూస్తే భయమేస్తున్నది.

పౌరుడు: తెలీదూ? మీదీ దేశంకాదల్లేవుంది. అదీ - వో యంత్రం.

యాత్రి: దేనికోసమా యంత్రం?

పౌరు: మా యంత్రరాజు విభూతి పాతిక సంవత్సరాలనుంచి పరిశ్రమించి తయారు చేసిన యంత్రం పూర్తయింది. అందుకోసం యివ్వాళ వుత్సవం చేసుకుంటున్నాం.

యాత్రి: ఆ యంత్రం చేసే పనేమిటి?

పౌరు: ముక్తధారా ప్రవాహాన్ని అరికట్టేస్తుంది.

యాత్రి: అమ్మయ్యో! అదో రాక్షసుడి తలలా కన్పిస్తున్నది. మాంసం లేని వుట్టి యెముకలగూడు. వుత్తరకూట నగరాన్ని కబళించేందుకు నోరు తెరుచుక్కూర్చుంది. అహోరాత్రాలూ దాన్ని చూస్తూవుంటే మీ ప్రాణాలు కుప్పింకించి కట్టె జారిపోతాయి.

పౌరు: మా ప్రాణాలు గట్టిగానే వున్నాయి. దాన్ని గురించి నువ్వేమీ ఆలోచించకు.

యాత్రి: అయితే కావొచ్చు. కానీ ఆ యంత్రాన్ని ఆ విధంగా సూర్య చంద్రాదులను అంటుకునేంత యెత్తుగా వుంచాల్సిన వస్తువు కాదు. దాన్ని కాస్త కప్పివుచ్చగలిగితే బాగుండేది. నీక్కనిపించటం లేదూ? రాత్రింబవలూ ఆకాశం అంతట్నీ రాచి రంపాన పెడుతున్నది.

పౌరు: యివాళ భైరవ మందిరంలో హారతి పడుతున్నారు. చూడటానికి పోవూ?

యాత్రి: చూద్దామనే బయల్దేరాను. ప్రతి సంవత్సరమూ యీ సమయానికే వొస్తాను. కానీ మందిరంకన్నా యెత్తుగావున్న యీలాంటి అవరోధాన్ని ఆకాశంలో యెన్నడూ చూళ్ళేదు. దాని వొంక చూసేప్పటికి హఠాత్తుగా వొళ్ళు కంపించి పోతున్నది. యీ యంత్రం మందిరాగ్రం కన్నా యెత్తుగా వుండటం యేదో దురహంకార సూచకంగా వుంది. పోయి నైవేద్యం సమర్పించొస్తాను. కాని నా మనస్సు మాత్రం ప్రసన్నంగాలేదు.

(నిష్క్రమిస్తాడు)
(వొక స్త్రీ ప్రవేశిస్తుంది. తలనుంచీ నేలదాకా జీరాడే తెల్లని
చీరె కట్టుకునుంటుంది ఆమె.)

స్త్రీ: సుమంతూ! నాయనా సుమంతూ! (పౌరుడితో) అయ్యా నా సుమంతు డింకా తిరిగిరాలేదు. మీరందరూ తిరి గొచ్చారు.

పౌరు: యెవరు నువ్వు?

స్త్రీ: మాది జనాయి పల్లి. నా పేరు అంబ. నా సుమంతుడున్నాడే వాడు నాకంటి వెలుగు, నా ప్రాణంలో ప్రాణం.

పౌరు: వాడేమైనాడమ్మా?

అంబ: యెవరో వాణ్ణి తీసుకుపోయారు. భైరవపూజ చేసుకోటానికి నే గుళ్ళోకి వెళ్ళాను. మళ్ళీ వొచ్చేసరికి వాణ్ణెవరో తీసుకు పోయారు.

పౌరు: అలా అయితే వాణ్ణి ముక్తధార ఆనకట్ట పనిలోకి తీసుకుపోయి వుంటారు.

అంబ: యీ దార్నే తీసుకుపోయారని నే విన్నాను. అదిగో ఆ గౌరి శిఖరానికి పడమటి దిక్కుగా. అంతదాకా నా చూపానటం లేదు. ఆపైన దారి కనిపించటం లేదు.

పౌరు: యేడిస్తే యేం లాభం? భైరవమందిరంలో హారతి చూట్టానికి నే వెళుతున్నాను. యివాళ మనకందరికీ పర్వదినం. నువు కూడా రా పోదాం.

అంబ: నే రాన్నాయనా. ఆ రోజున కూడా హారతి చూట్టానికే గుళ్ళో కెళ్ళాను. అప్పటినుంచీ పూజ చేయటానికి వెళ్ళటమంటేనే భయం వేస్తోంది. యిదిగో చూడు నాయనా నే చెబుతున్నాను, మన పూజలా భగవంతుడిదాకా పోవటమే లేదు. వాటిని దారిలోనే లాగేసుకుంటున్నారు.

పౌరు: ఎవరా లాగేసుకునేవాళ్లు?

అంబ: వాళ్ళే! నా సుమంతుణ్ణి నా దగ్గర్నుంచి లాక్కు పోయినవాళ్ళే. వాళ్ళెవరో మాత్ర మింతవరకూ తెలుసుకో లేకపోయాను. సుమంతూ! నాయనా సుమంతూ!

(యిద్దరూ నిష్క్రమిస్తారు)

(వుత్తరకూట యువరాజు అభిజిత్తు యంత్రరాజైన విభూతివద్దకు దూతను పంపించాడు. విభూతి మందిరంవైపు పోతూ వుండగా దూత అతనిని కలుసుకుంటాడు).

దూత : యంత్రరాజా విభూతీ! నేను యువరాజు పంపగా వొచ్చాను.

విభూతి : యేమిటీ వారి ఆదేశం ?

దూత : యిన్నాళ్ళనుంచీ మన ముక్తధార జలపాతాన్ని బంధించటానికి ప్రయత్నించారు మీరు. యెన్నిసార్లు ఆ కట్ట తెగిపోయిందో యెంతమంది మట్టిపాలైపోయినారో, యెంతమంది ప్రవాహంలో కొట్టుకుపోయినారో! చివరకీనాడు—

విభూతి : వాళ్ళ ప్రాణదాన మేమీ వ్యర్థం కాలేదు. నా ఆనకట్ట పరిసమాప్తమైంది.

దూత : శివతరాయిపల్లి గ్రామస్తులకు యీ వార్త యింకా తెలీదు. భగవంతుడు తమ కిచ్చిన జలాన్ని యెవడో మనుష్యమాత్రుడు కట్టివేయగలడన్న దాన్ని వాళ్ళింకా నమ్మలేకపోతున్నారు.

విభూతి : భగవంతుడు వాళ్ళకొక్క జలాన్నే యిచ్చాడు. నాకో, ఆ జలాన్ని బంధించే శక్తి యిచ్చాడు.

దూత : వాళ్ళు పాపం నిశ్చింతగా వున్నారు. పాపం వాళ్ళకింకా తెలియదు, వారం రోజుల్లో వాళ్ళ పంట పొలాలన్నీ—

విభూతి : పంటపొలాల మాటేమిటీ ?

దూత : మీరానకట్ట కట్టింది వాళ్ళ పొలాలు బీడు చేయటానిక్కాదూ ?

విభూతి : జడపదార్థాలైన జలపాషాణాల్ని భేదించి మానవమేధస్సు విజయం పొందాలనే నా వుద్దేశం. యెవడి పంటపొలం, యెవడి జొన్నచేను యెండిపోతుందో ఆలోచించటానికే నా కవకాశం లేకపోయింది.

దూత : యిప్పుడైనా ఆ అవకాశం రాలేదా అని యువరాజుగారడుగుతున్నారు.

విభూతి : లేదు. నేనిప్పటికీ యంత్రశక్తిమహిమను గురించే ఆలోచిస్తున్నాను.

దూత : ఆకలితో మాడేవారి కన్నీళ్ళైనా నీ ఆలోచన కాటంకం కలిగించటం లేదా ?

విభూతి : లేదు. నీళ్ళ వేగంతో నాకట్టు తెగిపోదు. కన్నీళ్ళ వొత్తిడికి నా యంత్రం చలించదు.

దూత : వాళ్ళ వుసురు తగుల్తుందనే భయమైనా లేదా మీకు ?

విభూతి : చూడు. వుత్తరకూటంలో కూలివాళ్లు కూడా దొరకని కాలంలో మహారాజుగారి ఆజ్ఞప్రకారం చండపట్నంలో వున్న ప్రతి యింటి నుంచీ పద్దెనిమిదేండ్లు దాటిన మొగపిల్లలందర్నీ లాక్కొచ్చేశాం. వాళ్ళలో చాలామంది ప్రాణాల్తో తిరిగి పోనేలేదు. వాళ్ళందరి తల్లుల వుసురు యెంత తగిల్నా చివరికి నా యంత్రమే జయించింది. దైవశక్తితోనే పోరాటం సాగించేవాడు యీ మనుష్య మాత్రుల శాపాన్ని లెక్కచేస్తాడా ?

దూత : యంత్రనిర్మాణం చేసి విఖ్యాతి నార్జించావు. దానివల్ల గౌరవం పొందావు. దాన్ని భగ్నం చేయటమనే మహా గౌరవాన్ని కూడా నువ్వు పొందుతే బాగుంటుందని యువరాజుగారంటున్నారు.

విభూతి : ఆ విఖ్యాతిని ఆర్జించటం పూర్తి కానంతవరకూ ఆ యంత్రం నాదే. యిప్పుడది ఉత్తరకూట ప్రజలందరిదీనీ. దాన్ని భగ్నం చేయటానికి నాకే అధికారమూ లేదు.

దూత : ఆ అధికారాన్ని తామే స్వయంగా తీసుకుంటామని యువరాజుగారన్నారు.

విభూతి : వుత్తరకూట మహారాజుగారేనా యీ మాటలన్నది ? ఆయన మనలోవారు కారూ ? శివతరాయివాసుల పక్షమా వారు ?

దూత : వుత్తరకూటాన్ని పరిపాలించేది కేవలం యంత్రమే కాదు. దేవతలు కూడాను. "యీ విషయాన్ని నిరూపించదలుచుకున్నాను," అని యువరాజుగారన్నారు.

విభూతి : నా యంత్రశక్తితో దేవతాపీఠాన్ని నేనే అధిరోహిస్తాను. యీ విషయాన్ని నిరూపించే భారం నాపైనే వుంది. దృఢంగా పాదుకుపోయిన యీ యంత్రశక్తిని సడలించే అవకాశ మేమాత్రమూ లేదని మీ యువరాజుగారితో పోయి చెప్పు.

దూత : ప్రళయకారకుడైన భగవంతుడెప్పుడూ రాజమార్గంలో నడిచి రాడు. ఆయన రాకకు వీలైన సందులూ, గొందులూ మన కళ్ళ కగుపించవు.

విభూతి : (వులికిపడి) సందులా ? గొందులా ? యిదేమిటి ? వాటి సంగతి నీకేం తెలుసు ?

దూత : నాకేం తెలుసు ? తెలుసుకోవాల్సిన అవసరం వున్నవారే తెలుసు కుంటారు.

(నిష్క్రమిస్తాడు)

(వుత్సవం కోసం పోయే వుత్తరకూట పౌరులు విభూతిని చూసినిలుస్తారు).

1 : యంత్రరాజా నువ్వు బలేవాడివయ్యా! తస్సగొయ్యా. మా అందర్నీ మించిపోయినావే! యింతవాడివౌతావని మేమనుకోనైనా లేదే ?

2 : యిప్పుడే కాదు, వాడు మొదట్నుంచీ యింతే. యెలా తప్పించుకు పైకి పోయినాడో యెవరికీ తెలీదు. వీడు మన చబువాగ్రామంలో వుండే విభూతిగాడేగా! జుట్టు కత్తిరించుకు తిరిగేవాడు. వీడూ మంతోపాటు కైలాస్ మాస్టారు దగ్గర లెంపకాయలు తినే వాడు. మనందర్నీ వొదిలేసి యెంతపని చేసి కూర్చున్నాడో చూడు.

3 : వొరే గబ్రూ, తట్ట చేత్తో పట్టుకుని యేమిటలా నోరు తెరుచుకుని చూస్తూ నిలుచున్నావ్ ? యెన్నడూ కళ్ళతో చూడలేదా యేమిటి యీ విభూతిని ? ఆ పూలదండలు బైటికి తియ్, వేసేద్దాం.

విభూతి : వుండండి, వుండండి, యిహ చాలు——

3 : చాలేమిటి ? నువ్వేమో హఠాత్తుగా పెద్దవాడివై పోతివి. అలాగే నీ మెడ కూడ వొంటె మెడంత పొడుగైపోతే, యీ వుత్తర కూటంలో వున్నవాళ్ళందరూ కలిసి దండలతో దాన్నంతట్నీ కప్పేసి సంతోషించేవారు.

2 : డోలు వాయించే హరిగాడింకా రానేలేదురా తమ్ముడూ !

1 : వాడుత్త సోమరిపోతురా, వాడి వీపు మీద డోలు వాయించాలిరా.

3 : అదయ్యే పనికాదు. డోలు వాయించటమే వొస్తే మన చేతికన్నా వాడి చెయ్యే గట్టి.

4 : బిసాయి సామంతుణ్ణడిగి రథం తీసుకొద్దామనుకున్నాను——మన విభూతిని రథంలో వూరేగించటానికి. కానీ, యివాళ మహారాజే మందిరానికి నడిచిపోతున్నాడాయెను.

5 : మంచిపనే అయింది. సామంతుడి రథం దశయేమిటో తెలుసునా? అదొక్కటి గాదు దశరథం అనొచ్చు. దారిమధ్య అడుగడుక్కీ పది భాగాలై పడిపోతుంది.

3 : హాహ్హాహ్హా, దశరథం! వొరే మన లంబూ వున్నాడే వొక్కొక్క కథ చెబుతూంటే బల్ మజాగా వుంటుంది. దశరథం. హాహ్హాహ్హా.

5 : మనలోమాట. మా పిల్లాడి పెళ్ళికా రథం వోమారడిగి తీసుకున్నాను. ముందుకు సాగటంకన్న వెనక్కే లాగింది.

4 : అయితే వో పని చేదాం. విభూతిని మన భుజాలమీదెక్కించుకుని తీసుకుపోదాం.

విభూతి : యేమిటిదంతా?

5 : మా యిష్టం. నువ్వు పెరిగింది వుత్తరకూటం చేతుల్లో. యిప్పుడేమో భుజం మీదెక్కావు. నీ తల అందరి తలల్నీ మించి పైకిపోయింది. (బుజాల మీద కర్రలు పెట్టుకుని వాటిమీద విభూతిని కూర్చోబెట్టు కుంటారు).

అందరూ : జయ్! యంత్రరాజ విభూతికి జయ్!

పాట

నమో యంత్ర, నమోయంత్ర, నమోయంత్ర, నమోయంత్ర
తుమి చక్రముఖర మందిత, తుమి వజ్రవహ్ని వందిత
తవ వస్తు విశ్వ వక్షోదంశ ధ్వంస వికట దంత
తవ దీప్త - అగ్ని శతశతఘ్ని - విఘ్నవిజయపంథ
తవ లోహగళన శైలదళన అచల చలన మంత్ర
కభూ కాష్టలోష్ట్ర - ఇష్టక దృఢ ఘన పినద్ధకాయా,
కభూ భూతల జల - అంతరిక్ష - లంఘన లఘుమాయా
తవ ఖని - ఖనిత్ర - నఖ విదీర్ణ క్షితివికీర్ణ - అంత్ర
తవ పంచభూత బంధనకర ఇంద్రజాల తంత్ర

(విభూతితో అందరూ నిష్క్రమిస్తారు)

(ఉత్తరకూట మహారాజు రణజిత్తూ, అతని మంత్రీ శిబిరంవైపునుంచి ప్రవేశిస్తారు).

రణజిత్ : శివతరాయీ ప్రజల నే విధంగానూ సంబాళించుకోలేక పోయావు. యిన్నాళ్ళకు ముక్తధారా జలాన్ని తన అధీనంలో

వుంచుకుని, వాళ్ళని వశం చేసుకునే వుపాయాన్ని చూపించాడు విభూతి. కానీ, మంత్రీ నువ్వేమీ వుత్సాహంగా వున్నట్టు కని పించటం లేదేం ? యీర్ష్యా ?

మంత్రి : మహారాజుగారు క్షమించాలి. పలుగూ పారా పుచ్చుకుని రాళ్ళ తోనూ, రప్పల్తోనూ కలియబడటం మా పనికాదు. రాజనీతే మా ఆయుధం. మనుషుల మనస్సులు తిప్పటమే మా వ్యవహారమంతా. శివతరాయిని శాసించే భారం యువరాజు మీద పెట్టమని నేనే తమకు సలహా యిచ్చాను. దాంతో వాళ్ళకూ, మనకూ అనుబంధం కలిగితే యెంతో బాగుండేది ?

రణజిత్ : దానివల్ల మనకొచ్చిందేమిటి ? రెండు సంవత్సరాల శిస్తు బకాయీ ! వాళ్ళకిలాంటి కరువప్పుడప్పుడూ వొస్తూ వుండటం పరిపాటే. అందుకని రాజుకు చెల్లించాల్సిన శిస్తు మాత్రమెన్నడూ ఆగిపోలేదు.

మంత్రి : శిస్తుకన్నా విలువైన ఆదాయాన్నే అతను సంపాదించి పెట్ట గలిగాడు. కానీ, తొందరపడి మీరతన్ని సమయంలోనే తిరిగి రమ్మని ఆదేశించారు. రాజ్యవ్యవహారాల్లో, చిన్నవాళ్ళు కదా అని యెవర్నీ వుపేక్షించకూడదు. వొక్క మాటమాత్రం గమ నించండి. మీ వుపేక్షవల్ల కలిగే బాధ సహించలేక చిన్న వాళ్ళందరూ యెవరి దారిన వాళ్ళు పోతారు. చివరకు వాళ్ళే మనకంటె పెద్దవాళ్ళైపోతారు.

రణజిత్ : నీ సలహా. అదేమో క్షణక్షణమూ మారుతూ వుంటుంది. మనం పైన వుండి అధికారం చెలాయించి, పరాయివాళ్ళ నదుపాజ్ఞల్లో వుంచటమే రాజనీతి—అని యెన్నిసార్లన్నావు ? అన్లేదూ ?

మంత్రి : నిజమే. అన్నాను అప్పటి స్థితి వేరు. సమయోచితంగా చేశానా సలహా. కానీ...యిప్పుడు...

రణజిత్ : యువరాజుని శివతరాయికి పంపించాలనేవుద్దేశం నాకెన్నడూ లేదు.

మంత్రి : యెందుకని మహారాజా ?

రణజిత్ : పరాయివాళ్ళతో గనక మనం కలుపుగోలుతనంగా వుండటం ఆరంభిస్తే మనమీద వాళ్ళకున్న భయం కాస్తాపోతుంది. మన

వాళ్ళను లాలించి పాలించాలి. పరాయి వాళ్ళను మాత్రం భయ భక్తులతో దూరంగా వుంచాలి.

మంత్రి: యువరాజు నసలు శివతరాయి కెందుకు పంపించామో మీరు మర్చి పోయినట్టున్నారు. కొన్నాళ్ళనుంచీ అతనేదో కలవరపడ్తున్నట్టు కన్పిస్తున్నాడు. తను జన్మించింది రాజమందిరంలో కాదని, ముక్తధారా జలపాతప్రదేశంనుంచి తీసుకొచ్చారనీ; యెలా తెలిసిందో అతనికి తెలిసినట్లుందని మనమనుమానించాం. ఆ సంగతి మర్చిపోయేట్టు చేయటానికే—

రణజిత్: ఆ సంగతి నాకు జ్ఞాపకం వుంది. యిప్పుడు కూడా రాత్రి పూట వొంటరిగా ఆ జలపాతం దగ్గిరికి పోయి బహుశా పడుకుంటు న్నాడేమో? వోనాడా సంగతి విని రాత్రిపూ టక్కడికి పోయాను. "నాయనా, అభిజిత్ ఏమిటిది? యిక్కడున్నా వెందుకు?" అనడి గాను. "యీ జలపాతంలో నా తల్లి గొంతు వినిపిస్తుం" దన్నాడు.

మంత్రి: యువరాజా! మీకేమొచ్చి పడ్డదీ, చూద్దామంటే రాజమందిరంలో అసలు కనేపించరు" అని నేనూ అడిగాను. "కొత్త మార్గం తొక్కటానికే వొచ్చాను నేనీ లోకంలోకి. ఆ సంగతి నా కను భూతమైంది." అన్నాడు.

రణజిత్: యితనిలో రాజలక్షణాలు కన్పిస్తున్నాయన్న సంగతి మీద నాకు విశ్వాసం సన్నగిలిపోతున్నది.

మంత్రి: యీ లక్షణాలున్నాయని నిర్ధారణ చేసినవారు తమ గురుపాదు లకు గురువులు అభిరామస్వాములవారు.

రణజిత్: స్వామి పొరబట్టారు. వాణ్ణి పెంచుకోవటంవల్ల నాకు నష్టమే కలిగింది. శివతరాయిలో వుత్పత్తి చేసే వున్ని దేశాల కెగుమతి కాకుండా వుండేందుకు నందికనుమ మూసెయ్యటం మా తాత ముత్తాతల కాలంనుంచీ అమల్లో వుంది. ఆ మూసేసిన కనుమనే యిప్పు డభిజిత్తు తెరిచిపారేశాడు. దాంతో యిహ వుత్తరకూటంలో అన్న వస్త్రాలకు ధరలు పెరిగిపోతాయి.

మంత్రి: చిన్నతనంగదా! కేవలం శివతరాయి ప్రజలదృష్ట్యా తమ యువరాజు—

రణజిత్ : స్వదేశవాసులకి ద్రోహం చేయటం గాక మరేమిటిది? ఆ బైరాగి ధనంజయుడొకడు ప్రజల్ని రెచ్చగొడుతూ తిరుగుతాడు, శివతరాయిలో. తప్పకుండా దీంట్లో వాడి జోక్యం కూడా వుంటుంది. వాడి కంఠహారంతోపాటు వాడి కంఠాన్ని కూడా నొక్కి పారెయ్యాలి. వాణ్ణి ఖైదులో వెయ్యాలనుంది.

మంత్రి : తమ మాట కెదురు చెప్పే సాహసం నాకు లేదు. కానీ మీకు తెలియందేముందీ? యిలాంటి అశుభాలు దాపురించినప్పుడు, అణచి వేయటంకన్న, వాటిజోలికి పోకుండా వుండటమే, ముప్పు రాకుండా వుండే మార్గం.

రణజిత్ : చాల్చాలు. ఆ ఆలోచన నీ కక్కర్లేదు.

మంత్రి : నేనాలోచించటం లేదు. తమరే ఆలోచించాలంటున్నారు.

(ప్రతీహారి ప్రవేశిస్తాడు)

ప్రతీహారి : మీ పినమామ మోహనగఢ మహారాజైన విశ్వజిత్తుగారిదే వొస్తున్నారు.

రణజిత్ : వీడొహడు, అభిజిత్తును చెడగొట్టేవాళ్ళలో వీడగ్రగణ్యుడు. పైకి ఆత్మీయుడుగా కనిపిస్తూ లోపల ప్రతిపక్షంలో వుండేవాడు. గూనివాడి వీపు మీద మూపురంలాటివాడు. అది వెనక్కి అంటుకునే వుంటుంది. దాన్ని తెగ్గొయ్యనూ లేము, తీసి పారేయనూ లేము. దాన్ని మొయ్యటమూ కష్టమే—యేమిటా అలికిడి?

మంత్రి : భైరవమందిరం చుట్టూ ప్రదక్షిణం చేస్తున్న భక్తులు.

(భక్తులు పాడుతూ ప్రవేశిస్తారు.)

తిమిర హృద్విదారణ
జ్వలదగ్ని నిదారుణ
మరుశ్మశాన సంచర
శంకర! శంకర!

వజ్రఘోష వాణీ
రుద్రశూల పాణీ
మృత్యుసింధు సంతర
శంకర! శంకర!

(విశ్వజిత్తు ప్రవేశం. తెల్లని వెంట్రుకలతో, తెల్లని ధోవతితో, తెల్లని తలపాగాతో వుంటాడు.)

రణజిత్ : నమస్కారం, మామా. మీరివాళ వుత్తరభైరవ మందిరంలో పూజ చేసే నిమిత్తమిక్కడికి వొచ్చే భాగ్యం నాకు లభిస్తుందనుకోలేదు.

విశ్వజిత్ : వుత్తరభైరవు డీనాడు మన పూజాపునస్కారాలను స్వీకరించడు. ఆ మాట చెప్పటానికే వొచ్చాను.

రణజిత్ : అశుభాన్ని సూచించే మాటలు, మా మహోత్సవానికే యివాళ——

విశ్వజిత్ : యెందుకోసమీ మహోత్సవం? లోకంలో దప్పిగొన్న మానవులందరికీ దేవదేవుడు తన కమండలవుతో జలం ధారాగతం చేశాడు. నిరాటంకమయిన ఆ జలధారను మీ రెందుకు బంధించారు?

రణజిత్ : శత్రుదమనం కోసం.

విశ్వజిత్ : భగవంతుణ్ణే శత్రువుగా భావించటమంటే నీకు భయం లేదూ?

రణజిత్ : ఆ భైరవుడే మా వుత్తరకూటానికి పురదేవత. మా జయమే ఆయన జయం. అందువల్ల మా పక్షం వహించి భైరవుడే తానిచ్చిన జలప్రదానాన్ని తానే వుపసంహరించుకున్నాడు. దప్పిక నేత్రశూలంతో చీల్చి, శివతరాయిని వుత్తరకూట సింహాసనమ్ముందు పడేస్తాడు.

విశ్వజిత్ : అయితే నువ్వు చేసేది పూజ కాదు. జీతంకోసం చేసే చాకిరి.

రణజిత్ : మామా : మీరు యెదిరి వాళ్ళంటే పక్షపాతంతోనూ, ఆత్మీయులంటే విరోధంతోనూ ప్రవర్తిస్తున్నారు. మీ తరిఫీదువల్లనే అభిజిత్తు కూడా తన రాజ్యాన్ని తనదిగా భావించటం లేదు.

విశ్వజిత్ : నా తరిఫీదువల్లనా? వొకప్పుడు నేను నీ పక్షం కాదూ? చండపట్టణంలో నీపై వొచ్చిన తిరుగుబాటుని అక్కడి ప్రజలందర్నీ సంహరించి అణచివేశానా లేదా? ఆ తర్వాత యెన్నడో వోనాడు తరుణవయస్కుడైన అభిజిత్తు నా హృదయంలో వో వెలుగులా ప్రవేశించాడు. అంధకారంలో చూడకుండా నేను గాయపరచిన వాళ్ళందరూ నావాళ్ళేనని నే తెలుసుకోగలిగాను. చక్రవర్తి లక్షణాలున్నాయని చూచి తెచ్చుకున్న యీ యువకుణ్ని కేవలం వొక్క వుత్తరకూట సింహాసనంలోనే వుంచదల్చుకున్నావా?

రణజిత్ : ముక్తధారా జలపాత ప్రదేశంనుంచి అభిజిత్తుని తీసుకొచ్చిన సంగతి కూడా మీరే చెప్పివుంటారనుకుంటాను.

విశ్వజిత్ : అవున్నేనే. ఆ రోజున దీపావళీ పండుక్కి అతన్ని మా ప్రాసాదాని కాహ్వానించాను. సంజవేళ మేడమీద తానొక్కడూ నిల్చి గౌరీ శిఖరం వైపు కదే పనిగా చూస్తున్నాడు. "యేమిటి చూస్తున్నావ్, తమ్ముడూ" అన్నాను. "అదిగో ఆ దుర్గమ పర్వతప్రాంతాల మీద యింతవరకూ వెయ్యనివీ, ముందు ముందు వెయ్యబోయేవీ మార్గాలు చూస్తున్నాను. దూరాన్ని దగ్గరకు తెచ్చే మార్గాలు. యిల్లు విడిచిన యే తల్లి యితణ్ణి ముక్తధారా జలపాతప్రాంతంలో విడిచి పెట్టిపోయిందో! అలాంటి వాణ్ణి యింట్లో యెవరుంచగలరు?" యిహ ఆపుకోలేకపోయినాను, "తమ్ముడూ, నీ జన్మ క్షణంలో నీకు స్వాగతం చెప్పింది పర్వతప్రాంతం. యే యింటిలో శంఖారావమూ నిన్నాహ్వానించలేదు.

రణజిత్ : యిప్పుడిప్పుడే గ్రహించాను.

విశ్వజిత్ : యేం గ్రహించారు?

రణజిత్ : యీ వార్త విన్న తర్వాతనే అభిజిత్తుకు రాజగృహమ్మీది మమకారం విచ్చిన్నమైపోయింది. దాన్ని బాహాటంగా ప్రకటించటం కోసమే నందికనుమను తెరిచిపారేశాడు.

విశ్వజిత్ : నష్టమేముంది దానివల్ల? తెరిచినందువల్ల ఆ మార్గం అందరిదీ అయిపోతుంది—వుత్తరకూటంవారిదీ, శివతరాయివారిదీ కూడా.

రణజిత్ : మామగారూ! మీరు నాకాత్మీయులు, గురుపాదులు కూడాను. అందుకే యింతకాలం వోపికపట్టాను. యిహ లాభం లేదు. మీరు దేశద్రోహులు, తక్షణమే యీ దేశం విడిచి వెళ్ళండి.

విశ్వజిత్ : నా అంత నేను విడిచిపెట్టిపోలేను. మీరే నన్ను బహిష్కరిస్తే సహిస్తాను.

(నిష్క్రమిస్తాడు)

అంబ ప్రవేశం

అంబ : (రాజుతో) అయ్యా మీరెవరు? సూర్యాస్తమయమౌతున్నది. యింకా నా సుమంతు తిరిగి రానేలేదు.

రణజిత్ : ఎవర్నువ్వు?

అంబ : నేనెవర్నీ కాను. నాకున్నదంతా నా పిల్లవాడే. వాణ్ణీదారి గుండానే తీసుకుపోయారు. యీ దారి కేమీ అంతులేదూ? అయితే

నా సుమంతుడింకా నడిచిపోతూనే వున్నాడా ? అదుగో ఆ పడమటి దిక్కుగా గౌరీశిఖరాని కవతల సూర్యుడస్తమించే చోటికి, వెలుతురు మాయమైపోయే చోటికి అన్నీ మునిగిపోయే చోటికి ?

రణజిత్ : మంత్రీ, బహుశా——

మంత్రి : ఆఁ ! ఆనకట్ట కట్టే పనిలోకే తీసుకుపోయుంటారు.

రణజిత్ : (అంబతో) నువ్వేమీ దుఃఖపడకు. నీ కొడుకు లోకమంతటి లోనూ చెప్పుకోదగ్గ మహాభాగ్యాన్ని పొందాడు.

అంబ : ఆ మాటే నిజమైతే సంజవేళకి నాకా భాగ్యాన్ని తెచ్చి యిచ్చే వాడు. నేను వాడి తల్లిని.

రణజిత్ : ఏదో సంజవేళకు తప్పక తెచ్చియిస్తాడు. కానీ, ఆ వేళింకారాలేదు.

అంబ : నీ మాటే నిజంగానీ, నాయనా ! భైరవమందిరానికొచ్చే దారులన్నీ యెదురు చూస్తూ వుంటాను. నాయనా సుమంతూ !

(అంబ నిష్క్రమిస్తుంది)

(సమీపంలో చెట్ల క్రిందుగా వుత్తరకూటం బడిపంతులు, విద్యార్థులూ ప్రవేశం)

పంతులు : తింటారు, తింటారు - బెత్తం దెబ్బ తింటారు. గొంతు విప్పి అనండి, జయ రాజరాజేశ్వరా అనండి.

పిల్లలు : జయ రాజరా——

పంతులు : (దగ్గర్లో వున్న పిల్లలకు వొకట్రొండంటించి) జేశ్వరా !

పిల్లలు : జేశ్వరా !

పంతులు : శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ——

పిల్లలు : శ్రీ శ్రీ శ్రీ——

పంతులు : (చిటికేసి) అయిదుసార్లు——

పిల్లలు : అయిదుసార్లు.

పంతులు : దిక్కుమాలిన కోతివెధవల్లారా ! శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ అనండి.

పిల్లలు : శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

పంతులు : వుత్తరకూటాధిపతికీ జై

పిల్లలు : వుత్తరకూటా——

పంతులు : ధిపతికీ

పిల్లలు : ధిపతికీ

పంతులు : జై

పిల్లలు : జై

రణజిత్ : యెక్కడికి పోతున్నారు మీరు ?

పంతులు : యంత్రరాజైన మన విభూతిని, మహారాజుగారు సమ్మానించబోతున్నారని విని పిల్లల్నందర్నీ తీసుకొచ్చాను—వుత్సవం చేయించటానికి. చిన్ననాటినుంచీ వుత్తరకూట గౌరవం నిలబెట్టటం నేర్చుకుంటున్నారీ పిల్లలు. యే కారణంవల్ల కూడా ఆ అవకాశాన్ని వాళ్లు పోగొట్టుకోవటం నాకిష్టంలేదు.

రణజిత్ : విభూతి సాధించిన మహాకార్యాన్ని గురించి వీళ్ళకు తెలుసునా ?

పిల్లలు : (గంతులేస్తూ చప్పట్లు చరుస్తూ) తెలుసు. శివతరాయివాళ్ళకు మంచినీళ్ళు పోకుండా ఆపేశాడు.

రణజిత్ : యెందుకాపేశాడు ?

పిల్లలు : (వుత్సాహంతో) వాళ్ళకి బుద్ధి చెప్పటానికి.

రణజిత్ : బుద్ధి చెప్పట మెందుకు ?

పిల్లలు : వాళ్లుత్తి చెడ్డవాళ్ళు.

రణజిత్ : యెందుకు చెడ్డవాళ్ళు ?

పిల్లలు : వాళ్లు మహాచెడ్డవాళ్లు. బలే చెడ్డవాళ్లు. ఆ సంగతందరికీ తెలుసు.

రణజిత్ : యెందుకని చెడ్డవాళ్ళో మీకు తెలీదూ ?

పంతులు : తెలియకేం మహారాజా! యేంరా! మీరు చదువుకోలే, పుస్తకంలో, వాళ్ళ మతం చాలా చెడ్డని.

పిల్లలు : అవునవును. వాళ్ళ మతం చాలా చెడ్డది.

పంతులు : యింకా యేమిటి ? వాళ్ళందరికీ మన మోస్తరు—చెప్పండిరా (తన ముక్కు చూపిస్తాడు).

పిల్లలు : మన మోస్తరుగా వాళ్ళకి ముక్కులు పొడుగ్గా వుండవు.

పంతులు : సరే, మన లెక్కల మేష్టరు దీన్ని గురించి యేం నిర్ధారణ చేశాడు ? ముక్కు పొడుగ్గా వుంటే యేం సూచిస్తుంది ?

పిల్లలు : మనది చాలా గొప్పజాతి—అని సూచిస్తుంది.

పంతులు : ఆ జాతి యింకా యెలాంటిది—నోటంట మాట పెగల్దేం ? ప్రపంచం అంతటిలో—చెప్పండర్రా తక్కిన వాళ్ళందర్నీ జయించే జాతిగాదూ ?

పిల్లలు : ఆఁ. అందర్నీ జయించే జాతి.

పంతులు : వుత్తరకూటంలో ప్రజలు యెన్నడైనా యుద్ధంలో వోడిపోయారా ?

పిల్లలు : యెన్నడూ వోడిపోలేదు.

పంతులు : మన రాజపితామహుడు ప్రాగ్జిత్తుమహారాజున్నాడే, ఆయన వొకానొకప్పుడు రెండువందల తొంభై ముగ్గురు సైనికులతో ముఫై వొక్క వేల యేడువందల తొంభై ముగ్గురున్న మహా సైన్యాన్ని తరిమి పారేశాడా లేదా.

పిల్లలు : ఆఁ. నిజమే. తరిమేశాడు.

పంతులు : మహారాజా, నా మాట నమ్మండి. దేశాంతరాల్లో తల్లి కడుపున పుట్టినవాళ్ళందరూ, మన పిల్లల్ని చూసి హడిలిపోయే రోజొస్తుంది. అలాకాకపోతే నా గొప్పేముంది ? ఒక్క క్షణం గూడా నా మీద వున్న యీ బాధ్యత మరిచిపోవటం లేదు. మనుష్యుల్ని తయారు చేయటం నా వొంతు, వాళ్ళను సవ్యంగా వినియోగించుకొనటం తమ మంత్రుల వొంతు. యీ సంగతంతా చూసి వాళ్ళకిచ్చే జీతమెంతో, మాకు ముట్టేదెంతో అందులో తారతమ్యం కాస్త గమనించండి.

మంత్రి : యీ పిల్లలే మీకో పెన్నిధి. యింతకన్నా యేం కావాలి ?

పంతులు : చాలా చక్కగా సెలవిచ్చారు మంత్రులు. యీ పిల్లలే మా పాలిటి పెన్నిధి. ఆహా. యెంతమాట. కాని, వో చిన్న కిటుకు మాత్రంవుంది. తినుబండారాల ధరలు నానాటికి పెరిగిపోతున్నాయి. చూడండి, యిదివరకున్న ఆవునెయ్యి ధరయిప్పుడు —

మంత్రి : సరే, సరే. ఆవు నెయ్యి సంగతి తరువాత చూద్దాం ప్రస్తుతానికి వెళ్ళి రండి. పూజకు వేళవుతున్నది.

(జయధ్వనులు చేస్తూ పిల్లలతోపాటు పంతులు నిష్క్రమిస్తాడు).

రణజిత్ : చూశావా మంత్రీ యీ పంతులు తలకాయలో యింకేమీలేదు వొక్క ఆవునెయ్యి తప్ప.

మంత్రి : పంచగవ్యంలోని కొన్ని యితర పదార్థాలు కూడా వున్నట్లే వుంది. కాని మహారాజా, యిలాంటి వాళ్లవల్లకూడా కొంత ప్రయోజనముంది. వాళ్ల నేదైనా చెప్పమంటే అదేవరసగా ప్రతి

నిత్యమూ తు. చ. తప్పకుండా చెప్పుకు పోతూనేవుంటారు. అంతకు మించిన తెలివితేటలే గనక వాళ్లకుంటే మాత్రం మన పనులింత సాఫీగా జరిగిపోవు.

రణజిత్ : మంత్రీ అటుచూడు, ఆకాశంలో అదేమిటి.

మంత్రి : మహారాజులు మరిచినట్లున్నారు. అది విభూతి నిర్మించిన యంత్ర రాజం కదూ.

రణజిత్ : యింత స్పష్టంగా యిదివరకెన్నడూ కన్పించలేదు సుమా.

మంత్రి : యివ్వాళ వుదయం వచ్చిన గాలివానతో ఆకాశమంతా తెరిపిచ్చింది. అందుకోసమే అంత స్పష్టంగా కనిపిస్తున్నది.

రణజిత్ : చూడు మంత్రీ, దాని వెనకనించి సూర్యబింబం క్రోధారుణంగా యెలా కనిపిస్తున్నదో యెవడో పిడికిలి బిగించి చూపిస్తున్నట్టు. అంత మరీ యెత్తుగా వుండటం అట్టే బాగుండలేదు.

మంత్రి : ఆకాశ వక్షస్థలంలో పొడుస్తున్న బల్లెంలాగుంది.

రణజిత్ : వెళ్దాం భైరవ మందిరంలోకి వేళైంది.

(యిద్దరూ నిష్క్రమిస్తారు)

(వుత్తరకూట పౌరుల రెండోదళం ప్రవేశిస్తుంది)

1 : చూశావా, యీ రోజుల్లో విభూతి మనల్ని యే విధంగా తప్పించుకు తిరుగుతున్నాడో వాడు మనతోపాటుండేవాడు కదా. అయినా, దులిపేసుకు పోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు. వొరకన్నా కత్తి పెద్దదైపోవటం అట్టే మంచిదికాదని వాడికీ తెలుస్తుందిలే.

2 : నువ్వేమన్నా అన్నాబాబూ, విభూతి మాత్రం వుత్తరకూటానికి చాలా పేరు తెచ్చాడు.

1 : చాలించవోయ్, వాణ్ణి మరీ మీరంతా నెత్తినెక్కించుకొంటున్నారు. వాడు కట్టిన ఆనకట్టవుందే, దాంతో వాడికి తల ప్రాణం తోక కొచ్చింది. ఆ ఆనకట్ట యింతవరకు పదిసార్లయినా యెక్కడోక్కడ తెగిపోయివుంటుంది.

3 : మళ్లీ యింకోసారి తెగిపోదని యేం నమ్మకం.

1 : ఆ ఆనకట్టకు వుత్తరాన అదిగో, ఆ దిబ్బచూడు.

2 : యేం, యేమయింది ?

1 : యేమయిందా, యింతమాత్రం తెలీదూ, చూసిన వాళ్లంతా అంటున్నారు.

2 : యేమంటున్నారన్నా ?

1 : యేమంటున్నారా ? యేం నంగనాచివిరా, యిదికూడా నీకు బోధ పరచాలిసిందే. అదిగో చూడు, మొదట్నించి చివరదాకా—యింకా యేం చెప్పమన్నావు ?

2 : నిజమేకాని, ఆ సంగతేమిటో కాస్త తెలిసేట్లు చెపుదూ.

1 : వొరే రంజనూ, యేమిటలా తెల్లబోయి చూస్తావ్. కాస్త వోపిక పట్టు, హాఠాత్తుగా యేదో మునిగిందంటే నీకే తెలుస్తుంది.

2 : నీదుంపతెగ యేమిట్రా అంటున్నావు. హాఠాత్తుగానా—యేదో ముంచుకొస్తుందా ?

1 : అవున్రా బాబూ, ఆ జగ్గడు చెపుతాడు విను. వాడన్నీ కొలిచి గుణించి మరీవొచ్చాడు.

2 : నిజమే జగ్గడికి వోమంచి గుణంమాత్రం వుంది. వో పట్టానవాడి బుర్ర వేడెక్కదు. చుట్టూ అందరూ నానా గొడవ చేస్తుంటే, వాడొక్కడు మాత్రం తన కొలత లేమిటో తన గుణింతాలేమిటో దాంట్లోనే మునిగుంటాడు.

3 : అవునుగాని, యెవరేమన్నా అననీ, వాడు సంపాయించిన విద్య మాత్రం—

1 : నాకు తెలిసిపోయింది. ఆ వెంకటవర్మ దగ్గర్నుంచీ కొట్టేసిందే. వాడయ్యా, ఆ వర్మ గుణవంతుల్లో గుణవంతుడంటే వాడ్నే చెప్పాలి. యేం తెలివైనబుర్ర. అయితేనేం తింటానికి తిండిలేక వాడు చచ్చిపోతే, యీ విభూతిగాడి ప్రభేమో యిలా వెలిగిపోతున్నది.

3 : అయితే, కేవలం తిండిలేకే చచ్చిపోయాడంటావా ?

1 : తిండిలేక చచ్చిపోతేనేం—యెవడో యేదో పెడ్తే అది తినిచచ్చి పోతేనేం—అదంతా మనకెందుకు. యెవడే పక్కనించి వింటున్నాడో, యిక్కడ చాడీకోర్లకు మాత్రం కరువులేదు. యీ దేశంలో మనుష్యులున్నారే, పరాయివాళ్లు బాగుపడుతుంటే చూసి వోర్చలేరు.

2 : మీరేమన్నా అనండి. వాడుమాత్రం—

1 : అందుకు సందేహమేమిటి. వాడు పుట్టిందెక్కడో తెలుసూ? సరిగ్గా ఆ చగువా గ్రామంలోనే మా తాత వుండేవాడు. వినలా, ఆయన సంగతి.

2 : బాగా చెప్పావురా. వుత్తర కూటంలో ఆయన్నెరగని వారున్నారా? ఆయన పేరు - మరేవచ్చి—

1 : ఆఁ ఆఁ భాస్కర్. నక్ష్యం తయారు చేయటంలో అంత ప్రజ్ఞ కలవాడు దేశం మొత్తంమీద లేరు. ఆయన చేతిమీదుగా తయారు చేసిన నక్ష్యం వొక్కనాడు లేకపోతే శత్రుజిత్తు మహారాజు గారికి పని సాగేదికాదు.

3 : అదంతా అలావుంచు. మందిరంలోకి వెళ్దాం. మనమూ ఆవిభూతి గూడా వొక్క గ్రామంనించే వచ్చాం. వాడి మెళ్లో మన చేతిమీదుగా వేయాలి దండ. వాడి సరసనే మనం కూర్చోవాలి.

[ నేపథ్యంలో : వెళ్లకండి, వెళ్లకండి. వొచ్చినదారినే పోండి ]

2 : విన్నావా, ఆ ముసలి తాత వున్నాడే, భట్టు, వాడు బయల్దేరాడు.

(భట్టు ప్రవేశం)

(వొంటి మీద కంబళి కప్పుకొని విరిగిన కొమ్మను కర్రగా చేత పట్టుకొని చెదరి పోయిన వెంట్రుకలతో ప్రవేశిస్తాడు.)

1 : యేం భట్టూ, యెక్కడికి వెళ్లుతున్నావ్ ?

భట్టు : నా మాట విను. ఆదారి పోబోకు. సమయం వుండగానే వొచ్చిన దార్నే వెళ్లిపో.

2 : యెందుకో చెప్పు ?

భట్టు : బలియిస్తున్నారు, నరబలి! దుక్కల్లావున్న నా యిద్దరి మనమళ్ళి బలవంతంగా లాక్కుపోయ్యారు. వాళ్లింతవరకు తిరిగిరాలేదు.

3 : యెవరికిస్తారు బాబాయి యీ బలి ?

భట్టు : తృష్ణ అనే రాక్షసికి.

2 : యెవరారాక్షసి ?

భట్టు : యెంతతిన్నా యింకా కావాలంటుందది. నెయ్యిపోసిన కొద్దీ పైకిలేచే మంటలాగా దాని నాలిక జాపుతూంటుంది.

1 : పిచ్చివాడా, మేం వెళ్లేది వుత్తర భైరవమందిరానికి. అక్కడ రాక్షసెక్కడుంది ?

భట్టు : యింకా మీకు కబురురాలే. యివ్వాళ వాళ్లందరూ కలిసి మంది రంలోనించి భైరవుణ్ణి గెంటేస్తున్నారు. ఆ వేదికమీద రాక్షసి కూర్చుంటుంది.

2 : నోర్మూయ్ వెర్రివాడా. యీ మాటలు వుత్తరకూటంలో యెవరన్నా విన్నారంటే నిన్ను చీల్చి పారేస్తారు.

భట్టు : వాళ్లప్పుడే నామీద దుమ్మెత్తి పోస్తున్నారు. రాళ్లు విసురు తున్నారు. నీ మనమలిద్దరూ ప్రాణత్యాగం చేశారంటే అది వాళ్ల అదృష్టమంటున్నారు పైగా.

1 : వాళ్లన్నమాట అబద్ధంకాదు.

భట్టు : అబద్ధంకాదూ ? ప్రాణ త్యాగంవల్ల మళ్లీ ప్రాణప్రతిష్ఠ కాకుండా కేవలం మృత్యువేమిగిల్తే, యీ ప్రాణ నష్టాన్ని చూచి భైరవుడు వూరుకుంటాడా ? నామాట వినండి. ఆదారిన పోకండి.

(నిష్క్రమిస్తాడు)

2 : వీడి మాటలు వింటే నావొళ్లంతా కంపరమెత్తి పోతున్నదిరా.

1 : వోరే రంజూ, నువ్వొత్తి పిరికిపందవురా. పదపద.

(అందరూ నిష్క్రమిస్తారు)

(యువరాజు అభిజిత్తు, రాజకుమారుడు సంజయుడు ప్రవేశిస్తారు)

సం : యువరాజా, నాకేమీ అర్థం కావటంలేదు యీ సంగతి. రాజ మందిరాన్ని విడిచిపోతున్నారెందుకు ?

అభి : అదంతా నీ కర్థంకాదు. నా జీవన ప్రవంతి యీ రాజ మందిర ఆవరణంలో యిమిడివుండలేదు. దాన్ని అతిక్రమించి మరీ ప్రవహిస్తుంది. యీ సంగతి తెలుసుకుని మరీ జన్మించా నీలోకంలో.

సం : కొన్నాళ్లనించీ మీలో యేదో వ్యాకులత కన్పిస్తున్నది. మన పరస్పర సంబంధాలు సడలిపోతున్నట్లనిపిస్తున్నది. అవి పూర్తిగా తెగిపోలేదుకద.

అభి : సంజయా, అదిగో అటుచూడు ; ఆ గౌరీ శంకరశిఖరంమీద అస్త మించే సూర్యబింబాన్ని ! యేమంటపులుగు మొయిలు రెక్కలు విప్పి రాత్రి వైపుగా యెగిరిపోతున్నదో. యిది నా జీవిత యాత్రను సూచించే చిత్రమూర్తి. యిదే ఆ అస్తమయంలో చిత్రించినట్లుంది.

సం : యువరాజా, చూడండి. ఆ యంత్ర గోపురం ఆకాశాన్నెలా చీల్చుకొని పైకిపోయిందో. ఆకాశంలో యెగిరిపోతున్న పక్షి గుండెలో బాణం గుచ్చుకొని, దాని రెక్కలన్నీ విడిపోయి, రాత్రీ గహ్వారంలోకి తేలిపోతున్నట్లు. యిదేమి శుభసూచకంగాలేదు, విశ్రమించడానికి వేళైంది. యువరాజా రాజమందిరంలోకి పోదాంపదండి.

అభి : బాధపడేచోట విశ్రాంతి యెలా దొరుకుతుంది ?

సం : రాజమందిరంలో మీరు పడుతున్న బాధను యిన్నాళ్లకు యెలా తెలిసికోగలిగారు ?

అభి : ఆ ముక్తధారకు ఆనకట్టకట్టిన వార్త వినగానే తెలిసికోగలిగాను.

సం : మీ మాటలు నాకర్థంకావడం లేదు.

అభి : మానవుడి ఆంతరంగిక రహస్యాన్ని దైవం బహిరంగంగా యెక్కడోక్కడ రాసిపెట్టే వుంటాడు. నా ఆంతరంగిక రహస్యం అంతా ఆ ముక్తధార దగ్గరేవుంది. స్వచ్ఛమైన ఆ ముక్తధారా ప్రవాహాన్ని యినుప సంకెళ్లువేసి బంధించిననాడే, తళుక్కుమని నా మనసులో గోచరించింది, యీ వుత్తరకూట సింహాసనంకూడా నా జీవన స్రవంతికి ఆనకట్టవంటిదని. దానికేదోదారి చూపించ డానికే నేనిలా పైకి వొచ్చాను.

సం : యువరాజా, నన్నుకూడా మీవెంట తీసుకుపోండి.

అభి : అలా వీల్లేదు, నీ దారినీవే చూసుకోవాలి. నా వెనకనే నీవు నడుస్తూవుంటే, నీదారికి నేను అడ్డం వొచ్చినట్లవుతుంది.

సం : అంత కాఠిన్యంచూపి నన్ను బాధపెట్టకండి.

అభి : నీవు నా ప్రాణంలో ప్రాణంలాటివాడివి. అందుకే నీకు బాధ కలిగినా నన్నర్థం చేసికోగలవు.

సం : యే పిలుపువిని యెక్కడికి పోతున్నావో నిన్ను నేను ప్రశ్నించ దలచుకోలేదు. సంజవేళ సమీపించింది. రాజగృహంలో వున్న ఖైదీలందరు పదాలు పాడటం మొదలుపెట్టారు. అందులో నీకేం పిలుపు వినపడటంలేదా ? కాఠిన్యంలో గొప్పతనముంటే వుండొచ్చు. కాని మాధుర్యానికి కూడా దాని విలువ దానికుండనేవుంది.

అభి : ఆ విలువ దానికియ్యడానికే యీ కాఠిన్యాన్ని నేను సాధిస్తున్నాను.

సం : వొకనాడు ఉదయం నువు పూజ చేస్తూండగా నీ పీటకు చేరువగా వో తెల్లని తామరపువ్వును చూసి ఆశ్చర్య చకితుడవై పోయావు. ఆ పువ్వు యేపొద్దున యెక్కడ పూసిందో, యే గాలి దానిని మోసి తెచ్చిందో నీకెవరూ చెప్పలేదు. కాని యెవరో వుంచిపోయిన ఆ పువ్వులో యెంత మాధుర్యం నిక్షిప్తమైవున్నదో నీకు జ్ఞాపకం రావటంలేదా ? ఆ ముద్దరాలు తన్నుతాను మరుగుపరచుకొన్నది గాని, తన భక్తి తాత్పర్యాన్ని మాత్రం మరుగుపరుచుకోలేక పోయింది. ఆమె ముఖం నీ మనసులో మెదలడంలేదూ ?

అభి : మెదలకేం. అందుకోసమే సహించలేకుండా వున్నాను, పృథివీ సౌభాగ్యాన్ని కుంఠితం చేస్తూ, యినుప కోరలతో ఆకాశాన్ని కబళించి అట్టహాసం చేసే యీ బీభత్స దృశ్యాన్నిచూసి. యీ భూతల స్వర్గంమీదవున్న ప్రేమవల్లనే ఆ యంత్ర రాక్షసితో పోరాటానికి వెనుదీయటంలేదు.

సం : ఆ నీలగిరి శృంగంమీద సంధ్యాకాంతి యెలా మూర్ఛిల్లి వాలి పోయిందో చూడు. అందులోనుంచి బాష్పధారాసిక్తమయిన వో మధురమూర్తి తొంగిచూడటంలేదా ?

అభి : ఆఁ చూస్తున్నా. నా హృదయం కూడా కన్నీళ్లతో నిండిపోయింది. కాని నాయీ కాఠిన్యం నాకు గర్వకారణంకాదు. అదిగో, అటు చూడు, దేవదారుద్రుమం చిగురు కొమ్మపై కూర్చున్న ఆ పక్షిని చూడు. అది గూటివైపుకే పోతుందో అంధకార మధ్యంలోపడి అరణ్యంలో యే దూరభూమికో యాత్ర సాగిస్తుందో తెలియదు. కాని ఆ సూర్యాస్తమయం వైపుచూస్తూ, వున్న ఆ పక్షిని చూస్తుంటే, నా హృదయం మధురమధురంగా స్పందిస్తున్నది. యీ భూతల మెంత మనోజ్ఞమైనది. నా జీవనాన్ని మధుమయం చేసిన ప్రతి సన్నివేశానికీ నేను అంజలి ఘటిస్తాను.

(భట్టు ప్రవేశం)

భట్టు : నన్ను పోనీయలేదు. కొట్టి వెనక్కు పంపించేశారు.

అభి : భట్టూ, యేం జరిగింది ? నీ నుదురు పగిలి రక్తం కారుతున్నదేం ?

భట్టు : నేనందరినీ జాగ్రత్తగా వుండమనీ హెచ్చరిస్తూ తిరిగాను. పోబోకండి. తిరిగి పొండని చెప్పాను.

అభి : యెందుకూ, యేమయింది ?

భట్టు : యువరాజా. మీకింకా తెలియదా ? యివ్వాళ వాళ్ళందరూ కలిసి యంత్రవేదిక మీద తృష్ణా రాక్షసిని ప్రతిష్ఠిస్తారు. దానికి నరబలి కావాలి.

సం : యేమిటీమాట ?

భట్టు : ఆ వేదిక నిర్మించేటప్పుడు నా యిద్దరి మనుమల రక్తాన్ని ధార పోశారు. నేననుకొన్నాను యీ పాపభూయిష్టమైన వేదిక తనంత టదే పగిలిపోతుందనుకొన్నాను. కాని యింతవరకు అది పగిలిపో లేదు. భైరవుడింకా మేలుకొన్నట్లు లేదు.

అభి ; పగిలిపోతుంది, పగిలిపోతుంది. ఆ సమయం ఆసన్నమైంది.

భట్టు : (దగ్గరగా వచ్చి రహస్యంగా) అలా అయితే విన్నారన్నమాట, భైరవుడి పిలుపుని.

అభి : ఆఁ విన్నాను.

భట్టు : తీరిపోయింది. అలాగయితే మీకిహ నిష్కృతి లేదు.

అభి : లేదు. లేనేలేదు.

భట్టు : యిదిగో చూడండి. నా తలనుంచీ రక్తం కారుతున్నది ; శరీర మంతా ధూళిమయం. మీరు వోర్చుకోగలరా యువరాజా, మీ గుండెనే కనుక చీల్చినట్లయితే ?

అభి : భైరవస్వామి అనుగ్రహంవల్ల తప్పకుండా వోర్చుకుంటాను.

భట్టు : నాలుగువైపులా శత్రువులు చుట్టుముట్టినా కూడా ? మీఆ ప్తులే మిమ్మల్ని ధిక్కరించినా కూడా ?

అభి : ఆఁ వోర్చుకుంటాను.

భట్టు : అయితే భయంలేదు.

అభి : నిశ్చయంగా భయంలేదు.

భట్టు : భేష్ ! భేష్ ! యీ భట్టునిమాత్రం మనసులో వుంచుకోండి. నేను పోయేదీ ఆ దారినే. భైరవస్వామి నా నుదుటి మీద తీర్చిన యీ రక్తతిలకాన్నిబట్టి యెంత చీకట్లోనైనా నన్ను మీరు పోల్చు కోగలుగుతారు.

(భట్టు నిష్క్రమిస్తాడు. రాజప్రహరీ వుద్ధవుడు ప్రవేశిస్తారు.)

వుద్ధ : యువరాజా, నంది సంకటానికి పోయేదారిని మీ రెందుకు తెరిచేశారు ?

అభి: పాపం, ఆ శివతరాయి గ్రామవాసులను నిరంతర దుర్భిక్షాన్నుంచి తప్పించటానికి.

వుద్ధ: మహారాజుకు వారంటే యెంతోదయ. తప్పక కావలసిన సహాయం చేస్తారు గదా.

అభి: కుడిచేత్తో వాళ్ళ కడుపుమీద కొడుతూ, యెడమ చేత్తో వాళ్ళను కనికరించటం యెలా సాధ్యమవుతుంది? అందుకోసమే వాళ్ళ తినుబండారమంతా రవాణా చేసే ఆ రహదారిని నేను తెరిచేశాను. వొకరి దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి వుండే దైన్యాన్ని చూసి నేను సహించలేను.

వుద్ధ: మహారాజేమన్నారంటే, నందిసంకటానికి వేసిన ఆటంకాల్ని తొలిగించటంవల్ల వుత్తరకూట ప్రజల భోజనంచేసే కంచానికిమట్టు లేకుండా చేసేశావంటున్నారు.

అభి: యిన్నాళ్ళు శివతరాయి ప్రజల అన్నం తింటూ బ్రతకాల్సిన దుర్గతి వుత్తరకూట ప్రజలకు లేకుండా చేశాను.

వుద్ధ: చాల దుస్సాహసం చేశారన్నమాట. యీ సంగతి మహారాజు కప్పుడే తెలిసింది. యింతకన్న యెక్కువగా మీతో చెప్పలేను. పోగలిగితే వెంటనే యెక్కడికైనా వెళ్ళిపోండి. దారిలో నిలిచి మీతో మాట్లాడటం కూడా ప్రమాదమే.

(వుద్ధవుడు నిష్క్రమిస్తాడు)

(అంబ ప్రవేశిస్తుంది)

అంబ: సుమంతా, నాయనా సుమంతా, నా సుమంతుణ్ణి తీసికొనిపోయిన దిక్కుగా పోయేవాళ్ళెవరూ లేరూ?

అభి: యేమిటి, మీ అబ్బాయిని తీసుకుపోయారా?

అంబ: ఆఁ, అదుగో, ప్రొద్దు కుంకుతున్నదే ఆ పడమటివైపుగా.

అభి: నేనూ ఆ వైపే వెళ్తున్నాను.

అంబ: అయితే, యీ నిర్భాగ్యురాలిమాట జ్ఞాపకం వుంచుకోండి. వాడు కనిపించగానే మీ అమ్మ నీ కోసం దార్లు కాస్తున్నదని చెప్పండి.

అభి: చెప్తాను.

అంబ: నాయనా, నువ్వు చిరకాలం బ్రతకవోయి, నాయనా, సుమంతా.

(నిష్క్రమిస్తుంది)

(యాత్రికుల ప్రవేశం, పాట.)

జయ భైరవ! జయ శంకర!
జయ జయ జయ ప్రళయంకర!
జయ సంశయ భేదన జయ బంధచ్ఛేదన!
జయ సంకటసంహర! శంకర! శంకర!

(నిష్క్రమిస్తారు)

(సేనాపతి విజయపాలుడు ప్రవేశిస్తాడు)

విజ: యువరాజా, నా వినయపూర్వక వందనమందుకోండి. మహారాజు దగ్గర్నుంచి వొచ్చాను.

అభి: యేమిటి వారి ఆజ్ఞ?

విజ: రహస్యంగా చెప్తాను.

సంజ: (అభిజిత్తు చేయి గట్టిగా పట్టుకొని) యేమిటీ, నా యెదట కూడా రహస్యమే.

విజ: నాకు వారిచ్చిన ఆజ్ఞ అలాంటిది. యువరాజా, వొక సారి రాజ శిబిరంలోకి అడుగు పెట్టండి.

సంజ: నేను కూడా వెంట వొస్తాను.

విజ: అది మహారాజు కిష్టం లేదు.

సంజ: అలా అయితే యిక్కడే, నిలిచి మీకోసం యెదురు చూస్తూవుంటాను.

(అభిజిత్తుని తీసుకుని విజయపాలుడు శిబిరంవైపు నిష్క్రమిస్తాడు.)

పాట

తిరిగిరాడు తిరిగిరాడు
మరల నతడు తిరిగిరాడు
గాలివాన కెదురెదురుగ
తేలిపోయె నావ ఇంక
తిరిగిరాదు తీరమునకు
వెనుక త్రోసి వగపులెల్ల
వెర్రివాడెవండు వాని
పిలిచి వెంట గొనిపోయెనొ
నీదు బాహు బంధనమున
నిలుపలేవు నీ వతనిని.

తిరిగి రాడు తిరిగి రాడు
మరల నతడు తిరిగిరాడు.

(పుష్పలావిక ప్రవేశిస్తుంది)

పుష్ప : అయ్యా, యీ వుత్తరకూటంలో వుండే విభూతి యెవరు ?

సంజ : యెందుకు ? నీ కతనితో యేం పని ?

పుష్ప : మాదీవూరు కాదు. దేవతలి గ్రామంనుంచి వొస్తున్నాను. వుత్తర కూటంలో యావన్మందీ ఆయన నడిచే మార్గాన్ని పూలతో కప్పేస్తున్నారని విన్నాను. ఆయన గొప్ప సాధుపుంగవుడనుకుంటాను. ఆ స్వామిదర్శనం చేసుకుందామని నాతోటలోనుంచి పూవులుతెచ్చాను.

సంజ : అతను సాధువవునో కాదోగాని మహా బుద్ధిమంతుడు మాత్రం అవును.

పుష్ప : ఆయనేం గొప్ప పనులు చేశారండీ ?

సంజ : యీ జలప్రవాహానికి ఆనకట్ట కట్టారు.

పుష్ప : అందుకా, ఆయన మీద యింత భక్తి ? ఆనకట్ట కడితే దేవకార్యమవుతుందా అది ?

సంజ : కాదు. దేవుడి చేతులకు సంకెళ్ళు వేయడమవుతుంది.

పుష్ప : అందుకా యీ పూలవాన ? నాకేం అర్థం కావడం లేదు.

సంజ : అర్థం కాకపోవటమే మంచిది. దేవకార్యానికై తెచ్చిన యీ పూలు వృథా చెయ్యక వొచ్చిన దారినే పో—యిటు చూడు, నీ దగ్గరున్న ఆ తెల్లకలువపూవును నాకమ్ముతావా ?

పుష్ప : సాధుపుంగవుల కిద్దామని తెచ్చిన పూలు అమ్ముతానా ?

సంజ : అందరికన్నా యెక్కువ భక్తితో సేవించే సాధువొక రున్నారు. ఆయన కిస్తాను.

పుష్ప : అలా అయితే తీసుకో. వొద్దు, వొద్దు. నేనేం ప్రతిఫలం తీసికోను. నీ స్వామికి నా నమస్కారా లందజేయండి. నేను దేవతలి గ్రామంలో వుండే పుష్పలావికనని చెప్పండి.

(నిష్క్రమిస్తుంది)

(విజయపాలుడు ప్రవేశిస్తాడు)

సంజ : అన్నా యెక్కడికి వెళ్లుతున్నారు ?

విజ : శిబిరంలో యువరాజును బంధించేశాం.

సంజ : యువరాజు బంది అయినాడా ? యేమి సాహసం !

విజ : యిదుగో చూడు, మహారాజుగారి ఆజ్ఞాపత్రం.

సంజ : యెవరు చేశారీకుట్ర, వోమారు ఆయన్ను పోయి కలుసుకో నీయండి.

విజ : క్షమించాలి.

సంజ : నన్ను కూడా ఖైదులో పెట్టండి. నేనూ విద్రోహినే.

విజ : రాజాజ్ఞ లేదు.

సంజ : సరే, ఆ ఆజ్ఞ నేనే పోయి తెచ్చుకుంటాను. (కొంతదూరం పోయి వెనుతిరిగి వొచ్చి) విజయపాలా, యీ తెల్లకలువ నేనిచ్చానని యువరాజుకియ్యి.

(ఇద్దరూ నిష్క్రమిస్తారు)

(శివతరాయి గ్రామవాసి బైరాగి ధనంజయుడు ప్రవేశిస్తాడు)

పాట

భయము పోగొట్టు నా పడవ నధిరోహించి
ప్రళయ ఝంఝూ సమీరమున కెదురుగ, మరణ
వారాశి తరియించువాడ నవలీలగా
'భయపడకు' మను దివ్యవాణిని నమ్మి, నా
పడవ పీలికలైన ప్రాత తెరచాపతో
వడివడిగ జేరు నావలి తీరమందు క
న్పడెడు ఛాయా ద్రుమప్రాంత వాటికను
నన్నేలు నాతడే నా త్రోవ చూపించు
నాకేల భయమింక నావ నిచటనె యుంచి
నా దారి పోవుటే నాదు కర్తవ్యమ్ము

(శివతరాయి గ్రామవాసులు కొందరు ప్రవేశిస్తారు)

ధనం : యేమిటోయ్ మీ మొహాలన్నీ సున్నంలాగా తెల్లనై పోయాయి? యేమిట్రా యేమయింది?

ఒకడు : ప్రభూ, రాజశ్యాలకుడు ఆ చండపాలుడున్నాడే వాడు కొట్టే దెబ్బలకి తాళలేకపోతున్నాం. ఆయనున్నాడే యువరాజును కూడా లెక్క చేయటం లేదు. అది మరీ కష్టంగా వుంది.

ధనం : యింకా దెబ్బలకి తాళలేక పోతున్నారూ? యింకా దెబ్బలవల్ల బాధ కలుగుతూనే వుందా?

2 వ: రాజు దేవిడీలోనే బహిరంగంగా కొడుతున్నారండీ. యేమి తలవొంపులుగా వుందనుకున్నారు.

ధనం: మీ మానాన్ని, ప్రాణాన్ని ఆ అంతర్యామి సన్నిధానంలో వుంచండి. యే అవమానం కానీ, తలవొంపులు కానీ, అక్కడికి ప్రవేశించవు.

(సర్దార్ గణేశ్ ప్రవేశిస్తాడు)

గణే: యిహా తట్టుకోలేను. వాణ్ణి యెప్పుడు పట్టుకొందామా అని చేతులు దురదెక్కిపోతున్నాయ్.

ధనం: అలా అయితే మీ చేతులు మీ వశం తప్పిపోతున్నాయన్న మాట.

గణే: స్వామీ వొక్కమారు అనుజ్ఞ యియ్యండి. ఆ చండపాలుడి దండాన్ని లాగేసుకుని దెబ్బంటే యేమిటో చూపించాలని వుంది.

ధనం: దెబ్బంటే యేమిటి కాదో వాడికి చూపించలేరూ? బహుశా దానికి యింతకన్నా యెక్కువ బలం కావాలి. వో చెంప తుఫాను వీస్తూంటే కర్రతో కొట్టినంతమాత్రాన కడలిలో కెరటాలు తగ్గిపోతాయా? అంతకన్నా చుక్కాని స్థిరంగా పట్టుకొని కూర్చుంటే, తుఫాను దెబ్బ తట్టుకోవచ్చు.

3 వ: అలా అయితే యేం చేయమన్నారు చెప్పండి.

ధనం: హింస అనేదాన్నే కూకటి వేళ్ళతో పీకేసేటంతటి వుద్రేకం తెచ్చుకోవాలి.

4 వ: అది యెలా సంభవిస్తుంది ప్రభూ?

ధనం: యెంత హింసించినా నిర్భయంగా నువు తలెత్తి నిలబడకలిగితే, హింస తనంతటదే నిర్మూలమవుతుంది.

2 వ: హింసిస్తూంటే బాధ లేదనుకోవటం మాత్రం చాలా కష్టం.

ధనం: అంతఃపురుషుణ్ణి మాత్రం యీ హింస బాధించదు. అతను అగ్నిజ్వాలవంటివాడు. మానవుడిలో వున్న పశుత్వాన్నే యిది బాధిస్తుంది. ఆ బాహ్యాపురుషుడు దెబ్బతిని కుమిలి కుమిలి యేడుస్తాడు. యేమిటలా నోరు వెళ్ళబెట్టి చూస్తారు. నా మాట లర్థం కావటంలా!

2 వ : మీర్రర్థమవుతున్నారుకాని, మీ మాటలు మాత్రం అర్థం కావటంలా.

ధనం : అయితే కొంప మునిగిందన్నమాటే.

గణే : మీ మాటలు అర్థం కావటానికి కొంతకాలం పడుతుంది. మా కంత దాకా వోపిక లేదు. మిమ్మల్ని అర్థం చేసుకొన్నాము కనక పెందల కడే తెప్ప దాటిపోతాము.

ధనం : అలా కాకుండా యింకా కొంత ఆలస్యమయితే, వొడ్డుదాకా వొచ్చి మరీ పడవ మునిగిపోతుంటే, చూస్తూ కూచోవాలి. నా మాటల్లో వున్న అంతరార్థాన్ని మీరు పూర్తిగా గ్రహిస్తేనేతప్ప మీరు యెందుకూ పనికిరాకుండా పోతారు.

గణే : స్వామీ అలా అనకండి. మీ చరణ సాన్నిధ్యంలో మాకాశ్రయం దొరికింది. అంటే యేదో విధంగా మాకు అర్థమయిందన్న మాటే.

ధనం : అంటే తెలిసిపోతూనే వున్నది మీకేమీ అర్థం కాలేదని. మీ నేత్రాలు రక్తారుణంగా వున్నాయి. మీ గొంతులోనుంచి యే మధురస్వరం బయటికి రావటం లేదు. వొక పాట వరస మీకందించనా.

పాట

పడనిమ్ము ! పడనిమ్ము ! ప్రభు ! నీ ప్రహారముల
పడనిమ్ము నాపైన వడిగా మరల మరల.

వో పిరికిపందల్లారా, దెబ్బ తప్పించుకోటానికి పారిపోనన్నా పారి పోతారు, లేకుంటే తిరిగి కొట్టనన్నా కొట్టిపోతారు. యీ రెండూ వొకటే. యిందులో యేది చేసినా పశువులమందలో మీరు కలిసి పోయినట్లవుతుంది కాని, పశుపతిని మీరు చూసినట్లు కాదు.

పాట

ఏ మూలనో డాగి యెచటనో పరువెత్తి
భీతితో నిన్ను తప్పించుకొని తిరుగు నా
సర్వస్వమును కైవసము చేసికొనుచు
సర్వాంకషముగ నను సరిదిద్దుకొనుము

నాయనలారా, చూడండి. నేను మృత్యుంజయుడి దగ్గిరికే పోతున్నాను యే సంగతీ తేల్చుకోటానికి. దెబ్బలు నన్ను

బాధిస్తాయో లేదో తెలుసుకోదలుచుకుంటే ఆ దెబ్బలేవో నన్ను కొట్టి మరీ తెలుసుకో, అని ఆయనతో చెప్పబోతున్నాను. మీలాగా యెదటి వాణ్ణి భయపెట్టేవాళ్ళను, యెదటివాణ్ణి చూసి భయపడేవాళ్ళను ఖజాన యెక్కించుకొనిమాత్రం నేను పోలేను.

పాట

నీవొ నేనో యోడిపోవలయునో ప్రభూ!
తిరునాళ్ళ సందడుల తీర్థస్థలాలలో
నవ్వు నవ్వడులతో నా బ్రతుకు కడచినది
నేడెట్లు నన్ను నీ వేడిపింపగ గలవొ?

అందరు: బాగుంది. బాగుంది. నేడెట్లు నన్ను నీ వేడిపింపగలవొ?

2 వ: కానీ, తమ రెక్కడికి వెళ్లుతున్నారు?

ధనం: మహారాజుగారి వుత్సవంలోకి.

3 వ: అది రాజుగారి వుత్సవమయితే మీకెలా అవుతుంది? అక్కడ యేం చేయబోతున్నారు?

ధనం: ఆ రాజసభలో నేను ఫలానా అని చెప్పి మరీ వొస్తాను.

4 వ: వోమారు వాళ్ళచేతులో మీరు పడ్డారంటే - వద్దువద్దు అలా చేయకండి.

ధనం: పడకుండా వుండటమెలాగ? అనుకొన్నదానికన్నా యెక్కువగా పడాలసి వొస్తుంది.

1 వ: రాజంటే మీకు భయంలేదు. మాకు మాత్రం మాచెడ్డభయం.

ధనం: మీరేమో లోలోపల వాణ్ణి దెబ్బతీయాలనుకుంటున్నారు. అందుకూ మీకీ భయం, నాకల్లా లేదు. అందువల్ల నాకు భయం లేదు. హింస చేద్దామనుకొనేవాళ్ళనే, భయం పట్టి పీడిస్తుంది.

2 వ: అయితే మేం కూడా మీతో వొస్తాం.

3 వ: రాజుగారికి మనవి చేసుకొంటాము.

ధనం: యేం కావాలని మనవి చేసుకొంటారు?

3 వ: కావాలిసింది చాలా వుంది. అందులో ఆయన యెంత యిస్తారన్నదే సందేహం.

ధనం: మీరందరూ వొచ్చి మాకు రాజత్వం కావాలని అడగండి.

3 వ: మాతో పరాచికం ఆడుతున్నారు.

ధనం : మీతో ఎందుకు నాకు పరాచికం ? ఒక్క కాలి మీద నిలబడాలంటే యెంత కష్టమో చూడండి. యీ రాజత్వమనేది వొక్క రాజుకే వుండి ప్రజలకు లేకపోతే కుంటుతున్నట్లుంటుంది. ఆ దృశ్యాన్ని చూసి దేవతలు కూడా కన్నీళ్లు కారుస్తారు. రాజుగారి క్షేమం కోసమే రాజత్వాన్ని మీరు అడిగి పుచ్చుకోవాలి.

2 వ : తన్ని తగిలేస్తే ?

ధనం : రాజులందర్నీ శాసించే రాజాధిరాజే కనక మీ పక్షముంటే, అతని హింస అతన్నే తుడిచేస్తుంది.

పాట

నీ సింహ పీఠిపై నీ చెంతనే మమ్ము
కూర్చుండ బెట్టుకొను కోర్కెతో గొంతెత్తి
పేరు పేరున నీవు పిలిచెదవుగాని మరి
మాటిమాటి కదేమొ మరతు మా మాట ప్రభు !

అసలు సంగతి చెప్పనా మీకు. ఆ సింహాసనం రాజాధిరాజైన పరమేశ్వరుడిదని గ్రహిస్తేనే కాని దానిమీద కూర్చోటానికి మీకు హక్కు రాదు. అది కేవలం రాజుదీ కాదు, ప్రజలదీ కాదు. ధీమాతో నాకేమని కూర్చోదగిన స్థలం కాదది. చేతులు రెండూ జోడించి కూర్చోవలసిన చోటు.

పాట

తానెరుంగడు మమ్ము ద్వారపాలకు డతడు
దారి నడుమనె మమ్ము వారించి తరలించు
వెలుపలను వాకిటనె నిలిచి యున్నామయ్య
పిలిచికొని పొమ్ము లోపలికి మమ్మో ప్రభూ !

ద్వారపాలకుడు మిమ్ము బుద్ధిపూర్వకంగానే గుర్తించ లేదంటారా. మీ మొహాల మీద అంకితమై వున్న రాజలాంఛనం ధూళితో కప్ప బడిపోయింది. మీ అంతశ్శత్రువులను జయించి అక్కడ మీ రాజత్వాన్ని ప్రతిష్ఠించుకోలేకపోయారు గదా, బాహ్యప్రపంచంలో యెలా ప్రతిష్ఠించుకో గలుగుతారు ? రాజన్నవాడు సింహాసనం మీద కూర్చుంటాడు. కాని, సింహాసనం మీద కూర్చున్నవాడల్లా మాత్రం రాజు కాడు.

పాట

ప్రాణమును, దానితోబాటు మానధనమ్ము
మాకిచ్చితివి దయామయుడవై లోకేశ!
మ్లానమై మలినమై యానాటి కానాడు
మట్టిలో కలిసినది మానధనమంతయును
లోభమున దగిలి లజ్జా భయమ్ముల చిక్కి.

1 వ: మీరేమన్నా చెప్పండి స్వామీ. రాజమందిరానికి మీరెందుకు వెళ్లుతున్నారో మాకు అర్థం కావటం లేదు.

ధనం: యెందుకో చెప్పనా. నా మనస్సులో సంకోచం కలిగింది.

1 వ: యేమిటది?

ధనం: మీరందరూ నన్నీ విధంగా గట్టిగా పట్టుకొన్నంత వరకూ యీాత నేర్చుకోవటం సాధ్యం కాదు. నాకూ వొడ్డు చేరుకోవటం కష్టమై పోతున్నది. అందుకోసం మిమ్మల్నందరినీ వొదిలించుకుపోయి స్వేచ్ఛగా వుండాలని వుంది. అక్కడ నన్నెవరూ మీలాగా గొప్పగా చూసేవాళ్ళుండరు. బతికిపోతాను.

1 వ: కాని, మహారాజుగారు మిమ్మల్ని అంత సులభంగా వొదిలిపెడ్తారా?

ధనం: వొదిలిపెట్టడమెందుకు. నన్ను బంధించేస్తే నాకింక ఆదుర్దా ఎందుకు?

2 వ: కాని, స్వామీ, వొంటిమీద చెయి పడితేమాత్రం మేము వూరుకోలేము.

ధనం: యీా శరీరాన్ని కాస్తా ఆ పరమేశ్వరుడి అధీనంచేశాను. ఆయన వూరుకోగా లేనిది మీకెందుకు?

1 వ: సరే, పదండి. మేముకూడా చూశొస్తాం. ఆ తర్వాత మా రాతెలా వుందో.

ధనం: అయితే కాస్సేపు మీరిక్కడ్నే వుండండి. నాకీచోటు కొత్త. యే దారెలా పోతుందో చూశొస్తా.

(నిష్క్రమిస్తాడు)

1 వ: చూశావా, యీా వుత్తరకూటపువాళ్ళ మొహాలు యెలా వున్నాయో. బ్రహ్మదేవుడు వో పెద్ద మాంసపు ముద్ద తీసుకొని వీళ్ళ మొహాలు తయారు చెయ్యటం ఆరంభించి పూర్తి చేయటానికి వోపిక లేక వొదిలేసినట్టుగా వుంది.

2 వ: వాళ్లు గట్టిగా బిగించి కట్టుకున్న వాళ్ళ కట్టుగుడ్డలు చూడండి.

3 వ: బస్తా పిగిలిపోతే యేమన్నా జారిపోతుందేమో అన్నంత బిగుతుగా.

1 వ: వాళ్లు భూమ్మీద పుట్టిందే చాకిరీ చేయడానికి. నాలుగు చెరువుల నీళ్ళు తాగి నానాదిక్కులు తిరగటమే వాళ్ల పని.

2 వ: వాళ్ళకో నాగరికత లేదు, యేం లేదు? వాళ్ళ శాస్త్రాలున్నాయ్, వాటిలో మాత్రం యేముంది?

1 వ: యేమీ లేదు. వాళ్లు రాసే అక్షరాలు చూశావా. చెదపురుగుల్లా గుంటాయి.

2 వ: అచ్చంగా చెదపురుగులే. వాళ్ళు నేర్చిందల్లా యేమిటంటే అన్నిటినీ కొరికి ముక్కలు ముక్కలు చేసేయటం.

3 వ: ఆ ముక్క లన్నిటినీ మట్టి దిబ్బ కింద పూడ్చిపెట్టటం.

1 వ: వాళ్లు అస్త్రాలతో శరీరాల్ని, శాస్త్రాలతో మనస్సుల్ని పీడిస్తారు.

2 వ: వుత్త పాపిష్టి సన్యాసులు. మన గురువుగారేమన్నారో తెలుసా? యెన్నటికీ వాళ్ళనీడనైనా తొక్కకూడదన్నారు. యెందుకో తెలుసా?

3 వ: యెందుకో చెప్పు.

2 వ: అయితే తెలీదన్న మాట. క్షీరసాగర మథనమైన తరువాత దేవతల చేతుల్లో ఉన్న అమృతభాండంలో నుంచి కొన్ని చుక్కలు నేలమీద రాలాయి. మన శివతరాయి పూర్వపురుషులందరూ అక్కడ్నుంచి పుట్టుకొచ్చారు. ఇహ యీ దేవతలు భుజించి విడిచిన వుచ్ఛిష్ట భాండాన్ని రాక్షసులు తనివితీర నాకి మురుగుకాలవలో పడేశారు. ఆ ముక్కల్లో నుంచి పుట్టుకొచ్చారు వుత్తరకూటపు వాళ్లంతా. అందుకే వాళ్లంత పొగరుబోతులు, థూ అంత అపవిత్రులు.

3 వ: నీకి భోగట్టా యెలా తెలిసింది?

2 వ: స్వయంగా గురువుగారే సెలవిచ్చారు.

3 వ: (మనసులో గురువుగారికి ప్రణామంచేస్తూ) గురుదేవా, నీవే సత్య మూర్తివి.

[ వుత్తరకూట పౌరులు కొందరు ప్రవేశిస్తారు. ]

వు 1: అంతాబాగానే వుంది కానీ, యీ కంసాలివాడ్ని విభూతిని రాజు గారు క్షత్రియుడు చేసి పారేయటంమటుకు అట్టే—

పు 2 : అదంతా మన స్వంత ఘోషలేవోయ్. మళ్లీ మనవూరు చేరుకున్న తరువాత ఆ సంగతేదో తేల్చుకుందాం. యిప్పటికి మాత్రం 'యంత్రరాజ విభూతికి జై' అనేద్దాం.

పు 3 : క్షత్రియుడి అస్త్రాన్ని, వైశ్యుడి యంత్రాన్ని రెంటినీ జతచేసిన యంత్ర రాజవిభూతికి జై.

పు 1 : అన్నా, అటుచూడు. శివతరాయి మనుషులల్లే వున్నారు.

పు 2 : యెలా తెలుసుకున్నావ్.

పు 1 : చెవులు కూడా కప్పేసిన అ టోపీలు చూడలా. యేంతమాషాగా వుందోయ్ చూట్టానికి, తలమీద వొక గుద్దుగుద్ది యిహ యెదగ టానికి వీలులేకుండా చేసినట్లుగా వుంది.

పు 2 : యిన్ని దేశాలు చూశాము. వీళ్లకీ చెవులు కప్పేసే టోపీ తెందు కోయ్. బ్రహ్మదేవుడికి మతి భ్రమించటంవల్ల యీ చెవులు సృష్టించా డనుకుంటున్నారేమో.

పు 1 : కాదురా, ఆ వున్నకాస్త బుద్ధీ వాటిలోగుండా బయటికి వెళ్లి పోతుందని. (అంతా నవ్వుతారు)

పు 3 : అదికాదురా, యేదైనా పొరబాటువల్ల బయటినుంచి బుద్ధి లోపలికి ప్రవేశిస్తుందేమోనని. (నవ్వు)

పు 1 : వుత్తరకూటంలో వున్న భూతమేదైనావొచ్చి చెవులు కాస్తా పీకేస్తుందేమోనని. (నవ్వు) యేమిట్రా తెలివి తక్కువ మొద్దుల్లాగా చూస్తూ నిలబడతారు. వులకరు పలకరు యేమొచ్చిందేమిటి ?

పు 3 : మీకేం తెలీదూ మా కివ్వాళ పండుగ దినమని. అనండి 'యంత్ర రాజ్ విభూతికి జై' అని.

పు 1 : నోటంట మాటరాదేం. గొంతు బిగుసుకుపోయిందా? గట్టిగాపట్టుకొని నొక్కితేనే కానిమాట పెగలదా? అనరేం 'యంత్రరాజ్ విభూతికి జై' అని.

గణేశ్ : యెందుకనాలి. యేంచేశాడావిభూతి ?

పు 1 : యేమంటున్నాడో చూడు, యింత బ్రహ్మాండమైనవార్త యిప్పటికీ వీళ్లకందలేదు, చెవులు మూసేసిన స్వభావం.

పు 3 : మీరు రోజూ తాగేనీళ్లున్నాయే ఆ విభూతిచేతిలో వున్నాయి. అతను దయతలిస్తేనే తప్ప లేకపోతే అనావృష్టితో కప్పలు చచ్చిపోయి నట్లు చచ్చిపోతారు.

శి 2: మేము తాగే నీళ్లేమిటి! అతడి చేతిలో వుండటమేమిటి! హఠాత్తుగా దేవత్తై కూచున్నాడాయేమిటి?

వు 2: దేవుణ్నే అలాకూచోమని చెప్పి ఆపనంతా తనే చేస్తున్నాడు.

శి 1: దేవకార్యమే నిర్వహిస్తున్నాడా. యేదికాస్త దృష్టాంతంచూపెట్టండి.

వు 1: అదిగో ఆ ముక్తధారకట్టిన ఆనకట్ట. (శివతరాయి గ్రామ పౌరు లందరూ విరగపడి నవ్వుతారు)

వు 1; యిదేం మీకు పరాచికంగావుందా?

గణే: పరాచికంకాదూ, ముక్తధారా ప్రవాహాన్ని కట్టిపారేస్తారా! భైరవుడు స్వయంగాయిచ్చిన దానిని యీ కంసాలి కుర్రాడాకాజేస్తాడు.

వు 1: మీకళ్లతోనే చూడండయ్యా అదిగో ఆకాశంలో.

శి 1: అరెరే, యేమిటది.

శి 2: అదేమిటో పెద్ద యినుముతో చేసిన మిడత ఆకాశంలోకి దూకుతున్నట్లుగావుంది.

వు 1: ఆ మిడతే తన కాళ్లతో మీవైపు ప్రవహించే జలాన్ని ఆపేస్తున్నది.

గణే: యీ దొంగ మాటలన్నీ కట్టిపెట్టండి. ఆ మిడత రెక్కలమీద యెక్కియెపుడో మీ కంసాలి కుర్రాడు చందమామని పట్టుకోబోతున్నాడనికూడా చెప్పగలరు.

వు 1: చూడండయ్యా యీ చెవులు మూసుకున్న వాళ్లగొడవ; వాళ్లకు చెవులున్నా వినబడదు. వాళ్లకు యెలాగో చావు నిశ్చయం.

శి 1: మేం చచ్చినాచావం, యేంపందెం?

వు 3: బాగుందికాని, మిమ్మల్ని బ్రతికించే వాళ్లెవరు?

గ: మా దైవాన్ని చూడలా? మా కాయనే ప్రత్యక్షదైవం.

ధనం: ఠాకూరు ఆయనపేరు. ఆయన శరీరం ఒకటి మందిరంలోను, ఒకటి బయట వుంటుంది.

వు 3: యేమిటీ అంటున్నారు యీ చెవిమూతగాళ్లు. వాళ్లచావు యెవ్వరూ తప్పించలేరు.

(వుత్తరకూట పౌరులు నిష్క్రమిస్తారు. ధనంజయుడు ప్రవేశిస్తాడు).

ధనం: యేమిటోయ్ అంటున్నారు. మిమ్మల్ని బతికించే భారం నామీదనా వుంది? అలాఅయితే మీరు పదిసార్లు అప్పుడేచచ్చి దయ్యాలయి పోయారన్నమాట.

గణే: ఆ వుత్తరకూటపువాళ్లు వొచ్చి మమ్మల్ని బెదిరించిపోయినారు. ఆవిభూతి ముక్తధారా ప్రవాహాన్ని కట్టివేశాడని చెప్పి.

ధనం: కట్టివేశాడనా చెప్పాడు?

గణే: అవును స్వామీ.

ధనం: వాళ్లు చెప్పిందల్లా విన్నట్లు లేదుమీరు.

గణే: అదేమంత వినాలిసిన కబురా. వొనవ్వురవ్వితో లేశాం.

ధనం: మీకందరికీ వున్న చెవులన్నీ కలిపి నా స్వాధీనంలో వుంచారా? మీరందరూ వినాల్సిందంతా నే నొక్కణ్ణే వినాలన్నమాట.

శి 3: స్వామీ, వాళ్ల నేమాటల్లో అంత శ్రద్ధగా వినాల్సిన విషయమేముంది?

ధనం: యేమిటామాట? దురంతమైన వొక శక్తిని బంధించారంటే, అదేమంత అల్పవిషయమా? అది అంతః శక్తికానీ బాహ్యశక్తికానీ.

గణే: అయితేస్వామీ, మేం తాగేనీళ్లను అటకాయిస్తారా?

ధనం: అది వేరేకథ. అలాచేస్తే భైరవుడు మాత్రం సహిస్తాడా. మీరు కాస్త యిక్కడ కూచోండి. నేపోయి అసలేమిటో తెలుసుకొస్తాను. అన్నివైపులా యేవో కంఠస్వరాలు మోగుతున్నాయి. యే దిక్కున వాటిని వినపడకుండా నిరోధిస్తావో, అక్కడే మృత్యువు బాణం విసురుతుంది.

(ధనంజయుడు నిష్క్రమిస్తాడు. మరొక శివతరాయ్ గ్రామపౌరుడు ప్రవేశిస్తాడు)

శి 3: యేంరా విష్ణూ, యేమిటి సంగతి.

విష్ణు: మహారాజు శివతరాయినుంచి యువరాజును పిలిపించేశాడు. అతన్ని అక్కడ వుంచడు.

అందరు: అలా జరగటానికి వీల్లేదు.

వి: వీల్లేకపోతే యేం చేస్తారు?

అందరు: మళ్లీ వెనక్కు తీసుకపోతాం.

వి: యెలాగ?

అందరు: బలవంతంగా.

వి: మహారాజు మీదనే బలప్రయోగం?

అందరు: మహారాజంటే మాకేం లెక్కలేదు.

(రణజిత్తు, మంత్రి ప్రవేశిస్తారు)

రణ : లెక్కచేయకపోవట మెవర్ని ?
అందరు : నమస్కారం.
గణే : మీతో వొక మనవి చేసుకోవాలని వొచ్చాం.
రణ : యేమిటది ?
అందరు : మాకు మా యువరాజు కావాలి.
రణ : యేమిటీ !
1 : యువరాజుని శివతరాయినుంచి తీసుకుపోతాం.
రణ : మీ సంతోషంలో శిస్తు చెల్లించటం సంగతే మరిచిపోయినట్టున్నారే.
అందరు : తిండిలేక చచ్చిపోతున్నాం.
రణ : మీ సర్దారెక్కడ ?
2 : (గణేశ్ వైపు చూపించి) యిదిగో యీాయనే మా సర్దారు.
రణ : యితను కాదయ్యా, మీ బైరాగి యెక్కడ ?
గణే : అదిగో రానేవస్తున్నాడు.

(ధనంజయుడు ప్రవేశిస్తాడు)

రణ : నువ్వేనా వీళ్లందర్నీ వెర్రెక్కించింది ?
ధనం : ఆహా, నాకూ వుంది కాస్త వెర్రి.

ఇది యేమి యున్మాద మీ అస్తమయవేళ !
ఏ మందపవనమ్ము లీ మోహనస్వరము
నాకాశవీధి పర్యంకమ్ము నింపెనో
ఏమి యున్మాదమిది యీా అస్తమయవేళ
పిలుపొకటె వినిపించు వీనులకు విందుగా
పిలుచు నాతండె కన్నుల గానగా రాడు.
గిరులపై వనులలో తిరిగి వేసారితిని
గాసిలి నిరాశతో కనలి విలపించితిని.

రణ : అదో నెపంపెట్టి అసలు సంగతి మరుగుపరచటం నీతరంకాదు. శిస్తు చెల్లిస్తారా లేదా, ఆమాట చెప్పండి.
ధనం : చెల్లించం, మహారాజా, చెల్లించం.
రణ : యేమిటీ మీ పొగరు !
ధనం : మీ సొమ్ము కాదే యిది, మీకెలా యిస్తాం.
రణ : మా సొమ్ము కాదూ ?

ధనం : మేం తినగా మిగిలింది మీ సొమ్ము, మా ఆకలి తీర్చుకోటానికి వున్నది మీ సొమ్ముకాదే.

రణ : నువ్వే నన్నమాట, వీళ్లందర్నీ శిస్తు చెల్లించవొద్దని చెప్పింది.

ధనం : భయంకొద్దీ వాళ్లు చెల్లిస్తామంటున్నారు. నేనే వారిస్తున్నాను. యేమనంటే, ప్రాణాలే అర్పించవలసి వొస్తే, మీకు ప్రాణభిక్ష పెట్టిన ఆ పరాత్పరుడికే కాని యింకొకరికి కాదూ అంటున్నాను.

రణ : కేవలం మీమీద నమ్మకంవల్ల వాళ్లు పైకి భయం లేనట్లుగా కనిపిస్తున్నారు. నిజమే. కాని ఆ నమ్మకం కాస్త బెదిరిపోయిందంటే, పదింతలు యెక్కువగా పైకి వుబుకుతుంది. అప్పుడు వాళ్ల చావు నిశ్చయం. యిటు చూడు, బైరాగీ, నీ నొసటిమీద దుఃఖం రాసివుంది.

ధనం : నా నొసటిమీద వున్న దుఃఖంవుందే, దాన్ని నా హృదయంలో పదిలంగా దాచుకున్నాను. అక్కడ దుఃఖానికి అతీతుడైన యీశ్వరుడే నివశిస్తాడు.

రణ : (ప్రజలతో) నామాట విని మీరందరూ శివతరాయికి తిరిగిపొండి. బైరాగీ నువుమాత్రం యిక్కడే వుంటావు.

అందరూ : మా బొందిలో ప్రాణాలుండగా అలా జరగదు.

ధనం : వుంటావంటున్నారు. యెవర్ని మీరుంచేది? బలవంతంగా లాక్కున్నదేదీ నిలవదు. నిలిచే దేదో అదే చివరకు నిలుస్తుంది. మహారాజా, బలవంతంగా నువు దేనినీ వశంచేసుకోలేవు. సులభంగా వుంచుకోతగిందే నీవశంలో వుంటుంది.

రణ : అంటే యేమిటి?

ధనం : యెవడైతే అన్నీ పరిత్యాగం చేస్తాడో, వాడికే అన్నీ వుండిపోతయ్. లోభంకొద్దీ బలవంతంగా వుంచుకొన్న సొమ్ము దొంగసొమ్మవుతుంది. అది నిలవదు. చెయ్యగలిగిందంతా చెయ్యండి మీ యిష్టంవొచ్చినట్లు. దేహబలంతో కొట్టండి, నిర్బంధించండి. ఆ బాధంతా యెవరి శరీరంలో స్పందిస్తుందో ఆ పరమేశ్వరుడే దాన్ని యెంతవరకు సహించాలో అంతవరకు సహిస్తాడు. మహారాజా, మీరు పొరపడుతున్నారు. ప్రపంచాన్ని బలాత్కరించి లాక్కుంటే మీవశం అవుతుందనుకొంటున్నారు. కాని, దేన్నైతే వొదులు

కొంటామో అదే మనకు దక్కుతుంది. దానిని గుంజుకోటానికి ప్రయత్నం చేశామా అంటే, అది చేయిజారిపోవటం తప్పదు. మీరు కావాలనుకుంటున్నదల్లా అవుతుందనుకుంటున్నారు. లోకమంతట్నీ మీరే తిప్పుతున్నామనుకుంటున్నారు. హఠాత్తుగా వొకనాడు కళ్లు తెరిచేసరికి, యేదైతే కాదనుకుంటున్నారో అదే అయితీరుతుంది.

రణ: మంత్రీ, యీ బైరాగి ధనంజయుణ్ణి బంధించి యిక్కడ వుంచెయ్.

మంత్రి: మహారాజా—

రణ: నే నిలా ఆజ్ఞాపించటం నీ కిష్టంలేనట్లుగా వుందిగదూ ?

మంత్రి: మీ శాసనం భయంకర యంత్రంలాగా సిద్ధమైవుండనేవుంది. దానికి తోడు భయోత్పాతాన్నికూడా కలిగిస్తే, అంతా తునా తునకలై పోతుంది.

ప్రజలు: యిలా జరిగితే, సహించటం కష్టం.

ధనం: నామాట విని, తిరిగి వెళ్లిపోండి.

ఒకడు: స్వామీ, మీరు వినలేదా యువరాజునుకూడా పోగొట్టుకున్నాం.

2: యిహ యెవర్నిచూసి మేము ధైర్యం తెచ్చుకోగలం ?

ధనం: కేవలం నా ధైర్యంతప్ప, మీదంటూ మీకే ధైర్యమూ లేదన్న మాట. యిదే కనక నిజమైతే, నన్నన్ని విధాలా దుర్బలుణ్ణి చేశారన్నమాట.

గణేశ్: అలాగని మమ్మల్ని నడమంత్రంగా వొదిలేయద్దు. మీరే లేకపోతే మాకు ధైర్యమెక్కడిది ?

ధనం: అలాగయితే నేను వోడిపోయినట్లే. నేను పక్కకు తొలిగిపోవాలి సిందే.

అందరు: యెందుకు స్వామీ ?

ధనం: నన్ను నమ్మి మీ బలాన్ని మీరు వంచించుకొని నష్టపడుతున్నారు. యింత నష్టాన్ని భర్తీచేయటానికి నాకు శక్తిలేదు. నాకు తల వొంపులుగావుంది.

ఒకడు: స్వామీ అదేంమాట. సరే తమరు యెలాచెపితే అలాగే చేస్తాం.

ధనం: నన్ను విడిచిపెట్టి వెళ్లిపొండి.

2: వెళ్లిపోయి యేం చేయమంటారు ? మమ్మల్ని విడిచిపెట్టి మీరుండ గలరా ? మామీద ఆమాత్రం అపేక్షలేదూ ?

ధనం : నా అపేక్షతో మిమ్మల్ని అణగదొక్కటంకంటే, మీమీద అపేక్షకొద్దీ నేను వెళ్లిపోవటమేమంచిది. వెళ్లిపోండి. యింకోమాటాడక వెళ్లిపోండి.

అందరు : స్వామీ, అలాగే వెళ్లుతున్నాం. కాని—

ధనం : కానీకాదు, గినీకాదు. నిశ్చింతగా వెళ్లిపోండి. తలెత్తుకొని మరీ వెళ్లిపోండి.

అందరు : చిత్తం, అలాగే.

ధనం : అలాగేనా వెళ్లిపోవటమంటే? చరచరా వెళ్లిపోవాలి.

గణేశ్ : చిత్తం స్వామీ. కాని మా బలమూ మా బుద్ధీ యిక్కడ్నే వొదిలి వెళ్లిపోతున్నాం.

(నిష్క్రమిస్తారు)

రణ : వైరాగీ, యేమిటలా మౌనంగా వున్నావు?

ధనం : నాలో నేను విచారిస్తున్నాను, మహారాజా.

రణ : యేమిటా విచారం?

ధనం : మీ చండపాలుడి దండంకూడా చేయలేనిపని నేను సులభంగా చేయగలిగాను. యిన్నాళ్లూ వీళ్లందర్నీ బలవంతుల్ని చేస్తున్నాననుకున్నాను. కాని యివాళ తెలుసుకున్నాను, వాళ్లబలాన్ని బుద్ధినీ పెంచడానికిబదులు నేనే తుంచేశానని.

రణ : యిదెలా సంభవించింది?

ధనం : నా మాటల్తో వారిని పరవశం చేశానుకాని తమ బుద్ధిని తామే వినియోగించుకొనేట్లు చేయలేక పోయినాను. అడ్డమయినవాళ్ల దగ్గరా అప్పులుచేసి, అటూయిటూ ఆదుర్దాపడుతూ తిరిగితే ఆ అప్పేమయినా తీరుతుందా? నేనేమో బ్రహ్మదేవుడికన్నా కూడా గొప్పవాణ్ణనుకొంటున్నారు వీళ్లు. వాళ్ల అప్పులన్నీ ఒక దెబ్బని రద్దు చేయించేశక్తి నాకున్నదనుకొంటున్నారు. అందుకోసం కళ్లు మూసుకొని గుడ్డిగా నా వెంటే బడుతున్నారు.

రణ : నువ్వో దేవతవని భావిస్తున్నారన్నమాట.

ధనం : వొచ్చి నాదగ్గిర్నే నిలిచిపోయారు. యింకా దేవత దగ్గిరకేంపోతారు? ఆ దైవసన్నిధికే పోతే లోలోపల వాళ్ల ప్రవృత్తులే మారిపోయేవి. నేనేమో బయటినుంచి వాళ్లను ఆదేశిస్తూ యెందుకూ కొరగానివాళ్లను చేశాను.

రణ : మహారాజుకు వాళ్లందరు శిస్తు చెల్లిస్తామంటే నీకు కష్టమనిపించింది. భగవంతుడికి అర్పణ చేయాలిసిన పూజాద్రవ్యాలు నీపాదాల ముందు పెడుతుంటే నీకేం కష్టంగాలేదూ ?

ధనం : లేకపోవడమేమిటి ? వీళ్లను తప్పించుకొని పారిపోదామని వుంది. ఆ పూలూపండ్లు నా ముందు పడేసి వాళ్ల దారినవాళ్లు వెళ్లిపోతారు. వాళ్ల అప్పులుతీర్చే భారంమాత్రం నామీద పడుతుంది. తీర్చిందాకా మాత్రం దేవుడు వొప్పుకోడు.

రణ : అలా అయితే యేమిటి కర్తవ్యం ?

ధనం : వాళ్లకు దూరంగావుండటమే. ముక్తధారను కట్టేసినట్లుగా, వాళ్ల మనస్సుల్ని నేను కట్టేసివున్నట్లయితే, ఆ విభూతితోపాటు నన్ను కూడా చేర్చి భగవంతుడు దండించితీరాలి.

రణ : అలా అయితే యింకా ఆలస్యం చేస్తావెందుకు. తొలిగిపో.

ధనం : నేనేకనక తొలగిపోతే వీళ్లందరూ వొక్కపాటున ఆ చండపాలుడి బుజమెక్కి మరీ కూర్చుంటారు. అప్పుడు నామీద పడవలసిన శిక్ష వాళ్ల నెత్తినపడుతుంది. యీ ఆలోచనతో కదలలేక పోతున్నాను.

రణ : నీ అంతట నీవు కదలలేకపోతే, ఆపని నేనే చేస్తాను. వుద్ధవా, యీ బైరాగిని మన శిబిరంలో ఖైదీగా వుంచు.

ధనం :

పాట

నీ శృంఖలమ్ములు నన్ను శిక్షింపగా లేవు
నీ ఆఘాతములు ప్రాణ మపహరింపగలేవు
తన చేతితో ముక్తిదాన పత్రమొసంగె
అది నా హృదంతరమ్మందె యున్నదిగాన
నీ బంధనమ్ము బంధింప జాలదు నన్ను.
ఏత్రోవ వత్తునో యేత్రోవ బోదునో
నిజమెరుంగగ గలరె నీ తలారులు వెదకి ?
ప్రభుమందిర ద్వార వర్తినౌ నన్నెవరు
వారింపగలరు నీ ద్వారమ్ము చొరనీక ?
ఎంత భయపెట్టినను సుంతయు భయంపడను.

(ధనంజయుడితో కలిసి వుద్ధవుడు నిష్క్రమిస్తాడు)

రణ : మంత్రీ, వోమారు కారాగారంలోకి వెళ్లి అభిజిత్తును చూసిరావూ? తను చేసిన పనికి యేమైనా పశ్చాత్తాపపడుతూవుంటే—

మంత్రి : మహారాజా, తమరే స్వయంగా వోసారి వెళ్లి—

రణ : కాదుకాదు. అతను స్వదేశ విద్రోహి. తన అపరాధం వొప్పుకోనంతవరకు అతని మొహం చూడను. నేను రాజధానీ నగరానికి వెళుతున్నాను. యేసంగతీ అక్కడికి కబురంపించు.

(నిష్క్రమిస్తాడు)

(భైరవ సన్యాసిదళం ప్రవేశిస్తుంది)

పాట

తిమిర హృద్విదారణ
జ్వలదగ్నిని దారుణ
మరుశ్మశాన సంచర
శంకర శంకర!

వజ్రఘోషవాణీ
రుద్రశూలపాణీ
మృత్యు సింధుసంతర
శంకర! శంకర!

(నిష్క్రమిస్తారు)

(వృద్ధవుడు ప్రవేశిస్తాడు)

వృ : యిదేమిటి, యువరాజును చూడకుండానే మహారాజుగారు వెళ్లిపోయారే?

మంత్రి : అతని మొహం చూడనన్న ప్రతిజ్ఞ భంగమవుతుందేమోననే భయంతో. ఆ ధనంజయుడితో యింతసేపు మాట్లాడుతూవుండటం కూడా ఆయన మనస్సులో యెటూ తేల్చుకోకపోవటం వల్లనే. శిబిరంలోపలికి పోలేకపోయారు, శిబిరాన్ని వొదిలిపెట్టి పోలేకపోయారు. పద, యువరాజును మనం చూనొద్దాం.

(నిష్క్రమిస్తారు)

(యిద్దరు స్త్రీలు ప్రవేశిస్తారు)

1 స్త్రీ : మాషీ, యెందుకూవాళ్లందరూ అంతకోపంగా వున్నారు? యువరాజు యేదో అధర్మం చేశాడంటున్నారు. యిదంతా

నాకేమీ అర్థం కావటంలా. వీళ్ళమాటలువిని సహించలేక పోతున్నాను.

2 స్త్రీ : వుత్తరకూటంలో పుట్టిన పిల్లవుకదా నువ్వు; నీకే అర్థంకావటం లేదూ. యువరాజున్నాడే ఆనందికూటంకనుమని తెరిచిపారేశాడు.

1 స్త్రీ : అందులో తప్పేముంది? యువరాజు అధర్మం చేశాడంటేమటుకు నేనెంతమాత్రం నమ్మలేక పోతున్నాను.

2 స్త్రీ : నువ్వింకా చిన్నదానివి, యెన్నోకష్టాలు పడితేనేకాని నీకు తెలిసి రాదు. పైకి బాగా కనిపించేవాళ్లందరూ అంతమంచి వాళ్లను కోటానికి వీల్లేదు.

1 స్త్రీ : యువరాజుమీద మీకందరికీ యేమిటీ అనుమానం?

2 స్త్రీ : అందరూ అంటున్నారు, మన యువరాజు శివతరాయి ప్రజలందర్నీ వశంచేసికొని వుత్తరకూటపు సింహాసనాన్ని యెప్పుడాక్రమిద్దామా అని తహతహలాడుతున్నాడట.

1 స్త్రీ : ఆయనకి సింహాసనంతో పనేముంది? అందరి హృదయాల్లోను ఆయన సింహాసనం వుండనేవుంది. ఆయన్ను నిందించే వాళ్లందరి మాటలు నమ్మటమేమిటి? ఆయన మాటలమీద నమ్మకం లేక పోవటమేమిటి?

2 స్త్రీ : యిష్, వూరుకో. యింతున్నావోలేదో, యేమిటీ పెద్దపెద్ద కబుర్లు. లోకమంతా అతన్ని ఆడిపోస్తుంటే, నువ్వేమో—

1 స్త్రీ : లోకమంతా వింటూండగానే నేనీమాట అంటాను.

2 స్త్రీ : వూరుకో, వూరుకో.

1 స్త్రీ : యెందుకూరుకోవాలి? నా కేడవాలనిపిస్తున్నది. అందరికన్నా నాకు యువరాజు మీదే యెక్కువ విశ్వాసంవుందని చూపించటానికి యేదన్నాచేసి చూపించాలనివుంది. పొడుగ్గావున్న నా యీ తల వెంట్రుకలు ఆ భైరవుడికి మొక్కుకుంటాను. తండ్రీ భైరవ స్వామీ, యువరాజు దేమీ తప్పుకాదనీ, తప్పంతా ఆయన్ని నిందించే వాళ్లదేననీ అందరికీ తెలియచేయమని ఆ మహానుభావుణ్ణి వేడుకుంటాను.

2 స్త్రీ : వూరుకో, వూరుకో. యెవరైనా వినగలరు. యీ పిల్ల కొంప మీదికి తెచ్చేట్టుందిసుమా.

(నిష్క్రమిస్తారు)

(వుత్తరకూట పౌరులు ప్రవేశిస్తారు)

1 వ: యింతటితో వొదలటమే! పదండి రాజుదగ్గరికి పోదాం.

2 వ: వెళ్లి యేంప్రయోజనం? యువరాజేమో మహారాజుగారి ముద్దుల కొడుకు. అతడుచేసిన అపరాధాన్ని ఆయన విచారిస్తాడా, మధ్య మనబోటి వాళ్లమీద విరుచుకుపడతాడు కాని.

1 వ: పడితేపడనీ, స్పష్టంగామాత్రం వున్నదున్నట్లు చెప్పేసేద్దాం. తర్వాత మన కర్మ యెలావున్నాసరే.

3 వ: వో చెంప ఆకాశంలో చందమామనైనా మీకోసం తీసుకొచ్చి యిస్తానన్నంత ప్రేమ చూపించాడు మనమీద, మళ్లీ చాటుమాటుగా యీ చేసేపనేమిటి? వుత్తరకూట ప్రజలమీదకన్న యీ శివతరాయి ప్రజలమీద యింత యెక్కువ ప్రేమ యెలా వొచ్చిపడ్డది?

2 వ: యీలా జరిగితే యిహ లోకంలో ధర్మమనేది నిలవటం యెలాగ? చెప్పుచూదాం.

3 వ: యెవణ్ణీ నమ్మటానికి వీల్లేదు.

1 వ: మహారాజే కనక యువరాజును శిక్షించపోతే ఆ పని మనమైనా చేసితీరాలి.

2 వ: యేం చేస్తావ్?

1 వ: యీ దేశంలో ఆయనకు చోటులేదు. తెరిచేసిన నందిసంకటంలో నుంచే ఆయన్ను బయటికి సాగనంపాలి.

3 వ: చబువా గ్రామస్థులేమో యువరాజు శివతరాయిలో లేడంటున్నారు. యిక్కడ రాజమందిరంలోనూ అతను కనిపించటంలేదు.

1 వ: యింక సందేహమేమిటి, మహారాజే అతన్ని దాచిపెట్టివుంటాడు.

3 వ: దాచిపెట్టాడంటావా? వుస్. గోడలకు చెవులుంటాయి.

1 వ: రాజమందిరానికి నిప్పంటించి మరీ బయటికి లాగుదాం.

3 వ: మమ్మల్నే మాయచేస్తారా? చచ్చినాసరే—

(వుద్ధవుడితో కలిసి మంత్రి ప్రవేశిస్తాడు)

మంత్రి: యేమిటి విశేషం?

1 వ: యీ దాగుడుమూతలు పనికిరావు. యువరాజును బయటపెట్టండి.

మంత్రి: ఆ పని చేయటానికి నేనెవర్ని ?

2 వ: మీ ఆజ్ఞప్రకారమేగదా ఆయన్ని—యిప్పుడేమో నేనెవర్ని అంటున్నారు. బలవంతంగా అతన్ని బయటికి లాక్కొస్తాం.

మంత్రి: సరే. మీ చేతుల్తోనే లాక్కోండి మీ రాజత్వాన్ని. రాజుగారిని ఖైదునుంచి విడిపించుకరండి.

3 వ: ఖైదులోనుంచా ?

మంత్రి: మహారాజాయన్ను ఖైదులో వుంచారు.

అందరు: మహారాజుకు జై ! వుత్తరకూటానికి జై !

2 వ: పదండిరా పోదాం ఆ ఖైదులోకి. అక్కడ్నుంచి—

మంత్రి: యేంచేస్తారు ?

2 వ: విభూతి మెడలోవేసిన పూలదండలోనుంచి పూలన్నీ తీసేసి ఆ తాడు యువరాజు మెడకు బిగించేద్దాం.

3 వ: మెడకెందుకు చేతులకు కట్టండి. ఆనకట్ట కట్టినందుకు సన్మానం చేసిన ఆ యెంగిలి పూలదండ తాడుతో శత్రు దేశానికి దారిచేసిన అతనిచేతులే కట్టేయండి.

మంత్రి: యువరాజు చేసినపని అపరాధం అంటున్నారుకదా, మీరు రాజ శాసనాన్నేధిక్కరిస్తే అదిమాత్రం అపరాధంకాదూ ?

2 వ: అది పూర్తిగా వేరేకథ. సరే, శాసనంధిక్కరించాం అనుకోండి. అయితే, యేమవుతుంది ?

మంత్రి: కాళ్లకింద నేల బాగాలేదని ఆకాశంలోకి దూకినట్లవుతుంది. అది కూడా అంత బాగావుండదని చెపుతున్నాను. మీకందరికీ నచ్చిన వ్యవస్థ నొకదానిని ముందుగా కల్పిస్తేనేకాని యిప్పుడున్న వ్యవస్థను నాశనం చేయకూడదు.

2 వ: సరే, ఖైదుమాట అలావుంచేయండి. రాజమందిరం ముందుకు పోయి, అక్కడ నిలబడి, మహారాజుకు జయజయ ధ్వానాలు వినిపించొద్దాం.

3 వ: యిదిగో ఆవైపు చూడండి. సూర్యుడస్తమించాడు. ఆకాశమంతా చీకట్లు కమ్ముతున్నాయి. కాని ఆ విభూతి నిర్మించిన యంత్ర శిఖరంవుండే యెర్రగా మెరుస్తూనేవుంది. సూర్యరశ్మి అనేకల్లుతాగి అంతా యెర్రబారినట్లుగావుంది.

2 వ : మునిగిపోతానేమోననే భయంతో అస్తమించే సూర్యుని వెలుతురు భైరవమందిరంమీద వున్న త్రిశూలాన్ని గట్టిగా కావలించుకొంది. యెంత అద్భుతంగావుంది !

(పౌరులు నిష్క్రమిస్తారు)

మంత్రి : యువరాజుని మహారాజుగారు యీ శిబిరంలోనే బందీగా యెందుకు వుంచమన్నారో యిప్పుడు నాకు తెలుస్తున్నది.

వృద్ధ : యెందుకు ?

మంత్రి : ప్రజలచేతుల్లో పడకుండా తప్పించటానికి. కాని పరిస్థితులేం బాగుండలా. ప్రజల దురావేశం మరీ పెచ్చుపెరిగి పోయింది.

(సంజయుడు ప్రవేశిస్తాడు)

సం : నేనింత ఆదుర్దాగావున్న సంగతి రాజుకు తెలియకుండా ప్రవర్తించాను. యెందుకంటే ఆ సంగతిగ్రహిస్తే, రాజు పట్టుదల మరీ యెక్కువై పోతుంది.

మంత్రి : రాజకుమారా ! మీరు శాంతంగా వుండాలి. యిప్పుడున్న వుత్పాతాన్ని మరీ జటిలంచేయకండి.

సంజ : విద్రోహం చేసి నేనుకూడా ఖైదీనయిపోదామనుకుంటున్నాను.

మంత్రి : అంతకన్న బయటనే వుండి యువరాజు బంధవిముక్తికోసం ప్రయత్నించండి.

సంజ : ఆ వుద్దేశంతోనే ప్రజల మధ్యకు వెళ్లి నిలబడ్డాను. వాళ్లు ప్రాణం కన్నా అధికంగా యువరాజును యెంతగా ప్రేమించేవారో ఆయన నిర్బంధాన్ని యెంత అసహనంతో చూసేవారో అనుకొన్నా. కానీ, నంది సంకటం కనుమను తెరిచింతరువాత వాళ్లందరూ యువరాజు మీద నిప్పులు కక్కుతున్నారు.

మంత్రి : అంటే కారాగారంలో వుండటమే యువరాజుకు క్షేమం అన్న మాట.

సంజ : చిరకాలంనుంచీ నేను ఆయనను అనువర్తిస్తున్నాను. అలాగే యిప్పుడుకూడా నన్నాయనతోబాటు ఖైదులోకి పంపండి.

మంత్రి : దానివల్ల యేమి ప్రయోజనం ?

సంజ : యీ ప్రపంచంలో యే వ్యక్తి యేకాకిగా వున్నంతకాలం సగం మనిషిగానే వుంటాడుకాని పూర్తిమనిషిగా వుండడు. వేరొకడి

సాంగత్యం లభిస్తే అప్పుడే అతనికి యేకత్వం లభిస్తుంది. యువరాజుకూ నాకూ అలాంటిదే సంబంధం.

మంత్రి: రాజకుమారా, ఆ సంగతి నేనెరుగుదును. ఆ యేకత్వాన్ని పొందటానికి వొకరికొకరు దగ్గరగావుండవలసిన అవసరమే లేదు. ఆకాశంలో వున్న మేఘం సముద్రంలో వున్న జలమూ—రెండూ వొకటే అయినా పైకి వేరు వేరుగా వుండటంవల్ల తమ యేకత్వాన్ని సార్థకం చేసుకుంటున్నాయి. యువరాజు బయటలేడన్న కొరత లేదు. మీరున్నచోటల్లా ఆయన వుండనేవున్నారు.

సంజ: మంత్రీ! యీ మాటలు మీరంటున్నట్టుగా నా కనిపించటంలేదు. అదేమో యువరాజే మాట్లాడుతున్నట్లనిపిస్తున్నది.

మంత్రి: ఆయన మాటలు మనం పీల్చే గాలిలోనే మిశితమైపోయినాయి. ప్రసంగిస్తున్నానన్నమాటేగాని యీ మాటలు నావో అతనివో పోల్చుకోలేకుండా వున్నాను.

సంజ: కాని నా మంచికోసమే మళ్లీ ఆ సంగతి జ్ఞాపకంచేశారు. దూరంగా వుంటూనే ఆయన పని నెరవేరుస్తాను. నే పోయొస్తాను, మహారాజుదగ్గిరికి.

మంత్రి: యెందుకోసం?

సంజ: శివతరాయిని పరిపాలించే భారాన్ని నామీదవుంచమని వేడుకొంటాను.

మంత్రి: యిది చాలా క్లిష్టమైన సమయం. యిప్పుడే—

సంజ: అందువల్లనే యిది చాలా అనుకూలమైన తరుణంకూడాను.

(యిద్దరూ నిష్క్రమిస్తారు)

(విశ్వజిత్తు ప్రవేశిస్తాడు)

విశ్వ: యెవరది, వృద్ధపుడేనా?

వృద్ధ: అవును మహారాజా.

విశ్వ: అంధకారంకోసం నిరీక్షిస్తున్నాను. నా వుత్తరం అందిందా?

వృద్ధ: అందింది.

విశ్వ: దానిప్రకారం పని నడిచిందా?

వృద్ధ: కొద్ది క్షణాల్లోనే తమరు తెలుసుకోగలుగుతారు. కాని—

విశ్వ: మనస్సులో యేమీ సంకోచించకు. మహారాజు స్వయంగా తానే విడిపించటానికి మాత్రం యిష్టపడటంలేదు. కాని తనకు

తెలియకుండా యింకెవరైనా విడిపించినట్లయితే మాత్రం సంతోషిస్తారు.

వృద్ధ : కాని ఆ విడిపించినవాణ్ణి మాత్రం క్షమించరు.

విశ్వ : నా సైన్యముందికదా, వాళ్లు నిన్ను నీ వెంటవున్న వాళ్లను బంధించి తీసుకుపోతారు. ఆ బాధ్యతంతా నాది.

నేపథ్యంలో : మంట! మంట!

వృద్ధ : అనుకొన్నంతా అయింది. కారాగారపు వంటింటి పక్కన గుడారం నిప్పంటుకొన్నది. యీ సందడిలో ఖైదీలిద్దరినీ విడిపిస్తాను.

(అభిజిత్తు ప్రవేశం)

అభి : యిదేమిటి యిక్కడున్నారు?

విశ్వ : నిన్ను ఖైదీగా తీసుకుపోవటానికే వొచ్చాను. నువ్వు మోహన్‌గడానికి వెళ్లాలి.

అభి : నన్నెవరూ యివాళ బంధించలేరు—క్రోధంవల్లకాని స్నేహంవల్ల కాని యీ నిప్పంటించింది మీరే ననుకొంటున్నారు. ఆ మాట నిజంకాదు. యేదోవిధంగా మీ రంటించకపోయినా యీ నిప్పంటుకొనేదే. నే నివ్వాళ బందీగావుండే అవకాశం లేదు.

విశ్వ : యెందుకని? నువేం చేయదలచుకొన్నావ్?

అభి : యీ భూమ్మీద పుట్టిన రుణం తీర్చుకోవాలి. ముక్తధారా ప్రవాహమే నన్ను వుగ్గుపాలతో పెంచిన దాది. ముందుగా ఆమె బంధ విమోచనం చేయాలి.

విశ్వ : దానికింకా చాలా వ్యవధివుంది. యిప్పుడప్పుడే కాదు.

అభి : ఆతరుణం యిప్పుడేనని మాత్రం నాకు తెలుసు. మళ్లీ యెప్పుడైనా ఆ తరుణం వొస్తుందో రాదో మాత్రం నాకు తెలియదు.

విశ్వ : మేంకూడా నీతోవొచ్చి చేయూత యిస్తాము.

అభి : అలాక్కాదు. దైవం అందరికీ వొకటే పని విధించదు. యీ పని మాత్రం కేవలం నేనొక్కణ్ణే చేయాలిసిన పని.

విశ్వ : శివతరాయిలోవున్న నీ భక్తులందరూ నీకు సహాయంగా వుండటానికి వుబలాటపడుతుంటారుగదా, వాళ్లను పిలవనంపవూ?

అభి : యివ్వాళ నే విన్నపిలుపు వాళ్లక్కూడా వినిపిస్తే నాకోసం యెదురు చూస్తూకూర్చోరు. నేనేకనక వాళ్లను పిలిస్తే వాళ్లుదారితప్పిపోతారు.

విశ్వ: నాయనా అన్నివైపులా చీకటి కమ్ముతున్నది.

అభి: ఆ పిలుపు వినిపించిన వైపునుంచే వెలుతురుకూడా వొస్తుంది.

విశ్వ: నిన్నాపగలిగినశక్తి నాకు లేకుండాపోయింది. యీ చీకటి దారిలోపడి వొక్కడివే వెళ్లిపోతున్నావ్. నే చేయకలిగిందేమీ లేక కేవలం నీకు వీడ్కోలుచెప్పి నేను తిరిగిపోవలసిందే. వొక్కమాట చెప్పి నాకు వూరట కల్పించు. మళ్లీ మన మెన్నడైనా కలుసుకుంటామా ?

అభి: మనిద్దర్నీ విడదీయడం సాధ్యంకాదు, ఆమాట మాత్రం మనసులో వుంచుకోండి.

(నిష్క్రమిస్తారు)

(ధనంజయుడు ప్రవేశిస్తాడు)

పాట

సోదరా! వైశ్వానరా!
పాడెదను నీ విజయగాథ!
సకల శృంఖలములను సమయింపగా గల్గి
అరుణారుణమ్ముగా మెరయు నీ మూర్తితో
సరివచ్చు మూర్తి యెచ్చటను గానగరాదు.
ఏ పాటతో నీదు హృదయముప్పొంగెనో
చేదోయితో నింగి చెరగులాడించేవు.
భయరహిత మానందమయమైన నృత్యమిది
వర్ణింపగారాదు భళి! యేటి నృత్యమో!
భవబంధ మోచన ప్రాప్తిగల్గిన నాడు
ఖైదు తలుపులకున్న గడియలు తొలగిపోవు
కరచరణ రజ్జువులు కాలి బూడిదయౌను
నాదేహ మానాడు నీ దేహమునజేరి
నవనవారుణముగా నాట్యమ్ము సేయు.
దాహమ్ములెల్ల నీ దాహమున దగ్ధమై
అనాడె అశుభమ్ము లన్నియును నశియించు.

(భట్టు ప్రవేశిస్తాడు)

భట్టు: స్వామీ! పొద్దు గూకింది. అంతటా అంధకారమయమైపోయింది.

ధనం : నాయనా! మన కెప్పుడూ పైకి కనిపించే వెలుతురుమీదే నమ్మకం. అది మాయమైపోయి చీకటి పడగానే మన కెక్కడ చూసినా చీకటే కనిపిస్తుంది.

భట్టు : భైరవుడి నృత్యం యివ్వాళ ప్రారంభమవుతుందని భావించాను. కాని మన యంత్రరాజు విభూతి ఆ స్వామి కరచరణాలుకూడా యంత్రంతో బంధించాడో యేమో ?

ధనం : భైరవస్వామి నృత్యం యెప్పు డారంభమవుతుందో మనక్కనిపించదు. అది సమాప్తం కాబోయేటప్పుడే మనకు గోచరిస్తుంది.

భట్టు : ప్రభూ! మా కాత్మవిశ్వాసాన్ని ప్రసాదించు. యేదో మహాభయం మాలో ప్రవేశించింది. మేలుకో, భైరవస్వామీ! మేలుకో! దీపం ఆరిపోయింది. దారి కనిపించదు. మృత్యుంజయా యే ఆనవాలూ కంటబడదు. నీ భయానకమూర్తితో మా భయాన్ని విదళించు. మేలుకో, భైరవస్వామీ మేలుకో!

(నిష్క్రమిస్తాడు)

(వుత్తరకూట పౌరులు ప్రవేశిస్తారు)

1 వ : అంతా అబద్ధం. మన రాజధాని కారాగారంలో ఆయన లేడు. యెక్కడో దాచేశారు.

2 వ : యెక్కడ దాచేస్తారో చూద్దాం.

ధనం : యెక్కడా దాచిపెట్టటం వాళ్ల తరంకాదు. అడ్డుగోడలు పడిపోతాయి. తలుపులు చెక్కలైపోతాయి. అన్నిటినీ చీల్చుకుని మరీ వొస్తుంది వెలుతురు. అన్నీ బట్టబయలవుతాయి.

1 వ : యెవడ్రా వీడు! చూడగానే వొళ్లు ఝల్లుమన్నది!

3 వ : సమయానికే దొరికాడు. యెవడో వొహడు కావాలిగద మనకు. యీ బైరాగిని పట్టి కట్టేయండి.

ధనం : పట్టుబడటానికి సిద్ధమై కూర్చున్నవాణ్ణి, యెలా పట్టుకుంటారు ?

1 వ : నీ సన్యాసివేష మలా వుంచవోయ్. మేమదంతా లెక్కచెయ్యం.

ధనం : అజగత్ప్రభువే స్వయంగా తన చేతుల్లోకి తీసుకుని, లెక్కచేసేటట్లు చేస్తాడు - మీ రదృష్టవంతులు - కొందరు నిర్భాగ్యులున్నారు - వాళ్లు మితిమీరిన గౌరవం చూపిస్తూ గురువునే పోగొట్టుకున్నారు.

వాళ్ల హద్దుమీరిన భక్తినుంచి తప్పించుకోటానికి దేశ త్యాగంచేసి మరీ వొచ్చాను.

1 వ : యెవరా గురువు ?

ధనం : వాళ్లను దండించేవాడే వాళ్ల గురువు.

1 వ : అలా అయితే నీమీద మేమెందుకు గురుత్వం చలాయించకూడదు ?

ధనం : అది నా కిష్టమే నాయనా. సరిగ్గా పాఠం నేర్చుకున్నానో లేదో మాత్రం తెలుసుకోండి. పరీక్ష చేయండి.

2 వ : మా యువరాజు కీతెలివి తేటలన్నీ నేర్పింది నువ్వేనని అనుమానంగా వుంది.

ధనం : మీ యువరాజుకున్న తెలివితేటలు నాకు లేవు. ఆయన నాకన్నా నేర్పరి.

2 వ : చూశావా ? యేదో వుంది దీంట్లో. వీళ్లిద్దరూ కలిసి యేదో తమాషా చేస్తున్నారు.

1 వ : లేకపోతే యింత రాత్రివేళ యిక్కడ తిరుగుతూ వుండటమెందుకు ? యువరాజుని శివతరాయికి తీసుకుపోవటాని కిదో యెత్తు. కాళ్లూ చేతులూ కట్టిపారేసి వీణ్ణిక్కడ్డే వుంచేద్దాం. యువరాజు ఆచూకీ తెలిసింతర్వాత వీడి సంగతి తేల్చుకుందాం. వొరే కుందన్ ! చూస్తావేం కట్టి పారెయ్యక. తాడూగీడూ నీదగ్గిరే వున్నాయి.

కుందన్ : యిదుగో తాడు. తీసుకుని నువ్వే కట్టేయ్.

2 వ : వొరే నువ్వూ, వుత్తరకూటంలో పుట్టలేదురా ? తే, యిలా తే. (కడుతూ కడుతూ) యెలావుంది. గురువుగారేమంటారు ?

ధనం : జగత్ప్రభువు కట్టే కట్టుబాట్లు గట్టిగా వుండిపోతాయి. సులభంగా వూడిరావు.

(భైరవ భక్తులు ప్రవేశిస్తారు)

తిమిర హృద్విదారణ
జ్వలదగ్ని నిదారుణ
మరు శ్మశాన సంచర
శంకర శంకర !
వజ్రఘోష వాణీ
రుద్రశూల పాణీ

మృత్యు సింధు సంతర
శంకర శంకర !

కుందన్ : అటు చూడు ! సందె వెలుగు తగ్గినకొద్దీ యంత్ర శిఖరం యెలా నల్లనై పోతున్నదో !

1 వ : పగలల్లా సూర్యుడికి పోటీగా మెరిసిపోతుంది. రాత్రిళ్లు చీకటినే మించిపోతుంది. అదో పెనుభూతంలా వుంది.

కుందన్ : విభూతి ఆ యంత్రాన్నిలా యెందుకు నిర్మాణంచేశాడో ? వుత్తరకూటంలో యెటుచూసినా యిది కనిపించక తప్పదు - యేదో వికట ఛీత్కారంలాగా.

(నాలుగో పౌరుడు ప్రవేశిస్తాడు)

4 వ : యిప్పుడే కబురొచ్చింది. ఆ మామిడి తోటకు వెనగ్గావున్న రాజ శిబిరంలో యువరాజుని దాచారు.

2 వ : అదీ సంగతి ! అందుకోసమే ఆ బైరాగి యీ ప్రాంతంలో తారట్లాడు తున్నాడు-వాణ్ణిక్కడే బంధించి వుంచండి - మనంపోయిచూశొద్దాం.

(పౌరులందరూ నిష్క్రమిస్తారు)

ధనం :

పాట

ఓ మధురగాయన మణీ ! గుణీ !
తంత్రులను సరిచేసినంత నీ
పని తీరిపోవునా ?
శ్రుతిచేసికొన్న వీణావాద్య
మిట్టులే పడియుండునా ?
నీ కరాంగుళులు సోకకయున్న
సుస్వరము మేలుకొనునా ?
లజ్జాభరమున తీగలతూగి
రాగమ్ముమూగవోదా ?
ఓ మధురగాయన మణీ ! గుణీ !

1 వ : యేమిటిదంతా ? మహారాజాగారి పినతండ్రి ప్రహరీలందరితోసహా యువరాజును మోహాన గడానికి తీసుకుపోయారు. దీని కర్థం యేమయ్యుంటుంది ?

కుందన్ : వుత్తరకూట రక్తమేగదా ఆయన నరాల్లోకూడా ప్రవహించేది. యిక్కడ తగురీతిగా విచారణ జరగదనే భయంతో బలవంతంగా లాక్కుపోయుంటాడు—

1 వ : యిది చాలా అన్యాయం. దీన్నే అత్యాచారమంటారు - మన యువరాజును శిక్షించే అధికారం మనకు లేదూ ?

2 వ : దీనికోవుపాయం వుంది—బోధపడలా ?

1 వ : అవునవును. వాళ్ల బంగారపు గనివుందే—

కుందన్ : తెలుసునా ? వాళ్ల కెంతలేకపోయినా యాభై వేల గోవులున్నాయి.

1 వ : వాటన్నిటినీ లెక్కపెట్టి చూస్తే - యేమన్యాయం ! భరించటం కష్టం ...

3 వ : అదలావుంచి, కుంకుమపువ్వు పండించే వాళ్లపొలంమీద కనీసం సంవత్సరానికి—

2 వ : అవునవును. అదంతా నష్టపరిహారంకింద మనకు వొప్పచెప్పాలిసిందే - అవునుగాని యీ బైరాగినేం చేద్దాం ?

1 వ : వాణ్ణక్కణ్ణే వుణ్ణీయండి—

(పౌరులు నిష్క్రమిస్తారు)

ధనంజయుడి పాట

నేలపై పారవైచిన యంతమాత్రాన
నిలుచునా అది యచటనే ? ఓ బుద్ధిహీనుడా !
ఎవడో ఒకడు దాని వెల యెరింగినవాడు
ఎత్తుకొని పోకుండునా ? ఓ బుద్ధిహీనుడా !
అదె చూడు రత్నమును ! మృత్తికకు దానిపై
హక్కుగలదని యందువా ?
ఈ రత్నమే పోయెనేని యా ప్రభు కంఠ
హారమే వృథయౌను గాదా ?
రత్నమన్వేషించు దూతలరుగో ! వారి
రాకపోకల చూడలేవా ?
అవహేల నెంతగా సలిపినను ప్రభువునకు
ఆదరమ్మె హెచ్చిపోదా ?

వ్యథపెట్టు మానవుల వ్యథలన్నిటిని మోయు
ప్రభువు తానహియించి యూరుకొనునా ?

(కుందన్ ప్రవేశిస్తాడు)

కుందన్ : స్వామీ, మీకట్లన్నీ తెంపేస్తాం - అదో తప్పుగా భావించకండి. వెంటనే యింటికి పారిపోండి - యీరాత్రి యేం జరుగుతుందో——

ధనం : యీ రాత్రి యేం పిలుపు వొస్తుందో. అందుకనే యింటికి పోలేకపోతున్నాను——

కుందన్ : యిక్కడ పిలుపేం వొస్తుంది ?

ధనం : వుత్సవం ముగిసేవేళకు.

కుందన్ : మీది శివతరాయి గ్రామంకదా, వుత్తరకూటపు వుత్సవంతో యేంపని ?

ధనం : భైరవస్వామి వుత్సవం - శివతరాయివారి ఆరతులెత్తటమే మిగిలిపోయింది.

(నేపథ్యంలో - మేలుకో భైరవస్వామీ మేలుకో)

కుందన్ : యిదంతా నాకేం బాగుండలా - నే వెళ్ళిపోతాను.

(యిద్దరూ నిష్క్రమిస్తారు)

(వుత్తరకూటపు రాజ దూతలిద్దరు ప్రవేశిస్తారు)

1 వ : 'నవసాను' లో గొర్రెమందలు కాసేవాళ్ల నడిగితే యువరాజుగారీ దారి వెంటనే పడమటి దిక్కుగా వెళ్లారన్నారు.

2 వ : యీ రాత్రి ఆయనెక్కడున్నా వెతికి పట్టుకోవాలి - అది మహారాజుగారి ఆజ్ఞ.

1 వ : ఆయన్ని మోహనగడానికి తీసుకుపోయారని వో వార్త బయల్దేరింది. ఆ వెర్రి మనిషి అంబ చెప్పినదాన్ని బట్టి చూస్తే ఆమె చూసింది మన యువరాజేననీ, ఆయన యీదారి వెంటనే పోయారనీ తెలుస్తుంది.

2 వ : కాని యింత అంధకారంలోబడి వొంటరిగా యెక్కడికి పోవటానికో నా కర్థంకాకుండా వుంది.

1 వ : దీపం లేకపోతే వొక్కడుగేనా కదపలేం మనం. కొత్వాలు దగ్గిర్నుంచి వో దీపం అడుక్కొద్దాం పద.

(యిద్దరూ నిష్క్రమిస్తారు)

(వొక పథికుడు ప్రవేశిస్తాడు)

పథికు : (బిగ్గరగా) ఒరే బూధన్ ! శంభూ - ఊ - ఊ ! నన్ను గంగలో దించారు - నువు ముందుగా పో, అడ్డు దార్నే వొచ్చి నిన్ను కలుసుకుంటామని చెప్పారు - వొక్కడూ కనిపించడు - యీ అంధకారంలో ఆ యంత్రం వెక్కిరిస్తున్నట్లుంది. భయం వేస్తున్నది. యెవరా వొచ్చేది ? యెవరు ? మాట్లాడవేం ? బూధనువేనా నువ్వు ?

2 వ పథి : నా పేరు నిముకు. వొత్తులమ్ముకునేవాణ్ణి. రాజధాని అంతటా రాత్రంతా దీపాలు వెలుగుతాయిగదా ! వాటికి వొత్తులు కావొద్దూ ? నువ్వెవరివి ?

1 వ పథి : నా పేరు హుబ్బా. యాత్రిక దళంలో పాటపాడతాను - దారిలో యెక్కడా మా ఆందూ - అధికారి దళం కనిపించలా ?

నిముకు : దారినిండా యెందరో మనుషులుంటారు - వాళ్లెవరో తెలుసుకోట మెలా ?

హుబ్బా : యెందరుంటేనేం. వాడి సంగతివేరు - మా ఆందూ వున్నాడే వాడు నిండైన మనిషి - యెంత గుంపులోవున్నాసరే యెత్తి చూపించక్కర్లేదు వాణ్ణి. అందర్నీ మాటుచేసి వాడే ముందు కనిపిస్తాడు - అవునుగాని నీ గంపలో చాలా వొత్తులున్నాయి, నాకో వొత్తియవూ ? యింట్లో వున్నవాళ్లకన్న బైటతిరిగే వాళ్లకే దీపాలవసరం కద !

నిముకు : యెంత ధరకు తీసుకుంటావ్ ?

హుబ్బా : డబ్బేవుంటే నీతో సరిసమానంగానే మాట్లాడుదును - యింత బతిమాలుతూ మాట్టాడట మెందుకూ ?

నిముకు : విదూషకుడివా నువ్వు ?

(నిష్క్రమిస్తాడు)

హుబ్బా : వొత్తియిమ్మంటే యియ్యలేదుగాని నన్ను విదూషకుడన్నాడు - అదిమాత్రం తక్కువ సంగతా ? విదూషకుడి లక్షణమేవిటంటే యెంత చీకటికమ్మినా యిదిగో నేనిక్కడున్నాననిపిస్తాడు-అబ్బ యీ పాడు కీచురాళ్ల రొద ! ఆకాశానికి చిల్లులు పొడుస్తున్నది ! ఆ వొత్తులమ్మే వాడితో హాస్యమ్మానేసి బందిపోటు సాగిస్తే పని జరిగిపోయేది.

(యింకో పథికుడు ప్రవేశిస్తాడు)

పథికుడు : ఎహేయ్ !

హుబ్బా : అలా ఝుడిపిస్తా వెందుకయ్యా ?

పథికుడు : యిహానడు !

హుబ్బా : నడుద్దామనే బయల్దేరాను. మా ముఠాలోవున్న వాళ్లందర్నీ వొదిలేసి నడచిపోదామనుకుంటే వొక్కడుగైనా వెయ్యాలేక పోతున్నానే — దీని అంతరార్థమేవిటో తెలుసుకుందామని ప్రయత్నిస్తున్నాను—

పథికుడు : మీ ముఠాలో తక్కిన వాళ్లంతా తయారుగా వున్నారు - నువ్వెళ్లి వాళ్లను కలుసుకోటమే తరువాయి.

హుబ్బా : యేమిటీమాటలు ? మేము తీన్మోహన గ్రామవాసులం - మా కందరికీ వో దురభ్యాసం వుంది - స్పష్టంగా వుంటేనేగాని మా కేమాట అర్థంకాదు - మా ముఠాలో తక్కిన వాళ్లంటున్నావే వాళ్లెవరు ?

పథికుడు : మేము చబువా గ్రామవాసులం - మాకూ వో దురభ్యాసం వుంది - అదేవిటంటే స్పష్టంగా తెలియచెయ్యటం - ఆ అభ్యాసంతో మా చేతులు పండిపోయినాయి. (వొక్క తోపుతోసి) అర్థమయిందా, యీసారి ?

హుబ్బా : ఆ. సరాసరిగా అర్థమైంది. నా కిష్టమున్నా లేకపోయినా పోయితీరాలిసిందే. కాని యెక్కడికో కాస్త చెప్పండి. యిందాకటి కన్న కొంచెం మృదువుగా మాత్రం జవాబు చెప్పండి - మీ మొదటి తోపుతోనే నా మనస్సుకు సందేహ నివృత్తి అయింది.

పథికుడు : శివతరాయికి పోవాలి.

హుబ్బా : యీ అమావాస్య చీకట్లోనా ? యేవిటక్కడి భాగోతం ?

పథికుడు : నంది సంకటం కనుమ కడ్డంగా కట్టిన కోట పడగొట్టారుగద. దాన్ని మళ్లీ నిర్మించాలి. అదీ భాగోతం.

హుబ్బా : నా చేతనా పడిపోయిన కోట కట్టించటం ? అన్నా, యీ చీకట్లో నా వాలకం నీక్కనిపించటంలేదు. అందుకనే యింత కఠినంగా మాట్లాడుతున్నావ్. నేనుందే—

పథికుడు : నువెలా వుంటేనేం ? నీకు రెండు చేతులున్నాయా లేదా ?

హుబ్బా : చేతులంటూ లేకపోలేదన్న మాటేగాని, వీటిని—

పథికుడు : చేతుల్తో పరిచయం నోటిమాటల్తో కాదు - తగిన స్థానంలోనే అవుతుంది - లే, యిహ లేచి నడు.

(రెండో పథికుడు ప్రవేశిస్తాడు)

2 వ పథికుడు : యింకో మనిషిని పట్టుకొచ్చానోయ్ కంకర్ !

కంకర్ : యెవడు వాడు ?

3 వ : నే నెవర్నీ కాదు నాయనా. నా పేరు లక్ష్మణ్. పుత్తూర భైరవ మందిరంలో గంట మోగిస్తూవుంటాను.

కంకర్ : మంచిమాటే - దృఢమైన చేతులేనన్నమాట - నడు నడు శివతరాయికి.

లక్ష్మణ్ : అలాగే వెళ్తాను. కాని మందిరంలో గంట కొట్టటానికి—

కంకర్ : ఒరేబాబూ ! భైరవుడు తన గంట తనే వాయించుకోవాలి.

లక్ష్మణ్ : అయ్యా కటాక్షించండి ! నా భార్య రోగంతో తీసుకుంటున్నది.

కంకర్ : నువు వెళ్లిపోతే రోగమైనా తగ్గొచ్చు, దాన్తో నీ భార్య దాటిపోయినా పోవొచ్చు - నువుంటేమాత్రం యింకోవిధంగా అవుతుందా ?

హుబ్బా : వోరె అన్నా ! నోరు మూసుకుని అర్థంచేసుకో. యీ పనిలోకి పోవటంలో ప్రమాదం లేకపోలేదు, కాని పోకపోవటంలో వున్న ప్రమాదంకూడా యేం తక్కువలేదు. నాకప్పుడే కొంత అనుభవమైంది.

కంకర్ : అదుగో నరసింహుడి గొంతు వినిపిస్తున్నది. యేంరా నరసింహా మంచి కబురేమన్నా తెచ్చావా ?

(కొంతమందితో కలిసి నరసింహుడు ప్రవేశిస్తాడు)

నరిసిం : యిదుగో చూడు ముఠాకట్టి మరీ తీసుకొచ్చాను. యింకా కొన్ని ముఠాలు ముందే పంపించాను.

కంకర్ : అలా అయితే పద, దారిలో యింకా కొంతమందిని కూడ గట్టుకోవొచ్చు.

ముఠాలో వొకడు : నే రాను.

కంకర్ : యెందుకురావు ? యేమొచ్చింది ?

ముఠాలో వొకడు : యేం రాలేదు. నేమాత్రం రాను.

కంకర్ : నరిసింహా వాడి పేరేమిటి ?

నరిసింహా : వాడి పేరు బన్వారి. కలవ గింజలతో దండలు కడతాడు.

కంకర్ : సరే వీడి సంగతేదో కాస్త కనుక్కుంటాను. యెందుకు రావో చెప్పు.

బన్వారి : నా కిష్టంలేదు - శివతరాయి వాళ్లతో నాకే వైరమూ లేదు - వాళ్లు మనకు శత్రువులు కారు.

కంకర్ : సరే మనమే వాళ్ల శత్రువులం. అలాంటప్పుడు మన మేదైనా చెయ్యొద్దూ ?

బన్వారి : అన్యాయం చెయ్యటం నావల్ల కాదు.

కంకర్ : న్యాయాన్యాయ విచారణ చేసే స్వాతంత్ర్యం వుంటే అప్పుడన్యాయం అన్యాయమవుతుంది. వుత్తర కూటం విరాట్ స్వరూపం. దాంట్లో నువ్వూ నేనూ అంశమాత్రులం. నీద్వారా జరిగే యీ పనిలో నీకేబాధ్యతా లేదు.

బన్వారి : వుత్తర కూటాన్ని మించిన మరో విరాట్ స్వరూపంకూడా వుంది. అందులో వుత్తరకూటమూ, శివతరాయికూడా అంశలే.

కంకర్ : వొరే నరిసింహా వీడో తర్కపండితుడురా - యీ తర్కంకన్న దేశానికి వేరే అనర్థంలేదు.

నరిసింహా : కష్టమైనపనిలో పెడితే తర్కంగిర్కం మాయమైపోతుంది. అందుకే వీణ్ణి లాక్కొచ్చాను.

బన్వారి : అలాగయితే నేనుండటం మీకు భారమేకాని, యే పనికీ నేను పనికిరాను.

కంకర్ : వుత్తరకూటానికే నువ్వు భారం. ఆ బరువు వొదిలించుకోటానికే యీ వుపాయం.

హుబ్బా : వొరే బన్వారీ ! యే విషయమైనా వాదప్రతివాదం చేసి గ్రహించాలనుకుంటావు నువ్వు. యే వాదంతోనూ నిమిత్తం లేకుండా గ్రహించేవాళ్లతో నీకెందుకీ కీచులాట. చేతనైతే వాళ్ల పద్ధతిని అర్థంచేసుకుని అనుసరించు. లేకపోతే నీ పద్ధతిని వుపసంహరించుకుని మౌనంగా వుండిపో.

బన్వారి : నీ పద్ధతేమిటి చెపూ్పా ?

హుబ్బా : నే పాట పాడతాను. అది వాళ్లకు గిట్టదు. అందుకని గొంతెత్తటమే మానేశాను. లేకపోతే యీపాటికి తానమూ పలవీ కూడా అందుకునేవాణ్ణి.

కంకర్ : (బన్వారితో) అయితే యేమిటి నీ అభిప్రాయం ?
బన్వారి : వొక్కడుగైనా కలదను.
కంకర్ : అలాగయితే మేమే కదిలిస్తాం. వీణ్ణి కట్టిపారెయ్యండి.
హుబ్బా : అన్నా కంకర్. నేనో మాట చెబుతాను, కోపం తెచ్చుకోకుండా వుంటే, వీణ్ణి మోసుకుపోయే బదులు, ఆ శక్తి కాస్తా మనపనిలోనే విని యోగిస్తే మంచిదిగద.
కంకర్ : వుత్తరకూటానికి సేవచెయ్యటం ఇష్టంలేని వాళ్లందర్నీ అదుపులో పెట్టటంకూడా ముఖ్యమైనపనే. ఆ మాట మాత్రం మనసులో వుంచుకో. సమయం మించిపోలేదు.
హుబ్బా : యింతకుముందే వుంచుకున్నాను.

(నరసింహా, కంకర్ తప్ప తక్కిన వాళ్లందరూ నిష్క్రమిస్తారు)

నరిసింహా : అదుగో వొస్తున్నాడు విభూతి. యంత్రరాజ విభూతికి జై !

(విభూతి ప్రవేశం)

కంకర్ : పని బాగా సాగింది. పని వాళ్లను కూడా యెక్కువగానే పోగు చేశాం. కాని మీరిక్కడున్నారేం ? అంతా మీ కుత్సవం చెయ్యటానికెదురు చూస్తూవుంటే ?
విభూతి : నా మనసు వుత్సవం మీదికి పోవటంలేదు.
నరిసింహా : యెందుకని ?
విభూతి : నా ప్రతిష్ఠ తగ్గించటానికే సరిగ్గా యివ్వాళ నందిసంకటంలో కోట పడిపోయిందన్న వార్తవొచ్చింది. నాకు ప్రత్యర్థిగా యెవరో యిదంతా నడుపుతున్నారు.
కంకర్ : యంత్రరాజా ! యెవరా ప్రత్యర్థులు ?
విభూతి : పేరు చెప్పదలుచుకోలేదు. అందరికీ తెలిసిందే. వుత్తరకూట ప్రజలు తమ ఆదరాన్ని యెవరికెక్కువగా చూపిస్తారు ? అతనికా, నాకా ? అదీ సమస్య. మీకో విషయం తెలియదు – నా మనస్సు తిప్పటానికి మధ్య, వాళ్లదగ్గర్నుంచి వొక దూత వొచ్చాడు. ముక్తధార ఆనకట్ట పగలగొట్ట బోతున్నారని కూడా బెదిరించి పోయాడు.
నరిసింహా : యెంత మాట !
కంకర్ : ఆ మాట మీరు సహించి వూరుకున్నారా ?

విభూతి : యిలాటి అసంబద్ధ ప్రలాపాలకు జవాబెందుకు ?

కంకర్ : అవునుగాని యింత నిర్విచారంగా వుండటం మంచిదికాదేమో ? మీరే అన్నారు - ఆనకట్టలో వొకటి రెండు చోట్ల బీటలున్నాయనీ, ఆ కిటుకు గనక తెలుసుకుంటే యెవరైనా అవలీలగా—

విభూతి : ఆ కిటుకు తెలుసుకున్నవాళ్ల కింకో విషయం కూడా తెలుస్తుంది. ఆ బీటలే గనక విచ్చిపోతే మహా ప్రవాహంలోబడి కొట్టుకు పోతారని.

నరిసింహ : యెవరైనా కాపలా వుంచటం మంచిది కాదూ ?

విభూతి : ఆ బీటల దగ్గర యమధర్మరాజే స్వయంగా కాపలావున్నాడు - ఆనకట్టను గురించి మనకేం భయంలేదు - నందిసంకటంగుండా పోయే దారిని మాత్రం మూసేస్తే మనకేవిచారమూ వుండ నక్కర్లేదు.

కంకర్ : అదంతగా అసాధ్యమైనపనిగాదే మీకు !

విభూతి : కాదు. పరికరాలన్నీ సిద్ధంగా వున్నాయి - వొచ్చిన చిక్కేవిటంటే ఆ నందిసంకటం కనుమ చాలా సన్నగావుంటుంది. యే కొద్దిమంది పట్టుదలగా నిలిచినా మనల్ని పోనీయకుండా అటకాయించవొచ్చు.

నరిసింహ : యెంతసేపటకాయిస్తారు ? చావటానికి సిద్ధమై మరీ ముందుకు పోతాం

విభూతి : చావుకు తెగించినవాళ్లు చాలామంది కావాలి.

కంకర్ : చంపేవాళ్లుండాలిగాని చచ్చేవాళ్లకి లోటులేదు.

నేపథ్యంలో : మేలుకో భైరవస్వామీ ! మేలుకో !

(ధనంజయుడు ప్రవేశిస్తాడు)

కంకర్ : యిదుగో చూడు - తీరా బయల్దేరబోయేసరికి అపశకునం !

విభూతి : చూశావా బైరాగీ ! నీలాటి సాధువులందరూ యింతవరకూ భైరవుణ్ణి మేలుకొల్పలేకపోయారు - నన్ను పాషండుడంటారుగదా, చూడు భైరవుణ్ణి మేల్కొల్పటానికి పోతున్నాను !

ధనం : ఆ మాట నాకర్థమైంది. భైరవస్వామిని మేల్కొల్పే భారం మీ మీదనే వుంది.

విభూతి : అవునుగాని గంట వాయించటంతోనూ, దీపం వెలిగించి ఆరతి పట్టటంతోనూ కాదు. మా పద్ధతి వేరు.

ధనం : నిజమే - మీరాయన్ను గొలుసుల్తో బంధిస్తారు - ఆ గొలుసులు తెంచిపారేయటానికే ఆయన మేలుకుంటాడు.

విభూతి : మా గొలుసులంత చులకనగాదు. మెలికమీద మెలిక, పేట మీద పేటగా అల్లినవి.

ధనం : యేవిధంగానూ కార్యసాధన చెయ్యటానికి వీల్లేని సమయమే ఆయన ప్రత్యక్షమయ్యే సమయం.

(భైరవ భక్తుల ప్రవేశం)

జయభైరవ జయశంకర !
జయ జయ జయ ప్రళయంకర !
జయ సంశయ భేదన !
జయ బంధన చ్ఛేదన !
జయ సంకట సంహర !
శంకర ! శంకర !

(నిష్క్రమిస్తారు)

(రణజిత్తూ, మంత్రీ ప్రవేశిస్తారు)

మంత్రి : మహారాజా ! శిబిరమంతా ఖాళీ అయిపోయింది. అనేకచోట్ల తగలబడిపోయిందికూడా. యెవరో కొద్దిమంది కావలివాళ్లున్నారు గాని, వాళ్లూ—

రణజిత్తు : వాళ్లెక్కడున్నా వుండనీ. అభిజిత్తు యెక్కడున్నదీ మాత్రం తెలుసుకోవాలి.

కంకర్ : మహారాజా ! యువరాజును శిక్షించే అధికారం మాక్కావాలి.

రణజిత్తు : యెవరికేశిక్ష విధించాలో నిర్ణయించటానికి నాకు మీ అనుజ్ఞ కావాలి ?

కంకర్ : ఆయన్ను వెతికి పట్టుకోకపోతే లోకులందరూ అనుమానిస్తారు.

రణజిత్తు : అనుమానమా ? యెవరిమీద ?

కంకర్ : క్షమించండి మహారాజా - మీ ప్రజల మనోభావాన్ని మీరు తెలుసుకోవాలి. యువరాజును వెతికి పట్టుకోటం ఆలస్యమైన కొద్దీ ప్రజల్లో అసహనం యెక్కువైపోయి, ఆయన దొరక గానే మహారాజుగారితో నిమిత్తం లేకుండానే ఆయన్ని శిక్షిస్తారు.

విభూతి : మహారాజు అనుమతి లేకుండానే నందిసంకటంలో పడిపోయిన దుర్గాన్ని మళ్లీ నిర్మించే భారం మామీదే వేసుకున్నాం.
రణజిత్తు : నా మీద యెందుకు వెయ్యలేకపోయారు.
విభూతి : తమ వంశంలోనే పుట్టిన యీ అపకీర్తిని తమరు గోప్యంగా వుంచాలనుకుంటున్నారనే అనుమానం ప్రజల్లో కలగటం సహజమే కదా !
మంత్రి : మహారాజా ! ప్రజానీకమంతా దురహంకారంతోనూ క్రోధం తోనూ మండిపడుతున్నారు - వాళ్ల అసహనాన్ని మీ అసహనంతో రెచ్చగొట్టకండి.
రణజిత్తు : యెవరక్కడ నిలుచున్నది ? బైరాగి ధనంజయుడేనా ?
ధనం : బైరాగికూడా మహారాజుగారికి గుర్తున్నాడు.
రణజిత్తు : యువరాజెక్కడున్నదీ నీకు నిశ్చితంగా తెలుసునా ?
ధనం : నాకు తెలియదు మహారాజా ! నిశ్చితంగా తెలిసిన విషయాన్ని దాచివుంచే స్వభావంకాదు నాది. అందుకే తరుచుగా ప్రమాదాల పాలవుతూ వుంటాను.
రణజిత్తు : అలా అయితే యిక్కడేం చేస్తున్నావ్ ?
ధనం : యువరాజెప్పుడు ప్రత్యక్షమవుతారా అని యెదురు చూస్తున్నాను.
నేపథ్యంలో : సుమన్ నాయనా సుమన్ ! అంతటా చీకటిపడ్డది. అంధకార మయమైపోయింది.
రణజిత్తు : యెవరది ?
మంత్రి : ఆ వెర్రిమనిషి, అంబ.

(అంబ ప్రవేశిస్తుంది)

అంబ : యెక్కడ ? వాడింకా తిరిగిరాలేదు.
రణజిత్తు : యింకా అతనికోసం చూస్తావెందుకు ? భైరవుడతణ్ణి పిలుచుకు పోయాడు.
అంబ : భైరవు డెప్పుడూ పిలుచుకు పోవటమేకాని, మళ్లీ వెనక్కి పంపించడా ? యే కారణం లేకుండానే, యింత కాళరాత్రిలో ? సుమన్ ! నాయనా ! సుమన్ !

(నిష్క్రమిస్తుంది)
(గూఢచారి ప్రవేశిస్తాడు)

గూఢ : శివతరాయినుంచి వేలకువేలు మనుషులొచ్చి పడుతున్నారు.

విభూతి : యేమిటిది! మనం వెంటనే వెళ్లి వాళ్లను నిరాయుధులుగా చెయ్యటం మంచిది. మీలో యెవరో విశ్వాసఘాతకులు మన గుట్టు కాస్తా బైటపెట్టివుంటారు. కంకర్! మీ నలుగురికీ తప్ప యీ సంగతెవరికీ తెలియదుగద! మరి, యెలా తెలిసిందీ—

కంకర్ : యేమిటి మీరనేదీ? మామీదకూడా అనుమానమే?

విభూతి : అనుమానానికి మితి అంటూ యెక్కడాలేదు.

కంకర్ : అలా అయితే మీమీదకూడా మాకనుమానమే.

విభూతి : నిజమే, ఆహక్కు మీకూవుంది. యేమైనాకానీ, ఆ సంగతేదో సమయమొచ్చినప్పుడు తేల్చుకుందాం.

రణజిత్తు : (గూఢచారితో) వాళ్లందరూ యే వుద్దేశంతో వొస్తున్నారో తెలుసూ?

గూఢ : యువరాజుని ఖైదుచేశారన్న వార్త వాళ్లకందింది. ఆయన్ని వెతికి పట్టుకోవాలని పట్టుపడుతున్నారు. ఖైదువిడిపించి ఆయన్ని శివతరాయి సింహాసనమెక్కించాలనుకుంటున్నారు.

విభూతి : యువరాజుని మేమూ వెతుకుతున్నాం, వాళ్లూ వెతుకుతున్నారు- చూద్దాం యెవరిచేతుల్లో చిక్కుతాడో!

ధనం : ఆయనకేపక్షపాతము లేదు - మీ యిద్దరి చేతుల్లోనూ చిక్కుతాడు.

(గణేశ్ ప్రవేశిస్తాడు)

గణేశ్ : (ధనంజయుడితో) స్వామీ మనకు దొరుకుతారా ఆయన?

ధనం : ఆ హా,

గణేశ్ : నిశ్చయంగా మరోమాటు చెప్పండి.

ధనం : తప్పకుండా దొరుకుతారు.

రణజిత్తు : యెవరికోసమనీ వెతుకుతున్నారు?

గణేశ్ : యిదుగో రాజుగారు - మీరాయన్ని విడిపించి వేయాలి.

రణజిత్తు : యెవర్ని?

గణేశ్ : మా యువరాజుని. ఆయన మీకక్కర్లేదు. మాక్కావాలి. మాకున్నదంతా కాజేసి చివరికి మా యువరాజుకూడా లేకుండా చేస్తారా?

ధనం : మూర్ఖుడా, ఆయన సంగతింకా తెలియదూ ? ఆయన్ని ఆపి వుంచటం యెవరి సాధ్యం ?

గణేశ్ : ఆయన్ని మా కందరికీ రాజుగా పట్టాభిషేకం చేస్తాం.

ధనం : అందుకు సందేహమేమిటి ? రాజవేషం ధరించే వొస్తాడాయన.

(భైరవ భక్తులు ప్రవేశిస్తారు)

తిమిర హృద్విదారణ !
జ్వలదగ్ని నిదారుణ !
మరు శ్మశాన సంచర !
శంకర ! శంకర !
వజ్రఘోష వాణీ !
రుద్రశూల పాణీ !
మృత్యుసింధు సంతర !
శంకర ! శంకర !

(నిష్క్రమిస్తారు)

నేపథ్యంలో : మీ అమ్మ పిలుస్తున్నది. తిరిగిరా సుమన్ ! తిరిగిరా !

విభూతి : యేమిటా శబ్దం ?

ధనం : అంధకారం తన అంతరంగంలో కిలకిలా నవ్వుకుంటున్నది.

విభూతి : వుండుండు ! యెటువైపునుంచి వొస్తున్నదీ ధ్వని ?

నేపథ్యంలో : జై భైరవస్వామికి !

విభూతి : స్పష్టంగా యిది జలప్రవాహ ధ్వని !

ధనం : నాట్యారంభంలో వొచ్చే డమరు ధ్వని.

విభూతి : యీ ధ్వని విస్తరించి పోతున్నది.

కంకర్ : అదేమిటో—

నరిసింహా : యిదేదో నాకనిపిస్తున్నది—

విభూతి : ఆహా. యిహ సందేహం లేదు. ముక్తధార గట్టుతెంచుకుంది. కట్ట తెగకొట్టిందెవరు ? యెవరు ? వాళ్ల కిహ తరణోపాయం లేదు.

(కంకర్, నరిసింహా, విభూతి వేగంగా నిష్క్రమిస్తారు)

రణజిత్తు : మంత్రీ, యేమిటిదంతా ?

ధనం : బంధ విమోచనోత్సవానికి ఆహ్వానం !

మ్రోగినది మ్రోగినది మ్రోగినది డమరు, నా
హృదయమందున మ్రోగినది డమరు నేడు.

మంత్రి : మహారాజా, యిదేమో——

రణజిత్తు : అవునవును. యిదంతా అతని——

మంత్రి : అతను తప్ప మరింకెవరూ——

రణజిత్తు : యింత సాహస మెవరికుంటుంది ?

ధనం :

నా ప్రాణములలోన నర్తించు నీనాడు
ప్రభు మనోహర పాద పంకేరుహ ద్వయము.

రణజిత్తు : శిక్షవిధించాలి. విధించితీరాలి. కాని దురావేశపరులైన ప్రజల నుంచి అతన్ని రక్షించాలి. నా అభిజిత్తు దేవతలకు ప్రేమపాత్రుడు. అతన్ని దేవతలే రక్షింతురుగాక !

గణేశ్ : యేం జరిగిందో యేమో ? యేదీ తెలియటంలేదు.

ధనం :

యామములతోబాటు యామికులు మేల్కొనిరి
ఆకాశమున తార అల్లాడగా సాగె

రణజిత్తు : యేదో అడుగుల చప్పుడు వినిపిస్తున్నది. అభిజిత్ ! అభిజిత్ !

మంత్రి : అదుగో ఆయనే వొస్తున్నారు !

ధనం :

ప్రాణ పదములనెల్ల వ్యధ లావరించినవి
బంధనమ్ములు పటాపంచలైపోయినవి.

(సంజయుడు ప్రవేశం)

రణజిత్తు : యిదుగో సంజయుడు ! అభిజిత్తెక్కడ ?

సంజ : ముక్తధారా ప్రవాహం ఆయన్ని మోసుకుపోయింది. మాకు దక్కలా.

రణజిత్తు : యేమంటున్నావూ ?

సంజ : యువరాజు ముక్తధార ఆనకట్ట తెగకొట్టారు.

రణజిత్తు : ఆ తెలిసింది. ఆ ప్రవాహా విముక్తితోబాటు, తనుకూడా ముక్తిపొందాడు. సంజయా, నిన్నుకూడా తన వెంటనే తీసుకు పోయాడా ?

సంజ : లేదు. కాని ఆయన అక్కడికే వెళుతున్నాడని తెలిసి అంధకారంలో అతనికోసం యెదురుచూస్తూ వుండిపోయాను. అంతవరకే. చివరి వరకూ నన్ను తనవెంటనే వుండనీయలేదు.

రణజిత్తు : యేమయిందో కొంచెం చెప్పవూ ?

సంజ : ఆ ఆనకట్టలో వొకచోట యేదో ఛిద్రాన్ని యెలాగో కనిపెట్టి, అక్కడ యంత్ర రాక్షసిని గాయపరిచాడు. ఆ రాక్షసి తిరిగి దెబ్బ కొట్టగానే, ముక్తధార కన్న తల్లిలాగా దెబ్బతిన్న అతని శరీరాన్ని తన వొడిలో పెట్టుకుని తీసుకుపోయింది.

గణేశ్ : యువరాజుకోసం మనమందరం వెతుక్కుంటూ వొచ్చాం. యిహ యువరాజు మనకు దక్కడన్నమాట !

ధనం : కాదుకాదు. శాశ్వతంగా మనకాయన దక్కిపోయినాడు.

(భైరవ భక్తులు)

జయ భైరవ ! జయ శంకర !
జయ జయ జయ ప్రళయంకర !
జయ సంశయ భేదన !
జయ బంధన ఛేదన !
జయ సంకట సంహర !
శంకర ! శంకర !
తిమిర హృద్విదారణ !
జ్వలదగ్ని నిదారుణ !
మరుశ్మశాన సంచర
శంకర ! శంకర !
వజ్రఘోష వాణీ !
రుద్రశూల పాణీ !
మృత్యుసింధు సంతర !
శంకర ! శంకర !

# రక్తకరవీరం

(యీ నాటకంలో వ్యవహారమంతా యక్షపురి అనే నగరాన్ని ఆశ్రయించి నడుస్తుంది. యిక్కడి శ్రామికులు భూగర్భంలోనుంచి బంగారం తవ్వి తెచ్చే పనిలో నియుక్తులై వున్నారు. యీ దేశపు రాజు అత్యంత జటిలమైన వొక ఆవరణం చాటునవుంటాడు. ప్రాసాదానికి ఆవరణంగావున్న యీ తెర ఒకటే యీ నాటక మంతటిలోనూ కనిపించే దృశ్యం. నాటకంలో సంఘటనలన్నీ యీ ఆవరణం ముందరే జరుగుతూ వుంటాయి.)

(నందిని, కిశోర్, సారంగం త్రవ్వే బాలకులూ ప్రవేశం.)

కిశోర్ : నందినీ, నందినీ, నందినీ!

నందిని : యింతగా పిలుస్తా వెందుకు కిశోర్ నన్నూ? నాకేం వినిపించదనా?

కిశోర్ : వినిపిస్తుందని నాకు తెలుసు. అదేమో నాకు పిలుస్తుంటే బాగుంటుంది. యింకా పూలు కావాలా నీకు? అలాగయితే తేవటానికి వెళతాను.

నందిని : పో పో, పనిలోకి వెళిపో. ఆలస్యం చెయ్యకు.

కిశోర్ : రోజంతా కేవలం బంగారపు మట్టిగడ్డలు తవ్వి తెస్తుంటాను. అందులో కాస్త సమయం దొంగిలించి నీకోసం పూలు తేగలిగితే బతుకు సార్థకమౌతుంది.

నందిని : అలా చేస్తే నిన్ను శిక్షిస్తారు. నీకు తెలుసునో తెలియదో.

కిశోర్ : నువు చెప్పనే చెప్పావు. యెర్ర గన్నేరుపూలు నీకు తప్పకొవాలి, యిహ నా కెందుకంటే సంతోషం - అవి సులభంగా యిక్కడెక్కడా దొరకవు. యెంతో వెతగ్గా వెతగ్గా వోయెరువు దిబ్బ వెనక వొకటే వొక్క చెట్టు కనిపించింది.

నందిని : నాకు చూపించేయ్. నేనే స్వయంగా వెళ్లి కోసి తెచ్చుకుంటాను.

కిశోర్ : అలా మాట్లాడకు. నందినీ! అంత నిష్ఠురంగా వుండకు. ఆ చెట్టొక్కటీ నా కొక్కడికే తెలిసిన రహస్యంగావుండనీ. పోకు నీకు

పాట వినిపిస్తాడు. అది అతని సొంతపాట. యిప్పటినుంచీ నీకు నేను పూలు తెచ్చి పెడతాను. యివి నా సొంత పూలు.

నందిని: కాని యిక్కడి వాళ్లు వుత్త పశువులు. నిన్ను బాధ పెడతారు. తలుచుకుంటే నాగుండె పగిలిపోతుంది.

కిశోర్ : ఆ బాధతో నా పూలు మరింతగా నావైపోయి పూస్తూవుంటాయి. అవి నా దుఃఖధనం.

నందిని: మరి నీ దుఃఖాన్ని నే నెలా భరించగలను ?

కిశోర్ : దుఃఖ మెందుకూ ? "యెప్పుడో వొకప్పుడు నీకోసం నా ప్రాణం కూడా అర్పిస్తాను" అని యెన్నిసార్లు మనసులో అనుకుంటాను !

నందిని: నువు నా కిచ్చినదాని కంతటికీ బదులుగా నేను తిరిగి నీకే మివ్వ గలను చెప్పు కిశోర్.

కిశోర్: నా కొక్క వాగ్దానం చెయి నందినీ. నా చేతినుంచే రోజూ పూలు తీసుకుంటానని.

నందిని: సరే. అలాగే చేస్తాను. కాని నువు మాత్రం కాస్త జాగ్రత్తగా వుండాలి.

కిశోర్ : జాగ్రత్తగా మాత్రం నడుచుకోను. ఆ చచ్చు వెధవలు చూస్తూ వుండగానే రోజూ పూలు తెచ్చి యిస్తా.

(అధ్యాపకుడు ప్రవేశం)

అధ్యాపకుడు: నందినీ! వెళిపోకు! యిటు తిరిగి చూడు.

నందిని : యేమీ ?

అధ్యాపకుడు: క్షణ క్షణమూ అలా మిరుమిట్లు కొలిపి వెళిపోతా వెందుకు ? కొంచెమాగు. రెండు మాటలు చెబుతాను.

నందిని: నాతో మీకే మవసరం ?

అధ్యాపకుడు: అవసరమనా అన్నావు ? అదుగో ఆపైన చూడు! మా తవ్వకం పనివాళ్లందరూ పృధివీ వక్షాన్ని చీరి ప్రయోజన భారాన్ని నెత్తిన పెట్టుకుని కీటకాల్లాగా సొరంగం లోపలినుంచి పైకి మోసు కొస్తున్నారు. యీ యక్షపురిలో మాకున్న ధనమంతా భూగర్భంలో నుంచి తవ్వి తెచ్చినదే. బంగారం. కాని సుందరీ నీ బంగార మున్నదే అది మట్టిలో పుట్టినది కాదు. వెలుగులో వెలిసినది. ప్రయోజనపు కట్టుబాట్లు దాన్ని బంధించవు.

నందిని: యెంతసేపు చూసినా వొకటే మాట. నన్ను చూస్తే మీ కింత విస్మయ మెందుకు?

అధ్యాపకుడు: పొద్దుటిపూట పూలతోటలో కదిలే వెలుగులో విస్మయం లేదు. బీటవారిన యిటుక గోడ నెరియలోనుంచి వొచ్చే వెలుగు సంగతి వేరు. ఈ యక్షపురిలోకి నీవు తెచ్చినది అలా తలవని తలంపుగా విరిసిన వెలుగు. యిక్కడి వాళ్లందరిని గూర్చి నువ్వే మనుకుంటున్నావో చెప్పు చూదాం.

నందిని: మాటలతో చెప్పలేక చూస్తున్నాను. పట్నం పట్నమంతా భూగర్భంలోకి తలదూర్చి అంధకారంలో తడుముకుంటూ తిరుగుతూంది. పాతాళంలోకి సొరంగం తవ్వి మీరందరూ యక్ష ధనాన్ని పైకి తెస్తున్నారు, కాని అది యెన్నో యుగాల క్రింద చచ్చిపోయిన ధనం. అందుకే భూదేవి దాన్ని పూడ్చిపెట్టి వుంచింది.

అధ్యాపకుడు: ఆ మరణించిన ధనానికే మేము శవ సాధన చేస్తున్నాం. దాని ప్రేతాన్ని వశపర్చుకోవాలి. యీ బంగారపు మంటిముద్దను ఆవహించిన భూతాన్ని బంధించ గలిగితే పృధివి అంతా గుప్పిట్లో కొస్తుంది.

నందిని: ఆ పైన యింకో విషయం. మీ రాజును అద్భుతమైన వొక జాలావరణం వెనక దాచి వుంచారు, ఆయన కూడా వొక మనిషే అన్న గుట్టు బయట పడుతుందేమోనని. మీ యీ సొరంగంలోని అంధకారం పైన వున్న ముసుగు తీసి పారేసి, అందులోకి వెలుతుర్ని చిలుకుదామనిపిస్తున్నది. అదే విధంగా యీ వికృతమైన తెరను చించేసి దానివెనక వున్న మానవుణ్ని ఉద్ధరించాలనిపిస్తున్నది.

అధ్యాపకుడు: మా చచ్చిపోయిన ధనాన్ని ఆవహించిన భూతం శక్తి యెంత భయంకరమో, మానవశ్రేష్ఠుడైన మా రాజు ప్రతాపం అంత భయంకరం.

నందిని: ఇదంతా వేషం వేసిన కట్టుకథ.

అధ్యాపకుడు: నిజమే. వేషం వేసిందే. దిగంబరుణ్ని పోల్చటం యెలాగ? బట్టలు కట్టి వేషం వేస్తేనే వీడు రాజు, వీడు బికారి అని పోల్చ గలుగుతాం. మా యింటికి రా. నీకీ తత్వశాస్త్ర విశేషాలు బోధ పరుస్తూ వుంటే నా కెంతో ఆనందంగా వుంటుంది.

నందిని : మీ తవ్వకం పనివాళ్లు నేల తవ్వుతూ భూగర్భంలోకి దూరి పోతున్నట్లుగా నువుకూడా పుస్తకాలమధ్య సొరంగం చేసుకుని పోతూ వుంటావుకదా! నాకోసం కాలం వృధా చేసుకోట మెందుకు ?

అధ్యాపకుడు : యెడా తెరిపిలేని యీ సొరంగంలో పడి కీటకాల్లాగ వొక మహా కార్యంలో చిక్కుకొని పోయాం. తీరిక సమయంలో ఆకాశంలో మెరిసే సంధ్యా తారవు నువ్వు. నిన్ను చూడగానే మా రెక్కలు కదిలినట్లౌతుంది. రా, మా యింటి కోసారి. నీకోసం కొంత కాలం వృధాచేసుకోనీ.

నందిని : వొద్దు. వొద్దు. యిప్పుడు కాదు. నే వచ్చింది మీ రాజుగారిని ఆయన యింటికి వెళ్లి చూడటానికి.

అధ్యాపకుడు : ఆ జాలావరణానికి వెనగ్గా వున్నారాయన. యింట్లోకి ప్రవేశించనీయరు.

నందిని : యీ జాలాన్ని నే లెక్కచేయను. ఆయన యింట్లో ప్రవేశించ టానికే వచ్చాను.

అధ్యాపకుడు : తెలుసునా నందినీ! నే నున్నదికూడా వొక తెర వెనక నే. తక్కిన మానవ లక్షణాలన్నీ పోయి పాండిత్య మొకటే నాలో మెలకువగావుంది. మా రాజు యేలాటి భయంకరుడో నేనూ ఆలాటి భయంకరమైన పండితుణ్ని.

నందిని : నాతో హాస్యమాడుతున్నావు. నువు నాకేం భయంకరం అనిపించటంలా. వొక్క మాట అడుగుతాను. వీళ్లు నన్నిక్కడికి తీసుకొచ్చారు గదా, నాతో రంజనుణ్ణి యెందుకు తీసుకురాలేదు ?

అధ్యాపకుడు : అన్ని వస్తువుల్నీ ముక్కలు ముక్కలు చేసి తీసుకురావటం వీళ్ల పద్ధతి. అవునుగాని చచ్చిపోయిన ధనంవున్న యీ చోటికి నీ ప్రాణ ధనాన్ని తీసుకొద్దామని యెందు కనుకుంటున్నావు ?

నందిని : నా రంజన్నే గనక యిక్కడికి తెస్తే ఈ మృత పంజరంలో ప్రాణం నాట్యంచేస్తూ లేస్తుంది.

అధ్యాపకుడు : వొక్క నందినిని తీసుకొస్తేనే యిక్కడ సర్దారు లందరికీ మతులుపోయినాయి కదా - రంజన్నుకూడా తీసుకొస్తే వాళ్ల గతేమవుతుంది ?

నందిని : తమ స్థితి యెంత హాస్యాస్పదమో వాళ్లెరగరు. విధాతృడి మందహాసమే గనక వాళ్ల మధ్య అవతరిస్తే వాళ్ల మైకం వొదిలి పోతుంది. రంజను మూర్తి అలాటి దరహాసం.

అధ్యాపకుడు : దేవతల నవ్వు సూర్యుడి వెలుతురు లాంటిది. దాన్తో మంచు కరుగుతుంది. కాని రాళ్లు కదలవు. మా సర్దార్లున్నారే వాళ్లను కదిలించాలంటే శరీరంలో మంచి శక్తి కావాలి.

నందిని : మా రంజను శక్తి మీ శంఖినీ నది వంటిది. ఆ నది మోస్తరుగా అతను అట్టహాసమూ చేయగలడు యేదేనా అడ్డమొస్తే, విరిచి పారేయనూ గలడు...యివ్వాళ మీకో రహస్యం చెబుతున్నా. నే నివ్వాళ రంజన్ని చూడ గలుగుతాను.

అధ్యాపకుడు : ఎలా తెలిసింది ?

నందిని : చూసి తీరుతాను, నాకు కబురొచ్చింది.

అధ్యాపకుడు : యిక్కడి సర్దార్ల కళ్లుకప్పి యే దిక్కునుంచి కబురొచ్చింది ?

నందిని : రాబోయే వసంతర్తువు కబురొస్తుందే - ఆ దిక్కునుంచే - ఆ రాక కోసమే ఆకాశంలో యీ రంగూ, గాలిలో యీ లీలా.

అధ్యాపకుడు : అంటే ఆకాశపు రంగుతోనూ, గాలిలో లీలతోనూ వొచ్చిన గాలి కబురన్నమాట.

నందిని : రంజను వొచ్చిన్తర్వాత చూపిస్తాగా. గాలికబురెలా నిజమై పోతుందో.

అధ్యాపకుడు : రంజను మాటేవొస్తే నందిని నెవరమూ ఆపలేం. సరే సరే. నా వస్తు తత్వవిద్య వుండనేవుంది. అందులో మునిగి తేలుతూ పడివుంటాను. వేరే సాహసం యేమీ చేయలేను.

(కొంత దూరంపోయి తిరిగొచ్చి)

నందినీ! వొక్క మాటడుగుతాను యక్షపురి చూస్తే నీకు భయం వేయటం లా ?

నందిని : భయపడటం యెందుకు ?

అధ్యాపకుడు : గ్రహణంపట్టిన సూర్యుణ్ని చూస్తే వున్నంతభయం, పూర్ణ సూర్య బింబాన్ని చూస్తే వుండదు. యీ యక్షపురివున్నదే యిది గ్రహణం పట్టిన పట్నం. ఆ బంగారపు సొరంగంలో రాహువు యీ పట్నాన్ని కబళించేశాడు. తనకు పూర్ణరూపంలేదు. వేరెవరినీ

పూర్ణరూపంతో వుండనీయదు. యిదుగో చెబుతున్నాను. యీ పట్నంలో వుండకు! నువు వెళ్లిపోతే యిక్కడి బంగారు గనులన్నీ నోరు తెరిచి మమ్మల్ని యింకా యెక్కువగా కబళించటానికి ప్రయత్నిస్తాయి - నాకు తెలుసు - అయినా చెబుతున్నాను, ఇక్కణ్నుంచి పారిపో. యే ప్రదేశంలో ప్రజలు దస్యు వృత్తిని అవలంబించి వసుంధరా జననిని ముక్కలు ముక్కలుగా చించేయరో, ఆ ప్రదేశంలో రంజనుతో కలిసి ప్రశాంతంగా వుండిపో.

(కొంత దూరం నడిచి తిరిగొచ్చి)

నందినీ! నీ కుడిచేతికి కట్టుకున్న ఆ యెర్రగన్నేరు పూలకంకణంలో నుంచి వొక పువ్వు నాకిస్తావా?

నందిని: యెందుకూ? యేం చేస్తావు దాన్తో?

అధ్యాపకుడు: యెన్నిసార్లో అనుకున్నాను. నువు ధరించిన ఆ యెర్ర గన్నేరు పూల ఆభరణంలో యేదో అంతరార్థం వుందని.

నందిని: యే అర్థముందో నాకు తెలియదు.

అధ్యాపకుడు: అది నీ అదృష్ట దేవతకు తెలుస్తుంది. ఆ యెర్రని రంగులో యేదో భయం పుట్టించే రహస్యంపుంది. కేవలం మాధుర్యమే కాదు.

నందిని: నాలోనా భయం పుట్టించే రహస్యం?

అధ్యాపకుడు: సుందరాంగుల చేతికి దైవం యెరుపు పూసే కుంచె యిచ్చింది. యీ యెర్ర రంగుతో యేరాత రాయటానికొచ్చావో యేమో? మాలతి వుంది, మల్లెవుంది, చామంతి వుంది. యివన్నీ వొదిలి యీ పూవే యెందుకని యెన్నిక చేశావో తెలుసునా? మనుష్యులు తమకు తెలియకుండానే తమ అదృష్టాన్ని కోరి తెచ్చు కుంటారు.

నందిని: రంజను అప్పుడప్పుడు నామీద ఆదరం కొద్దీ నన్ను రక్తకరవీర మంటూంటాడు. నీ వేమనుకుంటున్నావో నే నెరగను. రంజనుపై నాకున్న ప్రేమ రంగు యెరుపు. ఆ రంగు మెళ్లో వేసుకున్నాను. వక్షస్థలంలో వుంచుకున్నాను. చేతికి కట్టుకున్నాను.

అధ్యాపకుడు: అయితే వొక్క పూవీయవూ. కేవలం క్షణికమైన దానం. ఆ రంగులో తత్వమేమిటో తెలుసుకోటానికి ప్రయత్నిస్తాను.

నందిని : ఇదుగో తీసుకో. యివ్వాళ రంజను రాకతప్పదు. ఆ ఆనందంతో యీ పూవిస్తున్నాను నీకు.

(అధ్యాపకుడు నిష్క్రమిస్తాడు)

(తవ్వ పనివాడు గోకుల్ ప్రవేశం)

గోకుల్ : ఒకసారి యిలా ముఖం తిప్పుచూస్తాను. నిన్నేమీ అర్థం చేసుకో లేక పోతున్నాను నువ్వెవరివి ?

నందిని : నన్నెవర్నిగా చూస్తున్నావో అంతకుమించి నేనెవర్నీ కాను. అర్థం చేసుకోవాల్సిన అవసరమేమిటి నీకు ?

గోకుల్ : అర్థం కాకపోతే అదేదో బాగా వుండటంలా. నిన్నిక్కడికి రాజు యే పనికోసం తీసుకొచ్చాడు.

నందిని : పనిలేని పనికోసం.

గోకుల్ : ఏమిటి నీ దగ్గరేమేనా మంత్రంవుందా ? అందర్నీ మాయలో పడేశావు. సర్వనాశినివి నువ్వు. ఆ అందమైన నీ మొహంచూసి యెవరు ముగ్ధులౌతారో వాళ్లు చస్తారు చివరికి - యేదీ యేదీ ? నీ పాపట మీదుగా యేవిటా వేలాడేది ?

నందిని : యెర్రగన్నేరు పూలచెండు.

గోకుల్ : అంటే అర్థమేమిటి ?

నందిని : దాంట్లో యే అర్థమూ లేదు.

గోకుల్ : నీలో నాకెంత మాత్రమూ విశ్వాసంలేదు, యేదో మాయ చేశేశావు. యివ్వాళటి రోజు దాటకుండానే యేదో గొప్ప పత్తువొచ్చితీరుతుంది. అందుకే యీ ముస్తాబంతా. భయంకరీ ! ఓసి భయంకరీ !

నందిని : నన్నుచూస్తే నీకింత భయంకర మనిపించట మెందుకు ?

గోకుల్ : చూడగా నాకనిపిస్తున్నది నువ్వు రక్తవర్ణపు కాగడావు. తెలుసు కోలేని వాళ్లందరికీ తెలిసేటట్టుగా 'జాగ్రత్త జాగ్రత్త జాగ్రత్త' అని చెబుతాను.

(నిష్క్రమిస్తాడు)

నందిని : (జాలావరణం వాకిట్లో కాలుపెట్టి) వినిపిస్తున్నదా ?

నేపథ్యంలో : నందినీ ! వినిపిస్తున్నది. మాటిమాటికీ నన్ను పిలవొద్దు. నాకు వ్యవధి లేదు. ఏ మాత్రమూ లేదు.

నందిని : యివ్వాళ నా మనస్సు ఉత్సాహంతో నిండిపోయింది. ఆ సంతోషంతో మీ యింట్లోకి రాగోరుతున్నాను.

నేపథ్యంలో : వీల్లేదు. యింట్లోకాదు. చెప్పదలచుకున్నదేదో బైటినుంచే చెప్పు.

నందిని : మల్లెపూలు మాలకట్టి పద్మపత్రంలో అమర్చి తెచ్చాను.

నేపథ్యంలో : నువ్వే వేసుకో.

నందిని : నాకు నచ్చవు.

నేపథ్యంలో : నేను పర్వత శిఖరంలాటి వాణ్ని, శూన్యత్వమే నా శోభ.

నందిని : ఆ శిఖరంనుంచి జలపాతాలు ప్రవహించినట్లుగా మీ కంఠంనుంచి యీ పూలదండ వేలాడుతుంది. యీ జాలావరణాన్ని తెరవండి. లోపలికొస్తాను.

నేపథ్యంలో : రానీయను. చెప్పేదేదో తొందరగా చెప్పు. వ్యవధి లేదు.

నందిని : దూరాన్నుంచి ఆ పాట వినవొస్తున్నదా ?

నేపథ్యంలో : దేనిమీది పాట ?

నందిని : పౌష్య లక్ష్మి పాట. ధాన్యం పండింది. కోత కొయ్యాలి. అదీ ఆ పిలుపు.

రావోయి లేచి రావోయీ
పిలిచేను పిలిచేనదే పౌష్యలక్ష్మి ॥ రావోయి ॥
తట్టనిండగ పసిడి ధాన్యాలు నింపుకొని
పిలిచేనదే లేచి రావోయీ ॥ రావోయి ॥

కనిపించటంలా, పుష్యమాసపు యెండ పండిన ధాన్యరాశి లావణ్యాన్ని ఆకాశంతో కలిపేస్తున్నది.

దిక్సుందరులు కమ్మతెమ్మెరల కైపుతో
పండిన పొలాల లోపల నాట్యమాడేరు
నేల చెరగులరాలె నిండుటెండ పసిండి ॥ రావోయి ॥

ఓ రాజా ! బైటికొచ్చేయండి. పొలంలోకి తీసుకెళ్తాను.

నేలపాడేపాట నింగి విని మురిసింది
ఇంట నే డెవరుండగలరోయి ॥ రావోయి ॥

నేపథ్యంలో : నేను పొలానికి రానా ? యేంపని చేయటానికి ?

నందిని : పొలంలో పని మీ యక్షపురిలోకన్న అనేక రెట్లు సహజమైంది.

నేపథ్యంలో : సహజమైన పని చేయటమే నాకు చాలా కష్టం. నురుగులు నూపురాలుగా నాట్యంచేస్తూ పర్వతాగ్రంనుంచి జలపాతం వొచ్చినట్లుగా సరోవరం రాగలదా ? పో పో యింకేం మాట్లాడకు. వ్యవధి లేదు.

నందిని : మీ శక్తి అద్భుతమైనది. మీ భాండాగారంలో ప్రవేశించటానికి అనుజ్ఞ యిచ్చిన నాడు మీ బంగారపు కుప్పలు చూసి నే నాశ్చర్య పడలేదు. ఆ పెద్ద పెద్ద గడ్డలను అనాయాసంగా యెత్తి చక్కగా వొక్కచోట అమర్చగలిగిన ఆ బ్రహ్మాండమైన సామర్థ్యాన్ని చూసి ముగ్ధురాలినైనాను. అయినప్పటికీ యీ స్వర్ణఖండాలు మీ చేతుల్లో చిత్రవిచిత్రమైన గతితో చెప్పినట్లుగా కదుల్తూవుంటాయి కదా, పంట పొలాల్లో పైరు పలికినట్లుగా పిలిస్తే పలుకుతాయా ? రాజా ! సరేకాని పృథివీ గర్భంలోవున్న యీ చచ్చిన ధనాన్ని అహో రాత్రాలూ సర్దుతూవుంటే మీ కేం భయం వేయదూ ?

నేపథ్యంలో : యెందుకూ ? దేనికోసం భయం ?

నందిని : ప్రాణప్రదాలైన తన వస్తువులను సంతోషంకొద్దీ తనే మన కిస్తుంది. కాని యేనాడు దానిగుండె చీల్చి దాని యెముకల్ని అయిశ్వర్య మనుకొని తెంచి తీసుకొస్తావో ఆనాడే వాటితోబాటు ఆ అంధకారంలోనుంచి అంధరాక్షసి శాపాన్నికూడా వెంటతెచ్చు కుంటున్నావు. కనిపించటంలా - ఇక్కడి వాళ్లంతా కుపితులుగానో, భయకంపితులుగానో, సంశయగ్రస్తులుగానో వుంటున్నారు. ఇక్కడి వాళ్లందరినీ కోపమో, సంశయమో, భయమో యేదో వొకటి బాధిస్తున్నది.

నేపథ్యంలో : శాపమా ?

నందిని : ఆఁ యీ కుమ్ములాటా - యీ రక్తపాతం - వీటి శాపం.

నేపథ్యంలో : శాపం సంగతి నే నెరగనుగాని మా బలప్రతాపాన్ని పైకి తీసుకొస్తున్నామని మాత్ర మెరుగుదును. నా బలాన్ని చూసి నీ వానందించటం లేదా నందినీ !

నందిని : యెంతగానో ఆనందిస్తున్నాను. అందుకనే అంటున్నాను. వెలుగు లోకి, బైటికొచ్చేయండి, భూమ్మీద కాలు నిలపండి, భూదేవినికూడా ఆనందంతో వుప్పొంగి పోనీయండి.

వెలుగు జల్లులపొంగు విప్పారి విలసిల్లు
మంచుతుంపర లందగించు వరికంకులను
మోయలేని ముదంబు పుడమి తల్లి వెలార్చు ॥ రావోయి ॥

నేపథ్యంలో : ఎరుగుదువా నందినీ! నిన్నుకూడా విధాత రూపలావణ్య మనే మాయావరణానికి వెనక అపురూపంగా వుంచేశాడు. నిన్నందులోంచి లాక్కుని గుప్పిట్లో పెట్టుకోవాలని వుంది. కాని యేమీ పట్టుకోలేక పోతున్నాను. నిన్ను అటూ యిటూ వోమారు తిప్పి తారుమారుచేసి చూడాలని వుంది. అలా చేతకాకపోతే ముక్కలు ముక్కలుగా పగలకొట్టి పారేయాలనిపిస్తున్నది.

నందిని : ఏమిటీ అంటున్నారు ?

నేపథ్యంలో : నీ యెర్రగన్నేరు పూలకాంతిని పిండి వడకట్టి అంజనంవేసి కళ్లకు పెట్టుకుందామంటే చేతకావటం లేదెందుకని ? ఆ కాంతిని అందుకోనీయకుండా చేస్తున్నై ఆ చిన్ని పూరేకులు. నీ అంతర్యాన్ని కనుక్కోటానిక్కూడా అలాంటిదే ఆటంకం. కోమలంగా కనిపించే కాఠిన్యం.

సరేకాని నందినీ! నన్ను గురించి యేమనుకుంటావో స్పష్టంగా చెప్పు.

నందిని : ఆ విషయమింకోనాడు చెబుతాను. యివ్వాళ మీకు వ్యవధిలేదు. పోయొస్తాను.

నేపథ్యంలో : వొద్దు. వొద్దు, పోవొద్దు. నన్ను గురించి యేమను కుంటున్నావో చెప్పి మరీ వెళ్లు.

నందిని : యెన్నిసార్లు చెప్పాను. మిమ్మల్ని చూసి ఆశ్చర్య పడతానని, గాలివానకు ముందుగా కమ్ముకొచ్చే మేఘాల్లాగ బలిష్ఠమైన మీ బాహువుల్లో బ్రహ్మాండమైన శక్తి వుప్పొంగటం చూసి నామనస్సు నాట్యం చేస్తుంది . . .

నేపథ్యంలో : రంజన్ను చూస్తే యెలా నాట్యం చేస్తుందో అలాగే . . .

నందిని : అదలా వుండనీయండి. మీకు వ్యవధి లేదు.

నేపథ్యంలో : లేకేం, వున్నది వ్యవధి. కేవలం యీ వొక్క మాటా చెప్పి పో.

నందిని : ఆ నాట్యంలో లయ వేరు. మీ కర్థం కాదు.

నేపథ్యంలో అర్థం చేసుకుంటాను. అర్థం చేసుకుని తీరాలి.

నందిని : అన్ని విషయాలూ అర్థమయ్యేటట్లుగా చెప్పలేను. నే వెళ్ళొస్తాను.

నేపథ్యంలో ; వెళ్ళకు. చెప్పు. నేనంటే నీ కిష్టమేనా ?

నందిని : ఆ. యిష్టమే.

నేపథ్యంలో : రంజను మీద వున్నట్లుగానేనా ?

నందిని : యెటు తిరిగీ మళ్ళీ అదే మాట. యిదంతా మీ కర్థం కాదు.

నేపథ్యంలో : కొంచెం కొంచెం అర్థమౌతుంది. నాకూ, రంజనుకూ భేదమేమిటో నాకు తెలుసు. నా దగ్గిర కేవలం బలం వున్నది. రంజను దగ్గిర యింద్రజాలం వుంది.

నందిని : యింద్రజాలం అంటున్నారేమిటీ ?

నేపథ్యంలో : స్పష్టంగా చెప్పనా ? భూగర్భంలో పిండరూపంగా వున్న శిలలూ, ఇనుమూ, బంగారమూ - ఇవన్నీ బలానికి నిదర్శనాలు భూమి పై భాగంలో నేలమీద పచ్చపచ్చగా పచ్చిక మొలుస్తుంది. పూవు పూస్తుంది. అక్కడ కనిపిస్తుంది ప్రకృతిలీల - యింద్రజాలం. చేరరాని చోట్లనుంచి హీరమణులు తెస్తాం. మాణిక్యాలు తెస్తాం కాని, చేరువనుంచి ప్రాణంతో కదిలే ఆ యింద్రజాలాన్ని మాత్రం తుంపి తేలేకపోతున్నాం.

నందిని : మీకింత సంపద వుండగా యింకా యీ లోభమెందుకూ ?

నేపథ్యంలో : నాకున్నదంతా మోతబరువే. బంగారమెంత కూడబెట్టినా స్పర్శమణి కాదు. బలమెంత విస్తరించినా యవ్వనం తిరిగి రాదు. అందుకే కాపలా కాస్తూ నిన్ను నిర్బంధంలో వుంచగలుగుతున్నాను. రంజనుకుమల్లే నాకూ యవ్వనం వుంటే నిన్ను స్వేచ్ఛగా వొదితే సినా బంధించగలిగి వుండేవాణ్ని. యీ విధంగా యీ కట్టు త్రాళ్ళను ముళ్ళు వేయటంతోనే నా కాలమంతా చెల్లిపోయింది. యేం చెప్పను ! అన్నీ ముడిపడతాయి కాని ఆనందం మాత్రం ముడిపడదు.

నందిని : బుద్ధిపూర్వకంగా జాలావరణానికి వెనక వుండడానికి నిశ్చయించు .కుని యిపుడిలా చిర్రూ బుస్సనటం యెందుకో నా కర్థం కాకుండా వుంది.

నేపథ్యంలో : నీ కర్థం కాదు. నేనొక అంతులేని యెడారిని. నీవంటి వొక చిన్న గడ్డిపోచను చూసి అంటున్నాను. " నేను తాపంతో యెండి

పోతున్నాను. అన్నీ పోగొట్టుకుని గొడ్డుపోతున్నాను. తప్తుణ్ణి రిక్తుణ్ణి, క్లాంతజీవిని " దురాశాదాహంతో యీ యెడారి యెంతో సారవంతమైన భూమి నాక్రమించి తన విస్తీర్ణాన్ని పెంచుకుంటున్నదిగాని, వొక చిన్న దుర్బలమైన గడ్డిపోచలో వున్న ప్రాణాన్ని తన వశం చేసుకోలేకపోతున్నది.

నందిని : మిమ్మల్ని చూస్తే యింతగా బడలికతో కుంగిపోతున్నట్లే కనిపించదు. మీలో వున్న బలాధిక్యాన్నే నే చూడగలిగాను.

నేపథ్యంలో : నందినీ ! వొకనాడు నావలెనే అలిసిపోయిన పర్వతాన్ని దూరదేశంలో చూశాను. ఆ కొండలో రాళ్ళన్నీ లోలోపల యే విధంగా బాధపడుతున్నదీ బైటినుంచి నా కర్థం కాలేదు. కాని వొకనాటి కాళరాత్రి, యేదో రాక్షసి దుస్వప్నం రేగి రేగి హఠాత్తుగా భగ్నమైపోయినట్లు భయంకర శబ్దాన్ని విన్నాను. తెల్లవారి చూతును గదా ఆ కొండ భూకంపంచేత ఆకృష్టమై నేలలోకి కుంగిపోయింది. పెరుగుట విరుగుట కొరకే. శక్తిభారం తనకు తెలియకుండా తన్ను తానే చూర్ణం చేసి పారేసుకుంటుంది. ఆ పర్వతాన్ని చూసి యీ విషయం గ్రహించాను. యిహ నీలో కూడా వొక విలక్షణమైన స్వభావం కనిపెట్టాను. అది దీనికి కేవలం విపరీతం.

నందిని : నాలో యే స్వభావం కనిపెట్టారు ?

నేపథ్యంలో : విశ్వవేణువులోనుంచి వెలుగుతూ వచ్చే నాట్యగతి.

నందిని : నాకేం అర్థం కావటంలా ——

నేపథ్యంలో : అలాంటి గతివల్ల వస్తువులో వున్న బరువంతా తేలికై పోతుంది. దానివల్ల గ్రహ నక్షత్రాలన్నీ భిక్షుకీ నటబాలికా సమూహంలాగా ఆకాశంనుంచి ఆకాశానికి నాట్యం చేస్తూ విహరిస్తాయి. ఆ నాట్య మహిమవల్లనే సుమా నందినీ ! నీవింత సహజంగా, సుందరంగా వున్నావు. నాతో పోలిస్తే నీ పరిమాణ మెంత ? అయినా నిన్ను చూసి యీర్ష్యాళువు నవుతున్నాను.

నందిని : మీ తోటి వాళ్ళనుంచి చేతులారా దూరం చేసుకుని వెలి వేసుకుని మిమ్ము మీరే వంచించుకున్నారు. సహజమైన ప్రవర్తనతో అందరితో ఎందుకు కలిసిపోకూడదు ?

నేపథ్యంలో : నన్ను నేను గోప్యంగా వుంచుకుని, ప్రపంచంలో పెద్ద పెద్ద వస్తుశాలల్లోనుంచి గొప్ప గొప్ప వస్తువులన్నిటినీ దొంగిలించటానికే యిక్కడ కూచున్నాను. ఆ విధాత గుప్పిట్లో దాచివున్న దానాన్ని నీ సంపంగి మొగ్గల్లాంటి చిన్ని వేళ్ళతో అందుకో గలవు; కాని నా దేహమంతటిలోనూ వున్న బలాన్ని వినియోగించినా ఆ చేరువకే పోలేకపోతున్నాను. గట్టిగా మూసిన ఆ విధాత ముష్టిని విప్పించి తీరాలి.

నందిని : మీ యీ గొడవంతా నాకర్థం కావటం లేదు. నే వెళతాను.

నేపథ్యంలో : సరే వెళ్ళు. కాని యిదుగో తెర ఆవలికి చేయి చాపుతున్నాను - నీ చెయ్యి వొకసారి దీనిమీద వుంచి పో!

నందిని : వొద్దు వొద్దు. అంతా దాచేసి హఠాత్తుగా యీ చెయ్యి కాస్తా బైటపెడితే నాకు భయం వేస్తున్నది.

నేపథ్యంలో : కేవలం చేత్తోనే పట్టుకుంటానని అందరూ నా దగ్గర్నుంచి పారిపోతారు. కాని నా సర్వస్వమంతా అర్పించి నిన్ను పట్టుకోదలిస్తే పట్టుకోనిస్తావా? నందినీ?

నందిని : యెందుకీ కబుర్లు? నన్ను మీ యింట్లోకే రానీయ లేదు గద.

నేపథ్యంలో : నాకు తీరిక లేదన్న విషయాన్ని విస్మరించి నిన్ను నా యింట్లోకి తీసుకురాదలచుకో లేదు. గాలితో నిండిన తెరచాపతో అనాయాసంగా నా విశ్రాంతి సమయంలోకి యేనాడు రాగలుగుతావో, ఆనాడే నీ ఆగమనానికి తగిన లగ్నం. ఆగాలి ఝంఝా మారుతమైనా మంచిదే. యిప్పుడా సమయం రాలేదు.

నందిని : నేను మీతో చెబుతున్నాను. ఆ అనుకూల పవనాన్ని రంజను తీసుకుని వొస్తాడు. అతనెక్కడికొచ్చినా విశ్రాంతినీ విరామాన్నీ వెంటబెట్టుకొస్తాడు.

నేపథ్యంలో : రంజను తనవెంట తెచ్చే విరామంలో యెర్రగన్నేరు పూలతేనె యెవరు నింపివుంచారో నేనెరగననుకున్నావా? నందినీ! నువు నాకు వుత్త విరామాన్నిగురించి చెబుతున్నావ్. దాంట్లోకి మధువెక్కణ్ణుంచి తెచ్చుకోను?

నందిని : యిహ యివ్వాళ్లటికి వెళ్లిపోతాను.

నేపథ్యంలో : వొద్దు. ఈమాటకి సమాధానమిచ్చిపో.

నందిని : ఆ సమాధానం రంజను కళ్లవైపు చూస్తే తెలుస్తుంది. అతనెంతో అందమైనవాడు.

నేపథ్యంలో : సుందరులిచ్చే సమాధానం సుందరులకే లభిస్తుంది. సౌందర్య హీనులు దాన్ని బలాత్కరించి లాక్కోదలిస్తే వీణలో తీగెలు మోగవు ; తెగిపోతాయి. యింకేంలేదు. వెళ్లు. వెళ్లిపో! లేకపోతే యేదో విపత్తు సంభవిస్తుంది.

నందిని : వెళ్లేలోపుగా వొకమాట చెప్పిపోతా. రంజను యివ్వాళ రావటం నిశ్చయం నిశ్చయం నిశ్చయం. అతన్ని వారించటానికి యెవరికీ సాధ్యంకాదు.

(నిష్క్రమిస్తుంది)

[ తవ్వు పనివాడు ఫాగూలాల్, అతనిభార్య చంద్ర - ప్రవేశం ]

ఫాగూలాల్ : నా మద్యం యెక్కడ దాచేశావు చంద్రా, పైకితీయ్.

చంద్ర : యేమ్మాటది ? తెల్లవారి నప్పట్నుంచీ సారాయే ?

ఫాగూలాల్ : యివ్వాళ సెలవు రోజు. నిన్ననేగద వాళ్ల మారణచండి వ్రతం - ఉపవాసదినం. యివాళ ధ్వజపూజా దాంతోపాటు అస్త్రపూజా.

చంద్ర : యేమంటున్నావ్. వాళ్లకు దేవతమీద గౌరవమంటూ యేమన్నావుందా ?

ఫాగూలాల్ : చూడలేదూ ? అస్త్రశాలల్లో, యిళ్లలో, అన్నిచోట్లా మద్య పానీయాలే.

చంద్ర : సెలవు దొరికిందిగదా అని సారా తాగటమే ? మనవూళ్లో వున్నప్పుడు పండగ రోజున సెలవొస్తే ...

ఫాగూలాల్ : అరణ్య మధ్యంలో పక్షికి సెలవు దొరికితే యెగిరిపోతుంది. పంజరంలో పక్షికి సెలవు దొరికితే అడ్డు కడ్డీలకేసి తలకొట్టుకుని చస్తుంది. యీ యక్షపురంలో పనికన్న సెలవే అశుభం.

చంద్ర : వొదిలేశేయ్ యీ వుద్యోగం. తిరిగి యింటికి వెళ్లిపోదాం.

ఫాగూలాల్ : నీకు తెలియదు కాబోలు ! యింటికి పోయేదారి మూసేశారు.

చంద్ర : యెందుకు మూశారు ?

ఫాగూలాల్ : మనయింటివల్ల వాళ్లకేం లాభంలేదు.

చంద్ర : వాళ్ల అవసరానికి మనకూ అంత లంకేమిటి ? బియ్యపు గింజకూ పైనున్న వూకపొట్టుకూలాగా ? అంతకన్నేంలేదూ ?

ఫాగూపాల్ : బిశు అన్నట్లు అన్ని అవయవాలతోనూ సంపూర్ణంగా జీవించివుండటం మేకకు తన విషయంలో అవసరం. దాని మాంసం తినేవాళ్లు దాని యెముకలూ, గిట్టలూ, కొమ్ములూ, తోకా యివన్నీ వొదిలేసి తింటారు. కసాయివాడి కత్తి కనపడగానే అతి కరుణంగా అది ఆక్రందనం చేయటంకూడా అధిక ప్రసంగమని తమ అసమ్మతి తెలుపుతారు. అదుగో వొస్తున్నాడు పాట పాడుతూ పాడుతూ బిశుదాసరి.

చంద్ర : ఈ మధ్య అతని పాట విచ్చలవిడిగా పైకొస్తున్నది.

ఫాగూలాల్ : అదే చూస్తున్నాను.

చంద్ర : అదంతా నందిని ప్రభావం. అది వాడి ప్రాణాలు లాగేసింది. అలాగే వాడిలో వున్న పాటలుకూడా పైకి లాగేసింది.

ఫాగూలాల్ : అందులో ఆశ్చర్యమేముంది ?

చంద్ర : ఊహుఁ. ఆశ్చర్యమేంలేదు. యిదుగో పరాగ్గావుండు. యెప్పుడో వోనాడు నీ గొంతులోంచి కూడా పాట పుట్టిస్తుంది. ఆ రోజున యీ వాడలోవున్న వాళ్లగతేమిటి ? ఆ మాయలమారి అందరికీ ముప్పుతెస్తుంది.

ఫాగూలాల్ : బిశుదాసరికివ్వాళరాలేదు ముప్పు. యిక్కడికి రాకమునపు యెన్నో రోజులకిందటనే నందినితో పరిచయం.

చంద్ర : ఓ బిశువన్నా ! వో మాట ! ఎక్కడికెళ్లుతున్నావ్. పాట వినిపించటానికిక్కడకూడా వొకరో అర్థోమనుషులు దొరుకుతారు. బొత్తిగా అంత కరువులేదు.

(బిశు పాడుతూ ప్రవేశం)

నా స్వప్నతరణి నడిపించే నావికా !
నీవెవ్వరు నావికా నీవెవ్వరు ?
తెరచాపలు నిండిపోయె
మత్తిల్లిన గాడ్పులతో ॥ నా స్వప్న ॥
పాడిపాడి సాగిపోవు
పరవశమై నాప్రాణము

నావనీట తేలియాడ
నన్నేనేను మరచి పోవ
ఆ సుదూర తీరమ్మున
కటులెసాగి పోవోయీ ॥ నా స్వప్న ॥
విన్నవోవు నా తలపుల
ఉన్నటులే ఉండనిమ్ము
నీ ముంగలి తెరను దీసి
నామోమొకసారి చూడు
మందస్మిత కాంతితోడ
అందగింపుమీ ప్రాణము ॥ నా స్వప్న ॥

చంద్ర : నీ స్వప్నతరి నడిపే సరంగెవరో నేనెరుగుదును.

బిశు : పడవ మధ్యలో వుండి కూడా, నే చూడలేదు. బైటినుంచి నువ్వెలా తెలుసుకుంటావు ?

గోకుల్ : చూడు బిశూ. నీ నందిని నాకేం నచ్చలా.

బిశు : ఏం ? ఏం చేసింది ?

గోకుల్ : ఏమీ చేయలేదు. అందుకే అనుమానం వేస్తున్నది. యీ పట్నపు రాజు పుత్తినే యెందుకు తీసుకొచ్చాడు ? ఆవిడ వాలకం నాకేం అర్థంకావటంలా.

చంద్ర : ఓ దాసరన్నా ! ఇది విషాదపట్నం. ఆవిడ యిలాంటి ప్రదేశంలో వేళాపాళాలేకుండా తన అందాన్ని విరజిమ్ముకుంటూ విహరించటముందే, అది చూడలేకుండా వున్నాను.

గోకుల్ : తెల్లగా మోటగా కొట్టొచ్చినట్టుగావుండే మొహాలమీద మనకు నమ్మకం. వాళ్ల వేషం నిండుగా వుంటుంది.

బిశు : యక్షపురి వాతావరణంలో సౌందర్యం అంటే తిరస్కార భావం. యిదే వినాశ హేతువు. నరకంలోకూడా సౌందర్యం వుంది. కాని సౌందర్యమంటే యేమిటో అక్కడి వాళ్లకు బోధపడదు. నరక వాసులకు అన్నిటికన్నా పెద్ద శిక్షయిదే.

చంద్ర : సరే, మేం మూర్ఖులం. మా మాటకేం. యిక్కడి సర్దారుల వరకూ యెవరూ ఆమెను రెండుకళ్ళతోనూ చూడలేక పోతున్నారు - తెలుసునా ?

బిశు : చూడు చూడు చంద్రా. ఆ సర్దార్ల కళ్ళల్లో వ్యాధి నీకే గనక అంటుకుంటే నాబోటి వాళ్ళను చూచినా నీ కళ్ళు యెర్ర నౌతాయి. యేమిటో అంటున్నావు ఫాగులాల్.

ఫాగూలాల్ : నిజం చెబుతున్నాను బిశూ, నందినిని చూసిం తర్వాత నన్ను నే చూసుకుంటే సిగ్గేస్తున్నది. ఆమె యెదట నోరు మెదపలేక పోతున్నాను.

గోకుల్ : బిశువన్నా ఆ పిల్లను చూసి నీ మతి భ్రమిస్తున్నది. అందుకే చూడలేకపోతున్నావు. అదంత మంచి లక్షణం కాదు. నీకే తెలిసొస్తుంది, ఎంతో కాలం పట్టదు. చెప్పివుంచు తున్నాను.

ఫాగూలాల్ : బిశూ! నీ చెల్లి అడుగుతూంది - మనం సారా తాగటాని క్కారణమేమిటని ?

బిశు : దైవకృపవల్ల మద్యభాండాగారాలు జగత్తు నాల్గుదిక్కులా వాటంతట అవే వుండిపోయినాయి. అదే విధంగా సుందరాంగుల క్రీగంటి చూపుల్లోకూడా మధువున్నది. మా పురుష బాహువు లతో కార్యకలాపాలందిస్తాం. మీరో, మీ బాహుబంధనాలతో మధువు నందిస్తారు. లోకంలో వొక్కొక్కప్పుడు డబ్బుకోసం పని చేయాలి. వేరొకప్పుడు డబ్బు లేకుండా పనిచేయాలి. మద్యమే లేకపోతే డబ్బులేకుండా పని చేయటం యెలాగ ?

చంద్ర : అవును, నాకేం, మీలాటి పుట్టు త్రాగుబోతుల మీద భగవంతుడికి అంతులేని దయ. కల్లుకుండ మీ నోళ్ళల్లో బోర్లించేశాడు.

బిశు : వో చెంప ఆకలి బెత్తం పుచ్చుకుని కొడుతున్నది. దప్పిక బెత్తం పుచ్చుకొని కొడుతున్నది. చేతులో అగ్నిజ్వాల పెట్టుకుని "పని చెయ్ పని చెయ్" అని ఆ రెండూ అంటున్నాయి.

చంద్ర : వీటిని సారా అంటారా ?

బిశు : ప్రాణమనే మద్యంలో నిషా తక్కువ. కాని రాత్రింబవళ్ళూ వుండి పోతుంది. నా సంగతి చూడు. ఈ రాజ్యానికొచ్చి నేల తవ్వేపనిలో దిగాను. విశాలప్రపంచంలో వున్న ఆ ప్రాణమద్యం కరువై పోయింది. అందువల్ల యీ బజారుకల్లుతో మతి మతిలో లేకుండా పోతున్నది. సహజంగా వున్న ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు యెప్పుడు

ఆటంకం కలుగుతుందో అప్పుడు నిట్టూర్పు ఆయాసంగా వొస్తుంది.

ఇంకిపోయె అమృతధార
యీ చీకటి బ్రతుకులోన
ఇంక మృత్యురసముతోడ
నింపివేయు మీ పాత్రిక
ఈ చితాగ్నిపై రేగిన
యీ జ్వాలా నవమాలిక
జ్వలన వలయమంతటినీ
సమయించే మహాజ్వాల!
శూన్య గగనమంతటికీ
శోభ తెచ్చు మహాజ్వాల!

చంద్ర: దాసరన్నా, వొచ్చేయ్ పారిపోదాం యిక్కణ్ణుంచి.

బిశు: ఆ నీలాకాశం కింద బార్లాగా తెరిచి వుంచిన ఆ మధుశాలలోకేనా? దారిలేదు. అందుకనే యీ ఖయిదులో వున్న దొంగలందరికీ మద్యమ్మీద యింత ఆసక్తి. మా కిక్కడ ఆకాశం లేదు. అవకాశం లేదు. పగటివేళ పన్నెండు గంటల్లోనూ వున్న నవ్వూ వెలుగూ, ఆటా పాటా - యివన్నీ గట్టిగా వడకట్టి తళతళలాడే వొక గ్రుక్కెడు అగ్నిద్రవాన్ని చేసుకున్నాం. బానిసలకు పని యెలా నిండుగా వుంటుందో పని లేనప్పుడు వాళ్ళకు విశ్రాంతి కూడా అలా నిండుగా వుండాలి.

నీ దినమణి పెనుమబ్బుల
నీలిమలో మాయమాయె.
దినమంతయు పనికిరాని
పనులతో నశించి పోయె.
రానిమ్మా తిమిర రాత్రి
లుప్త నిశాచరమ సఖిని!
క్లాంత నయన యుగళిని ది
గ్భ్రాంతి గొలుపు సుషఃకాంతి
కప్పివేయనిమ్మోయీ!

చంద్ర : నువ్వేమన్నా అను బిశువన్నా - మీ మగవాళ్ళంతా యీ యక్షపురికొచ్చి పాడైపోయినారు. మేమ్మాత్రం యేమీ మారలా.

బిశు : మారలేదంటే యేమిటి ? మీ పూలన్నీ వాడిపోయినాయి. యిప్పుడు మీరంతా బంగారం బంగారం అని ప్రాణం తినేస్తున్నారు.

చంద్ర : యెన్నటికీ కాదు.

బిశు : అవునని నే చెబుతున్నా, ఆ దురదృష్టవంతుణ్ణి ఫాగును చూడు - పన్నెండు గంటలు చాలక యింకా నాలుగ్గంటలు చచ్చుచాకిరీ చేస్తున్నాడు కదా, దానిక్కారణం అతనికీ తెలియదు నీకూ తెలియదు. అంతర్యామికి తెలుసు. బంగారం కోసం మీరు కనే కలలన్నీ బెత్తంలాగ అతన్ని కొట్టి నడిపిస్తున్నాయి. యీ బెత్తం యిక్కడి సర్దార్ల బెత్తంకన్నా గట్టిది.

చంద్ర : అలాగైతే రావేం మనవూరికి వెళిపోదామంటే ?

బిశు : యిక్కడి సర్దార్లున్నారే, వాళ్లు, పోవటానికి దారిలేకుండా చేయటం వొకటేకాదు, పోవాలనే బుద్ధికూడా పుట్టకుండా అడ్డేశారు. యివ్వాళ వోవేళ యింటికి పోయినా అక్కడ నిలకడగా వుండిపోలేం. మర్నాడే - అవతల పారేసినా మళ్లీ పంజరానికి తిరిగొచ్చే పెంపుడు చిలకలాగ - బంగారమ్మీద మోజుకొద్దీ తిరిగొచ్చేస్తాం.

ఫాగూలాల్ : అవునుగాని బిశూ - వొకప్పుడు నువ్వు పుస్తకాలు చదివి కళ్లు పోగొట్టుకోటానికి సిద్ధమైనావుగదా - మాలాటి మూర్ఖులతో బాటు చేత్తో గడ్డపార పుచ్చుకున్నావెందుకు ?

చంద్ర : యిన్నాళ్లున్నా యీ మాటకు సమాధానం బిశువన్న దగ్గిర్నుంచి సంపాదించలేకపోయినాం.

ఫాగూలాల్ : అయినా అది మనందరికీ తెలుసు.

బిశు : యేమిటో చెప్పు చూతాం.

ఫాగూలాల్ : మా సంగతంతా తెలియచేయటానికి నిన్ను గూఢచారిగా నియమించారు.

బిశు : యిదందరికీ తెలిసిన విషయమే అయితే నన్నెలా బతికుండనిచ్చారు ?

ఫాగూలాల్ : యింకోటికూడా తెలుసు. యీపని సరిగ్గా చేయలేక పోయినావని.

చంద్ర : యింత హాయయిన వుద్యోగంకూడా చేయలేకపోయినావుగదా అన్నా !

బిశు : హాయయిన వుద్యోగమా ? ఆరోగ్యంగావున్న శరీరానికి వెన్నుమీది వ్రణంలాటిదీ వుద్యోగం. వొంట్లో చాలా సుస్తీగావుంది, వూరికి వెళిపోతానూ అని సర్దారుతో చెబితే ఆయనన్నాడూ, యింత పాడైపోయిన శరీరాన్ని తీసుకుని వూరికెలా వెళిపోతావు, అయినా యిక్కడే కొన్నాళ్లుండి చూడూ అన్నాడు. అలాగే చూశాను. చివరికేమైందీ ? యక్షపురి నోట్లో ప్రవేశించగానే ఆ నోరు మూతపడి పోతుంది. యిహ గర్భగోళంలోకి పోయే వొక్కమార్గం తప్ప మరోదారి లేదు. నేనిప్పుడు పడివున్నది ఆశగానీ ఆలోకంగానీ లేని ఆ గర్భవాసంలో. మీకూ నాకూ భేదమేమిటంటే మీకన్నయెన్నో రెట్లెక్కువగా సర్దారు నన్నవమానిస్తాడు. చిరిగి పోయిన అరిటాకు కన్న పగిలిపోయిన కుండను చూసి మానవుడు అసహ్యించుకుంటాడు.

ఫాగూలాల్ : యెందుకలా విచారిస్తావు బిశువన్నా - మేమందరమూ నిన్ను నెత్తిన పెట్టుకుంటున్నాం కదా.

బిశు : యిదందరికీ తెలిసిందంటే చచ్చిపోతాను. మీ అభిమానం యెక్కడైతే పడుతుందో ఆ సర్దారు దృష్టికూడా అక్కణ్ణే పడుతుంది. కప్పలు బిగ్గరగా సరససల్లాపాలాడుతూంటే ఆ చప్పుడు కాస్తా కొండ చిలువ చెవిని పడుతుంది.

చంద్ర : అన్నా మీ పని యెన్నాళ్లలో పూర్తవుతుంది ?

బిశు : వీళ్ల పంచాంగంలో దినం పూర్తికావటమంటూ లేదు. వొక రోజయింతర్వాత రెండు రోజులూ, రెండు రోజులయింతర్వాత మూడు రోజులూ - సొరంగం తవ్వుకుంటూ సాగిపోతాం - వొక మూర తర్వాత రెండు మూరలూ రెండు మూరలయింతర్వాత మూడు మూరలూ - గడ్డలు గడ్డలుగా బంగారాన్ని పైకి తెస్తాం - వొగడ్డ తర్వాత రెండు గడ్డలూ రెండు గడ్డలతర్వాత మూడు గడ్డలూ. ఈ పట్నంలో వొక అంకె తర్వాత యింకో అంకె, దాని తర్వాత మరో అంకె - యింతే తప్ప అర్థమేమీ కనిపించదు. అందుకే వాళ్ల లెక్కలో మనం మనుష్యులమే కాదు. కేవలం సంఖ్యలమే. ఫాగూ, నువ్వే సంఖ్య ?

ఫాగూలాల్ : నా చొక్కా వెనక ముద్ర వేసివుందిగా - "41 ఫా".

బిశు : నేను '69 జ' ని. మావూళ్లో వున్నప్పుడు నేనూ వో మనిషి నే. యిక్కడ చదరంగంలో వో చదరాన్ని. నా గుండెమీదుగా చదరంగం ఆట సాగుతున్నది.

చంద్ర : అన్నా, వాళ్లు అంత బంగారం కూడబెట్టారుగదా, యింకా యేమవసరం వాళ్లకి ?

బిశు : అవసరమంటూవుంటే దానికి అంతుంటుంది. భోజనం చెయ్యటం అవసరం. కడుపు నిండగానే ఆ అవసరం తీరిపోతుంది. యీ నిషా అనేది అవసరమూ కాదు - దానికి అంతూ లేదు. యీ బంగారుగడ్డలనేవి యీ పట్నపు రాజుగారికి గడ్డ గట్టిన మద్య ఖండాలు - తెలిసిందా ?

చంద్ర : ఊ హుఁ.

బిశు : మద్య భాండం చేతులో పుచ్చుకుని అదృష్ట చక్రంలో చిక్కుకున్న సంగతి మరిచిపోతాం. మన విరామానికేమీ ఆటంకం లేదను కుంటాం. యీ బంగారు గడ్డలు చేతుల్లో వుంచుకుని యీ పట్నం పరిపాలించే రాజుకూడా భ్రమలో పడిపోతున్నాడు. భూమికి సర్వసాధారణంగా వున్న ఆకర్షణశక్తి తన్నేమీ బాధించదను కుంటున్నాడు. అసాధారణమైన ఆకాశంలో యెగురుతున్నానను కుంటున్నాడు.

చంద్ర : కొత్త పంటలొచ్చినాయని వూరూరా పండుగచేసుకుంటున్నారు. అన్నా, నీ కాళ్లు పట్టుకుంటాను. యింటికి పోదాం రద్దూ. మనంద రమూ సర్దారుదగ్గిరకి వెళ్ళి వొక్కమాటు—

బిశు : యీావిడకింకా సర్దారు సంగతి అర్థంకాలేదనుకుంటాను.

చంద్ర : యేం, ఆయన్ను చూస్తే నాకెంతో...(నవ్వుతూ)

బిశు : అవునవును. యెప్పుడూ తళతళా మెరుస్తూంటాయి ఆయన పళ్లు. మొసలికి పైపళ్లూ కిందిపళ్లూ కరిచేటప్పుడు వొకదానిపక్క మరోటి అంటిపట్టివుంటాయి. మొసలిరాజే వాటిని విడదీయాలన్నా విడదీసుకోలేదు.

చంద్ర : అదుగో, సర్దారొస్తున్నాడు.

బిశు : మన పనయినట్టే. మన మనుకున్నమాటలు తప్పకుండా వినేవుంటాడు.

చంద్ర : యేముందీ, మన మనుకునేమాటల్లో యేమీ——

భిశు : మాట్లాడటమే మనవొంతు. ఆ మాటలికి అర్థం వాళ్లే చెబుతారు. యేమాటంటే యే కొంప అంటుకుంటుందో యెవరికీ తెలీదు.

(సర్దారు ప్రవేశం)

చంద్ర : సర్దారు తాతగారండీ!

సర్దారు : యేం మనమరాలా, అంతా బాగున్నారా ?

చంద్ర : వొక్కమారు యింటికి పోయిరావటానికి సెలవిప్పించండి.

సర్దారు : యిక్కడ మీకిచ్చిన గదులు మీ సొంతయింటికన్న చాలామంచివి. సర్కారువారి ఖర్చుమీద కాపలామనిషిని కూడా యేర్పాటు చేశాం. యేమోయ్ "69 జ"! వీళ్ల మధ్య నిన్ను చూస్తుంటే కొంగలకు నాట్యం నేర్పటానికి సారసపక్షి వొచ్చిందా అనిపిస్తున్నది.

బిశు : సర్దారుగారూ, మీ పోలిక నాకాట్టే నచ్చలేదు. నా కాళ్లల్లో నాట్యంచేసే సత్తువేవుంటే యెన్నడో పారిపోయుండేవాణ్ణి. మీ అందుబాట్లో యెక్కడైనా నాట్యంచేయటానికి ప్రయత్నిస్తే దానివల్ల యెంత ప్రమాదం వుందో చెప్పటానికి పెద్ద పెద్ద దృష్టాంతాలు చాలా వున్నాయి. సామాన్యంగా నడవటానికే మా కాళ్లు వొణికిపోతున్నాయి.

సర్దారు : మనమరాలా, నీకో మంచి కబురు. వీళ్లందరికీ మంచి మంచి విషయాలు వినిపించటానికి కేనారాం గోస్వామిని పిలిపించాను. వీళ్లదగ్గిర్నుంచి స్వామి దక్షిణగా వసూలయే డబ్బుతో అతని ఖర్చు గడిచిపోతుంది. ఆ గోస్వామి దగ్గిరికి వీళ్లు ప్రతి సాయంకాలమూ వెళ్లి——

ఫాగూలాల్ : అహాఁ, సర్దారుగారూ అలా పనికిరాదు. యిప్పుడు మేము సాయంకాలం కాగానే కల్లుతాగి మంచి మత్తుగా పడివుంటున్నాం. యీ సమయంలో వుపదేశాలు కనక మొదలుపెడితే నరహత్యలు జరుగుతాయి.

బిశు : వూరుకో వూరుకో ఫాగూలాల్ !

(గోస్వామి ప్రవేశం)

సర్దారు : ఇదుగో, అంటూండగానే వొచ్చేశారు. ప్రభూ ! నమస్కారం. మా పనివాళ్లున్నారే, వీళ్ల మనస్సు చాలా దుర్బలం. మధ్య మధ్య

అశాంతి రేగుతూవుంటుంది. వీళ్ల చెవులో యేదైనా కాస్త శాంతి మంత్రం వుపదేశించటం చాలా అవసరం.

గోస్వామి : వీళ్ల సంగతేనా చెబుతున్నారు? ఆహా, వీళ్లు సాక్షాత్తూ కూర్మావతారులు. బరువంతా నెత్తినపెట్టుకుని మోస్తున్నారు. కాబట్టే యీ లోకం యిలా నిలిచివుంది. తలుచుకుంటే వొళ్లు పులకరిస్తుంది. నాయనా "47 ఫా", వొకసారి నిదానంగా ఆలోచించి చూడు. యీ నోటితో భగవన్నామ సంకీర్తన చేసేట్టుగా మీరే నన్నాదుకుంటున్నారు. నా వొంటినిండా కప్పుకున్నయీ బట్టా, దీనిమీద అద్దకంవేసిన హరినామాలూ మీరు చేసినవే. యిదేం తక్కువ సంగతా? మిమ్మల్ని ఆశీర్వదిస్తున్నాను. సర్వకాల సర్వావస్థల్లోనూ అచంచలంగా వుండండి. అలాగయినట్లయితే భగవంతుడి కృపకూడా అచంచలంగా వుంటుంది. నాయనా వొకసారి గొంతు విప్పి 'హరీ హరీ' అనండి. మీ అందరి బరువూ తేలికై పోతుంది. హరినామ ఆదా వంతేచ మధ్యేచ—

చంద్ర : ఆహాహా! యెంత యింపయిన మాటలు! అయ్యా, యిలాటి మాటలు విని యెన్నాళ్లయిందో. మీ పాదధూళి కాస్త తీసుకో నివ్వండి.

ఫాగూలాల్ : యిప్పటిదాకా నిబ్బరంగా వుండగలిగాను. యిహ వుండ లేను సర్దారుగారూ. యీ దుబారా ఖర్చంతా యెవరికోసం? స్వామి దక్షిణ యియ్యమంటే మేం వొప్పుకుంటాం కాని, యీ మోసం మాత్రం భరించలేం.

బిశు : ఏయ్ ఫాగూలాల్, నీకు మతి పోతున్నది. యిలా అయితే క్షేమం కాదు సుమా. కాస్త తమాయించుకో.

చంద్ర : ఇహమూ పరమూ రెండూ పోగొట్టుకు కూర్చున్నావు. యిహ నీ గతేం కాబోతున్నదో. యిదివరకెన్నడూ నీ బుద్ధి యిలా వుండేదికాదు. నాకు బాగా తెలిసొచ్చింది. నీమీద ఆ నందిని ప్రభావం బాగా పడిపోయింది.

గోస్వామి : సర్దారుగారూ మీరేమన్నా అనండి. వీళ్లది యేం అమాయకత్వం! కడుపులో వొకటీ పైకొకటీ కాదు. వీళ్లకు మనం చెప్పే దేమిటి? వీళ్లు మనకే నేర్పగలరు - తెలిసిందా?

సర్దారు : తెలియకేం, బాగా తెలిసింది. ఈ వుపద్రవం యెక్కడినుంచొచ్చిందో కూడా తెలిసింది. యీ భారమంతా నేనే వహించాల్సొస్తుంది. ప్రభువువారు మట్టుకు ఆ పక్క పేటలోకి పోయి భగవన్నామస్మరణ చేయాలి. అక్కడి పనివాళ్లు అదేమిటో కొంచెం గడబిడ చేయటం మొదలుపెట్టారు.

గోస్వామి : ఏ పేటన్నారు ?

సర్దారు : అదుగో ఆ టాతాపేటలో. ఆ పేట పెత్తందారు 71 ట. ఙ 65 పేట లేదూ దాని యెడంవైపుదాకా వుందీపేట.

గోస్వామి : 'న' పేటలో యింకా కొంత కళవళపాటు వుందేమో కాని 'ఙ' పేటలో మాత్రం ప్రస్తుతం అందరూ ప్రశాంతంగా మధుర రసంలో మునిగివున్నారు. మంత్రోపదేశం తీసుకుంటున్నట్లుగా చెవులు నిక్కబెట్టుకున్నారు. అయినా యింకా కొన్నినెల్లు పోలీసు దళాన్ని అక్కడ వుంచటం మంచిది. యెందుకంటే 'నాహంకారాత్ పరో రిపుః' అహంకారాన్ని మించిన శత్రువు లేదు - పోలీసు వొత్తిడితో అహంకారం అణిగిపోయింతర్వాత - అప్పుడూ మాకుపని. యిహ వెళ్లొస్తా.

చంద్ర : ప్రభూ ! వీళ్లందరికీ మంచి బుద్ధి పుట్టేటట్లుగా దీవించండి. వీళ్ల తప్పులు లెక్కచేయకండి.

గోస్వామి : ఫరవాలేదమ్మా మహాలక్ష్మీ - అంతా చల్లబడిపోతుంది.

(నిష్క్రమణ)

సర్దారు : యేమోయ్ '69 ఙ', మీ పేటలోవాళ్ల వాలకం అదోమాదిరిగా కనిపిస్తున్నది !

బిశు : అయితే అయ్యుండొచ్చు. గోస్వామిగారు వీళ్లని కూర్మావతారం అన్నారు. శాస్త్రాన్ని బట్టి చూస్తే అవతారాలు మారటం కద్దు. కూర్మం హఠాత్తుగా వరాహం కావటమూ తాబేటి చిప్పకు బదులు దంత పటిమ కనిపించటమూ, వోర్పుకు బదులు పొగరుబోతుతనం రావటమూ జరుగుతూ వుంటాయి.

చంద్ర : బిశువన్నా కొంచెం ఆగు. సర్దారు తాతగారూ ! నా ప్రార్థన మరిచిపోకండి.

సర్దారు : యెప్పటికీ మరిచిపోను. విన్నానుగా. జ్ఞాపకం వుంచుకుంటాను.

(నిష్క్రమణ)

చంద్ర: ఆహా చూశావా! సర్దారు యెంత సరసుడో. అందరితోనూ నవ్వుతూనే మాట్లాడ్డం!

బిశు: మొసలిదంతాలు మొదట నవ్వటమూ తర్వాత కొరకటమూ.

చంద్ర: ఈయనలో ఆ కొరకటం యేమీ కనిపించటం లేదే?

బిశు: ఇంకా తెలియదూ? ఈ తడవనుంచి పనివాళ్ల వెంబడి వాళ్ల ఆడవాళ్లను తీసుకురావటానికి వీల్లేకుండా బందోబస్తు చేశారు.

చంద్ర: యెందుకు?

బిశు: వాళ్ల రోజువారి లెక్కల పుస్తకాల్లో సంఖ్యారూపంగా వున్న మాకు చోటుంది. గణితశాస్త్రం ప్రకారం మగ అంకెలకు ఆడ అంకెలంటూ లేవు.

చంద్ర: యేం విడ్డూరం! వాళ్ల యిళ్లల్లో వాళ్ల ఆడవాళ్లు లేరూ? వాళ్లేమంటారు?

బిశు: వాళ్లుకూడా బంగారపు మైకంతో అవివేకంలో పడిపోయినారు. ఆ పారవశ్యంలో భర్తలనుకూడా విడిచి వెళ్తున్నారు. మనం వాళ్ల దృష్టిలో లేనేలేం.

చంద్ర: మీ యింట్లో నీ భార్య వుండేదికదా. యేమైందామె? యెన్నాళ్లో అయింది ఆవిడ కబురు తెలిసి.

బిశు: నేను గూఢచారిగా పెద్ద వుద్యోగంలో వున్నంతకాలం సర్దార్ల భార్యలందరూ ఆవిణ్ణి ఆ పెద్ద మేడల్లోకి పిలుస్తూండేవారు - పేకాటకు. ఫాగూలాల్ ముఠాలో యెప్పుడైతే చేరానో అప్పుడా పిలుపులన్నీ నిలిపేశారు. ఆ అవమానంతో నన్ను వొదిలి వెళ్లిపోయింది.

చంద్ర: యెంత పాపిష్ఠిపని చేసిందీ!

బిశు: యీ పాపానికి శిక్షగా ఆవిడ వొచ్చేజన్మలో సర్దారు భార్య అవుతుంది.

చంద్ర: అన్నా యిదుగో చూడు. యెవరు వాళ్లంతా, పొగ రేపుతూ పోతున్నారు? ఒకదాని వెనక వొకటి ఆ నెమిలి పల్లకీలూ, యేనుగంబారీలమీద ఆ జాలర్లూ చూశావా? గుర్రపుస్వారి చేసేవాళ్లెంత ముచ్చటగా వున్నారో! ప్రతి బల్లెం చివరా సూర్యరశ్మిలో తునక వొకటి అతికించినట్లుగా పట్టుకుపోతున్నారు.

బిశు : వాళ్లంతా సర్దార్ల భార్యలు. ధ్వజపూజా సందర్భంలో జరిగే విందుకు పోతున్నారు.

చంద్ర : ఓహో! యేం వైభవం! యెంత తీర్చినట్లుగా వున్నారు! అవును గాని అన్నా, నువ్వు గూఢచారి వుద్యోగం మానుకోకుండా వున్నట్లయితే నువ్వుకూడా వాళ్లతోపాటు తిరిగేవాడివేనా? నీ భార్య కూడా——

బిశు : ఆ. మాక్కూడా ఆదశ పట్టేదే.

చంద్ర : యిహ వెనక్కు తిరిగి పోవటానికి దారి లేనట్టేనా? యెంత మాత్రమూ లేనట్టే?

బిశు : వుంది. మురుగు కాలువలోకుండా.

నేపధ్యంలో : భక్తుడా!

బిశు : యేం భక్తురాలా!

ఫాగూలాల్ : అదుగో నీ నందిని పిలుపు వినిపించింది యిహ యివ్వాల్టికి బిశువన్న మనకు దక్కడం వుత్తదే.

చంద్ర : యిహ నీ బిశువన్నమీద ఆశపెట్టుకోవొద్దు. అన్నా, ఆమె నిన్ను యే సుఖం చూపించి మాయపుచ్చింది?

బిశు : దుఃఖంతో మాయ పుచ్చింది.

చంద్ర : అన్నా! యెందుకిలా తలక్రిందుగా మాట్లాడతావ్.

బిశు : మీ కర్థంకాదు. అదో విధమైన దుఃఖముంది. దాన్ని మరిచి పోవట మనే దుఃఖాన్ని మించిన దుఃఖం వేరేలేదు.

చంద్ర : స్పష్టంగా చెబితే చెప్పు. లేకపోతే చిరాకేస్తుంది.

బిశు : చెబుతున్నావిను. చేరువనే వున్నదాన్ని కోరటంవల్ల వొచ్చే దుఃఖం పశువులు పొందే దుఃఖం. అతి దూరస్థంగా వున్నదాన్ని అభిలషించటం వల్ల వొచ్చే దుఃఖం మానవుల దుఃఖం. చిరస్థాయి అయిన ఆ దూరపు దుఃఖచ్ఛాయ నందినిలో ప్రకాశిస్తుంది.

చంద్ర : యీ మాటలేం నా కర్థం కావటంలా. ఒక్కటి మాత్రం అర్థం అవుతున్నది. ఆడవాళ్ల విషయంలో మీ కెంత తక్కువగా అర్థమైతే అంత యెక్కువ ఆకర్షణ. యే ఆడంబరమూ లేనివాళ్లం మేం - మా విలువ చాలా తక్కువ. అయితేనేం, నేనివ్వాళ చెప్పివుంచు

తున్నాను - ఆ పిల్లవుందే, ఆ యెర్ర గన్నేరు పూలమాయతో సర్వనాశనమయ్యే తోవలో లాక్కెళ్లి దించుతుంది.

(చంద్ర, ఫాగులాల్ నిష్క్రమిస్తారు)

(నందిని ప్రవేశం)

నందిని : దూరంగా ఆ రస్తా మీద యివ్వాళ ప్రొద్దున పుష్య లక్ష్మి పాట పాడుతూ వాళ్లు పొలానికి వెళ్లారు - విన్నావా పాట ?

బిశు : నా ప్రాతఃకాలం నీ ప్రాతఃకాలం మాదిరిగా పాట వినటానికి వీలైన కాలం అనుకున్నావా ? అది కేవలం జీర్ణించిన క్రిందటి రాత్రిలోనుంచి వూడ్చివేసిన ఉచ్ఛిష్టం.

నందిని : యివ్వాళ మనస్సులో సంతోషం కొద్దీ అనుకున్నాను : యిక్కడి ప్రాకారమ్మీది కెక్కి వాళ్లు పాడేపాటతో గొంతు కలుపుదామని. యెటూ దారి కనిపించలేదు. అందుకోసం నీదగ్గిర కొచ్చాను.

బిశు : నేనేం ప్రాకారాన్నా ?

నందిని : అవును. నువ్వు నాకు ప్రాకారానివే. నీ చేరువకి రాగానే యెత్తుగా లేచి బైటి ప్రపంచాన్ని చూడగలుగుతున్నాను.

బిశు : నీ నోట యీ మాట వింటుంటే నా కాశ్చర్యంగా వుంది.

నందిని : యెందుకు ?

బిశు : యీ యక్షపురిలో ప్రవేశించినప్పటినుంచీ యింతవరకూ నా జీవితంలోనుంచి ఆకాశాన్ని పోగొట్టుకున్నట్టే అనిపించేది. యిక్కడ ముక్కలు ముక్కలుగా వున్న మనుషులతోపాటు నన్నుకూడా గుండకొట్టి వోముద్దగా తయారుచేసినట్లనిపించేది. వాళ్లకు విశ్రాంతి అంటూ లేదు. యిలాటి సమయంలో నువ్వొచ్చి నావంక అదో విధంగా చూచేప్పటికి నాకనిపించింది - మన మధ్య యింకా కొంత వెలుతురు లేకపోలేదని.

నందిని : బిశూ ! మూసేసిన యీ కోటలో కేవలం నీకూ నాకూ మధ్యలోనే కొంత ఆకాశం నిలిచివుంది. తక్కిన అంతటి మీదా మూత వేసే వుంది.

బిశు : ఆ కాస్త ఆకాశమూ వున్నది కాబట్టే నీకు నా పాట వినిపించ గలుగుతున్నాను.

నా పాట నీకు వినిపింపగ
మేలుకొల్పి నన్ను నిలుపు

ఓ నిదుర చెదరగొట్టు దాన !
నా యెద కదిల్చు యిమ్ము పిలుపు
ఓ వగపు మేలుకొల్పు దాన !
ఇరులవివో విరియబారె
పులుగులు తమ గూండ్లుదూరె
పడవ యేటియొడ్డు చేరె
నా హృదయ మొకటె యూరట కనలేమి తెలుపు
ఓ వగపు మేలుకొలుపు దాన !

నందిని : నన్ను వగపు మేల్కొల్పుదాన ! అంటున్నావా ?

బిశు : అందరాని అవతలి సముద్ర తీరాన్నుంచి నాకు సందేశాన్ని తెచ్చిన దూతివినీవు. యేనాడు నువు యక్షపురి ప్రవేశించావో అప్పటినుంచీ లవణ జలకణాలను వహించే ఆ సముద్రపుగాలి నా హృదయాన్ని కదలించింది.

నా పనిపాటుల మధ్యమధ్య
కారిన కన్నీళుల ఝరి
అపనైన లేదేమరి ?
మెల్లమెల్లగ నన్ను డాసి
నాలో నమృతమ్ము పోసి
పోలేదా నన్నుబాసి ?
నా వగపుల మాటుమణిగి నిలిచియుంట ప్రీతిగొలుపు
ఓ వగపు గొల్పుదాన !

నందిని : యే దుఃఖాన్ని నువు గానంచేస్తున్నావో, ముందుగా దాని సంగతే నాకు తెలియలేదే.

బిశు : రంజను దగ్గర కూడా తెలియలేదా ?

నందిని : ఉఁహుఁ. రెండు చేతులతోనూ పడవ నడుపుకుంటూ రంజను తుపానులో కూడా నన్ను నదిని దాటిస్తాడు. అడివి గుర్రాల మీద కూడా జూలు చేతపట్టి, నన్ను వెంటబెట్టుకుని అరణ్యా మధ్యంలో స్వారి చేయగలడు. పైకి దూకవొస్తున్న బెబ్బులి కళ్ల మధ్య బాణం వేసి నా భయాన్ని పారదోలి హ హ హ అని నవ్వుతాడు. మా నాగాయి నదిలో దూకి ఆ ప్రవాహాన్ని అల్లకల్లోలం చేసినట్టు నన్ను

కూడా గందరగోళం చేసి పారేస్తాడు. తన ప్రాణంతో తన కున్న దంతా పందెంవేసి జయాపజయాల అట ఆడతాడు. ఆ ఆటలోనే నన్ను గెలిచి తీసుకుపోయాడు. ఒకప్పుడు నువుకూడా మాతోపాటు వుండేవాడివి. యేమనుకున్నావో యేమో, మా జూదగాళ్ల ముఠాలో నించి పైకి వెళిపోయావు. వెళ్లేటప్పుడు నా వంక అదో మోస్తరుగా చూశావు. అప్పుడు నాకేం అర్థంకాలేదు. తరవాత యెన్నాళ్ల దాకానో నీ జాడే తెలియలేదు. యెక్కడికి పోయావో చెప్పు.

బిశు :

వరదవారి కంటినీరు
వగపు కడలి కలిసిపోయె
ఓ నా చిన్నారీ! నా చిన్నారీ!
రెండుగట్టు లొరసికొనుచు
నిండిపోయె గుసగుసలు
ఓ నా చిన్నారీ! నా చిన్నారీ!
ఎరిగిన తీరాన నాదు
తరణి నిలిచియుండె దాని
కట్లన్నీ విడివడి పెను
గాలిలోన తేలిపోవ
యెరుగని యే గట్టునకో
యెవరో హైరా తరలించిరి?
ఓ నా చిన్నారీ! నా చిన్నారీ!

నందిని : ఆ అజ్ఞాత తీరంనుంచి యీ యక్షపట్నంలో సొరంగం తవ్వే పనిలోకి నిన్నెవరు తీసుకొచ్చారు?

బిశు : వొకమ్మాయి. యెగిరిపోయేపక్షి హఠాత్తుగా బాణంతగిలి నేలమీద పడ్డట్టు ఆ అమ్మాయి వొక్కదెబ్బన యీ చోటికి తీసుకొచ్చి పడేసింది. నన్ను నేనే మరిచిపోయాను.

నందిని : ఆమె నిన్నెలా వశం చేసుకో గలిగింది?

బిశు : ఆశపడి కోరుకున్న జలం అపురూపమయిపోతే బుద్ధి సహజంగానే యెండ మావిని చూసి భ్రమిస్తుంది. ఆ తరవాత దారీ తెన్నూ లేకుండా అక్కడా యిక్కడా యెంత వెతికినా జలం దొరకదు.

వొకనాడు పడమటి వైపు కిటికీలోనుంచి ఆకాశంలో మేఘాలు నిర్మించిన స్వర్ణపురం చూశాను. అదే సమయంలో ఆ అమ్మాయి యక్షపురిలో వున్న బంగారు గోపురం చూసి క్రీగంటి చూపుతో నన్నక్కడికోమారు తీసికెళ్లు, నీ కెంత సామర్థ్యం వుందో చూస్తాను, అన్నది. నేను పౌరుషం కొద్దీ అలాగే తీసికెళతానన్నాను. యీ బంగారు గోపుర సమీపానికి ఆమెను తీసుకొచ్చాను. అప్పటికి గాని నా భ్రమ విచ్చిపోలేదు.

నందిని : నేవొచ్చాను కదా, యిక్కణ్ణించి నిన్ను పైకి తీసికెళతాను. నీ బంగారు గొలుసుల్ని తెంచేస్తాను.

బిశు : నువ్వీ దేశపు రాజుని కూడా కదిలించి పారేశావు కదా, నీ కిక అడ్డం వొచ్చేదెవరు ? - అవును గానీ యీ రాజుని చూస్తే భయం వెయ్యడం లా ?

నందిని : యీ ఆవరణానికి యివతలుంటేనే భయం. నేనేమో లోపలికి పోయి చూశాను.

బిశు : యెలాగ కనిపించాడు ?

నందిని : ఆయనా మనిషే - కాని బ్రహ్మాండమైన మనిషి. ఆయన నుదురు కోట సింహద్వారంలా వుంది. ఆయన రెండు బాహువులూ దుర్గమ దుర్గంలో వున్న యినప గడియల్లా వున్నాయి. రామాయణ మహా భారతాల్లో నించి దిగొచ్చిన యెవరో మహాపురుషుడులా వున్నాడు.

బిశు : యింట్లో ప్రవేశించి యింకేం చూశావు ?

నందిని : ఆయన యెడమ చేతిమీద వొక డేగ కూర్చునుంది. దాన్నిదించి మంచె మీద కూర్చోపెట్టి నావంక అదే పనిగా చూశాడు. తరవాత నా చెయ్యి తన చేతిలో వుంచుకుని ఆ డేగ పక్షి రెక్కలు దువ్వి నట్లుగా నిమురుతూ కొంత సేపయింతరవాత ఆకస్మాత్తుగా "నేనంటే నీకు భయంలేదూ" అని అడిగాడు. యే మాత్రమూ లేదన్నాను నేను. అప్పుడు నా విరబోసిన తలవెంట్రుకల్లో రెండు చేతులూ దూర్చి కొన్ని నిమిషాల పాటు కళ్లు మోడ్చి కూర్చున్నాడు.

బిశు : నీ కెలా అని పించింది ?

నందిని : బాగానే వుందని పించింది. యేమని చెప్పను. అతడేమో వెయ్యేళ్లు నిండిన మర్రిచెట్టు, నేనో వొక చిన్న పిట్టను. ఆ చెట్టు

కొమ్మ చివర వొకసారి కొంచెం పుయ్యాల లూగితినా అతని మనస్సు పుప్పొంగి పోతుంది. ఆ మాట నిజం. యేకాంతంగా వున్న ఆ ప్రాణిని సంతోష పెట్టాలనే నా కోరిక.

బిశు : ఆ తర్వాత ఆయనేమన్నాడు ?

నందిని : వొకసారి వొళ్లు విదిల్చి లేచి బల్లెంమొన లాటి చూపు నా ముఖ మ్మీద సారించి తలవని తలంపుగా "నిన్ను తెలుసుకోవాలని వుంది నాకు" అన్నాడు. నా వొళ్లంతా యెలా వొణికి పోయిందో! "యేముంది తెలుసుకునేందుకు ? నేనేం పుస్తకాన్నా ?" అన్నాను. "పుస్తకాల్లో వున్నదంతా నాకు తెలుసు. నువు మాత్రం నాకర్థం కావటంలా" తర్వాత అదోరకంగా కలత చెంది "రంజను సంగతి నాకు చెప్పవూ ? అతన్ని యెలా ప్రేమిస్తావు ?" అన్నాడు. "జలంలో మునిగి వున్న చుక్కాని ఆకాశంలో తేలిపోతున్న తెర చాప నెలా ప్రేమిస్తుందో అలాగ. తెరచాపలో మలయమారుతం పాట పాడుతూంటే చుక్కాని చుట్టూ అలలు నాట్యం చేస్తాయి." అన్నాను. వొకుర్రవాడి మాదిరిగా అదే పనిగా చూస్తూ శ్రద్ధతో విన్నాడు. ఆ తరవాత హఠాత్తుగా వొణికి పోయినట్లయిపోయి "అతనికోసం ప్రాణాన్ని వొదులుకోగలవా" అన్నాడు. "ఈ క్షణం" అన్నాన్నేను. అదోవిధమైన కోపంతో గర్జించి "యెన్నటికీ వొదులుకో లేవు" అన్నాడు. "తప్పకుండా వొదులుకోగలను" అన్నాను. "దానివల్ల నీకేం లాభం"? అన్నాడు. "ఏమో నాకు తెలియద" న్నాను. దాంతో కటకటలాడి వెళిపో నా యింట్లోంచి ; వెళిపో, నా పని పాడు చెయ్యకు అన్నాడు. దాని అర్థం యేమిటో నాకు తెలియలేదు.

బిశు : అన్ని విషయాలూ స్పష్టంగా అర్థం చేసుకోవాలని అతని కోరిక. యేదైనా అర్థం చేసుకోలేక పోతే అతని మనస్సు కలతపడి పోతుంది. దాంతో అతనికి ఆగ్రహం వొచ్చేస్తుంది.

నందిని : పిచ్చి తమ్ముడూ, అతని మీద నీకేమీ జాలి వేయటంలేదూ ?

బిశు : అతని మీద భగవంతుడి కెప్పుడైతే జాలి కలుగుతుందో ఆక్షణమే అతని మరణం.

నందిని : అలాకాదు, అలాకాదు. బతికుండటం కోసం అతనెంత చచ్చిపోతున్నాడో నీకు తెలియదు.

బిశు : అతను బతకటమంటే అర్థం యేమిటో నీకివాళనే తెలుస్తుంది. అది చూసి నువ్వు సహించగలవో లేదో మాత్రం చెప్పలేను.

నందిని : అదుగో ఆ నీడ చూడు బిశూ, తప్పకుండా సర్దారు మన మాటలు చాటుగా వుండి విని వుంటాడు.

బిశు : యీ పట్నంలో అన్ని వైపులా పడుతూ వుంటుంది - సర్దారు నీడ. తప్పించుకు పోవడానికి వీలేదీ ? సర్దారెలా కనపడ్డాడు ?

నందిని : అటువంటి చచ్చు మనిషి నెక్కడా చూడలేదు. వేత వనంలో నుంచి కోసి తెచ్చిన బెత్తంలాగ ఆకుల్లేవు, వేళ్లు లేవు, లోపల సారంలేదు - అంతా యెండి పోయి విరవిరలాడు తున్నాడు.

బిశు : ప్రాణాన్ని శాసించటం కోసం ప్రాణం పోగొట్టుకుంటున్నాడు దౌర్భాగ్యుడు.

నందిని : వూరుకో వూరుకో వినగలడు.

బిశు : నువ్వు వూరుకోవటం కూడా వినగలడు. దానివల్ల మరీ వుపద్రవం. తవ్వు పని వాళ్లతో కలిసి మెలిసి వున్నప్పుడు సర్దారుతో జాగర్త గానే మాట్లాడుతాను. దాంతో ఆయన నన్ను యెందుకూ పనికి రాని పదార్థం కింద కట్టేసి నామానాన నన్ను బతక నిస్తాడు. అంచేత ఆయన దెబ్బకి గురికాకుండా వుంటున్నాను. కానీ వో పిచ్చి చెల్లాయీ, నువ్వు నా యెదట వుండగానే నాకదో పౌరుషం వొచ్చేస్తుంది. అప్పుడిహ తమాయించుకోలేను.

నందిని : అలాకాదు. వుపద్రవాన్ని పిలిచి మరీ తెచ్చుకోవొద్దు. అదుగో, సర్దారు రానే వొచ్చాడు.

(సర్దారు ప్రవేశం)

సర్దారు : యేమోయ్ '69 జ'. అందరితోనూ సావాసం చేస్తున్నావే - మంచీ చెడూ లేదూ ?

బిశు : తమతో కూడా నా సావాసం యిలాగే ప్రారంభమయింది. అక్కడ మంచీ చెడూ చూడటం కొంత కష్టమే.

సర్దారు : దేన్ని గురించి మాట్లాడు కుంటున్నారు ?

విశు : మీ దుర్గంలో నుంచి బైటపడటం యెలాగా అని పరామర్శించు కుంటున్నాం.

సర్దారు : యేమిటీ సాహసం! అంత నిర్భయంగా చెప్పటమే ?

విశు : సర్దారుగారూ, యెవరి మనసులో వాళ్లకి అందరూ అనుకుంటూనే వున్నారు. పంజరంలో పక్షి వూచలు పట్టుకుని ముక్కుతో పొడుస్తూంటే - అది ఆ వూచలపైన ప్రేమ కొద్దీకాదుకదా యిది పైకి చెబితే యేం, చెప్పక పోతే యేం ?

సర్దారు : ప్రేమ కొద్దీకాదు. ఆ సంగతి నాకూ తెలుసు. కానీ పైకి నిర్భయంగా చెప్పటమనేది మాత్రం యిటీవల కొన్నాళ్ల నుంచీ మాత్రమే జరుగుతున్నది.

నందిని : సర్దారుగారూ, రంజన్ని తీసుకొస్తానని చెప్పారే యేమయిందా సంగతి ?

సర్దారు : అతన్ని నేడే చూడబోతున్నావు.

నందిని : అది నాకు తెలియనే తెలుసు. అయినా యీ వార్త చెప్పినందుకు మీరు వర్థిల్లాలి. యీ మల్లెపూలదండ తీసుకోండి.

సర్దారు : అబ్బెబ్బె, ఆ దండ కాస్తా వృధాగా పాడుచేస్తున్నావు. రంజన్ కోసం అట్టే పెట్టుకోరాదూ ?

నందిని : అతనికోసం యింకో పూలదండ వుంది.

సర్దారు : వుంది, లేకేం. ఆమెళ్లో వేసుకున్నదేనా ? యీ మల్లెపూలమాల జయమాల. కేవలం యిది చేత్తో యిచ్చేదానం. ఆ యెఱ్రని గన్నేరు పూలదండ నిండు హృదయంతో యిచ్చేదానం. మంచిది మంచిది, చేత్తో యిచ్చిన దానం చేతిలోనే వుండిపోనీ. లేకపోతే వాడి పోతుంది. నిండు హృదయంతో యిచ్చే దానం యెంత ఆపేక్ష వుంటే అంతకాలం నిలిచిపోతుంది.

(సర్దారు నిష్క్రమిస్తాడు)

నందిని : (కిటికీదగ్గిరికి పోయి) వినిపిస్తున్నదా ?

నేపథ్యంలో : యేం చెప్పదలుచుకున్నావో చెప్పు.

నందిని : వొక్కసారి యీ కిటికీ దగ్గిరికొచ్చి నిలబడండి.

నేపథ్యంలో : ఇదుగో వొచ్చాను.

నందిని : నన్ను లోపలికి రానీయండి. యెన్నో సంగతులున్నాయి చెప్పటానికి.

నేపథ్యంలో : మాటిమాటికీ యెందుకలా వృథాగా వేడుకుంటావు ? యిప్పుడుకూడా తీరికలేదు. ఆ నీతో వున్నదెవరు ? రంజనుడి నేస్తమేనా ?

బిశు : కాదు మహారాజా, నేను రంజనుకి అవతలివైపు వాణ్ణి. అక్కడ వెలుతురు లేదు. నేను అమావాశ్యను.

నేపథ్యంలో : నందినితో నీకేం పని ? నందినీ, నీకితను నేమవుతాడు ?

నందిని : అతను నా నేస్తం. నాకు పాట నేర్పుతాడు. నాకేమి నేర్పాడంటే—

వలపుగొంటి వలపుగొంటి
ననుచు కలరుతమ్ముతోట
చేరువగా దూరముగా
నేలపైన నింగిపైన
వినిపించును వేణురవము

నేపథ్యంలో : నీ నేస్తమా ? యీ క్షణం కనక నేను మీ యిద్దరికీ స్నేహం విడగొట్టేస్తే యేం చేస్తావు ?

నందిని : మీ కంఠంలో నుంచి స్వరమేమిటి అలావొస్తున్నది ? కొంత నిదానించండి. మీకు మాత్రం యెవరూ నేస్తం లేరా ?

నేపథ్యంలో : నాకు నేస్తమా ? మధ్యాహ్నం సూర్యుడికి నేస్తం యెవరు ?

నందిని : సరే, ఆ మాట అలా వుంచేయండి. అమ్మో, మీ చేతిలో అదేమిటి ?

నేపథ్యంలో : యిది మండూక కళేబరం.

నందిని : దాంతో యేం చేస్తారు ?

నేపథ్యంలో : వొకనాడీ మండూకం వొక కొండలో శిలల మాటున వుండేది. మూడు వేల సంవత్సరాలైంది - అది దాంట్లో వుండి. యెంతకాలమైనా అలా వుండి పోవటం యెలాగో దాని దగ్గర నేర్చుకున్నాను. నిండు జీవనంతో వుండట మెలాగో మాత్రం దానికి తెలియదు. యివాళ నాకేమీ మనస్సు సరిగా లేక ఆ రాళ్లలో దాన్ని చితకొట్టి యెల్లకాలం అలా వుండి పోవటమనే దురవస్థ లోంచి దానికి ముక్తికలిగించాను. మంచి సంగతి కాదూ ?

నందిని : నాకు నాలుగు వైపులా వున్న మీ కోట గోడలు కూడా యివాళ

కూలి పోతాయి. నాకు తెలును - యివాళ రంజన్ని చూడటం పడుతుందని.

నేపథ్యంలో : మీ యిద్దర్నీ వొక్కచోట కలిసి వుండగా చూడాలని వుంది.

నందిని : యీ ఆవర వెనక నుంచి కళ్లద్దాలతో చూడలేవు.

నేపథ్యంలో : యింట్లో కూర్చునే చూస్తాను.

నందిని : దాంతో యేమవుతుంది ?

నేపథ్యంలో : ఆ సంగతి తెలుసుకోవాలి.

నందిని : మీరు తెలుసుకోవాలి అనేసరికి నాకేదో భయం వేస్తోంది.

నేపథ్యంలో : యెందుకు ?

నందిని : మనస్సుతో గ్రహించటానికి వీల్లేని కొన్ని విషయాల్ని ప్రాణార్పణం చేసి అవగాహన చేసుకోవొచ్చు. అలాటి విషయాల మీద మీకు ఆసక్తి లేదు.

నేపథ్యంలో : వాటిని విశ్వసించేటంత సాహసం నాకు లేదు. మోసపోతానని భయం. యిహ వెళ్ళిపో. నా సమయం పాడుచేయొద్దు. కాదు కాదు - కొంచెం ఆగు. నీ ముంగురుల నుంచి కంఠం వరకూ వేలాడే ఆ యెర్రగన్నేరు పూల గుత్తిని నా కిచ్చిపో.

నందిని : దీన్తో యేమవుతుంది ?

నేపథ్యంలో : ఈ పూల గుచ్ఛాన్ని చూస్తుంటే రక్త వర్ణంతో వున్న నా శనిగ్రహమే యీ పూల రూపంతో అవతరించిందేమో ననిపిస్తున్నది. ఆ పూలు కాస్తా నీ దగ్గిర్నుంచి లాక్కుని వాటిని తుంపి పారేయాలని బుద్ధిపుడుతుంది. మళ్లీ అనుకుంటానూ - నందిని తనంతటతానే యెన్నడో వోనాడు ఆ పూల గుత్తిని నా తలపై అలంకరిస్తే—

నందిని : అలా చేస్తే యేమవుతుంది ?

నేపథ్యంలో : అలా అయితే బహుశా ప్రశాంతంగా నేను జీవితం చాలించుకో గలుగుతాను.

నందిని : యెర్రగన్నేరు పూలంటే వొక మనిషికి యిష్టం. అతన్ని మనసులో వుంచుకుని నే నీ పూలతో నా చెవి కొనల్ని అలంకరించుకున్నాను.

నేపథ్యంలో : అలా అయితే చెబుతున్నాను - అవి నా శనిగ్రహమూ, నీ రంజన్ శనిగ్రహమూ కూడాను.

నందిని : అబ్బెబ్బె, యేమిటిలాటి మాటలంటున్నారు ! నేను వెళిపోతాను.

నేపథ్యంలో : యెక్కడికి వెళ్తావ్ ?

నందిని : మీ దుర్గద్వారం దగ్గిరికి వెళ్లి కూర్చుంటాను.

నేపథ్యంలో : యెందుకు ?

నందిని : ఆ దారివెంట రంజన్ వొస్తే చూడటానికి వీలవుతుందని. అతని కోసమే నేనిన్నాళ్లూ యిక్కడున్నది.

నేపథ్యంలో : ఆ రంజన్ని చితకొట్టి మట్టిలో కలిపేస్తే నువ్వు గుర్తుపట్టలేవు.

నందిని : యేమిటివాళ మీరు ! యెందుకిలా వుత్తుత్తినే జడిపించటం ?

నేపథ్యంలో : వుత్తుత్తినే జడిపించటమా ? నేనెంత భయంకరుణ్ణో తెలియదూ ?

నందిని : హఠాత్తుగా యేమిటీ వూహ ? లోకమంతా మిమ్మల్ని చూసి భయపడుతున్నది. యీ సంగతి తెలుసుకుని పొంగిపోతున్నారు కదూ ? మా వూళ్లో శ్రీకంఠం అని వీధిభాగవతంలో రాక్షస వేషం వేసేవాడొకడున్నాడు. వాడు రంగం మీదికి రాగానే పిల్లలంతా జడుసుకోవటం చూచి వాడు బలే పొంగిపోయేవాడు. మీ స్థితి కూడా అలాగేవుంది. నేనేమనుకుంటున్నానో నిజంగా చెప్పనా ? కోప్పడరు కదా ?

నేపథ్యంలో : యేమిటి చెప్పు చూదాం.

నందిని : యిక్కడి వాళ్లందరికీ పరాయి వాళ్లని భయపెట్టటమే వుద్యోగం. మిమ్మల్ని అందుకే తెరవెనక అద్భుతంగా వేషంవేసి వుంచేశారు. యీ దిష్టిబొమ్మ వేషం వేసుక్కూర్చోవటానికి సిగ్గు వేయటం లేదూ ?

నేపథ్యంలో : యేమిటీ అంటున్నావ్ నందినీ ?

నందిని : యిన్నాళ్లూ యెవరి భయం చూసి నువ్వు పొంగి పోయినావో వాళ్లందరూ తాము భయపడ్డందుకు సిగ్గుపడి పోతారు. నా రంజనే కనక యిక్కడ వున్నట్లయితే మీ మొహం మీదనే నవ్వేసి దాని ఫలితంగా చావటానికైనా సిద్ధమయేవాడు - కాని భయం మాత్రం. పడేవాడు కాదు.

నేపథ్యంలో : దురహంకారమేమీ తక్కువకాదు నీకు. యిన్నాళ్లనుంచీ నేను ముక్కలు ముక్కలు చేసి పారేసిన వస్తువులన్నిటినీ వొకచోట రాశిగాచేసి దాని నడి కొప్పున నిన్ను నిలబెట్టి చూడాలని వుంది. తరవాత——

నందిని : ఊఁ తరవాత - యేమిటి ?

నేపథ్యంలో : కడసారిగా పగల గొట్టవలసిందేదో పగలగొట్టేస్తాను. దానిమ్మ గింజలు రెండు చేతులతో పట్టుకుని పిండుతూంటే పదివేళ్ల సందుల్లోంచీ యెలా రసం స్రవిస్తుందో ఆ విధంగా నిన్ను యీ రెండు చేతులతోనూ - వెళ్లు వెళ్లు - పారిపో యిక్కణ్ణుంచి.

నందిని : యిదుగో, నేనిక్కడే నిలబడి వున్నాను. యేం చెయ్యగలరో చెయ్యండి. అంత అసందర్భంగా గర్జిస్తా రెందుకు ?

నేపథ్యంలో : నేనెంత నిష్ఠురంగా వుండగలనో నా ప్రభావం యెంత అద్భుతమో అదంతా వున్నదున్నట్లుగా నీకు ప్రత్యక్షంగా ఋజుపించాలని నా కోరిక. నా యింట్లో నుంచి ఆర్తనాదమేదీ నీకు వినిపించలేదా ?

నందిని : వినిపించింది. యెందుకోసం ఆ ఆర్తనాదం ?

నేపథ్యంలో : సృష్టికర్త చాతుర్యాన్ని నేను ధ్వంసం చేస్తాను. యీ అనంత విశ్వాంతరాళంలో దాగివున్న పదార్థాన్ని బలాత్కారంగా లాక్కోవాలని వుంది. ఆ ఆర్తనాదం యీ విచ్ఛిన్నప్రాణుల ఆక్రందన. చెట్టులో నుంచి నిప్పు తీయాలంటే దాన్ని దహనం చేయాలి. నందినీ ! నీలో కూడా కణకణలాడే అగ్ని వుంది. యెర్రని అగ్ని. వొకనాడు దహనం చేసి దాన్ని కూడా బైటికి రప్పిస్తాను. అలా చేయకపోతే దానికి నిష్కృతి లేదు.

నందిని : యెందుకింత క్రూరంగా ప్రవర్తిస్తున్నారు ?

నేపథ్యంలో : వీలయితే తీసుకుంటాను. వీలు కాకపోతే నాశనం చేస్తాను. యేదైతే నాకు కైవసంకాదో దాని మీద నాకు దయలేదు. దాన్ని ధ్వంసం చేయటం కూడా వొక విధంగా దాన్ని వశం చేసుకోవటమే.

నందిని : యిదేమిటి ! పిడికిలి బిగించి చెయ్యి అలా ముందుకి చాపుతున్నారేమిటి ?

నేపథ్యంలో : సరే, నా పిడికిలి లోపలికి తీసేసుకుంటున్నాను. నువ్వు పారిపో. డేగ నీడ చూసి పావురం పారిపోతుందే, అలా పారిపో.

నందిని : అలాగే వెళ్ళిపోతాను. మిమ్మల్ని విసిగించను.

నేపథ్యంలో : యిదుగో యిదుగో వెనక్కిరా నువ్వు - నందినీ, నందినీ వెనక్కిరా.

నందిని : యేమిటో చెప్పండి.

నేపథ్యంలో : యెదురుగా కనిపించే నీ ముఖంలో, కళ్లలో జీవరేఖ - నీ వెనక జాలువారే నల్లని కురుల్లో నిస్తబ్ధ మృత్యువాహిని. ఆ నాడు నా చేతులు రెండూ నీ కురుల మాటున చేర్చి మృత్యు విశ్రాంతిని అనుభవించాను. మరణంలో వున్న మాధుర్యాన్ని నేనెన్నడూ యీ విధంగా భావించలేదు. పాయలు పాయలుగా వున్న ఆ నీల శిరోజాల వెనక తలదాచుకుని నిద్రపోవాలని యెంతో కోరికగా వుంది. నీ వెరగవు నే నెంత అలిసిపోయి వున్నానో.

నందిని : యేం, మీ రెప్పుడూ నిద్ర పోరా ?

నేపథ్యంలో : నిద్ర పోవాలంటే భయం వేస్తుంది.

నందిని : నా పాట మీకు చివరిదాకా వినిపించేస్తాను.

వలపుగొంటి వలపుగొంటి
ననుచు కలరుతమ్ము తోడ
చేరువగా దూరముగా
నేలపైన నింగిపైన
వినిపించును వేణురవము ॥ వలపు ॥
నిండారెడు వగపున ఏ
గుండె క్రేళ్లు వారెనో
నింగి కొసల ఏ నల్లని
నేత్రాంచల మంటి, కంటి
నీరు జాలు వారెనో ॥ వలపు ॥

నేపథ్యంలో : వుండుండు. కొంచెం ఆగు. యిహ పాడకు.

నందిని :

ఆకలకంఠమ్ము తోడ
మహాసాగర తీరమున
కట్లు తెగిన గంభీరా
క్రందనమ్ము పొంగిపొరలు
మరపుగొలుపు పాటమ్రోత
ఆకారణముగా మదిలో
ఆదేపనిగ కళవళించు ॥ వలపు ॥

పిచ్చి తమ్ముడూ, చూశావా, ఆ చచ్చిపోయిన కప్పని అలా పారేసి యెక్కడికో పారిపోయాడు రాజు. పాట వినమంటే అతనికి భయం.

బిశు : అతడి హృదయంలో వుంటున్న వృద్ధమండూకం నానా అప స్వరాలకూ నిలయం. సుస్వరంతో వున్న పాట వింటే దానికి చచ్చి పోవాలనిపిస్తుంది. అందుకూ అతని భయం పిచ్చి చెల్లీ, నీ ముఖంలో యివ్వాళ వొక వింత దీప్తి కనిపిస్తున్నది. నీ మనస్సులో యే ఆలోచన యీ అరుణోదయాన్ని కల్పించింది? నాతో చెప్పవూ?

నందిని : యీ రోజున రంజన్ తప్పక వొస్తాడని నా మనస్సులో యేదో కబురు వినిపించింది.

బిశు : యీ వార్త యే దిక్కు నుంచి వొచ్చింది ?

నందిని : చెబుతా విను. నా కిటికీకి చేరువగా వొక దానిమ్మ చెట్టుంది. దాని కొమ్మమీద రోజూ వొక నీలకంఠపక్షి వొచ్చి కూర్చుంటుంది. సందె చీకటి పడగానే ధ్రువ నక్షత్రానికి నమస్కారం చేసి 'ఆ నీల కంఠపక్షి రెక్కల్లో వొక రెక్క యెగిరివొచ్చి నా యింట్లో పడితే ఆ రోజునే నా రంజన్ వొస్తాడని నేను తెలుసు కుంటాను' అనే దాన్ని. యివ్వాళ ప్రొద్దునే లేచి చూతును కదా, వుత్తర దిక్కు నుంచి వొచ్చే దారివాటుగా వొచ్చి వొక రెక్క నా పక్కమీద పడి వుంది. యిదుగో, నా పమిట కింద పెట్టుకున్నాను.

బిశు : అందుకే కాబోలు నీ ముఖాన కుదురైన కుంకుమ బొట్టుకూడా కనిపిస్తున్నది.

నందిని : నా రంజన్ కనిపించగానే యీ రెక్కను అతని తలపై అలంక రిస్తాను.

బిశు : నీలకంఠపక్షి రెక్కలు చైత్ర యాత్రా చిహ్నమని పెద్దలంటారు.

నందిని : రంజన్ చైత్ర యాత్ర నా హృదయాన్నే అనుసరించి పోతుంది.

బిశు : పిచ్చి చెల్లాయీ! యిహ నా సొంత పనిమీద వెళిపోతాను.

నందిని : వొద్దు. నిన్నివాళ పనిలోకి పోనీయను.

బిశు : మరేం చెయ్యను ?

నందిని : పాట పాడు.

బిశు : యే పాట పాడను ?

నంధిని : మార్గాన్ని అన్వేషించే పాట.

బిశు :

యుగ యుగాలుగా నన్నే
కోరి యుండె కాబోలును
నే నడిచే దారిచెంత
నిలిచి యుండెనో యేమో ॥ యుగ ॥
ఏ నాడో సాంధ్యవేళ
మసక మసక వెలుతురులో
కనుగోనల నేనా తని
కాంచియుంటి ననిపించును
నే నడిచే దారి చెంత
నిలిచి యుండెనో యేమో ॥ యుగ ॥
వెలుగు జిలుగు పాటలతో
నేడే జాబిలి నివాళి
మేలిముసుగు వీడిపోయె
నీల నిశా ముఖము నుండి
వెన్నెల వెలుగున నాతడు
కనుల యెదుట కనిపించగ
తెరలన్నియు చిటికలోన
సురిగి మాయమైపోవును
నేనడిచే దారి చెంత
నిలిచి యుండెనో యేమో ॥ యుగ ॥

నందిని : తమ్ముడూ, నువ్వు పాట పాడినప్పుడల్లా నీ వల్ల నే పొందిన మేలెంతో వున్నదని పిస్తుంది. దానికి బదులుగా నీ కేమీ నే నీయ లేక పోయాను.

బిశు : యేమీ యివ్వలేక పోవటమనే దాన్ని లలాట పట్టికమీద కట్టు కుంటాను. యేదో కొంచెం యివ్వటమనే ధరకు నా పాట అమ్ము కోటం నా కిష్టం లేదు. యిప్పుడెక్కడికి వెళుతున్నావ్ ?

నందిని : రంజన్ వొచ్చే దారి పక్కకి. అక్కడ కూర్చుని నీ పాట వింటూ వుంటాను.

(యిద్దరూ నిష్క్రమిస్తారు. సర్దారూ పెత్తందారూ ప్రవేశిస్తారు)

సర్దారు: ఊఁ హుఁ. యేమయినా సరే రంజన్ని యీ పేటలోకి రానీయరాదు.

పెత్తందారు: అతన్ని దూరంగా చేసేద్దామని వజ్రగడంలో సొరంగం తవ్వే పనిలోకి తీసుకు వెళ్లాను.

సర్దారు: వెళితే యేమైంది?

పెత్తందారు: యేమీ చాతకాలేదు. 'వొకరి ఆజ్ఞ ప్రకారం పనిచేయటం నా కభ్యాసం లేదు' అన్నాడతను.

సర్దారు: పోనీ, ఆ అభ్యాసం యిప్పుడు మొదలు పెట్ట కూడదూ?

పెత్తందారు: అలాగే ప్రయత్నం చేయబోయినాడు. యింతలోకే పెద్ద పెత్తందారు కొత్వాలుని వెంటబెట్టు కొచ్చాడు. ఆ మనిషికుందే, భయమూ భక్తీ లేదు. ఫలానా పని చెయ్యి అని అనీఅనక ముందే హ హ హా అని వొకటే నవ్వుతాడు. యేమిటని అడిగితే 'గాంభీర్య మనేది తెలివి తక్కువతనానికి ముసుగులాటిది, ఆ ముసుగు తీసేయ టానికే నే వొచ్చాను' అని అంటాడు.

సర్దారు: ఆ సొరంగంలో తవ్వే పనివాళ్లతో అతన్ని కూడా కలిపే సేయక పోయారా?

పెత్తందారు: కలిపేశాం. కాస్త వొత్తిడి చేస్తే లొంగి పోతాడు కదా అని చూశాం. మేము వొకటి అనుకుంటే జరిగింది యింకోటి. ఆ తవ్వేపనివాళ్లందరి మీదా కూడా వొత్తిడి పని చేయకుండా పోయింది. వాళ్లందర్నీ వెర్రెక్కించాడు. 'యివాళ మన మంతా గడ్డ పారల్తో నాట్యం చేద్దాం' అన్నాడు.

సర్దారు: గడ్డపార నృత్యమా? అంటే?

పెత్తందారు: రంజన్ పాట యెత్తుకున్నాడు. తంబుర లేదే అన్నారు వాళ్లు. బూర లేకపోతే యేం పార వున్నది కాదా అన్నాడు రంజన్. ఆ పారలతో నేల మీద కొట్టడం ప్రారంభించారు. ఆ బంగారం మట్టి ముద్దలతో యేం బంతులాట ఆడారు! పెద్ద పెత్తందారొచ్చి 'యేమిటోయ్ యీ పనిచేసే పద్ధతి' అని అడిగితే 'పని పగ్గాలు తెంచేశాం, దాన్ని వెనక నుంచి తోలక్క ర్లేదు, తనంతటదే నాట్యం చేసుకుంటూ పని సాగిపోతుంది.' అని అన్నాడు.

సర్దారు: చూస్తే వుత్తి పిచ్చివాడు లా వున్నాడే!

పెత్తందారు: కాస్తా కూస్తా పిచ్చివాడు కాదు. 'పట్టుకో వేం పార' అన్నాను. 'అంతకన్న పని బాగా జరుగుతుంది - వో తంబురా యిప్పించండి' అంటాడు.

సర్దారు: మీరతన్ని వజ్రగడం తీసికెళ్లారు కదా, అక్కణ్ణుంచి కుబేర గడలో కెలా వచ్చాడు ?

పెత్తందారు: యేం చెప్పెను ప్రభూ! అతనికి సంకెళ్లు వేస్తే అతని వొంటి మీద నిలవవు - యెలాగో జారి వొచ్చేస్తాయి. అంతే కాదు. మాట మాటకూ అతని వేషం మారిపోతూ వుంటుంది అతని వాలకం మారి పోతూ వుంటుంది. అతడి వోర్పు చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. యింకా కొన్నాళ్లు అతనిక్కడ వున్నాడంటే వొక్క పనివాడు కూడా కట్టుబాట్లకి లొంగిరాడు.

సర్దారు: అల్లదుగో చూడు. పాట పాడుకుంటూ ఆ దారివెంట వెళ్లే వాడు రంజన్ కాదూ ? యేదో విరిగి పోయిన తంబురా అతని చేతిలో వుంది. ఆ దర్పం చూడు ! కాస్త కూడా నమ్రతలేదు.

పెత్తందారు: ఆఁ, అతనే ఆ గోడలు దాటి బైటికెలా వొచ్చాడో ? యే మాయా మంత్రం తెలుసునో ?

సర్దారు: వెళ్లి వెంటనే అతన్ని పట్టుకో. యీ పేటలో నందినీ అతనూ కలుసుకోవటానికి వీల్లేదు.

పెత్తందారు: చూస్తూ చూస్తూండగానే వాళ్ల గుంపు యెలా పెరిగి పోతున్నదో, వీళ్లు మనందర్నీ నాట్యం చేయిం చేట్టున్నారు.

(చిన్న సర్దారు ప్రవేశం)

సర్దారు: యెక్కడికి వెళుతున్నావ్ ?

చిన్న సర్దారు: రంజన్ని పట్టుకోవటానికి వెళుతున్నాను.

సర్దారు: నువ్వెందుకు ? రెండో సర్దారెక్కడ ?

చిన్న సర్దారు: ఆయన రంజన్ని చూసి మూర్ఛపోతున్నాడు. అతని వొంటి మీద చెయ్యి వేయటం కూడా యిష్టంలేదు. 'ఆ రంజన్ నవ్వటం వొక్కమారు చూస్తే మనమందరమూ యిలా యెందుకై పోయినామో తెలుస్తుంది' అంటాడు.

సర్దారు: యీ మాట విను. అతన్ని పట్టుకోనక్కర్లేదు. రాజుగారింటికి పంపేసెయ్.

చిన్న సర్దారు : రాజు పిలుపంటే అతను లెక్క చెయ్యడు.

సర్దారు : నందిన్ని రాజు తన యింట్లో చాకిరీచేసే దాసిగా పెట్టుకున్నాడని చెప్పు రంజన్‌తో.

చిన్న సర్దారు : మరిసంగతి రాజుగారికి తెలిస్తే ?

సర్దారు : అదంతా నువ్వు ఆలోచించక్కర్లేదు. పద, నే నే వొస్తా.

(అందరూ నిష్క్రమిస్తారు)

(అధ్యాపకుడూ పురాణవాగీశ్వరుడూ ప్రవేశిస్తారు)

పురాణవాగీశ్వరుడు : ఆ లోపలేమిటి ? యేమిటా గందరగోళం ? భయంకరంగా వుందే ఆ చప్పుడు !

అధ్యాపకుడు : రాజుగారికి తన మీద తనకే కోపం వొచ్చింది. అందుకని తనకు తానే తయారుచేసిన యేదోవస్తువును ముక్కలు ముక్కలు చేసేస్తున్నాడు.

పురాణ వాగీశ్వరుడు : యేదో పెద్ద స్తంభం దభేలుమని కూలిపోతున్నట్టుగా వుంది.

అధ్యాపకుడు : అదుగో, ఆ కొండల మధ్య వొక సరోవరం వుండేది. దానిలోకి శంఖినీ నదిలోని జలం వొచ్చి దానిలో నిలిచిపోయేది. వొకనాడు దాని యెడంవైపున రాతితో కట్టిన గోడ పగిలి పడి పోయింది. అప్పుడు ఆ నిండిన నీరంతా వో పిచ్చివాడి నవ్వులాగ గలగలమని చప్పుడు చేస్తూ బైటికొచ్చేసింది. యీ మధ్య కొన్నాళ్ల నుంచీ రాజుగారిని చూస్తూంటే నా కనిపిస్తున్నదీ - యీాయన యిన్నాళ్ల నుంచీ కూడబెట్టిన వస్తువులనే సరోవరానికూ్కడా గట్లు తెగిపోయే స్థితి వొస్తున్నది అనిపిస్తున్నది.

పురాణ వాగీశ్వరుడు : నన్నే ప్రదేశానికి తీసుకొచ్చినట్లూ ? యేం చేయటానికి తీసుకొచ్చినట్లు ?

అధ్యాపకుడు : జగత్తులో తెలుసుకోవలసిందంతా, తెలుసుకోవటం ద్వారా తన హస్తగతం కావాలంటాడు. దాదాపు నా తత్వవిద్యయావత్తూ ఖాళీ చేసి పారేశాడు. యిప్పుడు వుండుండి మండిపడుతూ 'నీ విద్యలో ప్రపంచమనే యీ యింటికి కన్నం వేయటంవల్ల వొక గోడ పడిపోగానే యింకో గోడ కనిపిస్తుందిగాని, ఆ ప్రాణ పురుషుడి అంతఃపుర మెక్కడా కనిపించదు' అంటాడు. కొన్నాళ్ల

పాటు పురావస్తుశాస్త్ర విచారంలో వుండిపోతే బాగుండునని పిస్తున్నది. నా సంచీ ఖాళీ అయిపోయింది. ఇహ పురావృత్తచరిత్ర వుంది - ఆ మూటకూడా విప్పుకోనీ. అదుగో, ఆ పోయేదెవరో చూశారా ?

పురాణ వాగీశ్వరుడు : ఎవరో అమ్మాయి. ఆకుపచ్చ చీర కట్టుకున్నది.

అధ్యాపకుడు : పృధివిలో వున్న కల్యాణ గుణాలన్నీ తన సర్వావయవాలలోనూ లీనం చేసుకుని పోతున్నది - మా నందిని యీ యక్షపురిలో సర్దార్లున్నారు - పెత్తందార్లున్నారు - తవ్వుపనివాళ్లున్నారు నాబోటి పండితులున్నారు - శవాలకు గోతులు తవ్వే వాళ్లున్నారు - పూడ్చే వాళ్లున్నారు - అందరూ వొకరితో వొకరు కలిసి మెలిసి వుంటారు. యీ వొక్క నందిని మాత్రం యెవరితోనూ అతకదు. యేవైపు చూసినా బజారు గందరగోళం, ఆ అమ్మాయి మాత్రం శ్రుతి చేసిన తంబుర వొక్కొక్కనాడు ఆమె నడిచే దారిలో నుంచి వొచ్చే గాలి తగిల్తేనే నా తత్వవిచారమనే జాలావరణమంతా ఛిన్నమైపోతుంది. ఆ చిరుగుల్లో నుంచి నా మనోనిశ్చయం కాస్తా అడివి పక్షిలాగ హుష్షని యెగిరి పోతుంది.

పురాణ వాగీశ్వరుడు : ముసలితనంలో కూడా ముచ్చట్లు పోలేదన్న మాట.

అధ్యాపకుడు : జ్ఞానాకర్షణ కన్న ప్రాణాకర్షణ యెక్కువైతే పాఠశాల వొదిలి పారి పోవాలని పిస్తుంది. ఆ వుబలాటాన్ని సంబాళించుకోలేం.

పురాణ వాగీశ్వరుడు : సరేకాని మీ రాజుగారిని చూడటం యెక్కడో చెప్పు.

అధ్యాపకుడు : చూడటానికేమీ వుపాయంలేదు - ఆ తెర వెనకనుంచే మాటలు.

పురాణ వాగీశ్వరుడు : యేమిటీ ? యీ తెర వెనక నుంచా ?

అధ్యాపకుడు : కాకపోతే యేమిటి ? ముసుగుల్లో సరస సల్లాపాల గుసగుసలుండొచ్చు. అలాటిది కాదు. ఇది చాలా గంభీరమైన సంభాషణ మా రాజుగారి ఆవులున్నాయే అవి పాలీయవనుకుంటాను. సరాసరి వెన్నే యిచ్చేస్తాయి.

పురాణ వాగీశ్వరుడు : బాగుంది. అప్రధానమైన దాన్ని ఆవలకు త్రోసి అసలు విషయాన్ని గ్రహించటమే పండితుల లక్షణం.

అధ్యాపకుడు : కాని విధాత లక్షణంమాత్రమదికాదు. అప్రధానమైన దాన్ని లాలన చేయటానికే ఆయన అసలు వస్తువును సృష్టి చేస్తాడు. మామిడి పండులో టెంక మీద ఆయనకు చాలా గౌరవం. కాని అందులో రసమూ గుజ్జూ అంటే యెంతో ప్రేమ.

పురాణ వాగీశ్వరుడు : అవును, చూస్తున్నానుగా ప్రస్తుతం మీ తత్వ విచారమంతా ఆకుపచ్చ రంగువైపు లాక్కుని పోతున్నది. కాని యీ మీ రాజుగారిని యెలా సహించి వూరుకుంటున్నారండీ ?

అధ్యాపకుడు : అసలు నిజం చెప్పనా ? మా కందరికీ ఆయనంటే ప్రేమ.

పురాణ వాగీశ్వరుడు : యేం చిత్రం !

అధ్యాపకుడు : మీకు తెలియదు - ఆయన యెంత గొప్పవాడంటే ఆయనలో వున్నదోషాలు కూడా ఆ గొప్పతనాన్ని తగ్గించ లేవు.

(సర్దారు ప్రవేశం)

సర్దారు : వస్తు వాగీశమహాశయా ! యెంచి యెంచి మరీ తెచ్చినట్లున్నారీ పురాణ వస్తు వాగీశులను. యీాయన పరిశ్రమ చేసిన శాస్త్రం సంగతి వింటేనే వెర్రెక్కి పోతున్నారు మా రాజుగారు.

అధ్యాపకుడు : యే విధంగా ?

సర్దారు : చరిత్రలో పురాతన కాలమంటూ యేదీలేదు, వర్తమానకాలమే నానాటికి విస్తరిల్లుతూ పోతున్నది - అంటారు రాజుగారు.

పురాణ వాగీశ్వరుడు : పురాతన మనేదే లేకపోతే యింకోటి యెలా వుంటుంది ? వెనకంటూ వొకటి వుంటేగదా ముందంటూ యింకొకటి వుండటానికి వీలౌతుంది.

సర్దారు : సాగిపోయే మహా కాలానికి ముఖమ్మీద కొత్తదనం ప్రకాశిస్తూ వుంటుంది. ఆ విషయాన్ని మరుగుపరచి పండితులు మహాకాలం పురాతనాన్ని తన వీపు మీద మోసుకు పోతున్నదంటారు - యిదీ రాజుగారనేది.

అధ్యాపకుడు : నందిని నిండు యౌవనమనే ఛాయా వీధికలో కొత్తదన మనే మాయలేడిని చూశారు రాజుగారు బిడియపడుతూ బిడియ పడుతూ. కాని దాన్ని పట్టుకో లేక పోతున్నారు. దాన్తో మా శాస్త్రిల మీద మండిపడిపోతున్నారు.

(నందిని తొందర తొందరగా ప్రవేశిస్తుంది.)

నందిని : సర్దార్, యేమిటది ? యెవరు వారు ?

సర్దారు : యిదుగో నందినీ, నీ యిచ్చిన కుందమాల పొద్దుగూకిన తర్వాత వేసుకుంటాను. చీకట్లో నాలో మూడు వొంతులు కంటికి కనబడకుండా వుంటే పూలదండ వేసినా బాగానే వుండొచ్చు.

నందిని : జాగ్రత్తగా చూడండి! యెంత భయంకరమైన దృశ్యం! ప్రేతపురి వాకిళ్లు తెరిచారా యేమిటి! కావలా వాళ్లతో కలిసి యెవరా నడిచిపోయేది! రాజసౌధం దొడ్డి వాకిట్లో కుండా వొస్తున్నారు.

సర్దారు : వాళ్లని రాజుగారి పుచ్చిప్టాలంటాం.

నందిని : అంటే యేమిటి ?

సర్దారు : కొన్నాళ్లకు నీకూ తెలిసి పోతుంది. యివ్వాళ్టికి చాలు.

నందిని : వీళ్ల తీరంతా యిలా వుందేం - వాళ్లు మనుష్యులేనా ? వాళ్లలో మాంసం నెత్తురూ, మనస్సూ ప్రాణం - యివేవన్నా వున్నాయా ?

సర్దారు : లేకపోతే లేకపోవొచ్చు.

నందిని : యెన్నడైనా వుండేవా ?

సర్దారు : వుంటే వుండి వుండొచ్చు.

నందిని : యిప్పుడెక్కడికి వెళ్తారు ?

సర్దారు : మీకు చాతనైతే తెలియచేయండి వాగీశులుగారూ, నే వెళుతున్నాను.

(సర్దారు నిష్క్రమణ)

నందిని : యేమది! నీడల్లాటి ఆ మనుష్యుల్లో తెలిసిన ముఖాలు కనిపిస్తున్నాయి. అదుగో వాళ్లిద్దరూ అనుప్, ఉపమన్యూనూ. యేమండీ వాళ్లు మా పొరుగు గ్రామంలో వాళ్లు. యిద్దరన్నదమ్ములూ యెంతపొడుగో శరీరంలో అంతబలం కలవాళ్లు. అందరూ వాళ్లని తాల తమాలాలనేవాళ్లు. ఆషాఢ చతుర్దశి నాడు మా నదిలో పడవ పందెం ఆడటానికొచ్చేవాళ్లు. అయ్యో దైవమా ! యెవరు తెచ్చారు వాళ్ల నీ స్థితికి ? అదుగడుగో ! శుకులు, కత్తి ఆటలో అందరికన్నా ముందు అతనికే పూలదండ బహుమానం. అ - నూ - ప్, శు - కులూ ! వొకమారు తలెత్తి చూడండి. యిదుగో నే నే, మీ నందిన్ని. ఈశానాపాడాలో వుండే నందిన్ని. తలతిప్పి యెవరూ చూడటం లేదు. యెన్నాళ్లనుంచో తలవొంచు

కోటం అలవామైపోయింది. అతనెవరు? కంకుకాదూ? అలాటి పిల్లవాణ్ణి కూడా చెరుకుముక్కను నమిలి పారేసినట్టు చేశారు. చాలా సిగ్గుపడుతూ వుండేవాడు. నే నెక్కడైతే నీళ్లు తెచ్చుకోటానికి వెళ్లేదాన్నో సరిగ్గా అక్కడే యేటవాలుగా వున్న వొడ్డుమీద కూర్చుని వుండే వాడు. బాణాలు చేయటానికి తుంగకాడ లేరుకోటానికి వొచ్చాననే సాకు చెప్పి - చిలిపితనంచేసి అతనికెంతో నొప్పికలిగించే దాన్ని. ఓ కంకూ, యిటు తిరిగిచూడవూ? నే నొక సైగ చేస్తే అతని రక్తమంతా నాట్యం చేసేది. పిలిస్తే వినిపించినట్లుగా కూడా కనిపించడు. మా వూరి వెలుతురంతా ఆరిపోయినట్లే. అయ్యో, యినుమంతా క్షయమైపోయింది. కేవలం నల్లని తుప్పు మిగిలివుంది - యెందుకిలాగైంది?

అధ్యాపకుడు: నందినీ! యెక్కడైతే బూడిద రాలుతున్నదో అక్కడ పడుతున్నది నీ దృష్టి. వొక్కసారి ఆ మంట వైపు చూపు మరల్చు. ఆ జ్వాల లెలా లుకలుక మంటున్నాయో చూడు.

నందిని: మీ మాటలు నా కర్థం కావటంలా.

అధ్యాపకుడు: రాజును చూశావు కదా! అతని మూర్తిని చూసి నువ్వు ముగ్ధురాల వైనావా లేదా?

నందిని: నాకేం, ఆశ్చర్యజనకమైన శక్తి కనిపించింది - అతని రూపంలో.

అధ్యాపకుడు: ఆ అద్భుత రూపం జమ, యీ వికృత రూపాలు ఖర్చు. ఆ పెద్ద వాళ్లంతా వుజ్వలంగా వుండాలంటే యీ చిన్న వాళ్లందరూ బూడిదైపోవాలి. పెద్ద తనం సంపాదించటంలో వున్న తత్వం యిదీ.

నందిని: అది రాక్షస తత్వం.

అధ్యాపకుడు: తత్వమ్మీద కోపం తెచ్చుకోవటం వృథా. మంచిదనీ కాదు, చెడ్డదనీ కాదు. దానికి విరుద్ధంగా పోవటం అంటే మానవుడికి కే విరుద్ధంగా పోవట మన్నమాట.

నందిని: మనుష్యులు జీవించే మార్గమే యిదైతే, నాకు జీవితం అవసరం లేదు. అదుగో ఆ నీడలతో బాటు నేనూ వెళిపోతా. నాకు దారి చూపించండి.

అధ్యాపకుడు: దారి చూపించే రోజే గనక వొస్తే వీళ్లే చూపిస్తారు. యీలోపుగా ధారి చూపటమనే అశుభసూచకమైన ప్రసక్తే లేదు.

చూశావా, మన పురాణ వాగీశులు యెప్పుడో చల్లగా జారి పోయారు. పారిపోతే బతక వొచ్చునని కాస్త సాగి పోగానే ఆయనకే తెలిసొస్తుంది - యీ ముళ్లతీగ యిక్కడ ప్రారంభమై అనేక యోజనాల దాకా స్తంభానికి స్తంభానికి బిగించి వున్నదన్న సంగతి. నందినీ నీకు కోపం వొస్తున్నది. నీ కపోలమ్మీద యెర్ర గన్నేరు పూలగుత్తి ప్రళయ సంధ్యా మేఘంలాగా కనిపిస్తున్నది

నందిని : (జాలావరణం కిటికీ వద్ద నిలిచి) యిదుగో, యిదుగో.

అధ్యాపకుడు : యెవర్ని పిలిచేది ?

నందిని : యీ తెర అనే మంచులో దాక్కొన్న మీ రాజుని.

అధ్యాపకుడు : లోపల తలుపు బిగించు కున్నాడు. నీ తిలుపు వినబడదు.

నందిని : పిచ్చి తమ్ముడూ ! బిశూ ! !

అధ్యాపకుడు : అతన్ని పిలుస్తా వెందుకు ?

నందిని : యింకా తిరిగి రాలేదు. నాకు భయంగా వుంది.

అధ్యాపకుడు : యింతకు ముందేగా నీతో చూశాను.

నందిని : రంజన్ని గుర్తు పట్టటం కోసం అతన్ని పిలిచారని సర్దారన్నాడు. అతనితో నేను కూడా వెళ్లాలను కున్నాను - కానీ రానీయలేదు. యెవరిదా ఆర్తనాదం ?

అధ్యాపకుడు : ఆ వస్తాదు కాబోలు.

నందిని : యెవరతను ?

అధ్యాపకుడు : జగద్విఖ్యాతి పొందిన పైల్వాను గజ్జూ. అతని అన్న రాజుగారితో కుస్తీ పట్టటానికి సవాలు చేశాడు. ఆ తర్వాత అతని లంగోటీలో వొక చిరిగిన పీలిక కూడా కనిపించలా. ఆ కోపంతో గజ్జూ వొచ్చాడు తొడ చరుస్తూ. అతను రాగానే చెప్పాను. యీ రాజ్యంలో పౌరంగం తవ్వాలని వుంటేరా, చస్తూ చస్తూ అయినా కొన్నాళ్లు బతకొచ్చు - అలా కాక పౌరుషం చూపించబోయినావా అంటే వొక క్షణం వుండలేవు, యిది చాలా కష్టమైన ప్రదేశం.

నందిని : అహోరాత్రాలూ మనష్యులను పట్టుకునే యీ బోనులు పెట్టి కావలా కాస్తుంటే వీళ్లకేం బాగుందని పిస్తుంది ?

అధ్యాపకుడు : బాగుండటమనే మాటేలేదు వీళ్లల్లో. వుండటమ్మాత్రమే. యీ వుండటం కూడా యెంత భయంకరంగా విస్తరించిందంటే

లతులాది ప్రజల్ని వొత్తిడి చేసి పని చేయించకపోతే ఆ భారం మోయటానికి యెవరి సాధ్యం? అందుకోసం యీవల తాళ్లు నానాటికీ ముందు ముందుకు పోతున్నాయి—వాళ్లు నిలవాలి గదా మరి.

నందిని: నిలవాలి నిజమే. మానవత్వం పోగొట్టుకోకుండా నిలిచి వుండటం కోసం వొకప్పుడు చావటం కూడా అవసరం కావొచ్చు. దాంట్లో దోషమేమిటి?

అధ్యాపకుడు: అదుగో మళ్లీ ఆ కోపం - యెర్రగన్నేరు పూల ఝుంకారం. నువ్వన్నమాట తియ్యగానే వుంది కాని అసలు యదార్థం యదార్థమే. మానవులుగా నిలిచి వుండటానికి చావటం కూడా అవసరమంటావు. అలా అనటం నీకు సంతోషంగా వుంటే అలాగే అను. కాని, తాము నిలిచి వుండటానికి యితరులను చంపాలి అనే వాళ్లు కూడా వున్నారు. అసలు నిజంగా నిలిచి వుండేది వాళ్లే. దీని వల్ల మనుష్యత్వానికే న్యూనత అంటావు. నీ కోపంలో పొరబడుతున్నావుగాని అసలిదే మనుష్యత్వం. పెద్దపులి యింకో పెద్దపులిని తినటంవల్ల తను పెద్దదికాదు. వొక్క మనుష్యుల్లోనే వొకర్నొకరు తిని యీ బలిసిపోవటం.

(పైల్వాను ప్రవేశం)

నందిని: అహో, చూడు యెలా తూలిపోతూవొస్తున్నాడో! పైల్వానూ యిలా వొచ్చిపడుకో. వస్తు వాగీశమహాశయా! దెబ్బ యెక్కడ తగిలిందో కాస్త చూడండి.

పైల్వాను: దీనదయాళూ! భగవాన్ నా జీవితంలో కేవలం వొక్క రోజు పాటు నా వొంట్లో బలం వొచ్చేట్టు చేయి

నందని: యెందు కబ్బీ!

పైల్వాను: ఆ సర్దారు కంఠం పటుక్కున విరిచేయటానికి.

నందిని: సర్దారు నిన్నేం చేశాడు?

పైల్వాను: చేయవలసిందంతా చేశాడు. అసలు కుస్తీ పట్టటం నా కిష్టమే లేదు. నాకు పురెక్కించి యిప్పుడందరితోనూ నాదే తప్పని చెబుతున్నాడు.

నందిని: యేం? ఇందులో అతని స్వార్థమేముంది?

పైల్వాను: పృథివి మీద వున్న వాళ్లందర్నీ అశక్తుల్ని చేస్తే వాళ్లు నిశ్చింతగా వుంటారు. భగవంతుడా, తండ్రీ! వొక్కసారి వాడి రెండు గుడ్లూ పీకేసి వాడి జిహ్వాలాగి పారేయగలిగితే!

నందిని: నీ వొంట్లో యేలావుంది పైల్వాన్?

పైల్వాను: లోపలంతా తొలిచేసినట్లై పోయింది. వీళ్లెక్కడి రాక్షసులో. వీళ్లకు మాయా మంత్రం తెలుసు. వొంట్లో బలమే కాదు ఆశా వుత్సాహం కూడా వొక్క పెట్టున పెకలించేస్తారు యే వుపాయం చేతనైనా మళ్లీ వొక్కసారి, భగవంతుడా కళ్యాణమూర్తీ, కేవలం వొక్కసారి నీ దయే వుంటే యేది సాధ్యం కాదు - ఆ సర్దారు గుండెలో నా దంతాలు గుచ్చగలిగితే!

నందిని: అయ్యో అతన్ని కాస్త పట్టుకోండి. మనం యిద్దరం కలిసి అతన్ని నా బసకు చేరుద్దాం.

అధ్యాపకుడు: సాహసం పనికిరాదు నందినీ! యిక్కడి నియమాల్ని బట్టి అలా చేస్తే అపరాధ మౌతుంది.

నందిని: ఆ మనిషిని చావనిస్తే అపరాధం కాదేం?

అధ్యాపకుడు: యే అపరాధానికి శిక్షవేసే నాథుడంటూ వుండడో, అది పాపమైతే కావొచ్చునుగాని అపరాధం మాత్రం కాదు. నందినీ నువ్వీ లంపటంలోనించి బైటికొచ్చేశేయి. చెట్టు భూగర్భంలోకి తన వేళ్లు విప్పి ఆహారాన్ని గ్రహిస్తుంది. తక్కినది విసర్జిస్తుంది. అక్కడ పూలు పూయవు. కొమ్మల మీద ఆకాశంలో పూస్తాయి పూలు. ఓ యెర్రగన్నేరు పూవూ! నేల కింద పనిచేసే వాళ్ల వూను నీకు వొద్దు. పైన గాలిలో తూగుటుయ్యాలలో నీవు వూగటం చూడాలని కసిపెట్టుకున్నాం. అడుగో సర్దారు. నే తప్పుకుంటాను. నీతో మాట్లాడటం చూసి సహించలేడు.

నందిని: నీ మీద యెందుకింత కోపం?

అధ్యాపకుడు: వుజ్జాయింపుగా చెప్పగల్ను, నువు అతని హృదయతంత్రుల్ని సవరించటం ఆరంభించావు. శ్రుతిచేసి సుస్వరం పలికించే లోపుగా శ్రవణకటువైన అపస్వరాలు తప్పవు.

[నిష్క్రమిస్తాడు]

(సర్దారు ప్రవేశం)

నందిని : సర్దార్ !

సర్దారు : నందినీ ! నువ్విచ్చిన మల్లెపూల దండ మా యింట్లో చూసి గోస్వామి రెండు కళ్లూ - అడుగో ఆయనేవొచ్చాడు. నమస్కారం ! ప్రభూ ఆ దండ నందిని నా కిచ్చింది.

(గోస్వామి ప్రవేశం)

గోస్వామి : ఆహా ! పరిశుభ్రమైన హృదయం సమర్పించిన దానం భగవత్ప్రేమ పాత్రమైన మల్లెపూలు. విషయలోలురైన వారి చేతిలో పడ్డప్పటికీ వాటి శుభ్రత మాసిపోదు. పుణ్య మార్గంలో వున్న శక్తీ, పాపజీవుల పరిత్రాణాన్ని గురించిన ఆశా, వీటిలో కనిపిస్తాయి.

నందిని : గోస్వామిజీ ! యీ మనిషికి కాస్త సదుపాయం చెయ్యండి. యితని జీవితంలో చాలా అల్పభాగమే మిగిలి వుంది.

గోస్వామి : అన్ని విషయాలూ విచారించిన మీదట యితన్ని యెంతవరకు బ్రతికించి వుంచటమో అంతవరకూ మా సర్దారు తప్పకుండా బతికించి వుంచుతాడు. కాని, అమ్మాయీ, యీ మాటలన్నీ నీ నోటి వెంబడి వొస్తూ వుంటే కొంత శ్రవణ కటువని పిస్తున్నాయి - మాకు నచ్చటంలా.

నందిని : యీ రాజ్యంలో మనుష్యుల్ని బతకనీయటంలో పరిమాణ విచారం వున్నదన్నమాట.

గోస్వామి : లాకేం, వున్నది. యీ లోకంలో జీవితమంతా సీమాబద్ధం. దాని లెక్క తెలుసుకుంటేనేగాని వ్యక్తుల భాగాలు పంపిణీ చేయటానికి వీల్లేదు మా శ్రేణికి చెందిన వ్యక్తుల మీద దుస్సహమైనటువంటి బాధ్యత వుంచాడు - భగవంతుడు. ఆ భారమంతా మోయాలంటే జీవితాంశంలో యెక్కువ పరిమాణం మా భాగానికి రావాలి. వాళ్లు కొంచెం తక్కువ పరిమాణంలో జీవించినా జరిగిపోతుంది. యెందుకంటే వాళ్లభారం తగ్గించటానకి మేము బతికున్నాం. యీ విధంగా చూస్తే వాళ్లేం తక్కువగా బతుకుతున్నట్లా ?

నందిని : గోస్వామీ, వాళ్లందరికీ యేం వుపకారం చేయాలని భగవంతుడు మీ మీద యీ భారం పెట్టాడు ?

గోస్వామి : జీవితం సీమా బద్ధం కాకపోతే భాగాలు పంచుకోవటమేలేదు. వొకరితో వొకరు కలహించటానికి అవకాశమే లేదు. అలాటి అనంత

మైన మార్గాన్ని చూపించటానికే మేము గోస్వాములం వొచ్చింది. దీంతో కనక వాళ్లు సంతుష్టి పొందితే మేం వాళ్లకిబంధువులమే.

నందిని: అలా అయితే యీ మనిషి సీమాబద్ధమైన తన ప్రాణంతో యీ విధంగా సహం చచ్చిపడి వుండవలసిందే?

గోస్వామి: పడివుండట మెందుకు? యేమంటారు సర్దారు?

సర్దారు: నిజమే. అతన్నెందుకు పడివుండనిస్తాం? యిప్పటి నుంచీ తన సొంత బలం ఆధారం చేసుకుని నడవక్కరనే లేదతను. మాబలం తోనే నడిపించి తీసుకు వెళతాం. ఏయ్ గజ్జూ.

పైల్వాన్: యేం ప్రభూ!

గోస్వామి: హరి హరీ. నీ కంఠ స్వరం అదేమిటో కొంచెం సున్నితంగా వొస్తున్నది. వీణ్ణి నామకీర్తన చేసే జట్టులో చేర్చుకో వొచ్చునని పిస్తున్నది.

సర్దారు: హా - ఊ పేటలో పెత్తందారింట్లో నీకు బస యేర్పాటు అయింది. పద అక్కడికి.

నందిని: అదేంమాట! ఎలాఁనడిచి పోగలడు?

సర్దారు: నందినీ, ఇటు చూడు. మనుష్యుల్ని నడిపించటమే మా పని. యెవడన్నా నడవలేక కింద బోర్ల పడినా బలంతో వొక్కతోపు తోశా మంటే యింకా కొంత దూరం పోగలుగుతాడు. గజ్జూ, కదలవేం?

పైల్వాన్: చిత్తం ప్రభూ.

నందిని: పైల్వాన్, పెత్తందారింటికి నేను కూడా వొస్తున్నా. అక్కడ నిన్ను చూచే వాళ్లెవరూ లేరు.

పైల్వాన్: వొద్దు వొద్దు, సర్దారు చూస్తే మండిపడతాడు.

నందిని: సర్దారుకోకోపంవొస్తే నేను భయపడేదాన్నికాదు.

పైల్వాన్: నాకు భయమే. మీకోదణ్ణం. నాకు ముప్పు తెచ్చిపెట్టకండి.

(పైల్వాన్ నిష్క్రమిస్తాడు)

నందిని: సర్దార్, వెళ్లకండి. వెళ్లకండి. నాపిచ్చి తమ్ముణ్ణి బిశూని యెక్కడికి తీసికెళ్లారో చెప్పి మరీ వెళ్లండి.

సర్దారు: తీసికెళ్ళటానికి నేనెవర్ని? మేఘాన్ని గాలి తీసుకు వెళుతుంది. అదో దోషంగా భావించావంటే ఆ గాలిని యెవరు ప్రోత్సాహం చేశారో అడిగి కనుక్కో.

నందిని : యేమి సర్వనాశనమైన దేశమండీ యిది! మీరు మనుషులుకారు. మీ రెవరినైతే నడిపిస్తున్నారో వాళ్లు మనుషులు కారు. మీరేమో గాలీ వాళ్లు మేఘాలూనా? గోస్వామీ, మీకు నిజంగా తెలుసునా మా బిశూ యెక్కడున్నాడో ?

గోస్వామి : వొకటి మాత్రం నాకు నిశ్చయంగా తెలును. అతనెక్కడున్నా అదంతా మంచి కోసమే.

నందిని : యెవరి మంచికోసం ?

గోస్వామి : అది నీ కర్థంకాదు. ఆఁ ఆఁ వొదులు వొదులు - అది నా జప మాల. అరే, తెగిపోయింది. యేమండీ సర్దార్ యీ అమ్మాయిని కాస్త మీరు—

సర్దారు : యెలాగోయేమో, యిక్కడి నియమాలన్నిటిలోనూ యెక్కడో సందు కనిపెట్టి ప్రవేశించిందీ పిల్ల. స్వయంగా మా రాజుగారే —

గోస్వామి : అరెరె, యీ సారి నా నామావళి అద్దకం వేసిన బట్టకూడా చిరిగిపోతుంది కొంప ముంచుతుంది. నే వెళిపోతాను.

(గోస్వామి నిష్క్రమిస్తాడు)

నందిని : సర్దార్, నాకు చెప్పి తీరాలి బిశూని యెక్కడికి తీసుకు వెళ్లారో.

సర్దారు : అతన్ని విచారశాలకు పిలుచుకు వెళ్లారు. యింతకన్న యెక్కువ చెప్పటానికి వీల్లేదు. వొదిలెయ్యి నన్ను - నాకు పనుంది.

నందిని : నేను ఆడదాన్నని నేనంటే నీకు భయంలేదు. కాని ఇంద్రుడు తన వజ్రాన్ని సౌదామిని చేతిలో పెట్టి పంపాడు. నేనా వజ్రాన్ని పట్టుకొచ్చాను. మీ సర్దారుల బంగారు శిఖరాలన్నీ బద్దలై పోతాయి.

సర్దారు : అలా అయితే నిజం నీతో చెప్పిపోతాను. బిశూకు యీ వుప ద్రవం తెచ్చిపెట్టింది నువ్వే.

నందిని : నేనా ?

సర్దారు : ఆఁ, నువ్వే. యిన్నాళ్లూ వొక కీటకంలాగ నిశ్శబ్దంగా యీ భూమికింద సొరంగం చేసుకుంటూ పోతూండేవాడు. అతనికి మృత్యు పథంలో పడి నడిచిపోవటం నువ్వే నేర్పావు.
ఓ ఇంద్రుడి వజ్రమా! యిలాగే యెందర్నో ఆకర్షిస్తావు.
ఆ తర్వాత మనిద్దరి మధ్యా సమాధానం కుదురుతుంది. యెంతో కాలం పట్టదు.

నందిని : అలాగే కానీయండి. కానీ వొక్కమాట మాత్రం చెప్పిపోతాను. రంజనుకి నన్ను చూసే అవకాశం యిస్తారా ?

సర్దారు : యెంత మాత్రమూ యివ్వము.

నందిని : యెంత మాత్రమూ యివ్వరా ? చూస్తాను. మీ శక్తి యేపాటిదో. నేనివాళ అతన్ని కలుసుకుంటాను. కలుసుకు తీరతాను. మీతో చెప్పిమరీ వెళుతున్నాను.

(సర్దారు నిష్క్రమిస్తాడు)

నందిని : (వాకిలి దగ్గర కాలుంచి) వింటున్నారా, రాజా, వింటున్నారా ? మీ విచారశాల యెక్కడ ? ఈ జాలావరణం చీల్చేస్తాను. యెవరా వెళ్లేది ? కిశోర్ కాదూ ? యిదుగిదుగో, బిశూ యెక్కడికెళ్లాడో మీకు తెలుసునా ?

(కిశోర్ ప్రవేశిస్తాడు)

కిశోర్ : ఆ, తెలుసును నందినీ యిప్పుడే బిశూ కనిపిస్తాడు. మనసు నిబ్బరం చేసుకో, రక్షక భటుల యజమాని నా మోహం చూసి యెందుకోగాని దయదలిచాడు. నా విన్నపంవిని బిశూని యీ దారినే తీసుకురావటానికి వొప్పుకున్నాడు.

నందిని : రక్షక భటుల యజమాని ! అయితే మరి —

కిశోర్ : ఆఁ, అవును. అడుగో వొస్తున్నాడు.

నందిని : అయ్యో యిదేమిటి ! నీ చేతికి సంకెళ్లా ? పిచ్చి తమ్ముడూ నిన్నీ విధంగా యెక్కడికి తీసుకు పోతున్నారు వాళ్లు ?

(బిశూని తీసుకుని రక్షకభటుల ప్రవేశం)

బిశు : భయంలేదు. యేమీ భయపడకు. పిచ్చి చెల్లాయీ యిన్నాళ్లకు నాకు ముక్తి లభించింది.

నందిని : నువ్వేమంటున్నావో నా కర్థం కావటం లేదు.

బిశు : అడుగడుగునా బిడియపడుతూ ఆపద తప్పించుకోవటానికి నేను ప్రయత్నం చేసినన్నాళ్లూ స్వేచ్ఛగానే వున్నాను. కాని ఆ స్వేచ్ఛ వంటి ఖైదు యింకోటి లేదు.

నందిని : నువ్వేం తప్పు చేశావనీ నిన్నిలా బంధించి తీసుకెళుతున్నారు ?

బిశు : యిన్నాళ్లకు వున్నదున్నట్టు నిజం చెప్పేశాను.

నందిని : అందులో తప్పేమున్నది ?

బిశు : యేమీలేదు.

నందిని : అలా అయితే యీ సంకెళ్లెందుకు ?

బిశు : వేస్తే నష్టమేమొచ్చింది ? నిజం చెప్పి ముక్తిని పొందాను. యీ సంకెళ్ళు 'నిజాని' కి సాక్ష్యం.

నందిని : వాళ్లు నిన్ను పశువులాగా దారివెంట నడిపించుకు తీసుకెళు తున్నారు — వాళ్ల కేం సిగ్గు లేదూ ? వాళ్లూ మనుషులేనా ?

బిశు : వాళ్లల్లో లోలోపల వో పెద్ద పశువు కూర్చుని వుంది. వో చెంప మానవుల్ని అవమానం చేస్తూంటే వాళ్లు తలలు వొంచుకో నైనా వొంచుకో లేదు. ఆ లోపలున్న జంతువు తోక ఆడిస్తూనే వుంది.

నందిని : అయ్యో తమ్ముడూ, నిన్ను హింసించారా యేమిటి ? నీ వొంటి మీద ఆ గుర్తులేమిటి ?

బిశు : కొరడాతో కొట్టారు. కుక్కల్ని కొడతారే, ఆ కొరడాతో. ఆ కొరడా యే తాడుతో అల్లుతారో ఆ తాడుతోనే గోస్వామి జప మాల కూడా కడతారు. భగవన్నామ స్మరణ చేసేటప్పుడు గోస్వామి ఆ సంగతి మరిచి పోతాడు. కాని భగవంతుడు మాత్రం గుర్తుంచుకుంటాడు.

నందిని : నా తమ్ముడూ నన్ను కూడా యీ విధంగానే నీతో పాటు కట్టి తీసుకు వెళితే బాగుండును. నువ్వు తిన్న దెబ్బ నేను కూడా కొంత తినకపోతే యివ్వాళ నుంచి నాకు అన్నమే రుచించదు.

కిశోర్ : బిశూ, నేను కాస్త ప్రయత్నం చేశానంటే నీ బదులు నన్ను తీసు కెళ్లటానికి వాళ్లు వొప్పుకోవొచ్చు నీ అనుమతి యియ్యవూ ?

బిశు : యేమిటా పిచ్చిమాటలు ?

కిశోర్ : వాళ్ళు వేసే శిక్ష నన్నాట్టే బాధించదు. నా వయస్సు తక్కువ. సంతోషంగా నేను ఆ శిక్ష భరించగలను.

నందిని : ఆహాఁ, అలాక్కాదు. అలా అనకు కిశోర్.

కిశోర్ : నందినీ ! యివ్వాళ నేను పనిలోకి వెళ్లలేదు. ఆ సంగతి అప్పుడే తెలిసి పోయింది. నా వెనకనే వేట కుక్కల్ని వుసి కొల్పారు. వాళ్లేమైనా నన్ను అవమానం చెయ్యదలుచుకుంటే యీ శిక్షవల్ల అది తప్పించుకోవొచ్చు.

బిశు : కిశోర్, అలాకాక్కాదు. యిప్పుడప్పుడే పట్టుబడి పోకూడదు. ఆ పద్ధర్మంగా చెయ్యవలసిన వో ముఖ్యమైన పని వుంది. రంజన్ యిక్కడికి వొచ్చాడు. అతను యెక్కడున్నదీ యెలా బయట పెడతావో చూడాలి. అది అంత తేలిక కాదు.

(కిశోర్ నిష్క్రమిస్తాడు)

బిశు : యీసారి రంజన్‌తో యివ్వాళ నీ సమాగమం జరిగి తీరుతుంది.

నందిని : సమాగమం వల్ల నాకేమీ సంతోషంలేదు. నీకు కేవలం శూన్య హస్తంతో వీడ్కోలిస్తున్నాను. ఈ విషయం మరిచి పోలేను. అడుగో, ఆ కుర్రవాడు కిశోర్ మాత్రం నావల్ల యేం లాభం పొందాడు ?

బిశు : మా మనస్సుల్లో అగ్ని జ్వలింపజేశావు. దాంతో మా అంతఃకరణాలు ప్రకాశమానమైపోయినై. అంతకన్న యేంకావాలి ? జ్ఞాపకం వుందా ?— ఆ నీలకంఠపక్షి రెక్క రంజన్ తల్లో అలంకరించాలని.

నందిని : ఆ, యిదుగో నా పైట చెరగునే వున్నది.

బిశు : చెల్లీ, వినిపిస్తున్నదా — ఆ పొలంలో కోతకోస్తూ పాడుతున్న పాట.

నందిని : ఆ, వినిపిస్తున్నది. లోపల్నుంచి దుఃఖం పొంగిపొర్లుతున్నది.

బిశు : నేలమీది విలాసమంతా ముగిసింది. భూస్వామి పండిన పంట యింటికి చేర్చాడు. ప్రహరీ యింకెందు కాలస్యం ?

తుదకు మిగిలిన పంట
మొదలంటగా కోసి
మోపులను గట్టిగా కట్టండి
చేర్చుకొని పోవగా
చేతి కందని పంట
మట్టిలో మట్టిగా
మణిగి పోగా వదలి పెట్టండీ.

(చికిత్సకుడూ సర్దారూ ప్రవేశం)

చికిత్సకుడు : చూశా. తన మీద తనకే విరక్తి పుట్టింది రాజుగారికి. యీ రోగం శరీర సంబంధి కాదు. మానసికం.

సర్దారు : మరి దీనికి ప్రతీకారమేమిటి ?

చికిత్సకుడు : యేదో పెద్ద యెత్తున ఢక్కాముక్కీ తినాలి. యింకో రాజ్యంతో నైనాసరే లేకపోతే తన ప్రజల్లో నుంచైనాసరే సంఘర్షణ రావాలి.

సర్దారు : అంటే, యింకొకర్ని యెవర్నైనా నాశనం చేయనీయకపోతే తన్నుతానే నాశనం చేసుకుంటాడన్న మాట.

చికిత్సకుడు : యీ పెద్ద వాళ్లంతా పెద్ద పసిపాపలు. ఆడుకుంటారు. వొక ఆట మీద విరక్తి పుట్టగానే యింకో ఆట యేర్పాటు చేయాలి. లేకపోతే ఆటవస్తువులన్నీ పగలగొట్టి పారేస్తారు. మీరు మాత్రం సిద్ధంగా వుండండి. యెంతో ఆలస్యం లేదు.

సర్దారు : యీ లక్షణాలు కనిపెట్టి యిదివరకే అంతా సిద్ధంచేసి వుంచాను. కాని అయ్యయ్యో, యెంత విచారకరమైన విషయం! యెన్నో రోజులు కాలేదు మా సువర్ణపురి యెంత అయిశ్వర్యాన్ని సమకూర్చుకుంది! సరిగ్గా యిలాటి సమయంలో యీ—సరే వెళ్లండి, అంతా పార చూసుకుంటాను.

(చికిత్సకుడు నిష్క్రమిస్తాడు)

(పెత్తందారు ప్రవేశం)

పెత్తందారు : సర్దారు మా రాజుగారూ నేను ఈ పేటకు పెత్తందారుని, నన్ను పిలిచారా?

సర్దారు : నువ్వు 321 కాదూ?

పెత్తందారు : దొరగారికెంత జ్ఞాపకశక్తి! నాలాటి అభాజనుణ్ణి కూడా మరిచిపోరు.

సర్దారు : నా భార్య వూరినుంచి వొస్తున్నది. మీ పేట దగ్గిర బళ్లు మార్చుకోవాలి. తొందరగా యిక్కడికి చేరే సదుపాయం చేయాలి

పెత్తందారు : పేట పేటంతా పశువుల వ్యాధి. బళ్లు లాగటానికి యెడ్లన్న మాట లేవు. కానీయండి. తప్పుపని వాళ్లని పెట్టి పని నడిపిస్తాను.

సర్దారు : యెక్కడికి తీసుకెళ్లాలో్న తెలుసునా? సర్దారుల వనభోజనం జరుగుతున్నదే, ఆ వుద్యాన మందిరానికి.

పెత్తందారు : వొక్కమాట మీతో మనవి చేసుకుని వెళతాను. కాస్త చెవి వొగ్గి వినాలి. ఆ ౬౯ జ వున్నాడే, పిచ్చి బికు అంటారు — వాడి పిచ్చి కొంచెం పరీక్ష చేయవలసిన సమయం వొచ్చింది.

సర్దారు: యేం, మీ మీదేమన్నా దౌర్జన్యం చేస్తున్నాడా యేం?
పెత్తందారు: నోటి మాటలతో కాదు. వాడి ఆలోచనలూ వైఖరీ అలా వున్నాయి.
సర్దారు: వాడి వూసే అక్కర్లేదు - అర్థమైందా?
పెత్తందారు: కాకేం! అలా అయితే మంచిదే. ఇంకొక్కమాట. ఆ '47 ఫా'—అతనికి 69 జ తో సావాసం కొంచెం యెక్కువై పోయింది.
సర్దారు: గుర్తుంచుకుంటాను.
పెత్తందారు: అందులో యేం లోపం వుండదు. కాని దొరగారి చూపు వొక్క చోటకాదు, నానావైపులా తిరుగుతూ వుండాలి. వొకటి రెండు విషయాలు కంటికాన కుండా పోవొచ్చు. చూడండి మా 95 వరసకి నా మామగారి తోడబుట్టు పెనిమిటి - ప్రభువుగారికి తన చర్మంతో చెప్పులు కుట్టి యివ్వటానికి సిద్ధంగా వున్నాడు. అతని ప్రభుభక్తి చూసి అతని యిల్లాలే సిగ్గుతో తల వొంచుకుంటూ వుంటుంది. యింతైనప్పటికీ యింతవరకూ—
సర్దారు: అతని పేరు పెద్ద చిఠాలో నమోదైంది.
పెత్తందారు: పాపం, యింతకాలంనుంచీ చేసినసేవ యిన్నాళ్లకు ఫలించింది. యీ శుభవార్త అతనికి కొంచెం నిదానంగా వినిపించాలి. అతనికి మూర్ఛరోగం. కొంపతీసి హఠాత్తుగా చెబితే యేమైనా —
సర్దారు: సరే అలాగే చేద్దాం. నువ్వు తొందరగా వెళిపో.
పెత్తందారు: యింకొక్క మనిషి సంగతి చెప్పాలిసుంది. నాకు వాడు సొంత బావమరిదే అనుకోండి. వాడి తల్లి చచ్చిపోతే నా భార్య వాణ్ణి తన చేతులతో పెంచి పెద్దచేసింది. అయినా ప్రభువువారి వుప్పుతింటూ —
సర్దారు: ఆ మాట రేపుచూద్దాం. పరుగున వెళిపో.
పెత్తందారు: అదుగో, రెండో సర్దారుగారు వొస్తున్నారు - వారితో నన్నుగురించి రెండుమాటలు చెప్పరూ? నామీద వారికంత మంచి అభిప్రాయం లేదు. నా అనుమానం యేమిటంటే ప్రభువు గారింట్లో 69 జ రావటం, పోవటం మొదలుపెట్టినప్పటినుంచీ నా పేరూ —

సర్దారు: యెబ్బెబ్బె - నీపేరు చెప్పి వొక్కనాడూ ఆయన యేమైనా అనగా నేను వినలేదు.

పెత్తందారు: అదే అతని శాణాతనం. బాగా పేరుపడ్డ వొక మనిషిని గురించి చెప్పేటప్పుడు వాడిపేరు తొక్కిపెట్టేస్తే వాణ్ణి చంపేసినట్టే. నేర్పుగా సంజ్ఞలతో గుసగుసలాడటం అంత మంచి పని కాదు. మన 33 కి ఆ రోగంవుంది. నేను చూస్తున్నాగా - వాడి కింకోపనిలేదు. ప్రభువువారింటి లోపలిగదిలోకి అతను రావటం పోవటం జరుగుతూనే వుంది. నా భయమేమిటంటే యెవరిపేరయేం బనాయిస్తాడోనని. అసలు వాడింటిగుట్టుగనక——

సర్దారు: యివాళ తీరికలేదు. త్వరగా వెళిపో.

పెత్తందారు: చిత్తం నమస్కారం. (తిరిగొచ్చి)

ఒక్కమాట. ఆ పేటలో 88 - ముప్పైరూపాయల జీతంతో పనిలో ప్రవేశించాడు. రెండు సంవత్సరాలన్నా కాలేదు. పై సంపాదనతో వాడి యింటి ఆదాయం - నెలకి యెంత లేదన్నా వెయ్యీ్యాపదిహేను వందల దాకా వుంటుంది. ప్రభువు వారి మనస్సు నిర్మలమైంది. దేవుడిలాగా కాస్త పొగిడితే అన్నీ మరిచిపోతారు. సాష్టాంగ ప్రణామం చేయటం చూసి ——

సర్దారు: సరే సరే, అదంతా రేపు చూసుకుందాం.

పెత్తందారు: నాకూ దయాదాక్షిణ్యం వుంది. వాడినోటి అన్నం తీసేయటానికి చెప్పటంలా. కాని వాణ్ణి ఖజానాలో వుద్యోగంలో వుంచటం మంచిదా కాదా అని కొంచెం విచారించండి. వాడి పుట్టుపూర్వోత్తరం అంతా మన విష్ణుదత్తుకు తెలుసు, వాణ్ణి పిలిపిస్తే——

సర్దారు: ఇవ్వాళే పిలిపిస్తాను. నువ్వుమాత్రం వెళిపో.

పెత్తందారు: ప్రభూ! నా మూడో పిల్లవాడు పెరిగి పెద్దవాడై పోయాడు. మొన్న మీకు దణ్ణంపెట్టి పోవాలని వొచ్చాడు. మూడురోజులు నానాతిప్పలూపడి మీ దర్శనం చేసుకోలేక తిరిగొచ్చేశాడు. వాడి మనస్సు చాలాబాధపడి పోతున్నది. ప్రభువువారి భోగంకోసమని నా కోడలు తనచేత్తో తయారుచేసింది బూడిదగుమ్మడికాయ——

సర్దారు: యెల్లుండి రమ్మనిచెప్పు, తప్పకుండా చూస్తాను.

(పెత్తందారు నిష్క్రమిస్తాడు)

(రెండో సర్దారు ప్రవేశం)

రెండో సర్దారు: భోగంవాళ్లనూ బాజాభజంత్రీలనూ తోటలోకి పంపించొచ్చాను.

సర్దారు: మరి, ఆ రంజన్ సంగతి యెంతవరకు—

రెండో సర్దారు: యీ పనంతా నా వల్లకాదు. చిన్నసర్దారు తనే చూసుకుంటానని వొప్పుకున్నాడు. యీపాటికప్పుడే—

సర్దారు: రాజుగారికేమైనా—

రెండో సర్దారు: రాజుగారికేమీ తెలియనిమాట నిజం. పదిమందితో కలిపి పంపించాం అతన్ని. కాని రాజుగారిని యీవిధంగా మోసగించటం వుచితమని నేననుకోను.

సర్దారు: రాజుగారి యెడల ప్రవర్తించే విషయంలో వొకప్పుడాయన్ను వారించనూ వారించాలి, మోసగించనూ మోసగించాలి. ఆ బాధ్యతనాది. యీసారి మాత్రం ఆలస్యం చేయకుండా ఆ అమ్మాయిని—

రెండో సర్దారు: ఊఁ హుఁ హుఁ—యీపనంతా నావల్లకాదు. యీ భారమంతా ఆ పెత్తందారుమీద పెట్టారు — అతనే తగినవాడు. యే అంక చండాలపు పనికీ అతను భయపడేవాడు కాదు.

సర్దారు: రంజను సంగతి, కేనారాం గోస్వామికి తెలుసా?

రెండో సర్దారు: వుజ్జాయింపుగా అంతా తెలుసు. స్పష్టంగా తెలుసుకోవటం ఆయన కిష్టంలేదు.

సర్దారు: యేం?

రెండో సర్దారు: ప్రతి సమాధానంతోనూ 'నాకంత బాగా తెలియదు' అని చేర్చటానికి వీలుండదు.

సర్దారు: వీలుంటే మాత్రం!

రెండో సర్దారు: మీకర్థంకాలా? మనందరిదీ పైకొకటీ లోపల వొకటీ కాదు. అంతటా వొకటే రూపు. కాని ఆయనకు వోవైపున గోస్వామి మరోవైపున సర్దారూ - భగవన్నామాలద్దకం వేసిన బట్ట కాస్త తొలిగితే ఆయన గుట్టు బైటపడుతుంది. అందుకోసం, సర్దారు ధర్మాన్ని తనకు తెలియనట్టుగా నడపాలి. అలా: అయితే నామజపం చేస్తున్నప్పుడు అతని కాల్తే బాధవుండదు.

సర్దారు: ఆ నామజపం లేకపోతే వొదిలేయకూడదూ?

రెండో సర్దారు: కాని యీ విషయంలో ఆయన శరీరం సంగతి యెలా వున్నా మనస్సుకు మాత్రం ధర్మభీతి - అందుకని స్పష్టభావంతో నామజపమూ, అస్పష్ట భావంతో సర్దారు ధర్మమూ నడుపుకో గలిగితే సవ్యంగా వుంటాడు. అతడుండబట్టే మాదేవత అంత విశ్రాంతిగా వుంది. ఆమె కళంకం పైకి కనబడకుండా మాటుమణిగి వుంది. లేకపోతే ఆమెరూపం చూడటానికంత బాగుండదు.

సర్దారు: మీ విషయంలోకూడా మీ అధికార ధర్మానికీ మీ ప్రకృతి ధర్మానికీ జత కుదిరినట్లు లేదు. మీ రక్తంవేరు. సర్దారు రక్తంవేరు.

రెండో సర్దారు: అసలు రక్తమే అంటూ లేకుండా వుడిగిపోతే పరవా లేదు. అలా జరుగుతుందనే యింకా ఆశగావుంది. కాని మీ 321 వున్నాడే, వాణ్ణి చూసి సహించ లేకపోతున్నాను. వాణ్ణి పట్ట కారుతో పట్టుకోటానిక్కూడా అసహ్యం వేస్తుంది. అలాటివాణ్ణి నలుగురి యెదటా స్నేహభావంతో కావిలించుకోవాలిసొస్తే యే తీర్థంలో స్నానంచేసినా ఆ మాలిన్యం వొదలదు. అదుగో నందిని వొస్తున్నది.

సర్దారు: రండి పోదాం.

రెండో సర్దారు: యేం, భయం దేనికి ?

సర్దారు: మీ మీదనాకు నమ్మకం లేదు. మీ కళ్లల్లో కూడా ఆ నందిని ఆవేశం కనిపిస్తున్నది.

రెండో సర్దారు: నా కళ్లలోనే కాదు. మీకు తెలియకుండా మీ కళ్లలో కూడా అధికార రేఖతోపాటు గన్నేరు పూలరంగుకూడా కలిసి పోయింది. అందుకే ఆ రక్తిమ అంత భయంకరంగా వుంది.

సర్దారు: అయితే కావొచ్చు. మనస్సులో విషయం వొకప్పుడు మనస్సుకే తెలియదు. నాతో వొచ్చేయండి పోదాం.

(ఇద్దరూ నిష్క్రమిస్తారు)

(నందిని ప్రవేశం)

నందిని: చూడగా చూడగా యెర్రని మేఘాలతో యీ సందెవేళ యెర్ర బారి పోయింది. యీ యెరుపే మా సమాగమానికి సూచిక కాబోలు. అదేమో నా పాపిటలో సిందూరం ఆకాశమంతటా అల్లు కున్నది.

(గుమ్మంమీద కాలుంచి) వింటున్నారా, యెవరక్కడ? రాత్రిం బవళ్లు యిక్కడే పడివుంటాను నా మాట వినిపించుకోకపోతే.

(గోస్వామి ప్రవేశం)

గోస్వామి: యెవరినలా తొందర పెడుతున్నావ్?

నందిని: యీ తెరవెనక మనుష్యుల్ని కబళించే మహాసర్పం వున్నదే, దాన్ని.

గోస్వామి: హరిహరి. భగవంతు డెప్పుడూ చిన్నవాళ్లను నాశనం చేయ దలుచుకుంటే వాళ్లనోట పెద్ద మాటలనిపించి మరీ నాశనం చేస్తాడు. యిదుగో చూడు నందినీ నేనెప్పుడూ నీ శుభాన్నే కోరుతున్నాను. జ్ఞాపకం వుంచుకో.

నందిని: దానివల్ల నాకేమీ శుభంకాదు.

గోస్వామి: రా, నా దేవతార్చన మందిరానికి పోదాం. నీకు భగవన్నామం వినిపిస్తాను.

నందిని: వూరికే నామోచ్చారణ వల్ల యేం ప్రయోజనం?

గోస్వామి: మనశ్శాంతి కలుగుతుంది.

నందిని: ఛీ ఛీ ఛీ అలాంటి శాంతే నాకొద్దు. యీ వాకిలి దగ్గిర్నే నేను కూర్చుండి పోతాను.

గోస్వామి: నీకు దేవతలమీద కన్న మనుష్యులమీదే విశ్వాసం యెక్కువకదూ.

నందిని: మీ ధ్వజపూజాదేవత వున్నదే, ఆమె మనస్సు యెన్నటికీ మెత్త పడటమే జరగదు. కానీ యీ తెరవెనక వున్న మనిషి వున్నాడే, అతనెంతోకాలం యీ వలలో చిక్కుపడి వుండలేడు. ఫో ఫో ఫో - మానవుడి ప్రాణమంతా పిండేసి యేదో మిషతో అతన్ని మరిచి పోవటమే మీ వుద్యోగమంతా.

(గోస్వామి నిష్క్రమిస్తాడు)

(ఫాగూలాల్, చంద్ర ప్రవేశం)

ఫాగూలాల్: బిశూ నీతో వొచ్చాడుకదా, యిప్పుడెక్కడున్నాడతను? నిజం చెప్పు.

నందిని: అతన్ని ఖైదుచేసి పట్టుకు పోయారు.

చంద్ర: ఓసి రాక్షసీ, నువ్వే అతన్ని పట్టుకుని వొప్పజెప్పివుంటావు. నువ్వు వాళ్ల గూఢ చారిణివి.

నందిని : యేమొహంతో అనగలుగుతున్నావీ మాట ?

చంద్ర : కాకపోతే నీకిక్కడేం పని ? కేవలం అందరి మనస్సులూ భ్రమ పెడుతూ తిరిగేస్తున్నావ్.

ఫాగూలాల్ : యీ దేశంలో అందరికీ తక్కిన అందరి మీదా అనుమానమే. అయినా నిన్ను నమ్మి నేవొచ్చాను. నిన్ను గురించి అప్పుడప్పుడు మనస్సులో అనుకుంటానూ — అదంతా యెందుకులే! కాని యివ్వాళ అదేదో అంతా విలక్షణంగా వుంది.

నందిని : వుంటేవుండొచ్చు. నా వెంటవొచ్చే ముప్పు తెచ్చుకున్నాడు. మీ దగ్గర యే ఆపదా లేకుండా వుండేవాడు. ఆ సంగతి అతనే చెప్పాడు నాకు.

చంద్ర : అలా అయితే అతన్ని మాయపుచ్చి యెందుకు తీసుకొచ్చావ్ ? సర్వనాశీ !

నందిని : ముక్తి కావాలి, ముక్తి కావాలీ అన్నాడు.

చంద్ర : బలే మంచి ముక్తే యిచ్చావు అతనికి.

నందిని : అతనన్న మాటలన్నీ నా కర్థం కాలేదు చంద్రా. అతనదేమిటో అంటూవుండేవాడు - విపత్తులో అట్టడుక్కి మునిగిపోతేనే ముక్తి అంటూండేవాడు. ఫాగూలాల్, నిరపాయ స్థితిలోంచి ముక్తి కావాలనేవాణ్ణి బతికించి వుంచటం యెలాగ ?

చంద్ర : అదంతా నాకు తెలియదు. అతన్ని మళ్లీ తీసుకురాక పోయావంటే చచ్చిపోతావు. యీ చక్కని చుక్కని చూసి నేనేమీ మోసపోను.

ఫాగూలాల్ : చంద్రా, వృథాగా గడబిడ చేస్తే యేంలాభం ? ఆ కార్మికుల పేటలోనుంచి వో జట్టుని కూడ గట్టుకొస్తాను. యీ కారాగారాన్ని ముక్కలు ముక్కలుగా పగలకొట్టేస్తాను.

నందిని : నీతో నేను కూడా వొస్తాను.

ఫాగూలాల్ : వొచ్చియేం చేయాటానికి ?

నందిని : పగల కొట్టటానికి.

చంద్ర : ఓసి మాయావినీ, మహా పగలకొట్టావులే. యిహ పనేంలేదు.

(గోకుల్ ప్రవేశం)

గోకుల్ : అందరికన్నా ముందు యీ పిశాచిని కాల్చి చంపేయాలి.

చంద్ర : చంపేస్తావా ? అలాఅయితే దానికి తగిన శిక్షకాదు. తన చక్కదనం చూసుకుని అందర్నీ సర్వనాశనం చేసింది. ఆ చక్కదనాన్ని రూపుమాపాలి. తవ్వుగోలతో గడ్డి చెక్కేసినట్టు దాని మొహమంతా చెక్కెయ్యి.

గోకుల్ : ఓ, చెయ్యగల్ను. వొక్కమారు యీ సమ్మోటను నాట్యమాడిస్తే—

ఫాగూలాల్ : ఖబడ్దార్ ! ఆ పిల్ల వొంటిమీద చెయ్యి వేశావంటే—

నందిని : ఫాగూలాల్, నువ్వుండు. వీడుత్త పిరికి. నన్నుచూస్తే భయపడుతున్నాడు. అందుకే నన్ను చంపాలంటున్నాడు. అతని దెబ్బకు నేను భయపడేదాన్నికాదు. యేం చెయ్యగల్డో చెయ్యనీ, దుర్మార్గుణ్ణి.

గోకుల్ : ఫాగూలాల్ ! యిప్పటికీ నీకు తెలివిరాలేదు. సర్దారు శత్రువని నీకు తెలును. అయితే కానీ. శత్రువు శత్రువుగా నిలబడితే వాడిమీద నాకు గౌరవం. కాని యీ తియ్యతియ్యగా మాట్లాడే యీ నంగనాచి—

నందిని : సర్దారు మీద నీకు గౌరవమా ? కాలికిందవున్న బురదకి తన్ను తొక్కే అరికాలిమీద గౌరవం యేమిటి ? బానిసతొత్తుకి యజమాని మీద గౌరవం వుండటానికెలా వీలవుతుంది ?

ఫాగూలాల్ : యిదుగో, గోకుల్, నీ పౌరుషం చూపించే సమయం వొచ్చింది. యిలాటి ఆడపిల్లల మీద కాదు. రా, నాతో, పోదాం. (ఫాగూలాల్, చంద్ర, గోకుల్ నిష్క్రమిస్తారు. వొక మనుష్యుల దళం ప్రవేశిస్తుంది)

నందిని : యేమోయ్, యెక్కడికి పోతున్నారు మీరు ?

మొదటివాడు : ధ్వజపూజకి నైవేద్యం తీసుకు వెళుతున్నాం.

నందిని : రంజన్ కనిపించాడా మీకు ?

రెండోవాడు : అయిదు రోజుల క్రిందట వొక మారు చూశాం. మళ్లీ కనిపించలేదు. అదుగో వొస్తున్నారేం, వాళ్లని అడగండి చెబితే చెబుతారు.

నందిని : వాళ్లెవరు ?

మూడోవాడు : సర్దారుల వన భోజనానికి మద్యం తీసుకుపోతున్నారు.

(ఆ దళం నిష్క్రమిస్తుంది - యింకోదళం ప్రవేశిస్తుంది)

నందిని: ఓ యెర్ర టోపీలూ, రంజన్ కనిపించాడా మీకు?
మొదటి వాడు: మొన్న రాత్రి పెత్తందారు శంఖు యింట్లో చూశాం.
నందిని: యిప్పుడెక్కడున్నాడాయన?
రెండోవాడు: అదుగో వన భోజనానికి సామాన్లు తీసుకు వెళుతున్నారు - వాళ్లనడిగి చూడండి. మా చెవిని పడని సంగతులెన్నో వాళ్లు వింటూ వుంటారు.

(యీ దళం నిష్క్రమిస్తుంది - యింకోదళం ప్రవేశిస్తుంది)

నందిని: ఓయ్ - రంజన్ని యెక్కడ వుంచారో మీకేమైనా తెలుసునా?
మొదటివాడు: ఇస్స - స్స.
నందిని: మీకు నిజంగా తెలుసు. నాకు చెప్పాలి.
రెండోవాడు: మా చెవుల గుండా ప్రవేశించేది నోటి గుండా బైటికి రాదు. ఆ కారణం వల్లనే యింకా యిలా నిలిచి వున్నాం. అదుగో, ఆ ఆయుధాలు మోసుకెళుతున్నారూ — వాళ్లని అడిగి చూడండి.

(యీ దళం నిష్క్రమిస్తుంది — యింకోదళం ప్రవేశం)

నందిని: ఏయ్, కొంచెం ఆగండి, రంజన్ యెక్కడున్నాడో కాస్త చెప్పి పొండి.
వొకడు: నేను చెబుతున్నా - విను. తరుణం సమీపించింది. ధ్వజ పూజ కోసం రాజుగారు బైటికొచ్చితీరాలి. ఆయన్నే అడిగి చూడండి. మాకు ఆది తెలుసును, అంతు తెలియదు.

(యీ దళం నిష్క్రమిస్తుంది)

నందిని: (గుమ్మం మీద కాలుంచి) వేళయింది. వాకిలి తెరిచెయ్యండి.
నేపథ్యంలో: మళ్లీ వొచ్చావు - సమయం కాని సమయంలో. యిప్పుడే వెళిపో - వెళిపో నువ్వు.
నందిని: వుపేక్ష చెయ్యాలిసిన సమయం కాదు. నామాట విని తీరాలి.
నేపథ్యంలో: చెప్పవలసిందేదో పైనుంచే చెప్పి వెళిపో.
నందిని: పైనుంచి చెప్పేమాటలు మీ చెవిని పడవు.
నేపథ్యంలో: యివ్వాళ ధ్వజపూజ. నా మనస్సు తిక మక చెయ్యకు. పూజకి భంగం కలుగుతుంది. వెళ్లు వెళ్లు - తక్షణం వెళిపో.
నందిని: నా భయం మాయమైపోయింది. యీ విధంగా నన్ను బెదిరించలేరు. చావనైనా చస్తాను కానీ, వాకిలి-తెరవందే యిక్కణ్ణించి కదల్ను.

నేపథ్యంలో : రంజన్ కోసమనుకుంటాను యిదంతా. సర్దారుల కప్పుడే చెప్పివుంచాను. అతన్ని పంపిస్తారిక్కడికి. పూజకు వెళ్లే సమయంలో మాత్రం వాకిట్లో నిలబడి వుండకు. చాలా ప్రమాదం.

నందిని : దేవతలకు సమయాభావమంటూ లేదు. పూజకోసం యుగ యుగాంతరాలూ కూడా వేచివుంటారు. మానవుల దుఃఖం మానవులే తీర్చాలి. వాళ్ల సమయం చాలా అల్పం.

నేపథ్యంలో : నాకోపిక లేదు. నేను చాలా అలిసిపోయున్నాను. ధ్వజ పూజలో ఆ అలసట తీర్చుకుని వొస్తాను. యీ లోపుగా నన్ను బలహీనుణ్ణి చెయ్యకు. యిప్పుడు నాకు అడ్డం వొచ్చావంటే రథ చక్రంలో పడి పొడి అయిపోతావు.

నందిని : రథ చక్రం నా గుండె మీదుగా పోయినా సరే నే కదల్ను.

నేపథ్యంలో : నందినీ, నీ కిచ్చిన చనువు వల్ల నే నే నంటే భయంలేకుండా వున్నావు. యివ్వాళ భయపడక తప్పదు.

నందిని : అందర్నీ యెలా భయపెడుతున్నావో నన్ను కూడా అలాగే భయపెట్టు. నీ చనువు నాకక్కర్లేదు. దాన్ని తృణీకరిస్తున్నాను.

నేపథ్యంలో : తృణీకరిస్తావా ? నీ గర్వం అణిచేస్తాను. నీకు నాతో పరిచయం చేసుకునే తరుణం వొచ్చింది.

నందిని : ఆ పరిచయం కోసమే వేచివున్నాను. వాకిలి తెరవండి.

(ద్వారం భడాలున తెరుచుకుంటుంది)

ఆఁ, యేమిటది ! యెవరా నేల మీద - రంజన్‌లా కనిపిస్తున్నాడేం !

రాజు : యేమన్నావ్ - రంజనా ? యెంత మాత్రమూ కాడు. రంజన్ కాడు.

నందిని : అవును అవును - యితనే నా రంజన్.

రాజు : పేరెందుకు చెప్పలేదు నాతో ? అంత పౌరుషంత్తో నా దగ్గిర కెందు కొచ్చాడు ?

నందిని : రంజన్ ! ఓ రంజన్, మేలుకో, యిదుగో నే వొచ్చాను - నీ నెచ్చెలిని. రాజా, మేలుకో లేదేమి ?

రాజు : మోసం, మోసం, వీళ్లందరూ నన్ను మోసగించారు. సర్వనాశన మైంది. నేను నిర్మించిన యంత్రం నన్నే లెక్కచెయ్యకుండా పోయింది. పిలవండి - మీరు పోయి ఆ సర్దార్ని పిలుచుకు రండి. వాణ్ణి బంధించి తీసుకురండి.

నందిని : రాజా, రంజన్ని మేల్కొల్పవూ ? అందరూ అంటారు - మీరు మంత్రవేత్తలని నా రంజన్ని వొక్కమారు మేల్కొల్పరూ ?

రాజు : నే నేర్చిన మంత్రం యముడి దగ్గర. మేల్కొల్పటం నాచాత కాదు. మేల్కొన్న వాళ్లని శాశ్వతంగా నిద్రపుచ్చ గలను.

నందిని : అలా అయితే అలాంటి నిద్రలోనే నన్ను కూడా పడెయ్యండి. నేను సహించ లేకుండా వున్నాను. యింత అనర్థాని కెందుకు పాల్పడ్డారు ?

రాజు : నేను యౌవనాన్ని చంపేశాను. యిన్నాళ్లనుంచీ నే నార్జించిన శక్తి నంతటినీ కేవలం యౌవనాన్ని చంపటానికే వినియోగించాను. ఆ చచ్చిపోయిన యౌవనం నా కిచ్చిన శాపం నన్ను వెంటాడు తున్నది.

నందిని : నా పేరు చెప్పలేదా మీతో !

రాజు : నేను సహించలేనంత గర్వంతో నాకు సమాధానం యిచ్చాడు. అదేమో హఠాత్తుగా ప్రతి నరంలోనూ నాకు అగ్ని ప్రజ్వరిల్లి నట్లయింది.

నందిని : (రంజన్‌తో) ఓ వీర శిఖామణీ ! యిదుగో నీలకంఠ పత్రాన్ని నీ తలపై అలంకరిస్తున్నాను. నీ జైత్రయాత్ర నేటి నుంచీ ఆరంభ మవుతుంది. ఆ యాత్రకు నే నే వాహనాన్ని.

ఆహా, యిదుగో అతని చేతిలో నా రక్త కరవీర మంజరి ! అవు నవును. కిశోర్ తప్పక కలుసుకుని వుంటాడు. అతడెక్కడికి వెళ్లి వుండొచ్చు ? రాజా, ఆ పిల్లవాడెక్కడ ?

రాజు : యే పిల్లవాడు ?

నందిని : ఈ పూలదండ రంజన్ కిచ్చిన బాలకుడు.

రాజు : ముఖం చూస్తే సుకుమారమైన బాలికాముఖం. మాటలు చూస్తే యెంత దర్పం. పౌరుషంతో వచ్చి బలప్రయోగం చేయబోయినాడు.

నందిని : తర్వాత యేమైంది ? అలా వూరికే వుండకండి. ఏ మైందో చెప్పండి.

రాజు : నీటి బుడగ చితికి పోయినట్లే పోయాడు.

నందిని : రాజా, యిప్పుడా సమయం వచ్చింది.

రాజు : యెలాటి సమయం ?

నందిని : నా సమస్త శక్తినీ వినియోగించి మీతో పోరాడే సమయం.

రాజు : నాతో పోరాటమా ? యీ క్షణమే నిన్ను ధ్వంసం చేసి పారేయగలను.

నందిని : అప్పటి నుంచీ క్షణక్షణమూ నా చావు నిన్ను చంపేస్తూ వుంటుంది. నా దగ్గర యే ఆయుధాలూ లేవు. నా ఆయుధం మృత్యువు.

రాజు : అలా అయితే యిటురా దగ్గరకు. నన్ను నమ్మగలవా సాహసించి ? నాతో కలిసిరా ! నందినీ ! నన్నివ్వాళ నీ సహచరుణ్ణిగా చేసుకో.

నందిని : యెక్కడికి పోయేందుకు ?

రాజు : నా చేతిలో చేయికలిపి నాకు ప్రతికూలంగా నాపై యుద్ధం చేసేందుకు. తెలిసిందా ? ఆ యుద్ధం ఆరంభమైంది. యిదుగో నా ధ్వజం. యీ ధ్వజదండాన్ని యిదుగో విరిచి పారేస్తున్నాను. దాని కేతనాన్ని నువ్వు చించిపారేయ్. నా చేతితో నీ చేయి కలిపి నన్ను ధ్వంసంచేయ్ - నాశనంచేయ్ - దానివల్లనే నాకు ముక్తి.

దళంలో మనుష్యులు : మహారాజా, యేం విపరీతం యిది ! యేమిటీ వున్నాదం ? ధ్వజాన్నే విరిచేశారు ! యిది మా దేవతా ధ్వజం. వొక మొన ఆకాశానికీ రెండోది భూమికీ తగిలి అజేయంగా వుండే మహా పవిత్రమైన ధ్వజదండం. ధ్వజపూజ సమయంలోనా యీ మహా పాతకం చేయటం ? —పదండి, సర్దారులకీ వార్త చెబుదాం.

(ఆ దళం నిష్క్రమిస్తుంది)

రాజు ; యింకా నిర్మూలించవలసిన వెన్నోవున్నాయి. యీ ప్రళయ పథంలో నాదీపశిఖవుగా నువ్వుకూడా నాతో వొస్తావా నందినీ ?

నందిని : వొస్తాను. వొస్తాను.

[ఫాగూలాల్ ప్రవేశం]

ఫాగూలాల్ : వాళ్లు బిశూని యెంత మాత్రమూ వొదిలెయ్యటం లేదు — వీళ్లెవరు ? యీయన రాజుగారనుకుంటాను. ఓ పిశాచీ ! ఆయనతో కూడా పరామర్శచేస్తున్నావు ? విశ్వాసఘాతకీ !

రాజు : యే మయింది మీ కందరికీ ? యేం చెయ్యటానికిలా పైకొచ్చారు ?

ఫాగూలాల్ : ఆ కారాగారం తలుపు పగుల గొట్టటానికి. ప్రాణాలర్పిస్తాం గాని మళ్లీ తిరిగిరాము.

రాజు : తిరిగి రావటమెందుకు? పగల గొట్టటానికి నేనూ బయలు దేరుతున్నాను. అదుగో, దానికి యిది మొదటి సూచన — విరిచేసిన యీ ధ్వజం. చిట్టచివరకి నే చేసిన ఘనకార్యం.

ఫాగూలాల్ : నందినీ! బాగా అర్థం చేసుకోలేక పోతున్నాను. మేము అమాయకపు మనుష్యులం. మా మీద దయవుంచి మమ్మొ మోసం చేయకు, నువు మా యింటి పిల్లవి.

నందిని : అన్నా, మీరందరూ మృత్యువుతో పందెం ఆడుతున్నారు. యిహ మీరు మోసపోయే అవకాశం యేముంది?

ఫాగూలాల్ : నందినీ! అలా అయితే నువు కూడా మాతో కలిసి మెలిసి వొచ్చెయి.

నందిని : నేనూ అందుకోసమే బతికున్నాను. ఫాగూలాల్! రంజన్ని మీ అందరిలోకీ వెంటబెట్టుకుని తీసుకు వొద్దామనుకున్నాను. అదుగో చూడు, నా ప్రేమపాత్రమైన వీరశేఖరుడు. మృత్యువుని తిరస్కరించి వేంచేశాడు.

ఫాగూలాల్ : అయ్యో దైవమా! రంజనేనా అతను? అలా నిశ్శబ్దంగా నేలపై వాలి వున్నాడు.

నందిని : నిశ్శబ్దంగా కాదు. మృత్యువులో అపరాజితమైన అతని కంఠ స్వరం నాకు వినిపిస్తున్నది. రంజన్ పునర్జీవనంతో మేల్కొంటాడు. అతనెన్నటికీ చావబోడు.

ఫాగూలాల్ : అయ్యో నందినీ! స్నేహితురాలా! యీ అంధనరకంలోపడి యిన్నాళ్లనుంచీ యిందుకోసమా నువు జీవించివున్నది?

నందిని : అతడు వొస్తాడనే అపేక్షతో నిలిచివున్నాను. అతను రానే వొచ్చాడు. అతడు మళ్లీ రావటంకోసం నేను సిద్ధంగా వుంటాను. అతడు మళ్లీ తప్పక వొస్తాడు. అన్నా, చంద్ర యెక్కడ?

ఫాగూలాల్ : ఆ గోకుల్‌తో కలిసి సర్దారింటికి అడుక్కు తింటానికి వెళ్లింది. సర్దారు మీద దానికి మహా విశ్వాసం. మహారాజా! మీ కారాగారం పగలగొట్టటానికే పైకొచ్చాము. తప్పుగా భావించరు గదా.

రాజు : అవునవును. నా కారాగారమే. నువ్వూ నేనూ కలిసి మరీ చేయాలా పని, నువ్వొకడివే చేసే పనికాదది.

ఫాగూలాల్ : సర్దారులకు తెలిస్తే మాత్రం అటకాయిస్తారు.

రాజు : వాళ్లతోనే నా యుద్ధం ?

ఫాగూలాల్ : సైన్యం మీ మాట పాలించదూ ?

రాజు : నేనొక్కణ్ణే పోరాడతాను. నా వైపున మీరందరూ వున్నారు. గెలిచి తీరుతాం చావనూ చావగలం. యిన్నాళ్లకు చావటం అంటే యేమిటో తెలుసుకున్నాను. బతికి పోయాను.

ఫాగూలాల్ : మహారాజా ! ఆ గర్జన వినపడుతున్నదా ?

రాజు : అదుగో కనిపిస్తున్నది. సర్దారు సైన్యాన్ని తీసుకొస్తున్నాడు. యింత తొందరగా యెలా వీలైంది ? యింతకు ముందునుంచే సిద్ధం చేసుకుని వుండాలి. కేవలం నేనొక్కణ్ణే తెలుసుకోలేక పోయాను. మోసం చేశారునన్ను. నా బలంతోనే నన్ను బంధించారు.

ఫాగూలాల్ : మన దళాలింకా రాలేదే.

రాజు : సర్దారు వాళ్లను ఆపేసి వుంటాడు. యిక వాళ్లు రాలేరు.

నందిని : నా బిశు తమ్ముణ్ణి నా దగ్గిరికి తీసుకొస్తారను కున్నాను. అలా జరుగుతుందా ?

రాజు : వేరే వుపాయ మేంలేదు. దారులు మూసేయటంలో యీ సర్దారు లకు మించిన వాళ్లు నా కెక్కడా కనిపించటం లేదు.

ఫాగూలాల్ : అలా అయితే పద, నందినీ, నిన్ను వొక నిరపాయమైన చోట దిగబెట్టి వొస్తాను. ఆ తర్వాత యేదైతే అదవుతుంది. సర్దారు కంట పడ్డా మంటే నిన్నెవరూ రక్షించలేరు.

నందిని : నన్నొక్కదాన్నీ నిరపాయమైన ప్రదేశంలోకి పంపిస్తావా ? ఫాగూలాల్, మీకన్న ఆ సర్దారే మంచివాడు. అతను నా చైత్ర యాత్రామార్గాన్ని తెరచివుంచాడు. సర్దార్, సర్దార్, ఓ సర్దార్, చూడూ. ఆ బల్లెం మొనకు నా మల్లెపూలదండ వేలాడుతున్నది. ఆ దండకు నా గుండె నెత్తురుతో రక్తకరవీర వర్ణాన్ని పూసేస్తాను ఓ సర్దార్, యిదుగో నే కనిపించానా జై - రంజన్ కీ జై -

(వేగంగా నిష్క్రమిస్తుంది)

రాజు : నందినీ !

(నిష్క్రమిస్తారు)

(అధ్యాపకుడి ప్రవేశం)

ఫాగూలాల్ : ఎక్కడికలా హడావిడిగా పోతున్నారు ?

అధ్యాపకుడు: మా రాజుగారిన్నాళ్లకు జీవన రహస్యాన్ని సాక్షాత్కారం చేసుకుని పైకొచ్చేశారని అంటున్నారు. నా పుస్తకాలు అవతల పారేసి నేను కూడా వారిని అనుసరిద్దామని వొచ్చాను.

ఫాగూలాల్ : మహారాజు ఆ నందిని ఆహ్వానాన్ని విని ఆత్మార్పణం చేసుకోటానికి వెళ్లారు.

అధ్యాపకుడు : ఆయన జాలావరణం అంతా చిరిగిపోయిందా ? నందిని యెక్కడ ?

ఫాగూలాల్ : అందరికీ ముందుగా వెళ్లిపోయింది. ఆమెతో యిహముందు మనకు సంపర్కం వుండదు.

అధ్యాపకుడు : యిప్పుడే వుంటుంది. యిహ మనల్ని తప్పించుకు పోలేదు.

(అధ్యాపకుడి నిష్క్రమణ బిశూ ప్రవేశం)

బిశు : ఫాగూలాల్, నందిని యెక్కడ ?

ఫాగూలాల్ : నువ్వేలా వొచ్చేశావ్ ?

బిశు : మా పనివాళ్లందరూ కలిసి కారాగారాన్ని పగలకొట్టేశారు. అదుగో, వెళుతున్నారు—యుద్ధంలోకి. నందిని కోసం వెతుక్కుంటూ వొచ్చాను నేను. ఆమె యెక్కడ ?

ఫాగూలాల్ : అందరికన్నా ముందుగా వెళ్లిందామె.

బిశు : యెక్కడికి ?

ఫాగూలాల్ : కడసారి ముక్తికి. బిశూ, ఆ నేలమీద పడుకుని వున్నదెవరో చూశావా ?

బిశు : రంజన్ కదూ ?

ఫాగూలాల్ : మట్టితో కలిసి పోయింది ఆ రక్తరేఖ, చూశావా ?

బిశు : అర్థం అయింది. అదే అతని చరమ సమాగమానికి చెందిన రక్షా బంధం. యేకాకిగా యీ మహాయాత్ర చేయటానికి నాకు సమయం ఆసన్నమైంది. నా పాట వినిపించాలని వుంది ఓ నా పిచ్చి చెల్లీ !

అన్నల్లారా ! తమ్ముల్లారా
రండి యుద్ధంలోకి.

ఫాగూలాల్ : నందినికీ జై !

బిశు : నందినికీ జై !

ఫాగూలాల్ : అదుగో చూడండి, ధూళిలో పొర్లాడుతున్నది – ఆమె రక్తకరవీర కంకణం. ఆమె కుడిచేతినుంచి యెప్పుడో తెగి పడిపోయింది. ఆ అలంకారంలేని వుత్త చెయ్యితోనే ఆమె యివ్వాళ వెళిపోయింది.

బిశు :- ఆమె చేతినుంచి యేమీ తీసుకోనని చెప్పాను. యిదుగో, తీసుకోవలిసొచ్చింది – ఆమె కడసారి దానం.

నిష్క్రమిస్తాడు

(దూరంలో పాట)

*

# తెలుగు లిపిలో బెంగాలీ గేయాలు

## రాజా

1. ఖోలో ఖోలో ద్వార్ రాఖియో నా ఆర్
బాహిరే ఆమాయ్ దాఁడాయే ।
దాఓ సాడా దాఓ ఏయిదికే చాఓ
ఏసో దుయి బాహు బాహు బాడాయే ॥
కాజ్ హాయే గేఛే సారా,
ఉఠేఛే సంధ్యాతారా,
ఆలోకేర్ ఖేయా హాయేగేల దేయా ।
అస్త సాగర్ పారాయే ॥
ఏసేఛి దుఆరే ఏసేఛి ఆమారే
బాహిరే రేఖోనా దాఁడాయే ॥
ఝరి లయే ఝూరి ఎసేఛకి వారి,
సెజేఛకి శుచి దుకులే ।
బేంధేఛకి చూల్, తులేఛకి ఫూల్
గెఁధేఛకి మాలా ముకులే
ధేను ఎలో గోఠే ఫిరే,
పాఖిరా ఏసెఛె నీడే,
పథ ఛిల జత జుడియా జగత్
ఆంధారే గియేఛే హారాయే ॥
తోమారి దుఆరే ఏసేఛి, ఆమారే
బాహిరే రేఖోనా దాఁడాయే ॥

2. ఏజే మోర్ ఆవరణ్
ఘుచాతే కతక్షణ్ ?
నిశ్వాస్ - వాయే ఉడే చలేజాయ్
తుమి కర జది మన ।
జది పడే థాకి భూమే
ధులాయ్ ధరణీ చుమే,

తుమి తారి లాగి ద్వారే రబే జాగి
ఏ కేమన్ తవ పణ్ ?
రథేర్ చాకార్ రవే
జాగాఓ జాగాఓ సబే
ఆపనార్ ఘరే ఏసో శాలభరే
ఏసో ఏసో గౌరవే
ఘుమ్ టుటె జాక్ చలే,
చిని జేన ప్రభు బలే;
ఛూ్ఛుటే ఏసే ద్వారే కరి ఆవనారే
చరణే సమర్పణ్ ॥

3. కొథా బాయిరే దూరే జాయ్ రే ఉడే హాయ్ రేహాయ్,
తోమార్ చపల్ ఆంఖి వనేర్ పాఖి వనే పాలాయ్ ।
ఆజి హృదయ మాఝు జదిగో బాజే ప్రేమేర్ బాంశీ
తబె ఆప్ ని సేధే ఆప్ నా బేంధే పరేసే ఫాంసీ,
తబె ఘుచే గోత్వరా ఘురియా మరా హేథా హోథాయ్—
ఆహా ఆజిసే ఆంఖి వనేర్ వనే పాలాయ్ ।
చేయే దేఖస్ నారే హృదయ ద్వారే కీ ఆసేజాయ్ ।
తోరా శునిస్ కానే వార్తా ఆనే దక్షిణ్ వాయ్ ।
ఆజి ఫూలేర్ వాసే సుఖేర్ హాసే ఆకుల్ గానే
చిర వసంత జే తోమారి ఖోంజే ఏసేఛే ప్రాణే ।
తారే బాహిరే ఖూంజి ఘురియా బుఝు పాగల్ ప్రాయ్,
తోమారే చపల్ ఆంఖి వనేర్ పాఖి వనే పాలాయ్ ।

4. ఆజి దక్షిణ్ దుఆర్ ఖోలా—
ఏసోహే, ఏసోహే, ఏసోహే, ఆమార్
వసంత ఏసో !
దివ హృదయ - దోలాయ్ దోలా,
ఏసోహే, ఏసోహే, ఏసోహే, ఆమార్

నవ శ్యామల్ శోభన్ రథే
ఏసో వకుల్ - బిచానో పథే
ఏసో బాజాయే వ్యాకుల్ వేణు,
మేఖే పియాల్ ఫూలేర్ రేణు
ఏసో హే, ఏసో హే, ఏసో హే, ఆమార్
వసంత ఏసో ।

ఏసో ఘన పల్లవ పుంజే
ఏసో హే. ఏసో హే, ఏసో హే ।
ఏసో వన మల్లికా కుంజే
ఏసో హే, ఏసో హే, ఏసో హే ।
మృదు మధుర మదిర్ హేసే
ఏసో పాగల్ హావార్ దేశే
తోమార్ ఉతలా ఉత్తరియ
తుమి ఆకాశే ఉడాయే దియో,
ఏసో హే, హేసో హే, ఏసో హే, ఆమార్
వసంత ఏసో ।

5. జేఖానే రూపేర్ ప్రభా నయనలోభా,
సేఖానే తోమార్ మతన్ భోలాకే । (ఠాకుర్ దాదా)
జేఖానే రసిక - సభా పరమ శోభా
సేఖానే ఏమన్ రసేర్ ఝోలాకే । (ఠాకుర్ దాదా)

6. జేఖానే గలాగలి కోలాకులి
తోమారి బేచాకేనా సేయి హాటే,
పడేనా పదధూళి పథభులి
జేఖానే ఝుగడా కరే ఝుగడాటే,
జేఖానే భోలా ఖులి భోలా ఖులి
సేఖానే తోమార్ మతన్ భోలాకే—
ఠాకుర్ దాదా !

7. ఆమ్రా సబాయ్ రాజా అమాదేర్ ఏయి రాజార్ రాజత్వే
నయిలే మోదేర్ రాజార్ సనే మిల్‌బ కిస్వత్వే
(ఆమ్రా సబాయ్ రాజా)

ఆమ్రా జా ఖుశి తాయి కరి
తబు తాఁర్ ఖుశి తేయి చరి ।
ఆమ్రా నీయి బాంధా నయి దాసేర్ రాజార్ త్రాసేర్ దాసత్వే
నయిలే మోదేర్ రాజార్ సనే మిల్‌బ కీ స్వత్వే
(ఆమ్రా సబాయ్ రాజా)

ఆమ్రా చల్‌బ ఆపన్ మతే
శేషే మిల్‌బ తారి పథే
మోరా మర్‌బ నాకేవు విఫలతార్ విషమ్ ఆవర్తే
నయిలే మోదేర్ రాజార్ సనే మిల్‌బ కీ స్వత్వే ।
(ఆమ్రా సబాయ్ రాజా)

8. ఆమార్ ప్రాణేర్ మానుష్ ఆఛే ప్రాణే
తాయి హేరి తాయి సకల్ ఖానే ।
ఆఛేసే నయన తారాయ్ ఆలోకధారాయ్, తాయినాహారాయ్
ఓగో తాయిదేఖి తాయి జెథాయ్ సెథాయ్
తాకాయి ఆమి జేదికే పానే ॥
ఆమి తార్ ముఖేర్ కథా
శున్‌బ బలే గెలామ్ కోథా
శోనా హలనా, శోనా హలనా,
ఆజ్ ఫిరే ఏసే నిజేర్ దేశే
ఏయి జే శుని,
శుని తాహార్ వాణీ ఆపన్ గానే ॥
కే తోరా ఖుజిఁస్ తారే
కాంగాల్ వేశే ద్వారే ద్వారే,
దేఖా మేలేనా మేలేనా—
ఓ తోరా ఆయ్‌రే ధేయే దేఖ్‌రే చేయే
ఆమార్ బుకే—
ఓరే దేఖ్‌రే ఆమార్ దుయి నయనే ॥

9. తోరా జే జా బలిస్ భాయి
 ఆమార్ సోనార్ హరిణ్ చాయి।
 సేయి మనోహరణ్ చపల్ చరణ్
 సోనార్ హరిణ్ చాయి॥
 సేజే చమ్‌కే బేడాయ్ దృష్టి ఎడాయ్
 జాయినా తారే బాంధా,
 తార్ నాగల్ పేలే పాలాయ్ ఠేలే
 లాగాయ్ చోఖే ధాఁదా
 తబు ఛుట్‌బ పిఛే మిఛే మిఛే
 పాయి జానాహి పాయి
 ఆమి ఆపన్ మనే మాతే వనే
 ఉధాఓ హాయే ధాయ్॥
 తోరా పాబార్ జినిస్ హాటే కినిస్
 రాఖిస్ ఘరే భరే,
 జాహా జాయినా పావా తారి హావా
 లాగ్‌ల కేన మోరే?
 ఆమార్ జా ఛిల తా దిలేమ్ కోథా
 జానేయి తారి రఖోఁకే
 ఆమార్ ఫురోయ్ పుంజి, భావిస్ బుఝి
 మారి తాహార్ శోకే
 ఓరే ఆఛి సుఖే హాస్య ముఖే
 దుఃఖ ఆమార్ నాయి।
 ఆమి ఆపన్ మనే మాతేవనే
 ఉధాఓ హాయే ధాయ్॥

10. ఆజి కమల్ ముకుల్ దల్ ఖులిల
 దులిలరే దులిల
 మనస్ - సరసే రస్ - పులకే
 పలకే పలకే ఢేవు తులిల।
 గగన్ మగ్న హాల గంధే,
 సమీరణ్ మూర్ఛె ఆనందే

గున్ గున్ గుంజన్ ఛందే
మధుకర్ ఘురి ఘురి బందే;—
నిఖిల్ భువన్ మన్ భులిల—
మన్ భులిల రే

మన్ భులిల।

11. మోదేర్ కిఛు నాయిరే నాయి,
ఆమ్రా ఘరే - బాయిరే గాయి
తాయిరే నాయిరే నాయిరే నా।
జతయి దివస్ జాయిరే జాయి
గాయిరే సుఖే హాయిరే హాయి
తాయిరే నాయిరే నాయిరే నా।
జారా సోనార్ చోరా బాలిర్ పరే
పాకా ఘరేర్ భిత్తి గడే
తాదేర్ సామ్నే మోరా గాన్ గేయే జాయి
తాయిరే నాయిరే నాయిరే నా।
జఖున్ థేకే థేకే గాంతేర్ పానే
గాండ్ కాటూరా దృష్టి హానే,
తఖున్ శూన్య ఝులి దేఖాయే గాయి
తాయిరే నాయిరే నాయిరే నా।
ఏజే పసంత రాజ్ ఏసేఛే ఆజ్,
బాయిరే తాహార్ ఉజ్వల్ సాజ్,
ఓరే అంతరే తారే వైరాగి గాయి
తాయిరే నాయిరే నాయిరే నా।
సేజే ఉత్సవ దిన్ చుకియే దియే
ఝురి యే దియే శుకి యే దియే
దుయి రిక్త హాతే తాల్ దియే గాయి
తాయిరే నాయిరే నాయిరే నా।

12. మమ చిత్తే నితి నృత్యే కేజే నాచే
తాతా థైథై తాతా థైథై తాతా థైథై।

తారి సంగే కీ మృదంగే సదా బాజే
తాతా థైథై తాతా థైథై తాతా థైథై ॥
హాసి కాన్నా హీరా పాన్నా దోలే భాలే,
కాంపే ఛందే భాలో మంద తాలే తాలే,
నాచే జన్మ నాచే మృత్యు పాఛే పాఛే,
తాతా థైథై తాతా థైథై తాతా థైథై ।
కీ ఆనంద, కీ ఆనంద, కీ ఆనంద,
దివా రాత్రి నాచే ముక్తి నాచే బంధ,
సే తరంగే ఛుటి రంగే పాఛే పాఛే
తాతా థైథై తాతా థైథై తాతా థైథై ॥

13. వసంతే కి శుధు కేవల్ ఫోటా ఫూలేర్ మేలా రే ?
దేఖస్ నే కి శుక్నో పాతా ఝరా ఫూలేర్ ఖేలా రే ।
జే ఢేవు ఉఠె తారి సూరే
బాజే కి గాన్ సాగర్ జుడే ?
జే ఢేవు పడే తాహారో సూర్ జాగ్ఛే సారా బేలా రే ।
వసంతే ఆజ్ దేఖ్ రే తోరా ఝరాఫూలేర్ ఖేలా రే ।
ఆ మార్ ప్రభూర్ పాయేర్ తలే,
శుధుయి కిరే మానిక్ జ్వలే ?
చరణే తార్ లుటియే కాఁదే లక్ష మాటిర్ ఢేలా రే ।
ఆమార్ గురూర్ ఆపన్ కాఛే
సుబోధ్ ఛెలే క - జన్ ఆఛే
అబోధ్ జనే కోల్ దియేఛేన్ తాయి ఆమి తార్ చేలా రే ।
ఉత్సవ రాజ్ దేఖేన్ చేయే ఝరా ఫూలేర్ ఖేలా రే ।

14. విరహ మధుర్ హాల ఆజి
మధురాతే ।
గభీర్ రాగిణీ ఉఠే బాజి
వేదనా తే ।

భరి దియా పూర్ణిమా నిశా
అధీర్ - అదర్శన్ తృషా ।
కీ కరుణ్ మరీచికా ఆనే
ఆంఖి పాతే ।
సుదూరేర్ సుగంధ ధారా
వాయు భరే
పరానే ఆమార్ పథహారా
ఘురే మరే ।
కార్ వాణీ కోన్ సూరే తాతే
మర్మరే పల్లవజాలే,
బాజే మమ మంజీర రాజి
సాథే సాథే ॥

15. జా ఛిల కాలోధలో
తోమార్ రంగే రంగే రాంగా హల ।
జేమన్ రాంగావరన్ తోమార్ చరణ్
తార్ సనే ఆర్ భేద్ నారల ।
రాంగా హల వసన్ భుషణ్
రాంగా హల శయన్ స్వపన్
మన హోల కేమన్ దేఖ్ రే, జేమన్
రాంగా కమల్ టలమల్ ।

16. ఆహా, తోమార్ సంగే ప్రాణేర్ ఖేలా
ప్రియ ఆమార్ ఓగో ప్రియ ।
బడో ఉత్లా ఆజ్ పరాన్ ఆమార్
ఖేలాతే హార్ మాన్బే కి ఓ ?
కేవల్ తుమియి కి గో ఏమ్ని భావే
రాంగియే మోరే పాలియేజాబే ?
తుమి సాధ్ కరే నాథ్ ధరా దియే
ఆమారో రంగ్ వక్షే నియో—
ఏయి హృత్కమలేర్ రాంగా రేణు
రాంగాబే ఓయి ఉత్తరీయ ।

17. ఆమార్ సకల్ నియే బసే ఆఛి
సర్వ నాశేర్ ఆశాయ్ ।
ఆమి తార్ లాగి పథ చే యే ఆఛి
పథే జే - జన్ భాసాయి ।

18. జే జన్ దేయ్ నా దేఖా జాయ్ జే దేఖే,
భాలో బాసే ఆడాల్ థకే,
ఆమార్ మన్ మజేఛే సేయి గభీరేర్
గోపన్ భాలో బాసాయి ॥

19. ఆమార్ ఘుర్ లేగేఛే - తాధిన్ తాధిన్
తోమార్ పిఛున్ పిఛున్ నేచే నేచే
ఘుర్ లేగేఛే - తాధిన్ తాధిన్ ।
తోమార్ తాలే ఆమార్ చరణ్ చలే
శున్ తే నా పాయి కీ కీ బలే

తాధిన్ తాధిన్—

తోమార్ గానే ఆమార్ ప్రాణే జే కోన్
పాగల్ ఛిల సేయి జేగేఛే

తాధిన్ తాధిన్—

ఆమార్ లాజేర్ బాంధన్ సాజేర్ బాంధన్
ఖసేగేల భజన్ సాధన్,

తాధిన్ తాధిన్—

విషమ్ నాచేర్ వేగే దోలా లేగే
భావనా జత సబ్ ఖేగేఛే
తాధిన్ తాధిన్ ।

20. పుష్ప ఫుటే కోన్ కుంజవనే
కోన్ నిభృతే రే కోన్ గహనే ।
మాతిల ఆకుల్ దక్షిణ్ వాయు
సౌరభ్ - చంచల్ సంచరణే
కోన్ నిభృతే రే కోన్ గహనే ॥

కాటిల క్లాంత వసంత నిశా
బాహిర - అంగణ్ సంగి సనే ।
ఉత్సవ రాజ్ కొథాయ్ విరాజే
కేలయే జాబె సే భవనే—
కోన్ నిభృతే రే కోన్ గహానే ॥

21. ఆమి రూపే తోమాయ్ భోలా బ నా
భాలో బాసాయ్ భోలా బ ।
ఆమి హాత్ దియే ద్వార్ ఖుల్ బ నా గో
గాన్ దియే ద్వార్ ఖోలాబ ।
భజాబ నా భూషణ్ భారే
సాజాబ నా ఫూలేర్ హారే
సోహాగ్ ఆమార్ మాలా కరే
గలాయ్ తోమార్ పరాబ ।
జాన్ బె కేవు కోన్ తు ప్రానే
తరంగ దల్ నాచ్ బె ప్రాణే,
చాందేర్ మతో అలఖ్ టానే
జో యారే ధేవు తోలాబ ॥

22. భయేరే మోర్ ఆఘాత్ కరో
భీషణ్, హే భీషణ్ ।
కఠిన్ కరే చరణ్, పరే
ప్రణత్ కరోమన్ ।
బేంధే ఛ మోరే నిత్య కాజే
ప్రాచీరే ఘెరా ఘరేర్ మాఝే
నిత్య మోరే బేంధేఛే సాజే
సాజేర్ ఆభరణ్ ।

23. ఏసో హే, ఓహే ఆకస్మిక్
ఘిరియా ఫెలో సకల్ దిక్
ముక్త పథే ఉడాయే నిక్
నిమేషే ఏ జీవన్ ।

తాహార్ పరే ప్రకాశ్ హోక్
ఉదార్ తవ సహాస్ చోఖ్
తవ అభయ శాంతి మయ
స్వరూప్ పురాతన్ ॥

24. ఆమి తోమార్ ప్రేమే హాబ సజార్
కళంక భాగీ
ఆమి సకల్ దాగే హాబ దాగీ।
తోమార్ పథేర్ కాంటా కర్‌బ చయన్;
జేథా తోమార్ దూలార్ శయన్
సేథా ఆంచల్ పాత్‌బ ఆమార్
తోమార్ రాగే అనురాగీ।
ఆమి శుచి ఆసన్ టేనే టేనే
బేడాబ నా విధాన్ మేనే
జే పంకే ఓయి చరణ్ పడే
తాహారి ఛాప్ వక్షే మాగి ॥

25. ఆమి కేవల్ తోమార్ దాసీ
కేమన్ కరే ఆన్‌బ ముఖే తోమాయి భాలో బాసీ।
గుణ్ జది మోర్ థాక్‌త తబె
అనేక్ ఆదర్ మిల్‌త భవే,
బినా మూల్యేర్ కేనా ఆమి శ్రీ చరణ్ ప్రయాసీ।

26. ఏయి అంధకార్ డుబాఓ తోమార్ అతల్ అంధకారే,
ఓహే అంధ కారేర్ స్వామీ।
ఏ సో నిబిడ, ఏ సో గభీర, ఏ సో జీవన్ పారే
ఆమార్ చిత్తే ఏసో నామి।
ఏ దేహా మన్ మిలా యే జాక్ హాయియే జాక్ హారా
ఓహే అంధకారేర్ స్వామీ
వాసనా మోర్, వికృతి మోర్, ఆమార్ ఇచ్ఛాధారా
ఓయి చరణే జాక్ థామి।

నిర్వాసనే బాంధా ఆఛి దుర్వా సనార్ డోరే
ఓహే అంధకారేర్ స్వామీ—
సబ్ బాంధనే తోమార్ సాథే బందీ కరో మోరే
ఓ హే ఆమి బాంధన్ కామీ ।
ఆమార్ ప్రియ, ఆమార్ శ్రేయ, ఆమార్ హే పరమ్,
ఓహే అంధకారేర్ స్వామీ—
సకల్ ఝురే సకల్ భరే ఆసుక్ సే చరమ్
ఓగో మరుక్ నా ఏయి ఆమి ॥

27. ఆజి వసంత జాగ్రత ద్వారే ।
తవ అవ గుంఠిత కుంఠిత జీవనే,
కరోనా విడంబిత తారే ।
ఆజి ఖులియో హృదయ - దళ్ ఖులియో ।
ఆజి భులియో ఆపన్ - పర్ భులియో ।
ఏయి సంగీత్ ముఖరిత్ గగనే
తవ గంధ తరంగియా తులియో ।
ఏయి బాహిర్ భువనే దిశా హారాయే
దియో ఛడాయే మాధురీ భారే భారే ।
అతి నిబిడ వేదనా వన మాఝురే
ఆజి పల్లవే పల్లవే బాజేరే
దూరే గగనే కాహార్ పథ చాహియా
ఆజి వ్యాకుల్ వసుంధరా సాజేరే ।
మోర్ పరానే దఖిణ్ వాయు లాగిఛే
కారే ద్వారే ద్వారే కర్ హాని మాగిఛే
ఏయి సౌరభ్ విహ్వాలా రజనీ
కార్ చరణే ధరణీ తలే జాగిఛే ?
ఓగో సుందర వల్లభ - కాంత
తవ గంభీర్ ఆహ్వాన్ కారే ।

28. అంధకారేర్ మాఝే ఆమాయ్ ధరేఛ దుయి హాతే ।
కఖన్ తుమి ఏలే, హే నాథ, మృదు - చరణ్ పాతే ?

ఖవేఛిలేమ్ జీవన స్వామి,
తోమాయి బుఝి హోరాయి ఆమి,
ఆమాయ్ తుమి హారాబెనా బుఝెఛి ఆజ్ రాతే।
జేనిశీథే ఆపన్ హాతే నిబియే దిలేమ్ ఆలో,
తారి మాఝే తుమి తోమార్ ధృవ తారా జ్వాలో।
తోమార్ పథే చలా జఖన్
ఘుచేగేల, దేఖి తఖన్
ఆపని తుమి ఆమార్ పథే లుకియే చలసాథే॥

29. భోర్ హాల విభావరీ, పథ హాల అవసాన్
శున్ ఓయి లోకే లోకే ఉఠే ఆలో కేరీ గాన్।
ధన్య హాలి ఓరీ పాంథ,
రజనీ - జాగర క్లాంత,
ధన్య హాల మరి మరి ధులాయ్ ధూసర్ ప్రాణ్।
వనేర్ కోలేర్ కాఛే
సమీరణ్ జాగియా ఛే
మధు భిక్షు సారే సారే
ఆగత కుంజేర్ ద్వారే
హాల తవ జాత్రా సారా
మోఛో మోఛో అశ్రుధారా
లజ్జా భయ గేల ఝురి ఘుచిల రే అభిమాన్.

# ముక్తధారా

జయ భైరవ! జయశంకర!
జయ జయ జయ ప్రళయంకర

శంకర శంకర!

జయ సంశయ భేదన
జయ బంధన ఛేదన
జయ సంకట సంహార

శంకర శంకర!

నమోజంత్ర, నమోజంత్ర, నమోజంత్ర, నమోజంత్ర।
తుమి చక్రముఖర మంద్రిత, తుమి వజ్ర వహ్నివందిత—
తవ వస్తు విశ్వవక్షోదంశ ధ్వంస వికటదంత।
తవ దీప్త - అగ్ని - శతశతఘ్ని - విఘ్నవిజయ పంథ।
తవ లోహ గలన శైలదలన అచలచలన మంత్ర।
కభు కాష్ఠలోష్ట్రి ఇష్ట కధృత ఘన పినద్ధకాయా,
కభు భూతల - జాల - అంతరీక్ష లంఘునలఘు మాయా,
తవ ఖని - ఖనిత్ర - నఖ - విదీర్ణ క్షితి వికీర్ణ - అస్త్ర।
తవ పంచభూత - బంధనకర ఇంద్రజాల తంత్ర।

తిమిర హృద్విదారణ
జ్వలదగ్ని నిదారుణ
మరుశ్మశాన సంచర
శంకర శంకర.
వజ్ర ఘోషవాణీ
రుద్రశూల పాణీ
మృత్యు సింధుసంతర
శంకర శంకర!

జయ భైరవ! జయ శంకర!
జయ జయ జయ ప్రళయంకర!

జయ సంశయ భేదన జయ బంధన ఛేదన
జయ సంకట సంహార శంకర శంకర !

ఓతో ఆర్ ఫిర్ బెనారే, ఫిర్ బేనాఆర్, ఫిర్ బేనారే ।
ఝడేర్ ముఖే ఖాస్‌ల తరీ, కూలే ఆర్ భిడ్ బేనారే ।
కోన్ పాగలే నిలడేకే,
కాఁదన్ గేల పిఛే రేఖే—
ఓకే తోర్ బాహుర్ బంధన్ ఘిర్ బే నారే ।

ఆమి మారేర్ సాగర్ పాడి దేబ
విషమ్ ఝడేర్ వాయే
ఆమార్ భయ - భాంగా ఏయి నాయే ।
మాః వాణీర్ భర్ సానియే
భేఁడా పాలే బుక్ ఫులియే
తోమార్ ఓయి పారేతేయి జాబేతరీ
ఛాయా వటేర్ ఛాయే
పథ ఆమారే సేయి దేఖాబే

జే ఆమారే బాయ్—

ఆమి అభయమనే ఖాడ్‌బ తరీ
ఏయి శుధు మోర్ దాయ్ ।
దిన్ ఫురోలే జాని జాని
పైఁఛే ఘాటే దేబ ఆని
ఆమార్ దుఃఖ దినేర్ రక్త కమల్
తోమార్ కరుణ్ పాయే ।

ఆరో ఆరో ప్రభు, ఆరో ఆరో ।
ఏమ్‌ని కరేయి మారోమారో ।
లుకియే థాకి ఆమి పాలియే బాడాయి,
భయే భయే కేవల్ తోమాయ్ ఏడాయి ;
జా - కిఛు ఆఛే సబ్ కాడో కాడో ।
ఏ బార్ జా కర్‌బార్ తా సారో, సారో—
ఆమియి హారి కింబా తుమియి హార్ ।

హాశే షూాచే కాచే కరి ఖేలా ।
కేవల్ హేసే ఖేలే గేఛే బేలా,
దేఖి కేమనే కాఁదాతే పార్ ।

ఘులేజాయి ఢేకే ఢేకే
తోమార్ ఆసన్ – 'పరే బసాతే చాఓ
నామ్ ఆమాదేర్ హేఁకే హేఁకే ।
ద్వారీ మోదేర్ చెనేనాజే,
బాధాదేయ్ పథేర్ మాఝే,
బాహిరే దాఁడియే ఆఛి—
లఓ భితరే డేకే డేకే ।
మోదేర్ ప్రాణ్ దియేఛ ఆపన్ హాతే—
మాన్ దియే ఛ తారి సాథే ।
థేకేఓ సేమాన్ థాకే నాజే
లోభే ఆర్ భయే లాజే,
మ్లాన్ హాయ దినే దినే,
జాయ్ ధులోతే ఢేకే ఢేకే ।

ఆమారే పాడాయ్ పాడాయ్ ఖేపియే బేడాయ్ కోన్ ఖ్యాపా సే!
ఓరే, ఆకాశ్ జూడే మోహాన్ సూరే
కీ జే బాజాయ్ కోన్ బాతాసే!
గేల రే గేల బేలా,
పాగలేర్ కేమన్ ఖేలా!
డేకే సే ఆకుల్ కరే, దేయ్ నా ధరా!
తారే కానన్ గిరి ఖూఁజేఫిరి,
కేఁదే మరి కోన్ హుతాశే!

రయిల బలే రాఖ్ లే కారే?
హుకుమ్ తోమార్ ఫల్ బే కబే?
టానా టానీ టిఁక్ బే నా ఖాయి,
రబార్ జేటా సేటాయి రబే!

జా - ఖుశి తాయి కర్ తే పార్,
గాయేర్ జోరే రాఖ్ మార్,
జాఁర్ గాయే తార్ వ్యథా బాజే
తినియి జా సన్ సేటాయి సబే ।
భావ్ ఛ హాబే తుమి జా చాట్,
జగత్‌టాకే తుమియి నా చాట్,
దేఖ్ రే హాతాత్ నయన్ మేలే
హాయ్‌నా జేటా సేటాట హాబే ।

తోర్ శికల్ ఆమాయ్ వికల్ కర్ బేనా ।
తోర్ మారే మరమ్ మర్ బేనా ।
తార్ ఆపన్ హాతేరే ఛాడ్ - చిఠి సేయి జే,
ఆమార్ మనేరే భితర్ రయేఛే ఏయి జే—
తోదేర్ ధరా ఆమాయ్ ధర్ బేనా ।
జే పథదియే ఆమార్ చలాచల్
తోర్ ప్రహరీ తార్ ఖోఁజ్ పాబే కి బల్ ।
ఆమి తాఁర్ దుఆరే పౌఁఛే గేఛేరే
మోరే తోరే దుఆరే ఠేకాబేకిరే ?
తోర్ డరే పరాన్ డర్ బేనా ।

ఆగున్ ఆమార్ భాయి,
ఆమి తోమారి జయగాయి ।
తోమార్ శికల్ - భాంగా ఏమన్ రంగా
మూర్తి దేఖి నాయి ।
దుహాత్ తులే ఆకాశ్ పానే
మేతేఛ ఆజ్ కి సేర్ గానే ?
ఏకి ఆనందమయ నృత్య అభయ
బలిహారి జాయి ।
జేదిన్ భవేర్ మేయాద్ ఫురోబే భాయి,
ఆగల్ జాబే సరే,

సేదిన్ హాతేత్ దకి పాయేర్ దకి
దిబిరే ఛాయికరే ।
సేదిన్ ఆమార్ అంగ తోమార్ అంగే
ఓయి నాచనే నాచ్ బేరంగే
సకల్ దాహా మిట్‌బే దాహే—
ఘుచ్‌బే సబ్ జాలాయి ।

శుధుకి తార్ బేంధేయి తోర్ కాజ్ ఫురాబే
గుణీమోర్, ఓ గుణీ ?
బాంధా వీణా రయిబే పడే ఏమ్‌ని భావే
గుణీమోర్, ఓ గుణీ ।
తా హాలే హార్ హాల జే హార్ హాల,
శుధు బాంధా బాంధియి సార్ హాల,
గుణీ మోర్, ఓ గుణీ
బాంధనే జది తోమార్ హాత్‌లాగే
తా హాలేయి సూద్ జాగే
గుణీమోర్, ఓ గుణీ ।
నా హాలే ధులాయ్ పడే లాజ్ కుడాబే ।

ఫేలే రాఖ్‌లేయి కి పడే రబే, ఓ అబోధ్ ?
జే తార్ దామ్ జానే సే కుడియే లబే, ఓ అబోధ్ !
ఓ జే కోన్ రతన్ తా దేఖ్‌నా భావి,
ఓర్ పరేకి ధులోర్ దావి ?
ఓ హారియే గేలే తాఁరే గలార్
హార్ గాఁథా జే వ్యర్థ హాబే,
ఓర్ ఖోఁజ్ పడేఛే జానిస్ నేతా ?
తాయి దూత్ బేరోల హేథా సేథా ।
జాబే కర్‌ల హేలా సబాయి మిలి
ఆదర్ జేతార్ బాడియే దిలి,
జాబే దరద్ దిలి తార్ వ్యథాకి
సేయి దరదిర్ ప్రాణే శబే ?

జయ భైరవ! జయశంకర!
జయ జయ జయ ప్రళయంకర!
జయ సంశయ భేదన,
జయ బంధన ఛేదన,
జయ సంకట సంహార
శంకర శంకర!

బాజేరే బాజే డమరు బాజే
హృదయ మాఝే, హృదయ-మాఝే।
నాచేరే నాచే చరణ్ నాచే
ప్రాణేర్ కాఛే, ప్రాణేర్ కాఛే
ప్రహర్ జాగే ప్రహరీ జాగే—
తారాయ్ తారాయ్ కాంపన్ లాగే।
మర్మే మర్మే వేదనా ఫుటే—
బాంధన్ టుటే, బాంధన్ టుటే।

జయ భైరవ! జయ శంకర;
జయ జయ జయ ప్రళయంకర!
జయ సంశయ భేదన,
జయ బాధన భేదన,
జయ సంకట సంహార
శంకర శంకర;
తిమిర హృద్విదారణ
జలదగ్ని నిదారుణ
మరు శ్మశాన సంచర
శంకర శంకర!
వజ్ర ఘోష వాణీ
రుద్ర శూల పాణీ
మృత్యు సింధు సంతర
శంకర శంకర

# రక్తకరబి

ఫాష్ తోదేర్ డాక్ ది యే ఛే - ఆయ్ రేచలే
ఆయ్ ఆయ్ ఆయ్

డాలా జె తార్ భరే ఛె ఆజ్ పాకా ఫసలే
మరి హాయ్ హాయ్ హాయ్.

హాఒయార్ నేశాయ్ ఉఠల మేతే
దిగ్వధూరా ధానేర్ ఖేతే

రోదేర్ సోనా ఛడియె పడే మాటిర్ ఆంచలే
మరి హాయ్ హాయ్ హాయ్.

ఆలోర్ ఖుశీ ఉఠల జేగే
ధానేర్ శిషే శిశిర లేగే

ధరార్ ఖుశీ ధరేనా గో, ఒయ్ జె ఉఛలే
మరి హాయ్ హాయ్ హాయ్.

మోర్ స్వపన తరీర్ కే తుఇ నేయే
లాగల పాలేనేశార్ హాఒయా
పాగల పరాన్ చలేగేయే.

అమాయ్ భూలియే ది యే జా
తోర్ దూలియె ది యే నా
తోర్ సుదూర ఘూటే చల్ రే బేయే
అమార్ భావనా తో సబమిఛే
అమార్ సబ పడె థాక్ పిఛే
తోమార్ ఘోమటా ఖూలే దా ఒ
తోమార్ నయన తూలే చా ఒ
దా ఒ హాసితే మోర్ పరాన్ ఛేయే ।

తోర్ ప్రాణేర్ రసతో శుకియే గేల ఒరే
తబే మరణరసే నే పేయాలా భరే

సేజే చితార్ ఆగున్ గాలియే ఢాలా
సబ జ్వలనేర్ మేటాయ్ జ్వాలా

సబ శూన్యకె సే అట్టహాసే గాయ్ జే రంగిన్ కరే
తోర్ సూర్య ఛిలగహన మేఘే ర మార్ఝే

తోర్ దిన మరేఛే అకాజేర ఇకాజే
తబే ఆసుక్ నా సేఇ తిమిరరాతి

లుప్తనేశార్ చరమ సాథీ
తోర్ క్లాంత ఆంఖి దిక్ సే ఢాకి
దిక్ భోలాబార్ ఘోరే

తోమాయ్ గాన శోనాబ తాఇతో ఆమాయ్
జాగియే రాఖ

ఓగో ఘూమ భాజానియా
బూకే చమక దియే తాయ్‌తో డాక్

ఓగో దుఃఖ జాగానియా
ఏలో ఆంధార్ ఘిరే
పాఖి ఏల నీడే
తరి ఏల తీరే

శుధూ ఆమర్ హియా విరామ పాయ్ నాకో
ఓగో దుఖ జాగానియా

ఆమార్ కాజేర మాఝే మాఝే
కాన్నాధారార్ గోలాతుమి థామతే దిలే నాజే

ఆమాయ్ పరశకరే
ప్రాణ సుధాయ్ భరే
తుమిజా ఒ జే సరే
బూఝి అమార్ వ్యథార్ ఆడాలేతే దాఁడియేథాక
ఓగో దుఖ జాగానియా.

ఓ చాంద్ చోఖేర జలేర లాగల జోయార
దుఖేర పారావారే
హొల కానాయ్ కానాయ్ కానాకాని
ఏఇ పారే ఒఇ పారే
ఆమార తరీ ఛిల చేనార కూలే
బాఁధన్ తాహార గేల ఖూలే
తారే హాఒయాయ్ హాఒయాయ్ నియే గేల
కోన్ అచేనార ఘరే.

ఖాలో బాసీ ఖాలో బాసీ
ఏఇ సురే కాఛేదూరే జలేస్థలే బాజాయ్ బాఁశీ
ఆకాశే కార బూకేర మాఝె
వ్యథా బాజే
దిగంతే కార కాలో ఆఁఖి ఆఁఖిర జలేజాయ్
గో భాసి.
సేఇ సురే సాగర కూలే
బాఁధన్ ఖూలే
అతల రోదన ఉఠే దూలే
సేఇ సురే బాజే మనే
అకారణే

జుగే జుగే బూఝి అమాయ్ చేయేఛిల సే
సేఇ బూఝిమోర్ పదేర ధారే రయే ఛే బసే
ఆజ కేన మోరపడే మనే
కఖన తారే చోఖేర కోణే

దేఖెఛిలేమ అఫూట ప్రదోషే
సేఇ జేన మోర పథేర ధారే రయేఛే బసే.

আজ ఒఇ చాఁదేర వరణ్ హబే ఆలోర సంగీతే
రాతేర ముఖేర ఆఁధార ఖాని ఖూలబే ఇంగితే
శుక్ల రాతే సేఇ ఆలోకే
దేఖా హబే ఏక పలకే
సబ ఆబరణ్ జాబే జే ఖసే
సేఇ జేన మోర్ పథేర ధారే రయేఛే బసే.